# డాక్టర్ కొమ్మూరి వేణుగోపాలరావు నవలలు సవిమర్శక పరిశీలన

సాహితీ మూర్తులు,
గౌరవనీయులు శ్రీ ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తి
గారికి
ఆత్మీయతతో
కోసూరి దామోదర నాయుడు
5/3/98

డాక్టర్ కోసూరి దామోదర నాయుడు
ఎం.ఎ., పి. హెచ్ డి.

వసుంధర పబ్లికేషన్
తిరుపతి - 517 502.

డా॥ కొమ్మూరి వేణుగోపాలరావు నవలలు – సమిమర్శక పరిశీలన

—డా॥ కోసూరి దామోదర నాయుడు

ప్రథమ ముద్రణ : ఆగస్టు 1996

ప్రతులు : 1000

వసుంధర పబ్లికేషన్స్ – 1

ఈ గ్రంథం తెలుగు విశ్వవిద్యాలయం వారి ఆర్థిక సహాయంతో ప్రచురింపబడింది. ఈ గ్రంథంలోని రచయిత అభిప్రాయాలతో తెలుగు విశ్వవిద్యాలయం వారికి ఎలాంటి సంబంధం లేదు.

ప్రతులకు :

శ్రీమతి కె. వసుంధర

c/o డా॥ కె. దామోదర నాయుడు

లెక్చరర్ – తెలుగు అధ్యయన శాఖ

శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం,

తిరుపతి – 517 502.

ధర : రూ. 60/-

ముద్రణ :

లక్ష్మి గ్రాఫిక్స్

48B, రామానుజ అయ్యర్ స్ట్రీట్

మద్రాసు – 600 021.

కని పెంచి చదివించి

నన్ను ప్రయోజకుణ్ణి

**చేసిన**

నా తల్లి దండ్రులు

**శ్రీ కోసూరి రాజగోపాల్ నాయుడు**

**శ్రీమతి కమలమ్మ గార్లకు**

ప్రేమతో

ఈ పరిశోధన గ్రంథం

అంకితం.

# నా మాట

నేను ఇంటర్ చదువుకునే రోజులు నుండి కవులన్నా, రచయితలన్నా వారు రాసిన రచనలన్నా యెంతో ఆసక్తి వుండేది. పత్రికల్లో వచ్చే ధారావాహిక నవలల్ని, పుస్తకరూపంలో వచ్చిన నవలల్ని, కథల్ని చదవడం బాగా అలవాటు. ఎం.ఏ. చదువుకునే రోజుల్లో నవలలను సామాజిక దృక్పథంతో చదవడం వాటి లోని వ్యక్తులను, సంఘటనలను నేటి సమాజంలో తారసిల్లే వ్యక్తులతోను, సంఘటనలతోను పోల్చి చూసుకోవడం నా కెంతో సరదా. గ్రంథరూపంలోను, వ్యాసరూపంలోను వున్న విమర్శనా వ్యాసాల్ని చదవడం నా పనుల్లో ఒకటిగా పరిగణించేవాణ్ణి.

ఎం ఏ.లో జానపద విజ్ఞానం చదువుకున్నా, ఎం.ఫిల్. చిత్తూరు జిల్లా ప్రముఖ కవి, విమర్శకులు, రచయిత కీ.శే. నూతలపాటి గంగాధరం కవిత్వాన్ని యెన్నుకొన్నా నాలో నవలలపట్ల వున్న ఆసక్తి తగ్గలేదు. అందుచేత పి.హెచ్.డి. కోసం నవలాంశాలను ఎన్నుకోవాలని నా మనసు ఆరాటపడింది. డాక్టర్ కొమ్మూరి వేణుగోపాలరావు నవలలను పి.హెచ్.డి. పరిశోధనాంశంగా యెన్నుకున్నాను. కొమ్మూరి నవలల్లో కనిపించే శరత్ రచనల ప్రభావం నా ఆసక్తిని మరీ పెంచింది. నా హృదయాన్ని కదిలించిన వేణుగోపాలరావుగారి నవలలు పెంకుటిల్లు, సూర్యుడు దిగిపోయాడు, భారతి, హారతి, న్యాయానికి అటూ-ఇటూ, కదిలే మేఘం, జాలిలేని జాబిలి, జోగిబాల.

పరిశోధన అవకాశం ఇచ్చినది కీ.శే. ఆచార్య మద్దూరి సుబ్బారెడ్డిగారు. సాహిత్య ప్రక్రియల్లో దేనిపైనా గాని సుబ్బారెడ్డిగారికి చిన్నచూపు లేదు. పైగా వారు కథల్ని, నవలల్ని సాహిత్యదృక్పథంతో చదివే మనీషి. మంచి వక్త. ఆంగ్ల నవలల్ని చదువుతూ తెలుగు నవలల్లోని పోలికల్ని, తేడాల్ని విశ్లేషించడం నా కింకా గుర్తు. కొమ్మూరి నవలలపై నా అభిప్రాయం చెప్పినప్పుడు తాను కూడా చదివి కొన్ని అరుదైన సూచనలు ఇవ్వడంలో వారికి నవలలపట్ల వున్న గౌరవం, నాపట్ల వున్న అభిమానం స్పష్టమయింది. వారికి ఏ రూపంలో కృతజ్ఞతలు చెప్పాలో నా కంతుపట్టడంలేదు. ఆచార్య సుబ్బారెడ్డిగారు బ్రతికున్న రోజుల్లో ఈ సిద్ధాంత గ్రంథాన్ని ముద్రించాలని అనుకున్నా వీలుకాలేదు.

నేను విజయవాడ వెళ్ళినప్పుడు వేణుగోపాలరావు వారి నవలలకు సంబంధించి, ఇతర రచయితల రచనలకు సంబంధించిన అనేకాంశాలు చెప్పి పరిశోధనకు తోడ్పడినందుకు వారికి నా ధన్యవాదాలు.

నా పరిశోధన సిద్ధాంతాన్ని ముద్రణ సమయంలో రూపురేఖలు దిద్దడమే గాక అమూల్యమైన అభిప్రాయాలు రాసియిచ్చిన ఆచార్య కె. సర్వోత్తమరావుగారికి, డా॥ గల్లా చలపతిగారికి నా ప్రత్యేక కృతజ్ఞతాభివందనాలు.

ప్రముఖ విమర్శకులుగా, మంచి వక్తగా పేరుప్రఖ్యాతులు గాంచిన కీ.శే. ఆచార్య కేతవరపు రామకోటిశాస్త్రిగారు నా ఎం.ఫిల్, పి.హెచ్.డి. పరిశోధనాంశాలు రెండింటికి పరీక్షకులుగా వ్యవహరించి అమూల్యమైన సూచనలు, అభిప్రాయాలు ఇచ్చారు. వారికి నా ప్రత్యేక కృతజ్ఞతలు.

పరిశోధన చేస్తున్నప్పుడు నవలలపై తర్జనభర్జనలు జరిపి అమూల్యమైన విషయాల్ని చెప్పిన అప్పటి పరిశోధకవిద్యార్థి ఇప్పటితోటి అధ్యాపకులు అయిన డా॥ జె. మునిరత్నంగారికి కృతజ్ఞతలు.

నా పరిశోధన సిద్ధాంతానికి తెలుగు విశ్వవిద్యాయంవారు ఆర్థిక సహాయం చేసినందుకు ఆచార్య నాయని కృష్ణకుమారిగారికి (తెలుగు విశ్వవిద్యాలయ వి.సి.) డా॥ ఏ. వి. సుబ్బారావు (తెలుగు విశ్వవిద్యాలయం రిజిష్ట్రార్) గారికి నా మనః పూర్వక కృతజ్ఞతలు.

సిద్ధాంత వ్యాసాన్ని ముద్రించేటప్పుడు అమూల్యమైన సలహాలు ఇచ్చిన ఆచార్య జాస్తి సూర్యనారాయణ, ఆచార్య తుమ్మపూడి కోటీశ్వరరావు, ఆచార్య పి. సి. నరసింహారెడ్డి, ఆచార్య సి. రమరణ్య, డా॥ అంతటి నరసింహం, డా॥ గార్లపాటి దామోదరనాయుడుగార్లకు హృదయపూర్వక నమస్సులు.

శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయం తెలుగు అధ్యయనశాఖ అధ్యాపకులందరికి పేరు పేరున నా హృదయపూర్వక వందనాలు.

కావలసిన పుస్తకాలను అందుబాటులో వుంచి ప్రోత్సహించిన మిత్రులు మా విశ్వవిద్యాలయ గ్రంథాలయోద్యోగి శ్రీ వి. షణ్ముగంగారికి నా కృతజ్ఞతలు.

నా సాహిత్య వ్యాసంగంలో సహకరించిన నా సహధర్మచారిణి శ్రీమతి కోసూరి వసుంధరకు ప్రత్యేక ఆశీస్సులు.

ఈ పుస్తకాన్ని అతి తక్కువ కాలంలో అందంగా ముద్రించి ఇచ్చిన లక్ష్మీగ్రాఫిక్స్ అధినేత శ్రీ జి. వీరబ్రహ్మంగారికి కృతజ్ఞతలు.

తిరుపతి
9-8-96

కోసూరి దామోదర నాయుడు

ఆచార్య కె. సర్వోత్తమరావు
తెలుగు అధ్యయన శాఖ
శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయం
తిరుపతి-517 502.

తిరుపతి
27—6—'96

# ఆకాంక్ష

డా॥ కోసూరి దామోదరనాయుడు ప్రస్తుతం సహోద్యోగి, అయినా ఎం.ఏ. చదువుకొనే రోజుల్లో మా అంతేవాసి. ఆచార్య మద్దూరి సుబ్బారెడ్డిగారి పర్యవేక్షణలో నూతలపాటి గంగాధరం కవిత్వం సవిమర్శక పరిశీలన అనే శీర్షిక ఎన్నుకొని 'ఎంఫిల్' చేశారు. డా॥ కొమ్మూరి వేణుగోపాలరావు నవలలు సవిమర్శక పరిశీలన అనే శీర్షిక ఎన్నుకొని పి.హెచ్.డి. పరిశోధన సాగించారు. తదనంతరం జానపద గేయాలపై చూపు మళ్ళించి కొన్ని పాటలను సేకరించి 'యాదమరి మండలం జానపద గేయాలు' అనే చిరుపొత్తాన్ని ముద్రించారు కూడా. కవితలన్నా, నవలలన్నా, కథలన్నా చివరకు గేయాలన్నా సమాన దృక్పథంతో చూడడం నాయుడు ప్రత్యేకత అంతేకాదు. ఆచార్య మద్దూరి సుబ్బారెడ్డిగారి పర్యవేక్షణలో పరిశోధన సాగించిన తెలుగు అధ్యయన శాఖలోని ఉపాధ్యాయుల అంచరవల్లి గౌరవాదరాలు ప్రదర్శించుకుంటూ అందరి అభిమానాలు చూరగొన్న వ్యక్తి.

ప్రస్తుతం నాయుడు ముద్రించిన పుస్తకం పి.హెచ్.డి. సిద్ధాంతగ్రంథం. నవలలు కూడా వాఙ్మయంలో, సాహిత్యంలో ఒక భాగమేనా! అని పెదవి విరిచిన రోజులుకూడా వున్నాయి. 'నవలలపై పరిశోధనా' అని వెక్కిరించిన జనంకూడా లేక పోలేదు. ఈ జాడ్యం ప్రత్యేకించి ఆంధ్రులకే ఎందుకువుందో అంతు పట్టని విషయం. ఇతర భాషలలో నవలలపై పుంఖాను పుంఖంగా వ్యాసాలొస్తున్నాయి. సామాజిక దృక్పథంతో బేరీజువేయడం సామాన్య అంశంగా నిలిచిపోయింది. తమిళంలో అయితే 'నవలల్లోని సూక్తులు' అనే పేరుతో కొన్ని సంకలనాలుకూడా వచ్చాయి. తెలుగువారి నవల 'పంట' ఎక్కువైనా ఇంకా అంతర్జాతీయ మార్కెట్లోకి చేరుకోక పోవడం దురదృష్టం. అలాగని తెలుగు నవలలు తీసివేయవలసినవి కావు. కందుకూరి, చిలకమర్తి, ఉన్నవ, చలం, విశ్వనాథ, బాపిరాజు, కొడవటిగంటి, ధనికొండ, నోరి. బుచ్చిబాబు, గోపీచంద్, మొక్కపాటి, జి.వి. కృష్ణారావు, మహీధర, శ్రీదేవి, లత, వాసిరెడ్డి, రంగనాయకమ్మ, మాలతీ చందూర్, శారద, రావిశాస్త్రి, నవీన్, ఆర్.యస్. సుదర్శనం, కేశవరెడ్డి, 'ఓల్గా' లాంటివాళ్లు క్రమగాం

తమకంటూ ఒక వాణిని నిల్పుకున్నారు. అయితే అందరి కంటే భిన్నంగా నవలలు రాస్తున్న వ్యక్తి డా॥ కొమ్మూరి వేణుగోపాలరావు. వృత్తిరీత్యా డాక్టర్ అయినా ప్రవృత్తిరీత్యా మనస్తత్వవేత్త. అందుచేతనే వ్యక్తుల సంఘర్షణలు, కుటుంబ చిత్రణలు, సామాజిక దుర్మతలు తన నవలల్లో సజీవంగా చిత్రీకరించాడు. ప్రత్యేకించి రావుగారికున్న ఆధ్యాత్మిక జిజ్ఞాస విజ్ఞానంతో పెనవేసుకుంది. హనుమద్భక్తి, షిర్డీ సాయిపై అనురక్తి, కల్కి ధర్మంపట్ల జిజ్ఞాస రావుగారి వ్యక్తిత్వంలో భాగాలు.

డాక్టర్ కొమ్మూరి నవలల్లో కొట్టవచ్చే అంశం వైద్య విజ్ఞానం. ఎన్నో పేర్లు తెలియని భయంకర వ్యాధులు, వాటి పరిణామాల్ని నవలల్లో భాగంగా మలచడం అందరికీ చేతనయ్యే అంశంకాదు. కవులు చిన్ననాటనే కవిత్వం అల్లేవారని చెప్పుకోవడం, వినడం పరిపాటి. కాని రావుగారు పదిహేనవ ఏటనుండి నవలలు కథలు రాస్తున్నారనడం చాలామందికి తెలియని అంశం.

నవలలపై పరిశోధన 'ఆషామాషీ' కాదు. రచయితలతో పరిచయం, రచనల పట్ల ఆదరం, నవలాంశంపట్ల ఆకాంక్ష అన్నీ అవసరం. ప్రత్యేకించి సుమారు ఏభై సంవత్సరాల నుండి మారుతున్న సాంఘిక, చారిత్రక నేపథ్య అవగాహన కూడా చాలా అవసరం. ఇవన్నీ నాయుడులో ఉన్నాయనడానికి ఈ సిద్ధాంత గ్రంథం సాక్ష్యం.

డాక్టర్ నాయుడు నవలల్లోని సమస్యల్ని వర్గీకరించిన విధానం, పాత్రల మనస్తత్వాలు మారడానికి కారణాలు సామాజిక నేపథ్యంతో వివరించడం బాగుంది. కొమ్మూరి వారి ప్రత్యేకతను విశ్లేషించిన వైనం పరిశోధకుల్ని ఆకట్టు కుంటుందనడంలో సందేహంలేదు.

డాక్టర్ నాయుడు ఎం.ఏ., ఫైనల్‌లో నవలల్ని ఐచ్ఛిక పాఠ్యాంశంగా బోధిస్తున్నారు. పరిశోధనకు, పాఠ ప్రవచనానికి చాలాచోట్ల 'లంకె' మాత్రం వుండదు. కాని నాయుడుగారికి అరుదైన అవకాశం లభించడం అదృష్టం పాత సిద్ధాంతాల్ని దేరిజు చేసుకోవడానికి, నూతన సిద్ధాంతాల్ని వింగడింపులో సరికొత్త విశ్లేషణ చేయడానికి ఈ బోధన సహాయపడ్తుందనడంలో సందేహంలేదు.

డాక్టర్ నాయుడు విభిన్న అంశాల్ని ఎన్నుకొని భవిష్యత్తులో ఎన్నో రచనలు చేయాలని నా ఆకాంక్ష.

**కె. సర్వోత్తమరావు.**

డా॥ గల్లా చలపతి
రీడర్-తెలుగు అధ్యయన శాఖ
శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయం, తిరుపతి-517 502

# అభినందన

'నావెల్' అనే ఆంగ్లపదానికి 'నూతనమైన' అని అర్థం. తెలుగులో 'నవల' అనే పదం 'నావెల్' అనే పదానికి సమానార్థకంగా గ్రహింపబడింది. ఆంగ్లంలో నావెల్ ఒక నూతన సాహిత్య ప్రక్రియ. తెలుగులో నవలకూడా అంతే. సంస్కృతంలో 'నవలా' అనేపదం 'స్త్రీ' అనే అర్థంలో వుంది. ఈ పదం తెలుగులోకి వచ్చినప్పుడు 'నవల' అవుతుంది. ఆంగ్లపదమైన 'నావెల్' అనే పదానికి సమానార్థకంగా గ్రహించిన 'నవల'కు సంబంధమేమైనా వుందేమో పరిశీలిస్తే కొంతైనా సంబంధమున్నట్లే అర్థమవుతుంది. తెలుగులో ప్రస్తుతం 'నవల' పేరుతో వచన గ్రంథాలు అసంఖ్యాకంగా వెలువడుతున్నాయి. తెలుగులో 'నవల' అనేమాట ఆంగ్ల 'నావెల్' నుంచి ఏర్పడినదేనని విమర్శకులు నిర్ణయించారు. అయినా పద సారూప్యత ఆ పదాల అర్థ సారూప్యత ఆధారంగా ఆలోచిస్తే ఈ రెండు పదాల మధ్యగల సంబంధం బోధపడుతుంది.

సంస్కృతంలో 'నవలా'కు స్త్రీ అనే అర్థమున్నా తెలుగులో నవలకు స్త్రీ అనే అర్థంలేదు. వ్యాకరణాంశాల చర్చ అవసరంలేదు. ఆపదాల అర్థ సామ్యతను గుర్తించి 'నవల' పదానికి గల అర్థాన్ని ప్రస్ఫుట పరచడమే యిక్కడ వుద్దేశం. 'నవ' అనే సంస్కృత విశేషణానికి కొత్తదైన అని అర్థం. దీనికి వ్యాకరణ యుక్తంగా 'లా'చేరి స్త్రీ అనే అర్థం సిద్ధించింది. స్త్రీ యెప్పుడూ నిత్య నూతనంగా వుండాలని కోరుకుంటుంది. 'నూతన ప్రియులు సతులు' అని ఒక కవి మాట. పెళ్ళయిన స్త్రీలే నూతన ప్రియత్వాన్ని కోరితే కన్యలుగా వున్నవాళ్ళు ఎంత నూతన ప్రియులుగా వుంటారో ననిపిస్తుంది. నవల అనేమాటకు స్త్రీ అని అర్థం చెపితే అందులో వ్యక్తావ్యక్తంగా వుండే నూతనత్వం, ప్రియత్వం, సుకుమారత్వం, ముగ్ధత్వం, మృదుత్వం మొదలైన లక్షణాలన్నీ స్ఫురిస్తాయి. కవిత్వమంటే ఎంతసేపూ ఛందోబంధమైన ఆలంకారిక రచన అని భావిస్తుండిన రోజుల్లో ఆంగ్ల కవులు సమకాలీన సమస్యలకు ప్రతిబింబించే యితివృత్తాలను తీసుకొని వచనంలో వ్రాయడం మొదలుపెట్టారు. పద్యం పరిష్వంగంనుంచి బయట పడ్డామని ఊపిరి

పేల్చుకున్నారు. తమ వచన రచనలు నూతన ప్రక్రియకు చెంది కనిపించడం చేత ఆ ప్రక్రియకు 'నవల' అనిపేరు పెట్టుకున్నారు. ఈ ప్రక్రియకు చెందిన రచనలలో అప్పటివరకు కవితా సంప్రదాయానికి అనుగుణంగా వస్తుండిన 'రొటీన్' వస్తువులకు మారు వినోద విజ్ఞానాలతో పాటు సాంఘిక స్పృహను కలిగించే నూతన వస్తువులు స్పృశింపబడ్డాయి. నూతన వస్తువులు, వ్యక్తిగత ఆలోచనాధోరణులు వుండడం వల్లనే ఆ రచనలకు నవలలని పేరు సార్థకమైంది. ఆ తరువాత నవల విశ్వవ్యాప్తమైన ప్రక్రియగా సాహిత్యంలో స్థిరపడింది.

నవల అనే పదంలో 'నవ' నూతనార్థ స్ఫోరకమని తెలుగు సాహిత్యంలో ప్రక్రియగా స్థిరపడిన 'నవల'లో కూడా క్షణక్షణం నూతనత్వాన్నపేక్షించే స్త్రీ లక్షణాలవలె కొత్తకొత్త సమస్యలు ఇతివృత్తాలుగా ఊహాతీతమైన చిత్ర విచిత్రాలు సంఘటనలుగా, నూతన లోకావిష్కరణలు కల్పనలుగా వుంటాయని పై చర్చకు సారాంశం. మానవ జీవితానికి అతి సన్నిహితంగా వెళ్ళి అందులోని వివిధ సమస్యలను చిత్రించి చూపేది నవల. జీవితాన్ని ఉన్నదున్నట్లు చూపినా కొంత ఆదర్శం, కొంత లౌక్యం కూడా నవలలోకి పాత్రల స్వభావంగా కనిపిస్తుంది. కాబట్టి నవలలలో కల్పిత విషయాలు తప్పనిసరి అవుతున్నాయి. తెలుగులో మొదట జానపద కథలే నవలలుగా రావడం కూడా దీనిని నిరూపించే అంశం. నవలకు కావలసిన ఇతివృత్తం ఫలానా అంశానికే చెంది వుండాలనే నియమంలేదు. లేక పోవడం వల్లనే జానపద చారిత్రక నవలలు కూడా వచ్చాయి. సాంఘిక ఇతివృత్తాలలోగల నవలల విషయం చెప్పనక్కరలేదు. నవల అంటే సాంఘిక నవలే వెంటనే జ్ఞాపకం వస్తుంది.

నవలలు అసంఖ్యాకంగా వెలువడుతున్న నవలాయుగమిది. వ్యక్తిగత, కుటుంబ, దేశ సమస్యలెన్నో ఇప్పటి నవలలలో కనిపిస్తున్నాయి. వస్తు వైవిధ్యం ప్రస్ఫుటంగా కనిపిస్తున్నది. వ్యక్తిగత, సాంఘిక సమస్యలకు నవలా రచయితలు రచయిత్రులు సూచిస్తున్న పరిష్కార మార్గాలు యెంతో సాంఘిక ప్రయోజనాన్ని కలిగివున్నాయి. అలాంటి ప్రయోజనకరమైన నవలలు డా॥ కొమ్మూరి వేణుగోపాల రావుగారి నవలలు. వేణుగోపాలరావు మంచి రచయిత. ఆయన నవలలన్నీ వివిధ ప్రయోజనాల నాశించి రచింపబడినవే. ఆయన నవలలన్నిటిని బాగా పరిశీలిస్తే ప్రయోజనం దృష్టితో ఎవరికైనా నాలుగు విభాగాలుగా చేయవచ్చుననిపిస్తుంది.

1. మధ్య తరగతి కుటుంబ వ్యవస్థను చిత్రించే నవలలు – 'పెంకుటిల్లు' నవల దీనికి మంచి ఉదాహరణ. మధ్యతరగతి ఆర్థికవ్యవస్థ మనిషిని ఎంత కుంగదీస్తుందో వివరించే నవల యిది.

2. మానవ జీవితంలో ప్రేమ వయోధర్మాన్ననుసరించి యెలాంటి పరిణామాలు పొందుతుందో వివరించే నవలలు – హారతి, ప్రేమనక్షత్రం, ప్రేమకాంతి, ఆత్మజ్యోతి, జాలిలేని జాబిలి మొదలైన నవలలు ఈ కోవకి చెందినవి.

3. వైద్య వృత్తిని వివరించే నవలలు – హౌస్ సర్జన్, డాక్టరుగారి భార్య. కదిలే మేఘం మొదలైన నవలలు ఈ విభాగం కిందికివస్తాయి.

4. మనో విశ్లేషణాత్మక నవలలు – 'వ్యక్తిత్వ లేని మనిషి' ఈ తరగతికి చెందిన నవల.

వేణుగోపాలరావు వ్యక్తిరీత్యా మానవుల గుండెల కదలికకబట్టి ఆరోగ్య స్థితిని నిర్ణయించే వైద్యుడు. ప్రేయసీప్రియుల లేదా స్త్రీపురుషుల హృదయ స్పందనలను విని వారిలో యెలాంటి భావాలున్నాయో పసిగట్టగల నేర్పు కూడా ఆయనకుంది. గుండె రక్త ప్రసరణకు సంబంధించిన యంత్రమని వైద్యులు భావిస్తారు. అదే గుండె వివిధ భావ ప్రకంపనాలను పుట్టించి జీవితగమ్యాలను నిర్దేశించే దిక్సూచిగా రచయిత భావిస్తారు. గుండె లేదా హృదయం అనేక భావాలకు నిలయం. వేణుగోపాలరావు వైద్యుడుగా, సాహిత్య శిల్పవేత్తగా అటు వైద్య రంగానికి సంబంధించిన విశేషాలందించడంతోపాటు ఇటు వ్యక్తిగతమైన గుండె చప్పుళ్ళను కూడా నేర్పుగా వ్యాఖ్యానించారు. ఇది ఆయన గొప్పదనం. ఆయన నవలలలోని విశేషాలను వెలికితీసి చెప్పడం నా పనికాదు. ఆయన నవలలను ఇలా విశ్లేషించి ఒక పరిశోధక పట్టప్రబంధం రాసి శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం నుండి పి.హెచ్.డి. పట్టా పొందిన డా॥ కె. దామోదరనాయుడు ఆ పనిని సమర్థవంతంగా నిర్వహించారు.

డా॥ దామోదరనాయుడు నాకు మంచి మిత్రుడు. పైగా సహాధ్యాపకుడు, వివిధ పత్రికలలో వచ్చే సాహిత్య వ్యాసాలను యెప్పటినుంచో సేకరించి పెడుతున్నాడు. పత్రికలన్నీ ఆయన దగ్గరుంటాయి. ఒక ఉపాధ్యాయుడి కుండ వలసిన లక్షణాలివి. ఉపాధ్యాయుడు నిరంతర విద్యార్థి కాబట్టి ఎప్పటికప్పుడు నూతన సాహిత్యాంశాలను తెలుసుకుంటూ ఉండాలి. ఈ విషయంలో ఈయన

మిగిలినవారికి స్ఫూర్తి. తన గ్రంథానికి రెండు పరిచయవాక్యాలు రాయమని నన్నడిగి నప్పుడు నేనీ పనికి తగనని తెలిపినా ప్రియ నిర్బంధానికి లోబడి ఒప్పుకున్నాను.

డా॥ దామోదరనాయుడు రచించిన ఈ గ్రంథం చదివిన తరువాత ఒక గొప్ప నవలాకారుని నవలలు ఒక మంచి పరిశోధన గ్రంథంలో సవిమర్శంగా సమీక్షింపబడినాయని అనిపిస్తుంది. డా॥ రావు ఏ స్ఫూర్తితో, స్పందనతో నవలలు రాశారో ఆ విషయాలను ఈ పరిశోధకుడు ఆమూలాగ్రం పట్టుకున్నారు. ఆ విషయం పునాదులపైన వివిధ అధ్యాయాలు నిర్మించుకున్నాడు. ఆయా అధ్యాయా లలో ప్రధాన విషయాలకు సంబంధించిన అనేకాంశాలను కుప్పలుపోసి చూపిం చాడు. పరిశోధన ప్రమాణాలను జారిపోకుండా గొప్ప పరిశోధక గ్రంథం నిర్మించి ముద్రించినందుకు ఆయనను మనసారా అభినందిస్తున్నాను.

మొన్న మొన్నటి వరకు వంటింట్లో చదువుకొనే చిలక కబుర్లతో నిండిన రచనలు నవలలని ఒక చవకబారు అభిప్రాయముండేది. సాంఘిక బాధ్యతను సమర్థ వంతంగా నిర్వహిస్తూ సంఘంలోని అనేకానేక కీలక సమస్యలను ఎత్తిచూపి పరి ష్కారాలన్వేషించే సాహిత్యరూపమని నవలకీనాడు గుర్తింపు వుంది. సాంఘిక అనారోగ్యాన్ని పోగొట్టి ఆరోగ్యాన్నిచ్చే కర్తవ్యంతో నవలలెన్నో వస్తున్నాయి. డా॥ దామోదర నాయుడువంటి నవలా విమర్శకులవల్లనే నవలా ప్రక్రియ సమా జానికి యెలా ఉపయోగపడుతున్నదో తెలుస్తుంది. సాహిత్యవిమర్శలో నవలా విమర్శ ఒక ప్రధానాంశంగా గుర్తింపబడింది. విశ్వవిద్యాలయాల్లో నవలల అధ్యయనం ప్రత్యేక బోధనాంశాలుగా నిర్ణయించడం అభిలాషణీయమైన పద్ధతి. దామోదరనాయుడు పి. జి. స్థాయిలో నవలలను ప్రత్యేకాంశంగా బోధిస్తున్నారు. తెలుగు నవల పరిణామ వికాసాలను సంబంధించిన సమగ్ర అవగాహన వీరికుంది. గొప్ప రచనలలోని వెలుగులు జిలుగులు విమర్శవల్లనే బహిర్గతమవుతాయి కాబట్టి డా॥ నాయుడు ఇలాంటి నవలా విమర్శ గ్రంథా లెన్నింటినో రచించవలసిన అవసర ముంది. ఈయన కలంనుండి మంచి మంచి గ్రంథాలు రావాలని ఆకాంక్షిస్తున్నాను. ఈ గ్రంథాలన్ని తెలుగుపాఠకులు ఆదరిస్తారని ఆశిస్తున్నాను.

తిరుపతి
9-8-1996

గల్లా చలపతి

# విషయానుక్రమణిక

## 1. జీవిత విశేషాలు



## 2. వైద్య వృత్తి



## 3. కుటుంబ జీవిత చిత్రణ

4. ప్రేమ జీవితం

## 5. మనస్తత్వ చిత్రణ



## 6. పాత్ర చిత్రణ



—o—

# కొమ్మూరి వేణుగోపాలరావుగారి నవలలు

— o —

1. పెంకుటిల్లు (1957)
2. గోరింటాకు (1959)
3. సంకెళ్ళు (1959)
4. పిల్లదొంగ (1959)
5. శారద (1960)
6. ఆత్మజ్యోతి (1961)
7. జాలిలేని జాబిలి (1961)
8. విషవలయం (1963)
9. నివేదిత (1965)
10. భారతి (1965)
11. హౌస్ సర్జన్ (1967)
12. హారతి (1967)
13. వ్యక్తిత్వంలేని మనిషి (1968)
14. ఈ దేశంలో ఒక భాగమిది (1970)
15. ఒకేపాటకు రెండు రాగాలు (1970)
16. ఒకే రక్తం ఒకే మనుషులు (1972)
17. మనిషికి ఏం కావాలి! (1974)
18. పసుపు - కుంకుమ (1975)
19. మేడలో నీడలు (1976)
20. సూర్యుడు దిగిపోయాడు (1978)
21. ప్రేమ నక్షత్రం (1980)
22. ప్రేమకాంతి (1981)
23. ఊగవే ఉయ్యాల (1983)
24. తోడూ-జోడూ (1984)
25. డాక్టరుగారి భార్య (1984)
26. గుప్పెడు వెలుగు (1985)
27. విరాజి (1986)
28. న్యాయానికి అటూ-ఇటూ (1986)
29. కదిలే మేఘం (1987)
30. నెత్తుటి బొట్టు (1987)
31. జోగబాల (1987)
32. వెన్నెల వాణికింది (1987)
33. కళ్ళు (1987)
34. అర్ధచంద్ర (1988)

—o—

# జీవిత విశేషాలు - 1

ఒక రచయిత జీవిత సంఘటనలు, అనుభవాలు, ఆశయాలు, అభిరుచులు, వ్యక్తిత్వం అతని రచనలో తప్పని సరిగా ప్రతిబింబిస్తాయి. అందువల్లనే రచనలు పరిశీలించేటప్పుడు ఆ రచయితను గురించి తెలుకోవడం అవసరం. అంతేకాదు ఆసక్తికరం కూడా, ఆధునిక తెలుగు నవలా రచయితల్లో ప్రఖ్యాతి పొందినవారిలో కొమ్మూరి వేణుగోపాల రావుగారు కూడా ఒకరు. ఈయన వృత్తిరీత్యా వైద్యులు, ప్రవృత్తి రీత్యా రచయిత, ఆయన దృక్పథం. శరత్ చంద్రుని వంటి సుప్రసిద్ధ రచయితల నుండి స్ఫూర్తిపొందిన వీరు మరెందరో తరువాతి రచయితలకు మార్గ దర్శకులయ్యారు. "ఆంధ్రా శరత్"[1] అని కూడా అనిపించుకున్నారు. సాంఘిక సమస్యలను విశ్లేషించడంతో పాటు విజ్ఞాన విశేషాల్ని తన నవలల్లో పొందుపరచి సాహిత్యం ద్వారా సమాజానికి విశిష్టమైన సేవచేశారు, చేస్తున్నాడు.

## 1. వైయక్తిక జీవితం

కొమ్మూరి వేణుగోపాలరావుగారు విజయవాడలో 1938వ సంవత్సరం సెప్టెంబరు 4వ తేదీన జన్మించారు. వీరి తల్లి దండ్రులు అరుంధతమ్మ, డాక్టర్॥ సదాశివరావు. వేణుగోపాలరావు గారికి యిద్దరు అక్కయ్యలు, ఇద్దరు చెల్లెళ్లు, ఒక తమ్ముడు వున్నారు. రచయిత పూర్తిపేరు కొమ్మూరి వేంకట వేణుగోపాల రావు. వీరిది నియోగి బ్రాహ్మణ కుటుంబం.

కొమ్మూరి వేణుగోపాలరావు గారి ప్రాథమిక విద్యాభ్యాసం ఇంటి దగ్గరే జరిగింది. 1945వ సంవత్సరం నుండి 1952వ సంవత్సరం వరకు విజయవాడ సి.పి.ఆర్,జి.యమ్. ఉన్నత పాఠశాలలో చేరి చదువుకొనసాగించారు. చిన్నప్పటి నుండి తల్లిదండ్రుల చెంత క్రమ శిక్షణతో పెరిగినవారు వేణుగోపాలరావు

1. ఆదివిష్ణు - కొమ్మూరి వేణుగోపాలరావు సాహిత్య [illegible] పుట. 3,

1952వ సంవత్సరం నుండి 1954 వరకు విజయవాడలోనే యస్. ఆర్. ఆర్. మరియు సి. పి. ఆర్. కళాశాలలో ఇంటర్మీడియట్‌ను పూర్తిచేశారు. తరువాత ఎం.బి.బి.యస్. చదవడంకోసం కాకినాడ వైద్యకళాశాల ప్రవేశంకోసం ప్రయత్నించి విఫలులయ్యారు. మూడు సంవత్సరాలు హైదరాబాదులో ఆయుర్వేదం, అల్లోపతి విద్య నభ్యసించారు. 1958వ సంవత్సరం కాకినాడ ప్రభుత్వ మెడికల్ కళాశాలలో ఎం.బి.బి.యస్. సీటురాగా 1964 వరకు చదివి పట్టా పుచ్చుకున్నారు. ఎం.బి.బి.యస్. పూర్తి అయిన తరువాత 1964 – 65 విద్యాసంవత్సరంలో గుంటూరు ప్రభుత్వ మెడికల్ కళాశాలలో హౌస్ సర్జన్సీ పూర్తి చేశారు.

1965వ సంవత్సరం నుండి ఇప్పటి వరకు విజయవాడలో ప్రయివేట్ డాక్టరుగా వైద్యవృత్తిని కొనసాగిస్తూ మరో ప్రక్క రచనలు చేస్తూ సాహిత్య కృషి చేస్తున్నారు. చిన్నపిల్లల వైద్యంలో వేణుగోపాలరావు గారు మంచి డాక్టరుగా పేరు సంపాదించారు.

కొమ్మూరి వేణుగోపాలరావు జీవితం ఒక కలికి తురాయి వంటిది. ఎం.బి.బి.యస్. చదువుకొనే రోజుల్లో ప్రొఫెసర్లందరికీ ప్రేమ పాత్రులయ్యారు. వారి ఆదరాభిమానాల్ని, మన్ననల్ని పొందగలిగారు. విద్యార్థులతో కలిసిమెలిసి ఉండే వారు. ఇంటర్మీడియట్ చదువుతుండగా కళాశాల వార్షికోత్సవంలో వారు రచించిన 'కొత్త డాక్టరు' నాటకం ప్రదర్శితమైంది. అందులో రావుగారే డాక్టరు పాత్ర ధరించి దానికి జీవం పోశారు. రచనలు చేస్తూ చదువుయెడల నిర్లక్ష్యం చూపిస్తున్నాడని ఏ ఒక్కరూ వేలెత్తి చూపనంత శ్రద్ధగా చదివి మెడిసెన్ పూర్తిచేశారు. చదువులోను, రచనల్లోనూ తన సామర్థ్యాన్ని చూపించడమే కాకుండా వక్తృత్వ పోటీల్లో పాల్గొని ఉత్తమ వ్యక్తిగా బహుమతులు అందుకున్నారు. ఆ సమయాల్లో 'జోక్సు'తో ఎంతో నవ్వించేవారు. ఎదుటి వారిని ఎప్పుడూ నవ్విస్తూ తను నవ్వుకుంటూ వుండటం తప్ప, తన మాటల ద్వారా ఎదుటివారిని బాధ పెట్టకుండా వుండేవారు. ఆత్మీయతకు, అనురాగానికి మరోపేరు వేణుగోపాలరావు గారు. తనే కాదు ఎదుటివాళ్లు కూడా పచ్చగా వుండాలని, అలా చూడాలని కాంక్షించే వ్యక్తి. వీరు కళాశాల జీవితంలోనే మంచి వ్యక్తిగా పేరు తెచ్చుకున్నారు. మెడిసిన్ చదువుతున్నప్పుడు సాహిత్య విభాగానికి కార్యదర్శిగా పోటీలేకుండా ఎన్ని

కయ్యారు. అటువంటి అపార ఆదరాభిమానాల్ని అది కాలంలో మెడికల్ కళాశాలలో చూరగొన్న వ్యక్తి వేణుగోపాలరావు గారు.

కొమ్మూరి వేణుగోపాలరావు గారి వివాహం అహల్యాదేవితో 1961వ సంవత్సరం ఆగష్టు 26వ తేదీన జరిగింది. వీరికి ముగ్గురూ మగపిల్లలే, వారు రాజా, శివకుమార్, రవికిరణ్, వీరు ముగ్గురూ డాక్టరు వృత్తిని చేపట్టక వివిధ శాఖల్లో రాణిస్తున్నారు. తండ్రి తాతలు మాదిరిగా వాళ్లు డాక్టర్లు కాలేక పోయారు. వారిలో కొమ్మూరి రాజా ఇప్పుడిప్పుడే చిన్నచిన్న కథలు రాస్తున్నారు.

కొమ్మూరి వేణుగోపాలరావుగారి తాతగారు పట్టాభిరామయ్యగారు, పట్టాభి రామయ్యగారి తండ్రి నాగరాజుగారు. వీరి ఇంటి పేరు కంభంమెట్టువారు. వీరు కొమ్మూరి వారికి పెంపకం రావడంతో కొమ్మూరి వారు అయినారు. నాగరాజు గారిని పెంచుకున్న తల్లిగారు బుచ్చమ్మ, తండ్రిపేరు తెలియవచ్చలేదు. పట్టాభి రామయ్యగారు ఆ రోజుల్లో ఆయుర్వేదిక్ డాక్టరుగా పేరు ప్రఖ్యాతులు సంపాదించిన వ్యక్తి. వీరు వైద్య వృత్తినేగాక మరో ప్రక్క మైలవరం రాజావారు ఏర్పాటుచేసిన నాటకసమాజ కంపెనీకి మేనేజరుగా కూడా వుండేవారు. వేణుగోపాలరావు గారి తండ్రి సదాశివరావు కూడా తండ్రి అడుగుజాడల్లో నడచి వైద్య వృత్తినే స్వీకరించారు. వీరు ఎల్.ఎం.పి. డాక్టరుగా మంచిపేరు సంపాదించారు. సదాశివరావు మనో వికాసంతో ఆధ్యాత్మికంగా మహోన్నత స్థాయికి చేరుకున్న వ్యక్తి. ఒక గ్రంథాలయాన్ని ఏర్పాటుచేసి అపారమైన విజ్ఞానం సంపాదించారు. ప్రస్తుతం 'చిన్మయమిషన్' సభ్యులు... వుంటూ దాని అభ్యున్నతికి కృషి చేస్తున్నారు. సదాశివరావుగారు 'డివైన్ లైఫ్ సొసైటీ'లో యాక్టివ్ మెంబరు. వీరు విజయవాడలోని 'ఇండియన్ మెడికల్ అసోసియేషన్'కు అధ్యక్షులు.

కొమ్మూరి సదాశివరావు గారు చిన్నపిల్లల వైద్యంలో బాగా కృషిచేశారు. వీరికి అన్న దమ్ములు లేరు. అప్పచెల్లెండ్రు మొన్నటివరకు వున్నారు. వీరు తండ్రి తాను వైద్య వృత్తిని అవలంభిస్తూ వచ్చారు. కాబట్టి, సదాశివగారు కూడా తన కొడుకు వేణుగోపాలరావుని డాక్టర్ని చేయగలిగారు. వీరి తండ్రి తాతలు మధ్య తరగతి కుటుంబానికి చెందిన వ్యక్తులు కాబట్టి బాధ్యతా యుతంగానూ, క్రమ శిక్షణతోనూ పెంచారు.

రచయితగా సుప్రసిద్ధులైన కొమ్మూరి వేణుగోపాలరావు గారి జీవన వికాసానికి ప్రత్యక్షంగాను, పరోక్షంగానూ పలువురు దోహదం చేశారు. ఎత్తు ఎదగడానికి ప్రోత్సహించారు, రచయితగా రాణించడానికి అభిమానాన్ని కురిపించి ఉత్తేజపరిచారు.

వేణుగోపాలరావు బాల్య దశనుండి అంటే ఉన్నత పాఠశాల విద్యాభ్యాసం దశనుండి నేటివరకు ఆయనతో సత్సంబంధాన్ని కలిగివుంటూ సంఘంలో ఉన్నత స్థానంలో వున్నవారు యెర్నేని రామకృష్ణబాబు, జి. సదాశివ శర్మ, జె. అన్నం రాజు శర్మ, ఐ. జె. సుబ్రమణ్యం, దేవళ్ళారాజు రామలింగేశ్వరరావు, ఇపటూరి రామలింగేశ్వర రావు, వి. రాజేశ్వర శర్మ. పురాణం సూర్యప్రకాశరావు, జి. సి. హెచ్. రామారావు గార్లు ముఖ్యులు.

సాహిత్య రంగంలో సుప్రసిద్ధులైన రచయితలు పలువురు కూడా కొమ్మూరి వేణుగోపాలరావు గారితో సన్నిహిత సంబంధం కలిగి వుండటం గమనార్హం. వీరు పురాణం సుబ్రమణ్య శర్మ, గొల్లపూడి మారుతీరావు, పోతుకూచి సాంబశివరావు, పొత్తూరు వేంకటేశ్వరరావు, నండూరి రామమోహన రావు, వీరాజీ, డా॥ సమరం, కళాప్రపూర్ణ లత, హరికిషన్, బీనాదేవి, ఉన్నవ విజయలక్ష్మి, కీ॥శే॥ మాదిరెడ్డి సులోచన, కె. పి. కృష్ణకుమారి, వెల్లకూరి జయప్రధ ముఖ్యంగా పేర్కొనవచ్చు.

పురాణం సుబ్రమణ్యశర్మ, గొల్లపూడి మారుతీరావుగారు కొమ్మూరి వారితో కలిసి 'ఇడియట్' అనే పేరుతో ఒక గొలుసు నవలను రాసిన విషయం సాహితీ లోకానికి గుర్తుండేవుంటుంది.

## 2. సాహిత్య జీవితం

కొమ్మూరి వేణుగోపాలరావుగారు హైస్కూల్లో చదువుకున్న రోజుల్లోనే సాహిత్యంపట్ల మంచి అభిరుచి ఏర్పడింది. ఆ రోజుల్లో స్వతంత్ర నవలలు తక్కువ. ఇతర భాషలనుండి తెలుగులోనికి పుంఖా పుంఖాలుగా అనువదింప బడేవి. వీటిలో ముఖ్యంగా హిందీ, బెంగాలీ, ఒరియా భాషల నుండి తెలుగులోనికి అనువాదం చేయడం జరిగేది. [illegible], రవీంద్రనాథ టాగూర్, ప్రేమచంద్,

సురేంద్రనాథ బెనర్జీ, తారాశంకర్ బెనర్జీ, విభూతి భూషణ బెనర్జీల రచనలు తెలుగులోనికి రావడంతో వారి రచనలన్నిటిని వేణుగోపాలరావు అధ్యయనం చేసి ఆకళింపు చేసుకున్నారు. వీరికి మొదటి నుండి మానవ జీవితపు లోతుల్ని, మానవతా విలువల్ని, మానసిక బలహీనతల్ని, చెప్పగలిగే సాహిత్యంపట్ల, ఆసక్తి ఎక్కువ. కరుణారసమన్నా, విషాదమన్నా, మక్కువ కావడంవల్ల వేణుగోపాల రావు గారిని శరత్ రచనలు ఎక్కువగా ఆకర్షించాయి. శరత్ రచనల్లో చరిత్ర హీనులు, శేషప్రశ్న, శ్రీకాంత్, గృహదహనం, దేవదాసు మొదలైన నవలలు ఎంతగానో ఆకట్టుకున్నాయి. ఆ నవలల్లోని మాదుర్యం విషాదం, టీవి, పాత్రల చిత్రణ, పాత్రల స్వభావం, నిగ్రహశక్తి, శైలీ విన్యాసం, శిల్పచాతుర్యం రావు గారిని ఎంతగానో ఆకర్షించాయి. ఆ భావావేశమే వేణుగోపాలరావు రచనా వ్యాసంగానికి దోహదమైంది. అనువాద రచనలే కాక ఆనాడు వెలువడిన స్వతంత్ర రచనలన్నీ కూడా ఎంతో ఆసక్తితో చదివేవారు. జంపన, విశ్వనాథ, ఉన్నవ లక్ష్మీనారాయణ, బాపిరాజు, చలం, గోపీచంద్ మొదలగువారి రచనల్ని బాగా ఆపోశనం పట్టగలిగారు.

ఆదునిక నవలా సాహిత్యంలో వేణుగోపాలరావుగారికి నచ్చిన నవలలు యివి—బుచ్చిబాబు 'చివరకు మిగిలేది', గోపీచంద్ 'అసమర్థుని జీవయాత్ర', పండిత పరమేశ్వరశాస్త్రి 'వీలునామా', బాపిరాజు 'నారాయణరావు', రావిశాస్త్రి 'అల్పజీవి', బీనాదేవి 'పుణ్యభూమి కళ్లుతెరు', శ్రీదేవి 'కాలాతీత వ్యక్తులు', రంగనాయకమ్మ 'బలిపీఠం', వాసిరెడ్డి సీతాదేవి 'మట్టిమనిషి' ఇంకా లతా, మాలతీ చందూర్ రచనలు కూడా చోటు చేసుకుంటాయి. పై రచనల ప్రభావ ప్రేరణలు అతనిలోని రచయితను నిద్రలేపాయనే చెప్పాలి.

వేణుగోపాలరావు ఉన్నత పాఠశాలలో చదువుకొనే రోజుల్లో కొవ్వలి, జంపన రచనల్ని తన తండ్రికి తెలియకుండా చదివేవాడు. కథలు రాయాలన్న తపన, ఆవేశం కలగడంవల్ల కొన్ని కథలు రాసి వివిధ పత్రికలకు పంపేవారు. ఆ రచనలు తిరిగివచ్చినా నిరుత్సాహపడకుండా తన రచనల్లోని లోటుపాట్లను సరిదిద్దు కుంటూ కథలు రాసి మళ్ళీ వివిధ పత్రికలకు పంపేవారు. 1952వ సంవత్సరంలో జ్యోతి మాసపత్రికలో రావుగారి కథ మొట్టమొదటిసారిగా ప్రచురితమైంది. మొదటి సారిగా తన రచనను పత్రికాముఖంగా చూసేటప్పటికి ఉత్సాహం పెల్లుబికింది.

వీరి తండ్రి తప్ప వారి కుటుంబమంతా సంబరపడింది. రచనలు చేయటం వాళ్ళ నాన్నగారికి పెద్దగా యిష్టం వుండేదికాదు. అందుబాటులో లేని ప్రదేశాల్లో రచనలు సాగించేవారు.

వేణుగోపాలరావుగారు తన రచనల్లో నిరుపేదలు, దారిద్ర్యం, గృహాస్త్రీల కొట్లాటలు, కులాల తారతమ్యాలు, ఓ రాజకీయ సిద్ధాంతం వీటిని తన రచనకు వస్తువులుగా ఉపయోగించుకొనేవారు. వీరు మధ్య తరగతి కుటుంబానికి చెందిన వ్యక్తి కావడంవల్ల ఆ తరగతి కుటుంబ సమస్యలు, బంధువుల సమస్యలు, ఆర్థిక సమస్యలు ఆయన్ని బాగా కదిలించాయి. కలాన్ని ఆకర్షించాయి. కథల్లో ఒక్కని సైకాలజీ జోడించి రచనలు చేశారు.

ఇంటర్మీడియట్ చదువుతున్న రోజుల్లో తన అక్కకొడుకు మరణిస్తాడు, హృదయవిదారకమైన ఆ దృశ్యాన్ని చూసి ఓ చిన్నపాప విలపిస్తుంది. ఆ సంఘటన రావు హృదయాన్ని ఊపివేసింది. ఆ అనుభూతిని మసితను కాగితంపై పెట్టారు. ఆ నేపథ్యమే 'చావు బ్రతుకులు' అనే కథ. ఈ కథ 1953వ సంవత్సరం మే నెల 'భారతి' సాహిత్య మాసపత్రికలో ప్రచురితమైంది. 'భారతి'లో తన కథ అచ్చు కావడంతో వీరి రచనా విధానానికి కొత్త వాతావరణం, పరిపుష్టి ఏర్పడ్డాయి. సెలవుల్లో చదువుకోవడానికి కావలసినన్ని పుస్తకాలు దొరికేవి. ఆంగ్లంలో షేక్స్పియర్ నాటకాల్ని అధ్యయనం చేసేవారు. అవి నచ్చలేదని కారణంగా వాటిమీద శ్రద్ధ చూపించక కథల్ని రాసేవారు. కళాశాల మేగజైన్‌లో 'ఇంగ్లీషులో విద్యాభ్యాసం సమంజసమా?' అన్న వ్యాసం ప్రచురితమైంది.

1954వ సంవత్సరం నవలా రచయితయిన 'చంటు' (జి. సి. హెచ్. రామారావు) గారితో పరిచయం ఏర్పడింది. రచనల యితివృత్తాలను గురించి వీరిద్దరూ చర్చించుకొనేవారు. విజయవాడలోని లైబ్రరీలన్నిటిలోను చదువుకొనే వారు. రామమోహన్ లైబ్రరీలోని పుస్తకాలు వీరి రచనా వ్యాసంగానికి ఎక్కువగా ప్రోత్సాహ మిచ్చాయి. వేణుగోపాలరావు గారి మొట్టమొదటి చిన్న నవల 'పిల్ల దొంగ', ప్రముఖ వార పత్రికలో సీరియల్‌గా వచ్చింది. ఇంటర్మీడియట్ పూర్తయిన తరువాత 1955లో 'పెంకుటిల్లు' నవల రాశారు. హైదరాబాదు నుండి వెలువడుతున్న 'ప్రజామత' వార పత్రికలో సుమారు సంవత్సరంపైగా ఈ

నవల ధారావాహికంగా వెలువడింది. అంతటి మహత్తరమైన నవలను 13 సంవత్సరాల ప్రాయంలోనే రాయగలిగారు. మధ్య తరగతి జీవితంలోని సౌకుమార్యాన్ని, మాధుర్యాన్ని అందించిన తన రెండవ రచనతోనే పాఠకులను బాగా ఆకట్టుకున్నారు.

'పెంకుటిల్లు' నవలను దేశకవితా మండలివారు పుస్తక రూపంలో ఆంధ్ర దేశానికి అందించారు. ఈ నవల 1940 నుంచి 1955 వరకు ప్రచురితమైన నవలల్లో ప్రథమ బహుమతి కూడా అందుకుంది. విశాలాంధ్ర పత్రికా సంపాదకులు అయిన మద్దుకూరు చంద్రశేఖర రావు సమీక్షించారు. నార్ల చిరంజీవి నవలా విశిష్టతను కొనియాడారు. ప్రఖ్యాత సాహితీ విమర్శకులు అయిన శ్రీవాత్స యండమూరి సత్యనారాయణ ప్రత్యేకంగా ఆ నవలను శ్లాఘించారు. ఆ నవలా రచనతో వేణుగోపాలరావు గారికి తల్లావఝుల శివశంకరశాస్త్రి, మునిమాణిక్యం నరసింహారావు, నోరి నరసింహశాస్త్రి, మొక్కపాటి నరసింహమూర్తి మొదలైన వార్లతో పరిచయం ఏర్పడింది.

1958 వ సంవత్సరం కాకినాడ వైద్యకళాశాలలో చేరిన తరువాత 'గోరింటాకు' నవల రాశారు. ఈ నవల నవ్యసాహితీ బహుమతి నందుకొంది. ఇది ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రికలో ధారావాహికంగా వెలువడింది. వైద్యకళాశాల ఎన్నికల్లో సాహిత్య విభాగానికి పోటీ లేకుండా ఎన్నికయ్యారు. నాల్గవ సంవత్సరం చదువుతున్నప్పుడు డా॥ సమరంతో పరిచయం ఏర్పడింది. వీరిద్దరూ ఎన్నో సాహిత్య సభల్ని, గోష్ఠుల్ని ఏర్పాటుచేశారు. 'జవహర్' అన్న గోడ పత్రికను కళాశాల ఆవరణంలో ఆరంభించారు. ఆ పత్రిక ద్వారా తనతోటి విద్యార్థుల్ని చైతన్యవంతుల్ని చేయడానికి ప్రయత్నించారు. ఆ కళాశాలలో అధ్యాపకులు మన్ననల్ని కూడా పొందగలిగారు.

వేణుగోపాలరావుగారు ఎం.బి.బి.యస్. చదువుకుంటూ మరోపక్క నవలలు కూడా రాస్తూ వచ్చారు. 1959 వ సంవత్సరం 'చిన్నక్క' నవల 'ప్రజామాత' వార పత్రికలో ధారావాహికంగా ప్రచురితం అయింది. కాని చిన్నక్క నవలను పేరు మార్చి 'శారద' నవలగా సాహితీలోకానికి అందించారు. వైద్యకళాశాల చదువు పూర్తి అయ్యేలోపుగా 'ఆత్మజ్యోతి', 'జాలి లేని జాబిలి', 'విషవలయం', నవలల్ని రాశారు. 1965 వ సంవత్సరం హౌస్ సర్జన్ అనుభవాల్ని అదే పేరుతో

సపిలా రూపంగా వెలుపరించారు. ఈ నవలను ఎమెస్కో వారు 1967 లో కూడా ప్రచురించారు. (1967 వ సంవత్సరం అక్టోబరులో ఎమెస్కో పాకెట్ బుక్స్ సిరీస్‌లో ప్రథమ ముద్రణ పొందిన ఈ నవల 1969 మార్చిలో రెండవ ముద్రణ, 1971 జూన్‌లో మూడవ ముద్రణ, 1975 ఆగస్టులో నాల్గవ ముద్రణ పొందింది.)

ఆంధ్రదేశంలోని దిన, వార, పక్ష, మాస పత్రికలన్నిటిలోను వేణుగోపాలరావు రచనలు ప్రచురింపబడినాయి. ప్రజామత, ప్రజాసాహితి, తెలుగు స్వతంత్ర, భారతి, జ్యోతి, యువ, ఆంధ్రపత్రిక, ఆంధ్రప్రభ, ఆంధ్రజ్యోతి, స్వాతి మొదలైన పత్రికల ద్వారా గత ముప్ఫై సంవత్సరాలుగా వారు రచనల్ని అందిస్తున్నారు.

వేణుగోపాలరావు గారు చిన్నప్పటినుండి నాటకాలు రాయాలనీ, గేయ కవితలు రాయాలనీ, ఎంతో ఉబలాటపడేవారు. ఎన్నో రేడియో నాటికలు రచించారు. ఆకాశవాణి, విజయవాడ ద్వారా చాలవరకు ప్రసారం అయ్యాయి.

వేణుగోపాలరావు తన నవలల్ని అన్నింటిని సాహితీకారులకు, సాహితీ మిత్రులకు, తల్లిదండ్రులకు, ఆత్మ బంధువులకు, భార్యకు అంకితం చేశారు. సాహితీ కారుల్లో ముఖ్యంగా శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి, త్రిపురనేని గోపీచంద్, ఇచ్ఛాపురపు జగన్నాథరావు, పురాణం సుబ్రహ్మణ్య శర్మ, కీ॥ శే॥ మాదిరెడ్డి సులోచన గార్లు ముఖ్యులు. హరికిషన్, జొన్నలగడ్డ లలితాదేవి, ఉన్నవ విజయలక్ష్మి, యండమూరి వీరేంద్రనాథ్ మొదలైన రచయితల నవలలకు పీఠికలు కూడా రాశారు.

ముగ్గురు సుప్రసిద్ధ రచయితలు అయిన పురాణం సుబ్రహ్మణ్య శర్మ, గొల్లపూడి మారుతిరావు, కొమ్మూరి వేణుగోపాలరావు కలిసి అద్భుతంగా రాసిన గొలుసు నవల 'ఇడియట్'. ఈ నవల మధ్య తరగతి జీవితాలకు దర్పణం పట్టింది. 'గొలుసు' నవల రాయడం తెలుగు నవలా సాహిత్యంలో ఓ నూత్న ప్రయోగం. గొలుసు నవలను రాయటంలో కూడా వేణుగోపాలరావు సిద్ధ హస్తులు.

**అనువాద కార్యక్రమాన్ని ఒక పద్ధతి ప్రకారం అమలు జరుపుతూ అనేక అనువాద గ్రంథాలను ప్రచురించిన ఖ్యాతి నేషనల్ బుక్ ట్రస్ట్ కే దక్కుతుంది.**

వీరు హిందీలోకి అనువదింపజేసే గ్రంథాలన్నీ భారతీయ భాషలన్నింటిలోకి అనువాద మయ్యాయి. పురాణం సుబ్రహ్మణ్య శర్మ, శ్రీ వాకాటి పాండురంగారావు ఎడిట్ చేసిన 'తెలుగు కహానియా'లో వేణుగోపాలరావు గారి 'మరమనిషి' కథ చోటు చేసుకొంది.

**కథలు :**

కొమ్మూరి వేణుగోపాల రావు కథల రూపంలోనే అటు సాహితీ లోకానికి, ఇటు పాఠకలోకానికి మొదట పరిచితులయ్యారు. వీరు దాదాపు రెండు వందల కథలకు పైగా రాశారు. వీరి కథలు పుస్తకాల రూపంలో వెలువడ్డాయి. కొమ్మూరి కథలు కథావాహిని, కాంతికిరణాలు అనే పేర్లతో పదునాలుగు సంపుటాలుగా వెలువడ్డాయి.

**నవలలు :**

వేణుగోపాల రావు కథల ద్వారా సాహితీ లోకానికి పరిచితులయినప్పటికి 'పెంకుటిల్లు' నవల వారిని సాహిత్య జగత్తులో నిలబెట్ట గలిగింది. వీరి నవలలు అన్నింటిని నవభారత్ బుక్ హౌస్ వారు పుస్తకాల రూపంలో వెలువరించారు. వాటిలో ముఖ్యమైనవి – 'పెంకుటిల్లు', 'హౌస్ సర్జన్', 'ఈ దేశంలో ఒక భాగమిది', 'శారద', 'జాలిలేని జాబిలి', 'ఒకే రక్తం – ఒకే మనుషులు', 'ఒకే పాటకు రెండు రాగాలు', 'వ్యక్తిత్వం లేని మనిషి', 'సూర్యుడు దిగిపోయాడు' 'భారతి', 'డాక్టరు గారి భార్య', 'న్యాయానికి అటూ – యిటూ', 'కదిలే మేఘం', 'గుప్పెడు వెలుగు', 'విరాజి', 'జోగిబాల', 'కళ్ళు', 'నెత్తుటి బొట్టు', 'అర్ధచంద్ర' మొదలగు నవలల్ని చెప్పుకోవచ్చు.

## 3. పరభాషల్లోకి అనూదితాలు

మంచి రచనలు ఇతర భాషల్లో అనువదించడం సాహిత్య లోకంలో సర్వ సాధారణంగా జరుగుతూ వుంటుంది. ఇక్కడ రచయితకు ప్రాముఖ్యత యివ్వరు. రచనకు ప్రాముఖ్యత యిస్తారు. ఒక రచయిత రచనలు పరభాషలోకి అనువదించడం వల్ల ఆ రచయిత పేరే కాకుండా ఆ ప్రాంతానికి కూడా మంచి పేరు వస్తుంది.

వేణుగోపాలరావుగారి 'హౌస్ సర్జన్' నవలను వేమూరి ఆంజనేయశర్మ గారు హిందీలోకి అనువదించారు. ఈ నవల హిందీలోనే గాక కన్నడ, మలయాళ భాషల్లోకి అనువదించబడింది. 'ఈ దేశంలో ఒక భాగమిది' నవలను హిందీలోకి అనువదించి 'హిందీ విశారద' వారికి ఉపవాచకంగా నిర్ణయించారు. 'భారతి', 'హారతి', 'ప్రేమకాంలి', 'ప్రేమ నక్షత్రం' నవలల్ని కన్నడంలోకి అనువదించారు. 'హారతి', 'ప్రేమ నక్షత్రం' నవలలు తెలుగులో చలనచిత్రాలుగా కూడా వచ్చాయి. 'హారతి' నవల తెలుగులోనే కాక హిందీ, కన్నడ భాషల్లో కూడా చలనచిత్రంగా రూపొందించారు. వీరి 'మరమనిషి' కథ ముఖ్యమైన భారతీయ భాషలన్నిటిలోకి అనువదించబడింది.

# 4. సన్మానాలు – సత్కారాలు

కొమ్మూరి వేణుగోపాలరావుగారు ఇంటర్మీడియట్ చదువుతున్న రోజుల్లో అంటే 1950–54 సంవత్సరాల మధ్య పట్టు వదలని విక్రమార్కుడిలా వంద కథలు రాసి పాఠకుల ప్రశంసలు అందుకున్నారు. అందువల్ల విద్యార్థి మిత్రులు ఓ 'మినీ' సన్మానం ఏర్పాటు చేశారు. కళాశాల అధ్యాపకులయిన శ్రీ లక్ష్మి నారాయణగారి అధ్యక్షతన 'మినీ సన్మానం' జరిగింది. ఆ నాడు తీయించుకున్న ఫొటో ఈ రోజున చూసుకుంటే వేణుగోపాలరావుగారికి ఎంతో సంబరం; ఎన్నో మధురస్మృతులు, ఎంతో ఆనందం పొందుతారు.

వేణుగోపాలరావు 18 సంవత్సరాల వయస్సులోనే 'పెంకుటిల్లు' నవలను రాసి ప్రముఖుల మన్ననల్ని పొందగలిగారు. 'తెలుగు భాషా సమితి'వారు 1940–1957 మధ్య కాలంలో వెలువడిన నవలల్లో 'పెంకుటిల్లు'కు ప్రథమ బహుమతి యిచ్చారు. సన్మానసభల్లో ఆనాటి లోక్‌సభ అధ్యక్షులు శ్రీ అనంత శయనం అయ్యంగార్ వేణుగోపాలరావుగారిని సన్మానించారు. ఆధునిక రచయితలు అంత చిన్న వయసులో సన్మానం పొందటం గర్వించదగ్గ విషయం. మరెవరూ ఆ చోటును భర్తీ చేయలేకపోయారు. 1953–60 సంవత్సరాల మధ్య వెలువడిన 'గోరింటాకు' నవలకు 'నవ్యసాహితి' సమితివారు ప్రథమ బహుమతి ప్రదానం చేశారు.

1976 వ సంవత్సరం ఏప్రిల్ నాలుగవ తేదీన వేణుగోపాలరావుగారికి సాహిత్య రజతోత్సవం జరిగింది. సాహితీ మిత్రులు హైదరాబాదులోని రవీంద్ర భారతిలో సన్మాన సభలు ఏర్పాటు చేశారు. ఆనాటి సాహితీసభకు 'సాహితీ చైతన్య' పోతుకూచి సాంబశివరావుగారు అధ్యక్షత వహించారు. ఆనాటి ఆంధ్రప్రదేశ్ హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి శ్రీ ఆవుల సాంబశివరావుగారు వేణుగోపాలరావు గారిని సన్మానించారు. 1968–69 సంవత్సరాలలో అఖిలభారత చలనచిత్ర బహుమతుల కమిటీలో కూడా వేణుగోపాలరావుగారికి సభ్యత్వం దక్కింది.

1978 వ సంవత్సరం ప్రారంభంలో అఖిలభారత స్థాయిలో ఇండో సోవియట్ సాంస్కృతిక యాత్రను ఏర్పాటు చేశారు. కేంద్రప్రభుత్వంచేత ఎన్నుకోబడిన ఇరవైమంది ప్రముఖ రచయితలు నెలరోజులు దక్షిణదేశయాత్ర చేశారు. అందులో వేణుగోపాలరావుగారు కూడా సభ్యులు. ఇటీవల పేరుపొందిన ఆయన రచన 'కల్కి భగవాన్'. ప్రస్తుతం వైద్యవృత్తిలోనే కొనసాగుతూ డా॥ వేణుగోపాలరావు రచనా వ్యాసంగం కూడా చేస్తున్నారు.

―o―

# వైద్యవృత్తి - 2

## 1. సాహిత్యం - వైద్య విషయాలు

వైద్యో నారాయణోహరిః అన్నారు పెద్దలు.

ప్రాచీన సాహిత్యంలో వైద్యానికి సంబంధించిన ఎన్నో విషయాలు, విశేషాలు కనిపిస్తాయి. వేయి సంవత్సరాలుగా వచ్చిన సాహిత్యాన్ని మనం చూస్తే ప్రాచీన వైద్యానికి సంబంధించిన విషయాల్ని మనం గమనిస్తే ఔషధాలు, ఆకులు, వేర్లు, చూర్ణంవంటి వాటితో ఆరోగ్యాన్ని కాపాడుకుంటూ వచ్చారని తెలుస్తుంది. ఆధునిక వైద్యశాస్త్రం మాత్రం ఎన్నిరకాల రోగాలువుంటే అన్నిరకాల రోగాలకు విరుగుడు కనిపెడుతూ ముందుకు వెళుతున్న విషయం తెలిసిందే.

ప్రాచీన చరిత్రలో కనిపించే ప్రసిద్ధవైద్యులు చరకుడు, సుశ్రుతుడు, వాగ్భటుడు. చరకుడు 'చరక సంహిత' (వైద్య శాస్త్రం) అనే వైద్య విజ్ఞాన గ్రంథాన్ని రచించారు. సుశ్రుతుడు శస్త్రచికిత్సలో పేరు పొందినవాడు. వాగ్భటుడు 'అష్టాంగ సంగ్రహం' అనే వైద్యశాస్త్ర గ్రంథాన్ని రచించాడు. చివరి ఇరువురు గుప్తుల కాలంలోని ప్రముఖ వైద్యులు. జైన, బౌద్ధమత ప్రాబల్యాల కారణం వల్ల వైద్యానికి సంబంధించిన శాస్త్రాలు ఎన్నో ప్రచారంలో వున్నాయి.

వైద్యానికి సంబంధించిన అనేకాంశాలు జానపదగేయాలలో, సామెతలలో కనిపిస్తాయి. ముఖ్యంగా సామెతల్లో—

'పది జిలకర పోగులువుంటే పగవాని ఇంటిలో భోజనంచేయ వచ్చు.

'అన్న సాగితే రోగం అంత భోగం లేదు'

'రోగం రట్టు సంసారం గుట్టు'

'దిగులును మించిన వ్యాధి లేదు'

'విశ్వాసాన్ని మించిన ఔషధం లేదు'

వ్యాధి వచ్చినవాడు వెర్రి పట్టినవాడు ఒక్కటే'

జానపద గేయాలలో 'చెమ్మా - చెక్క' అనే గేయంలో వైద్య శాస్త్ర రహస్యాలున్నాయని జానపదబ్రహ్మ ఆచార్య బిరుదరాజు రామరాజు గారు భావించారు.

మహాభారతంలో ధృతరాష్ట్రుడు అంధుడుగా జన్మించడం, పాండురాజు పాండు రోగంతో జన్మించడం మనకు తెలిసిందే. వీళ్ళ రోగాలకు విరుగుడు లేనట్లు తెలుస్తుంది. విచిత్రవీర్యుడు క్షయ వ్యాధితో మరణించాడని మహాభారతం చెప్పినా అందుకు కారణం విలాసశృంగార జీవితం గడపడమే. పామువిషాన్ని మంత్ర తంత్రాలతో తొలగించేవారని చెప్పడానికి తక్షకుని భయంతో పరీక్షిత్తు విష వైద్యుల్ని రప్పించి జాగ్రత్తపడటం ఆదిపర్వంలో ఓ మంచి ఉదాహరణ.

ప్రాచీనులు ఉపయోగించే ఔషధాలు ఎక్కువగా హిమాలయాల్లో వుండేవని నన్నెచోడుని 'కుమార సంభవం' చెపుతుంది. పాల్కురికి సోమన 'బసవ పురాణం'లో దేశీయ వైద్యానికి సంబంధించిన అంశాలెన్నో వున్నాయి.

మృత శరీరాన్ని చెడకుండా రసాయనాల్లో వుంచే విధానం కావ్య వర్ణనల్లో వుంది. సత్యభామ తన తండ్రి మరణించినపుడు 'తైలపాకం'లో వుంచి హస్తినకు తీసుకెళ్ళి శ్రీకృష్ణునకు మరణవార్తను తెలిపినట్లు పోతన 'భాగవతం'లో వుంది. శ్రీనాథుడు 'కాశీ ఖండం'లో భోజన క్రమమాణాన్ని వర్ణించాడు. పెద్దన 'మను చరిత్ర'లో ఇందీవరాక్షుని కథలో వైద్యానికి సంబంధించిన విషయం చాలావుంది. నత్కీరుని కథలో 'కుష్ఠురోగ నివారణ' పీటిలో వుండే ఔషధ మూలకాల వలన జరిగింది. నంది తిమ్మన 'పారిజాతా పహరణం'లో విశల్యకరణి, సంజీవకరణి, సంధాన కరణి, సౌవర్ణకరణి వంటి ఔషధాలు చాలా రోగాల్ని పోగొట్టేవిగా వర్ణింపబడినాయి. ధూర్జటి 'కాళహస్తీశ్వరమాహాత్మ్యం'లో తిన్నడు శివునికి చేసిన నేత్రవైద్యం తెలుగు సాహిత్యంలోనే మకుటాయమానం. శివునికంటికి యెన్ని మందులు వాడినప్పటికీ రక్తం ఆగనందువల్ల తిన్నడు తన నేత్రాన్ని శివునికి అర్పించి తన భక్తిని ప్రదర్శిస్తాడు. పింగళిసూరన 'కళా పూర్ణోదయం'లో యోగాసనాలు ఆయుస్సును పెంచుతున్నట్లు వర్ణించాడు.

తిక్కన 'నిర్వచనోత్తర రామాయణం'లో కణితిని శస్త్రచికిత్స చేయు విధానం వర్ణింపబడి వుంది. 'భాస్కరరామాయణం'లో మూర్ఛిల్లిన లక్ష్మణునికి

చికిత్స కోసం హనుమంతుడు హిమాలయాలకు వెళ్ళి సంజీవని పర్వతంలో ప్రకాశిస్తున్న ఔషధాలు తీసుకువచ్చినట్లు తెలుస్తుంది. లక్ష్మణుని మూర్ఛ రోగాన్ని పోగొట్టే సంధానకరణి, సంజీవకరణి వంటివి వాడినట్లు ఇందులో విదితం భాస్కరరామాయణంలో దశరథమహారాజు మరణిస్తే వశిష్ఠమహర్షి తైలపాకంలో వుంచి అరణ్యవాసం వెళ్ళిన శ్రీరామునకు వర్తమానం పంపినట్లు తెలుస్తుంది వెన్నెలకంటి సూరన 'విష్ణుపురాణం'లో ఆరోగ్యాన్ని కాపాడే క్రమపద్ధతి ముఖ్యంగా భోజన సమయాల్లో తీసుకోవలసిన జాగ్రత్తల వివరణ చాలా వుంది.

ప్రాచీన సాహిత్యంలో కనిపించే వైద్య విజ్ఞానం ఆధునిక యుగంలో ముఖ్యంగా నవల్లో చోటు చేసుకున్నది. అయితే నవలలో దేశీయ వైద్యవిజ్ఞానికి మారుగా ఆంగ్ల వైద్యవిజ్ఞానం కనిపిస్తుంది. పాఠకులకు వైద్యవిజ్ఞానాన్ని అందు బాటులోకి తేవడానికి నవలలు ఉపయోగపడినాయి. డా॥ కొమ్మూరి వేణుగోపాల రావు మొట్టమొదట వైద్యవృత్తికి సంబంధించిన పలు అంశాలను నవల ద్వారా చెప్పడానికి ప్రయత్నం చేసినవారు.

ఏ వృత్తికి సంబంధించినవారు ఆ వృత్తిని గురించి రాస్తే సాహిత్యంలో వైవిధ్యం వుంటుంది. అటువంటి రచనలు నిర్దిష్టభావాలతో ప్రయోజనాన్ని కలిగి ఆదర్శశిఖరాల్ని అధిరోహిస్తూ కనిపిస్తాయి. రచయితకు జగత్తులోని ప్రతి విషయాన్ని నిశితంగా పరిశీలించే శక్తి, స్పందించే హృదయం వుంటుంది. వ్యక్తికి వృత్తికి ప్రవృత్తికి అనుసంధానత్వాన్ని కలిగించేది మానసిక పరిపక్వత. వైద్య వృత్తిలో వుండే వ్యక్తికి వివిధ రకాల మనస్తత్వాల్ని తెలుసుకోవడానికి ఎంతో అవకాశం వుంటుంది.

ప్రపంచ వ్యాప్తంగా హిపోక్రటీస్‌ని 'ప్రథమ వైద్య పితామహుడు'గా కీర్తిస్తారు. "The longer you can look back, the further you can look forward" అన్నారు చర్చిల్ మహనీయుడు. గతం వర్తమానానికి భవి ష్యత్తుకి తాళంచెవి అందిస్తుంది. గత రెండువేల సంవత్సరాలలో వైద్యశాస్త్రం ఎంతో అభివృద్ధి చెందింది. వైద్యశాస్త్రం అభివృద్ధి వెనుక కొన్ని వేలమంది శాస్త్రజ్ఞుల నిరంతర కృషి పట్టుదల ఉన్నాయి. అందరి పేర్లు తెలుసుకోవడం సాధ్యం కాకపోయినా కొందరి పేర్లు, చిరస్థాయిగా ఎప్పటికీ నిలిచిపోతాయి. అట్టి వారిలో హిపోక్రటీస్ మొట్టమొదటివారు. ఈ నాటికి వీరిని 'వైద్యశాస్త్ర పితా

మహామునిగా కీర్తిస్తారు. క్రీ. పూ. 4 వ శ॥లో వీరు చెప్పిన వైద్యశాస్త్ర సూక్తులు ఇప్పటికీ ఆచరణలో వున్నాయంటే అతిశయోక్తి కాదు. వైద్యవృత్తి నీతిబద్ధమైనదని చెప్పి ఆచరించిన తొలివ్యక్తి హిపోక్రటీస్. ఆధునిక వైద్యధర్మాలకు పునాదులు వేశాడు. వారు చెప్పిన నీతిసూక్తులు ఒక పట్టికగా ఏర్పాటుచేసి వైద్య శాస్త్రంలో పట్టభద్రుడైన వ్యక్తిచేత పఠింపచేస్తారు. దీనినే 'హిపోక్రటీస్ ఓత్' అంటారు. వారి మాటల్లో "ఒక మనిషి మంచి వైద్యుడు కావాలంటే ముందుగా అతనికి మంచి వ్యక్తిత్వం ఉండాలి" అని అంటాడు.

ప్రపంచ తాత్వికవేత్త శ్రీ జిడ్డు కృష్ణమూర్తిగారు సుమారు 70 సంవత్సరాల క్రితం విజయవాడలో వైద్యులకు గల నీతినియమాల్ని తెలియజేస్తూ "డాక్టర్లు, లాయర్లు అవినీతిపరులైతే సమాజం అవినీతిమయం అవుతుంది అయితే అవినీతి అంటే ఏమిటనేదే ప్రశ్న. అందరూ ఏది దుర్భరమని ఏవగించుకుంటారో అదే అవినీతి" అని అన్నారు.

వైద్యవృత్తి అనుభూతుల నిలయం. దీనికి స్పందించే హృదయం ఎంతో అవసరం. ఆత్మస్థైర్యం, గుండెదిటవు, సంయమనం కావాలి. డాక్టర్ల జీవితం ఎంతో సంఘర్షణతో కూడుకున్నది. సభ్యసమాజంలో ఎంతో బాధ్యత గల వైద్యులు రోగుల మనస్తత్వానికి అనుగుణంగా వారికి మానసికోల్లాసం కలిగించి మరో జన్మ ప్రసాదించే మహోన్నత వ్యక్తులు. మానవత్వం మూర్తీభవించి ఎదుటివారిని పూర్తిగా అర్థం చేసుకోగల సహృదయులు. మూఢనమ్మకాల ఊబి నుండి బయటకు లాగగల శక్తి సంస్కర్తల తరువాత వైద్యులకే వుందనుటలో సందేహం లేదు. ప్రస్తుత కాల్పనిక జగత్తులో కల్పనా సాహిత్యంలో వచ్చే రచనలన్నీ వాస్తవాలు కాకపోవచ్చు కాని వైద్యవృత్తిని స్వీకరించిన వ్యక్తి రచయిత అయినట్లయితే వాస్తవానికి చేరువలో వుండటానికి ఎంతైనా అవకాశం వుంది. మాటల్లో భేదం వుండవచ్చు కాని భావం మాత్రం ఒక్కటే.

కొమ్మూరి వేణుగోపాలరావు మొట్టమొదట వైద్యవృత్తికి సంబంధించిన పలు అంశాలను నవలల ద్వారా చెప్పడానికి ప్రయత్నించారు. తెలుగు నవలా సాహిత్యంలో వైద్యవృత్తికి సంబంధించిన సంపూర్ణ నవల వీరి 'హౌస్ సర్జన్'. ఇదే మొట్టమొదటి వైద్యవృత్తి నవల. వ్రాయడానికి తగిన కారణాలను

'డాక్టర్‌గారి భార్య' నవలకు ముందుమాటలో రచయిత "వైద్యవృత్తిలోని పవిత్రతను, గొప్పదనాన్ని జనరంజకంగా చిత్రించడానికి చాలా నిజాయితీగా చిత్తశుద్ధితో కృషి చేశాను. డాక్టర్ల జీవితం ఎంత కష్టమైందో, ఎంత విశ్రాంతి లేకుండా పని చేస్తారో ప్రేమ అనేదాన్ని మరచిపోయి ఎలా శ్రమిస్తుంటారో రక రకాల పేషంట్ల మధ్య ఎలా నలిగిపోతుంటారో చిత్రించడానికి కృషిచేశాను. డాక్టర్ల మానవతా దృక్పథం వెనుక ఎంత త్యాగం, సంఘర్షణ, పవిత్రత వుంటుందో తెలియజేయడానికి శాయశక్తులా ప్రయత్నించాను" అని అంటారు. పై మాటలు నిలబెట్టుకోవడం కోసమే శ్రమించి తన వైద్యవృత్తి నవలలకు న్యాయం చేకూర్చగలిగారు. వైద్యవృత్తి నవలలను నవలా సాహిత్యంలో ఒక ప్రత్యేక అంశంగా పరిశీలించవలసిన అవసరం ఎంతైనా వుంది.

వృత్తిలోని భాగాలుగా విద్య, వైద్య, లాయర్, ఇంజనీర్, వ్యవసాయం ఇలా మరెన్నో విభజించుకోవచ్చు. మానసిక పరిపక్వత గల రచయిత తాను ఒక వృత్తిలో వుంటూ మరొక విషయంలో అభివృద్ధి పెంచుకుంటాడు. దీన్ని ప్రవృత్తి రచన అంటారు. వృత్తి, ప్రవృత్తి కలిగిన వైద్యులు అనేక విషయాలను నవలల్లో చొప్పించారు. వీటిలో వాస్తవికత కూడా ప్రతిఫలిస్తుంది. ఇది ప్రవృత్తి రచన. డాక్టర్ కొమ్మూరి వేణుగోపాలరావు తరువాత వైద్యవృత్తి నవలలు వ్రాసినవారిలో డా॥ కొత్త రవీంద్రబాబు, డా॥ కేశవరెడ్డి, డా॥ పరచూరి రాజారాం ప్రముఖులు. రచయిత్రులలో డా॥ కె. వి. కృష్ణకుమారి, డా॥ పెళ్ళకూరి జయప్రద, డా॥ ఆలూరి విజయలక్ష్మి ప్రసిద్ధులు.

వైద్యులు కానివాళ్ళు ఈ వృత్తికి సంబంధించిన అంశాలను సూక్ష్మదృష్టితో పరిశీలించి నవలలు వ్రాశారు. వారిలో యండమూరి వీరేంద్రనాధ్, చల్లా సుబ్రహ్మణ్యం, చివుకుల పురుషోత్తం, చిత్తర్వు మధు, కప్పగంతుల మల్లికార్జున రావు, లల్లాదేవి, మన్నెం శారద, రావులపల్లి సునీత, చిట్టారెడ్డి సూర్యకుమారి మొదలైనవారు ప్రసిద్ధులు.

యండమూరి వీరేంద్రనాధ్ 'ప్రార్థన' నవలలో కేన్సర్‌వ్యాధి ఇతివృత్తం. కేన్సర్‌వ్యాధి పేరిట జరిగే మోసాలు ఈ నవలలో ప్రస్తావించారు. కప్పగంతుల మల్లికార్జునరావు నవల 'ది నీడిల్'లో మత్తుమందుకు లోనయిన విద్యార్థుల

జీవితం ఇతివృత్తం. మెడిసన్‌లో చేరిన విద్యార్థి సహవిద్యార్థి స్నేహంవల్ల మాదకద్రవ్యాల సేవనకు అలవాటుపడి జీవితం నాశనం చేసుకోవడం 'ది సీడిల్' నవలలో వివరించారు. ఇది నేటి యువతకు హెచ్చరికలాంటి రచన. నర్సుల జీవితాన్ని ఇతివృత్తంగా అల్లిన మరో మంచి రచన మన్నెం శారద 'సిస్టర్ సిస్టర్'. డాక్టర్లకు సహకరిస్తూ రోగులకు సేవచేసే విషయం ఇందులోని వస్తువు. 'తెల్లని దుస్తులు ఎంత స్వచ్ఛంగా వుంటాయో రోగులకు మేము చేసే సేవ కూడా అంత స్వచ్ఛంగా వుంటుంద'ని రచయిత్రి యీ నవల ద్వారా ఓ సందేశాన్ని ప్రకటించారు. డాక్టర్ల వృత్తి ఎంత పవిత్రమైందో తెలిపే రచన 'వృత్తి'. రచయిత్రి రావులపల్లి సునీత. ఇందులో ప్రభుత్వ ఆసుపత్రులలో రోగ నిర్ణయం జరిగినట్లుగా ప్రయివేటు ఆసుపత్రులలో జరగడంలేదని ఇందులో సూచించబడింది. మెడికల్ రిప్రజెంటేటివ్‌ల జీవితాల చిత్రణ ఇందులో అక్కడక్కడా కనిపిస్తుంది. మానసిక వ్యాధులకు గురైన రోగుల్ని మెంటల్ ఆసుపత్రులలో రోగ నిర్ధారణచేసి దానికి చికిత్స ఎలా చేస్తారో చిట్టారెడ్డి సూర్యకుమారి 'ది హాస్పిటల్' నవలలో చెప్పారు. ఆసుపత్రుల వాతావరణాన్ని, రోగుల జీవితాన్ని క్షుణ్ణంగా అధ్యయనం చేసిన నవల.

డాక్టర్లుగా వుంటూ వైద్యవృత్తి నవలలు వ్రాసినవారిలో వేణుగోపాలరావు తరువాత కొత్త రవీంద్రబాబు ప్రసిద్ధులు. వారి 'సుశ్రుత నర్సింగ్ హోమ్', 'చరక సంహిత' నవలలు బాగా ప్రచారంలోకి వచ్చాయి. ప్రభుత్వ ఆసుపత్రులు, ప్రయివేటు నర్సింగ్‌హోమ్‌లు పెట్టుకునేవారి సాధకబాధకాలు, ఆపరేషన్ చేసే విధానాలు, నకిలీ డాక్టర్ల మోసాలు రవీంద్రబాబు తన నవలల్లో చక్కగా చిత్రించారు. కేశవరెడ్డి 'సిటీ బ్యూటిఫుల్' నవలలో ఎం.బి.బి.యస్. కోర్సులో చేరిన విద్యార్థుల మనస్తత్వాలు ఆ వృత్తిలో వున్నటువంటి సాధకబాధకాల్ని వివరించారు.

కొమ్మూరి వేణుగోపాలరావు 40 నవలలకు పైగా రాసినా ప్రతి నవలలో వైద్యవృత్తికి సంబంధించిన ఎన్నో విశేషాలు చెప్పారు. కాని ప్రత్యేకించి వైద్య వృత్తికి సంబంధించిన ఐదు నవలల్ని మాత్రం పరిశీలించవలసి వుంటుంది. 1. హౌస్ సర్జన్ (1966) 2. భారతి (1970) 3. డాక్టరుగారి భార్య (1984) 4. న్యాయానికి అటూ-ఇటూ (1986) 5. కదిలే మేఘం (1987).

ఆధునిక నవలా ప్రపంచంలో తెలుగులో వెలువడిన మొదటి ప్రొఫెషనల్ నవల 'హౌస్ సర్జన్', రచయిత హౌస్ సర్జన్‌గా ఉండిన కాలంలో తన అనుభవాల్ని, తన వృత్తిధర్మాన్ని ఇందులో విశ్లేషించి విశదీకరించారు. ప్రభుత్వ ఆసుపత్రుల్లోని మొత్తం వాతావరణాన్ని చిత్రీకరించారు. సంస్కారవంతులైన డాక్టర్లను, నిర్లక్ష్య వైఖరి ప్రదర్శించే డాక్టర్లను, నర్సుల దీనగాథల్ని ఇందులో చెప్పడం ఓ విశేషం. ప్రతి మెడికల్ విద్యార్థి చదవదగ్గ రచనగా హౌస్ సర్జన్ నవల ప్రసిద్ధి కెక్కింది.

'భారతి' నవలలో కుష్ఠువ్యాధి వచ్చిన వ్యక్తులు సంఘంలో ఎదుర్కొనే ఇబ్బందుల్ని తెలియజేశారు. నిర్లక్ష్యపు డాక్టర్ల మనస్తత్వాన్ని ఇందులో రచయిత ఎండగట్టారు. కుష్ఠు మనం భయపడేటంతటి భయంకరమైన వ్యాధి కాదని నిరూపించిన మనోవైజ్ఞానిక నవల యిది.

ప్రయివేటు ప్రాక్టీస్‌లో ఎదురయ్యే సమస్యలతో సాగిన రచన 'డాక్టర్‌గారి భార్య'. వైద్యవృత్తిలో అసంతృప్తిని, నిరుత్సాహాన్ని చవిచూసిన ఓ డాక్టర్, భార్య ఇచ్చే ప్రోత్సాహంవల్ల సంపూర్ణుడైన డాక్టరుగా ఎలా మారగలిగాడన్నది నేపథ్యం. వైద్యవృత్తిలోని పవిత్రతను, గొప్పదనాన్ని, చిత్తశుద్ధితో అర్థం చేసుకుని అనుసరించడం ఇందులో కనిపిస్తుంది. వైద్యుల జీవితం వెనుక ఎంత త్యాగం, సంఘర్షణ వుంటుందో తెలుపుతూ వృత్తిధర్మాన్ని పాటించాలన్నది రచయిత సందేశం.

ప్రయివేటు ఆసుపత్రులు ప్రముఖ వాణిజ్యకేంద్రాలుగా మారకూడదన్న ఉద్దేశంతోనే వ్రాసిన నవల 'న్యాయానికి ఇటూ-ఇటూ'. డాక్టర్ నిర్లక్ష్యం కారణంగా చిన్నపసిపాప అంధురాలు కావడం ఇందులోని ప్రధాన ఇతివృత్తం. భాగ్యనగరంలో ఒకానొక ఆసుపత్రిలో జరిగిన యథార్థ సంఘటన నేపథ్యమే ఈ రచన. వైద్యవృత్తిలో చిత్తశుద్ధి లోపించడమే ప్రధాన కారణమని యీ నవల చక్కగా చెపుతుంది.

రచనా విధానంలో వైవిధ్యం చూపే వేణుగోపాలరావు 'మెర్సీకిల్లింగ్' ఇతివృత్తంగా వ్రాసిన నవల 'కదిలే మేఘం'. ఇలాంటి కథావస్తువుతో వెలువడిన మొదటి రచన. దీర్ఘకాలిక వ్యాధిగ్రస్తుల దీనగాథల్ని వివరించడం ఇందులోని ప్రధానాంశం,

## 2. కథా సన్నివేశాలు

### 2.1 హౌస్ సర్జన్ :

హౌస్ సర్జన్‌లో ముఖ్యస్థలం ప్రభుత్వ జనరల్ ఆసుపత్రి. అక్కడ మృత్యువుతో అనుక్షణం పోరాడుతూ నరకయాతన అనుభవిస్తుండే రోగులు మనకు దర్శన మిస్తారు. మధుబాబు M B B S. పూర్తి అయిన తరువాత హౌస్ సర్జన్‌గా మెడికల్ కళాశాలలో చేరుతాడు. తొలిరోజు అటెండెన్స్ పుస్తకంలో సంతకం చేస్తుంటే చేయి వణుకుతుంది. ఓ.పి.కి వెళ్ళిన మధుబాబు చీఫ్ కంప్లెయింట్, డయాగ్నసిస్ ట్రీట్‌మెంట్ వ్రాయడం నేర్చుకుంటాడు. పేషెంట్స్ భాగోతాన్ని అడుగుతుంటె సిస్టర్ వెనకనుండి ప్రతివార్ని యిలాగే ఎగ్జామ్ చేస్తే తెల్లవారిపోతుందని అంటే నర్స్ సలహా ప్రకారం అలాగే చేస్తాడు. ఇది వైద్యవృత్తిలో ప్రథమభాగం.

మధుబాబు సున్నితహృదయుడు. తొలిరోజునే జనరల్ వార్డులో వున్నప్పుడు ఓ తల్లి ఆవేదన్ని అతన్ని మరింత కృంగదీస్తుంది. ఆ మాతృ హృదయం రోదిస్తూ బిడ్డపై ఆమెకున్న మమకారాన్ని అర్థం చేసుకుంటాడు. పసితనంలో భర్తను పోగొట్టుకున్న ఆమెను చూసినప్పుడు మధు మనస్సు వికలమవుతుంది. తన అనవసరపు తెలివితేటలు చూపెంచక పిల్లవాణ్ణి బ్రతికిస్తాడు. ఇంకోరోజు టి.బి. వార్డులో మరణించిన ఆ స్త్రీని చూసి మధు మరింత వ్యథ చెందుతాడు. సున్నిత హృదయుడుగా చూడలేకపోతున్నందుకు ఓ సిస్టర్ 'గవర్నమెంట్ ఆసుపత్రుల్లో పనిచేసే డాక్టర్లు అంత సున్నితంగా వుండకూడ'దంటుంది. ఇలా మరణాల్ని కళ్ళారా చూసిన మధు 'ఇవన్నీ చూస్తూవుండటానికేనా' నేను డ్యూటీ చూస్తున్నదీ 'ఈ విద్య మిథ్యయేనా' అని అనుకుంటూ నిరాశపడతాడు.

మధుబాబు సర్జన్‌గా చేరిన తొలిరోజు నుండి తన అనుభవాల్ని అరవై పేజీలకు పైగా నోట్ చేసుకుంటాడు. ప్రతి సంఘటన, ప్రతి అనుభవం తనదిగా చెప్పుకుంటాడు. హౌస్ సర్జన్ ఓ సంఘర్షణగా, ఓ తపస్సుగా, ఓ యజ్ఞంగా అనుకుంటాడు. మెడిసన్‌ను ఓ మహాసముద్రంతో పోలుస్తాడు. రోగుల తాలూకు ఆసుపత్రులందు అసభ్యంగా కేకలు పెడుతూ, [illegible] ప్రచారం చేస్తుంటారు. అటువంటి వాటికి దూరంగా వుండాలని మృదులతో అంటాడు.

డాక్టర్ చక్రపాణి కార్డియాలజీ డిపార్ట్‌మెంట్‌కు చీఫ్. నిస్వార్థపరుడు, సేవభావంటే ఎనలేని అభిమానం. రౌండ్స్‌కు వస్తున్నారంటే ఆ వార్డు వాతావరణంలో ఎంతో మార్పు వచ్చేది. డాక్టర్లు, నర్సులు, అతిజాగ్రత్తగా మసులుకుంటారు. ఏదో ఒక తప్పు చక్రవర్తి దృష్టిలో పడుతూనేవుండేది. ఓ అమ్మాయి తన తల్లిని వార్డులో చేర్పించడంకోసం గంటలతరబడి నిలబడివున్న విషయాన్ని గ్రహించిన చక్రపాణికి హృదయం ద్రవిస్తుంది. ఆ సంవత్సరంలో చక్రపాణి మాటల్లో సంస్కారంతోపాటు, సేవలపట్ల వున్న సానుభూతి వ్యక్తమవుతుంది. రోగుల మనస్తత్వాల్ని కనిపెట్టిన చక్రపాణి డాక్టర్లతో మనల్ని గురించి వాళ్ళ ఏలా మాట్లాడుకుంటారో కూడా తెలియజెప్పాను. చక్రపాణి మాటలకు మధు క్రమశిక్షణ కల్గిగిన డాక్టరుగా మనకు నవలంతా దర్శనమిస్తాడు.

ఒక్కసారి డాక్టరుగా మంచిపేరు వచ్చిందంటే సామాన్యంగా రోగుల్లోగాని మామూలు మనుషుల్లోగాని అది తొలగిపోదు. ఆసుపత్రిలో ఉబ్బసపు రోగి అయిన శ్రీ భజనగీతాలు పాడుతుంటె ఆరాధనాభావాలు వున్నవాడుగా తాదాత్మ్యం చెందుతాడు. మధు నిస్వార్థ సేవను గుర్తించిన రోగులు అతనికి ఉన్నతమైన భవిష్యత్తు వుండాలని ఆశీర్వదిస్తారు, రోగుల అభిప్రాయాలలో ప్రభుత్వ ఆసుపత్రులంటె మంచి అభిప్రాయం కలిగివున్నట్లు గ్రహిస్తాడు.

మధుబాబు రోగుల విచారకరమైన మాటలు విన్నతరువాత మనో నిబ్బరాన్ని పాటిస్తాడు. మమతలు, మమకారాలు పెట్టుకోకుండా త్రికరణశుద్ధిగా వైద్యం చేయడం ధర్మంగా భావిస్తాడు, మధుబాబును దీవిస్తూ అతని తల్లిరాసిన ఉత్తరం అతన్ని మరింత ఉన్నతుణ్ణి చేస్తుంది. మృదుల మాటలకు తనకున్న విజ్ఞాన తృష్ణను తెలియజేస్తాడు. మృదుల మధుని ప్రేమిస్తుంది. ఆ విషయాన్ని తెలుసుకున్న మధుబాబు 'నేను అధముణ్ణి నీకు సమ ఉజ్జీనికాను .... .కటిక నేలలో కష్టంగా దుమ్ములో శ్రమపడే శ్రామికుణ్ణి నేను' అని తన అర్హతను గురించి మాట్లాడుతాడు. మధు మాటలకు రాగ ద్వేషాలకు అర్హుడని తెలుసుకుంటుంది మృదుల. మృదుల, మధుబాబుల సంభాషణల్లో మధుకి వైద్య విద్యార్థిగా పైకి రావాలన్న ధ్యాస, పట్టుదల, జిజ్ఞాస ప్రస్ఫుటం అవుతుంది.

రోగికి చికిత్స విధానం ప్రభుత్వ ఆసుపత్రుల్లో వున్నట్లు మరెక్కడా లేదని మధుబాబు కితాబు యిస్తాడు. నర్సుల నిస్వార్థసేవను, వాళ్ళ డాక్టర్ల చేతిలో మోస పోవటాన్ని కూడా చిత్రిస్తాడు. డాక్టర్ మూర్తిచే వంచింపబడ్డ సిస్టర్ లలిత గర్భవతి అవుతుంది. అబార్షన్ చేయించుకున్న లలితను అధికారులు సస్పెండు చేస్తారు. పరాచికాలకు పోయిన లలిత ఆసుపత్రిలో అప్రతిష్ఠ పాలౌతుంది. మరో సిస్టర్ నళినితో మధు అన్నమాటలు గమనార్హం. 'అందమైన తెల్లటి యూని ఫారమ్‌లో చూసే నర్సుకూ వారి కుటుంబ పరిస్థితికి యే మాత్రం సంబంధం' లేదంటాడు.

డాక్టర్ రాజు ప్రభుత్వ ఆసుపత్రి సూపరింటెండెంట్. మంచి పేరు ప్రఖ్యాతయున్న. డాక్టరు లంచం తీసుకున్నాడని అబద్ధపు ఆరోపణలచే అరెస్టు చేయబడతాడు. రాజకీయంగా రాజును అణచాలన్న నెపంతో కుట్రదారులు కుట్ర పన్నుతున్నారని మధు తెలుసుకుంటాడు. వికలమనస్కుడైన మధు 'ప్రపంచంలో గొప్పవాడుగా గాని, మంచివాడుగా గాని వున్నవాడు కూడా విరోధుల్ని పెంచు కుంటాడన్న' సత్యాన్ని గ్రహిస్తాడు. డాక్టర్ రాజు నిస్వార్థపరుడుగాను, మంచి మనసుకల స్నేహితుడుగా మనకు దర్శనమిస్తాడు.

డాక్టర్ కామేశ్వరి గైనకాలేజీలో అసిస్టెంట్ ప్రొఫెసర్. తనకున్న బ్రెస్ట్ కేన్సర్‌ని యెవరికీ తెలియకుండా అవివాహితగానే వుండి పోతుంది. వేదాంత గ్రంథాలు చదువుతూ, దేవాలయాలకు వెళుతూ ఆధ్యాత్మిక భావాలున్న స్త్రీ మూర్తి ఈమె. కామేశ్వరికి వున్న కేన్సర్ విషయం కనుకొని హైదరాబాదులో చేర్పించి కేన్సర్ వ్యాధిని నయంచేస్తారు తోటి డాక్టర్లు.

డాక్టర్ రాజేశ్వరి అశ్రద్ధ ఫలితంగా ఓ పిల్లవాడు మరణిస్తాడు. మధు ఆ విషయాన్ని తెలుసుకొని రాజేశ్వరికి చెడ్డపేరు రాకుండా ఆ పిల్లవాడి వ్యాధి యెక్కువ గావడంతో చనిపోయాడని చెప్తాడు. మధు కారణంగా రాజేశ్వరిలో మార్పు వస్తుంది.

మధుని ప్రేమించిన మృదుల ప్రేమ విఫలమవుతుంది. మధు పై చదువుల కోసం ఇంగ్లండు వెళుతుంటే వీడ్కోలు చెప్పడానికి రైల్వే స్టేషనుకు వచ్చినా

చెయ్యకూడా ఊపదు. ఇంకా యీ నవలలో రోగుల మనస్తత్వాలు, వారి అనుమానాలు, రకరకాల రోగులు, వ్యాధుల్లో వివిధ విభాగాలు, స్వాతంత్ర్య సమర యోధుడి దీనగాథ, ప్రొఫెసర్ హాల్డెన్ గురించిన విశేషాలు, ప్రముఖుల అభిప్రాయాలు ఇందులో ఉన్నాయి. హౌస్ సర్జన్ ఉత్తమ పురుషలో చెప్పబడిన నవల.

## 2.2 భారతి :

గౌరీపతి ఒక్కగానొక్క కూతురు భారతి. ఆమెకు శరీరంమీద మచ్చలు రావడంతో డాక్టరు గోవిందరావు దగ్గరకు వెళ్ళగా కుష్ఠు అని నిర్ధారణ చేశాడు. భారతి తండ్రి గౌరీపతి తన కుమార్తెకు కుష్ఠువున్న విషయాన్ని దాచిపెట్టి గంగాధరం కొడుకు సారధితో పెళ్ళి జరిపిస్తాడు. భారతి స్నేహితురాలు మల్లిక భారతి విధి వైపరీత్యానికి దుఃఖిస్తుంది. భారతి సున్నిత మనస్కురాలు కావడంచేత తనకున్న వ్యాధివల్ల మరింత దిగులుపడుతుంది. కాని తండ్రి మాటను గౌరవించి పెళ్ళి చేసుకుంటుంది. కుష్ఠువ్యాధిపట్ల సంఘంలో ఎటువంటి స్థానం వుందో తెలుసుకున్న భారతి మల్లికతో 'ఈ రోగంతో తగుదునమ్మా!' అని 'నలుగురిలో ఏ ముఖం పెట్టుకురాను' అని తన బాధను వ్యక్తంచేస్తూ దుఃఖిస్తుంది.

భారతి, సారధిల పెళ్ళి అయిన రెండు రోజుల్లోనే డాక్టర్ గోవిందరావును గంగాధరం విందుకు ఆహ్వానిస్తాడు. గంగాధరం ఇంటికి కోడలయిన భారతిని చూసి గంగాధరంతో భారతికి వున్న కుష్ఠువ్యాధి సంగతి తెలియజేస్తాడు, గోవిందరావు కారణంగా భారతి వైవాహిక జీవితంలో గండిపడుతుంది. భారతిని అవమానించి గంగాధరం పుట్టింటికి పంపివేస్తాడు.

పట్టుబద్ధంగా తన కొడుక్కి విడాకు లిప్పించడం కోసం గంగాధరం భారతి ఇంటికి వెళతాడు. ఆమెకున్న వ్యాధిని చూపి అవహేళన చేస్తూ మాట్లాడుతాడు. గంగాధరం మానవత్వం లేనివాడుగా తెలుస్తుంది. భారతి విడాకులు ఇవ్వడానికి సమ్మతించడంతో ఆమె ఆత్మస్థైర్యానికి మెచ్చుకుంటాడు. కోర్టులో ఆమెపై నిందలుమోపి విడాకులు ఇప్పిస్తాడు. కోర్టులో భారతి విధివంచిత అవుతుంది. అన్నింటినీ మనోధైర్యంతో ఎదుర్కొని ముందుకు వెళ్ళడానికి ప్రయత్నిస్తోంది.

భారతి తనకు జరిగిన అన్యాయానికి ఆరోగ్యం విషయంలో నిర్లక్ష్యం చేస్తుంది. మల్లిక కోరికమేరకు భారతి డాక్టర్ సారథి దగ్గర వైద్యం చేయించు కొంటుంది. భారతి రోడ్డులకు ఎక్కువగా తిరగటం కారణంగా ఆరోగ్యాన్ని నిర్లక్ష్యం చేస్తుంది. సాగర్ ఆమెకు మనోధైర్యాన్ని ఇచ్చి ముందుకు నడిపిస్తాడు. ఇక్కడ రోగిపై డాక్టరుకు సానుభూతి, సేవ చెయ్యాలన్న ధ్యాస కనిపిస్తుంది. సాగర్ వైద్యంతో భారతి మళ్ళీ మామూలు మనిషి అవుతుంది.

భారతికి కుష్టువ్యాధి నయం కావడంతో మళ్ళీ చదవాలనిపిస్తుంది. తన కోరిక కుష్టురోగులకే సేవ చెయ్యాలన్నది ఆమె ఆశయం. స్నేహితురాలు మల్లిక అభినందిస్తుంది. నర్సరీ పూర్తిచేసి కుష్టురోగులకే తన సేవను వినియోగించాలన్న కోరికతో కలికిరి ఆసుపత్రికి నర్సుగా వెళుతుంది. తన జీవితంలో నిప్పులు కురిపించిన గోవిందరావు ముందు ఉద్యోగం చేయడం చిన్నతనమనిపించింది. భారతిని చూసిన గోవిందరావు 'అదృష్టవంతురాలివి. కుష్టురోగంతో బాధపడిన దానివి. తిరిగి కుష్టురోగుల ఆసుపత్రికే నర్సుగా రావడం చెప్పుకోదగ్గ విషయమే' అని వ్యంగ్యంగా మాట్లాడుతాడు.

భారతి నర్సు వృత్తిలో రోగుల మధ్య తిరుగుతూ ఎంతో సహనం అల వరచుకుంటుంది. తోటి సిస్టర్స్ పరిహాసాల్ని, ఆంక్షల్ని, అధికారాల్ని అర్థం చేసు కుంటుంది. కర్తవ్య నిర్వహణలో ఒక రకం హుందాతనం, గర్వం, సంతృప్తి భారతిలో కనిపిస్తాయి. కుష్టురోగుల్ని ముట్టుకోవడానికి ఏనాడు సంకోచించదు. నిశ్చయంగా, నిస్సంకోచంగా, [illegible] వాళ్ళను తాకుతుంటే వాళ్ళే భయ పడి, సిగ్గుపడి దూరంగా వెళ్లేవాళ్ళు. సంఘసేవా తత్పరురాలుగా భారతి దర్శనం ఇస్తుంది.

సంఘంలో ఎంతో బాధ్యత గల వృత్తి వైద్యవృత్తి. రోగుల మనస్తత్వానికి అనుగుణంగా వారికి మానసికోల్లాసం కలిగించి మరోజన్మ ప్రసాదించే మహోన్నత వృత్తి. గోవిందరావు పై అంశాలన్నింటిని విస్మరించి బాధ్యతా రహితంగా ప్రవర్తిస్తాడు. అవినీతికి పాల్పడుతూ రోగుల గాయాల్ని మాన్పడానికి బదులు మానసికంగా గాయపరుస్తుంటాడు. గోవిందరావు కుష్టురోగులపట్ల నిర్లక్ష్య

భావం ప్రకటిస్తూ వాళ్ళను చూసి హేళనగా మాట్లాడుతూ వాళ్ళను అనుక్షణం హింసిస్తుంటాడు. భారతి అతని అవినీతిని బయటపెట్టాలనుకుని కొన్ని సూచనలు చేస్తుంది. అందుకు గోవిందరావు వృత్తిధర్మాన్ని కించపరిచేటట్లు సంకుచిత స్వభావిగా, స్వార్ధపరుడుగా మాట్లాడుతాడు.

గోవిందరావు ఆసుపత్రి కోసం వున్న నిధుల్ని దుర్వినియోగం చేయడాన్ని భారతి నిలదీస్తుంది. అందుకు ఆమెను మందలిస్తాడు. రోగుల్లో కూడా గోవింద రావుపై అశాంతి మరింత చోటు చేసుకుంటుంది. భారతితో గోవిందరావు పనికి మాలిన సేవలు చేస్తూ జీవితాన్ని వృథాగా గడిపేయడం, ఏ జన్మలో ఏ పాపం చేసుకున్నారో వాళ్ళిలా పుట్టారనడం, ఓ డాక్టరుగా అనవలసిన మాటలు కావు. గోవిందరావు భారతిని మానభంగం చేయబోగా కత్తి చూపి బెదిరిస్తుంది. అతని కాంక్ష తీరకపోవడంతో లక్ష్మి అనే మరో రోగిని బలవంతం చేయబోతాడు. ఆమె వెనక్కి తోసేయగా ఇనుపముక్క గుచ్చుకుని ధనుర్వాతంతో మరణిస్తాడు.

గోవిందరావు స్థానంలో డా॥ సాగర్ రావడంతో మునుపున్న వాతావరణం పూర్తిగా మారిపోతుంది. రోగులకు శుశ్రూష చేస్తూ మంచి పేరున్న డాక్టరుగా గుర్తించబడతాడు. రోగుల్లో భయాన్ని పోగొట్టాలనే ఉద్దేశంతోనే 'కుష్ఠువ్యాధి అందరూ భయపడేంతటి భయంకరమైన అంటువ్యాధి కాద'ని నిరూపిస్తాడు. విశాల హృదయుడుగా, ఉన్నతమైన డాక్టరుగా, సంఘసేవా తత్పరుడుగా కనిపిస్తాడు. డాక్టర్ సాగర్‌కు కుష్ఠువ్యాధి ప్రారంభదశలో వుండగా భారతి ప్రోత్సాహంచే డాక్టర్ పాల్ బ్రాంచ్ దగ్గర ట్రీట్‌మెంటు తీసుకోగా నయమవుతుంది.

సారధి రెండవ భార్య కుంతల. మొదటి భార్య అయిన భారతి విడాకులు తీసుకోవడంతో కుంతల భారతి దగ్గరకు వచ్చి పుత్రభిక్ష పెట్టమని ప్రాధేయపడు తుంది. భారతి తన భర్త దగ్గరకు వెళ్ళినా మానసికంగా రోగులపైనే ఎక్కువ కుపిదిం వుంటుంది కాబట్టి తిరిగి ఆమె రోగుల సేవ చేయడం కోసం మళ్ళీ ఆసుపత్రి చేరుతుంది. డా॥ సాగర్, భారతిల సేవ ఆ ఆసుపత్రికి శ్లాఘ నీయమైంది.

## 2.3. డాక్టరుగారి భార్య :

డాక్టర్ నరేష్, సహజ భార్యాభర్తలు. మధ్యతరగతి కుటుంబీకులు కావడం వల్ల డాక్టర్ నరేష్ ప్రయివేటు ప్రాక్టీసు పెట్టుకుని జీవితాన్ని గడపాలను

కుంటాడు. సహజ అతనికి తగు ప్రోత్సాహాన్ని ఇస్తుంది. ఓ చిన్న ఇంటిని అద్దెకు తీసుకుని వైద్యవృత్తికి కావలసిన పరికరాల్ని, వస్తువుల్ని సమకూర్చుకుంటాడు. డబ్బుమీద మమకారం వుండకూడదని నిస్వార్థంగా వైద్యవృత్తి చేయాలని సలహా తన భర్తకు ఇస్తుంది సహజ. ముందుచూపు గలిగిన స్త్రీ సహజ. రోగుల విషయంలో తగిన సలహాల్ని ఆమె సూచిస్తూ వుంటుంది. పేషెంట్స్ యొక్క బాధలు 'మనం ఎంతవరకు వినాలో అంతవరకే వినాలి. కోపం ప్రదర్శించవద్దు. చిరునవ్వు చెరగనివ్వద్దు' ఇటువంటి విషయాల్ని పాటించినట్లయితే రోగుల దగ్గర మంచిపేరు వస్తుందని తన భర్తను ప్రోత్సహించేది. నరేష్ సున్నిత హృదయు డని తెలుసుకున్న సహజ నిరాశ చెందకుండా 'వైద్యవృత్తిలో చిత్తశుద్ధితో నిజాయితీగా వుండటమే ముఖ్యం కాని మరీ సెన్సిటివ్‌గా వుండకూడ'దంటుంది. లౌక్యంతో వృత్తిలో ఓ ఇమేజ్‌ని ఏర్పరచుకోవాలంటుంది. సాధకబాధకాల్ని అర్థం చేసుకునే సహజ గృహిణిగా వుంటూ, ఓ ఉత్తమమైన డాక్టరును రూపొందించ టానికి చాలా కష్టపడుతుంది.

నరేష్ ప్రాక్టీసు పెట్టిన తొలిరోజుల్లో ముగ్గురి పేషెంట్స్ ద్వారా అనేక ఇబ్బందుల్ని ఎదుర్కొని మానసికంగా కృంగిపోతాడు. సహజ తన భర్తను ఓదార్చి ధైర్యం చెప్పి మళ్ళీ మామూలు మనిషిని చేస్తుంది. నరేష్‌కు మరో అసంతృప్తి జ్వాల ఎదురౌతుంది. సిటీబస్ క్రిందపడ్డ ముసలావిడను నరేష్ దగ్గరకు తీసుకువస్తారు. ఆ సమయంలో నరేష్ స్నానం చేస్తుంటాడు. సహజ కారణం చెప్పి మరోచోటికి వెళ్ళమంటుంది. కాని ముసలమ్మ మరణిస్తుంది. ఓ యువకుడు నరేష్‌ను నానా మాటలంటాడు. చుట్టుప్రక్కలవాళ్ళు ఎవరికివారు పట్టనట్లు వూరు కుంటారు. కలత చెందిన నరేష్ ఎక్కడికైనా వెళ్ళిపోయి ప్రశాంతంగా బ్రతుకుదాం అని తన అసంతృప్తిని వెళ్ళగ్రక్కుతాడు. వైద్యవృత్తిని గుర్తుచేస్తూ రోగి కాని, రోగి తాలూకు మనుషుల్ని క్షమించే స్థిలికి ఎదగాలంటుంది.

పట్టణంలో కర్ఫ్యూ విధిస్తారు. కాల్పులకు గురైన ముగ్గురిలో ఇద్దర్ని అతి కష్టంమీద బ్రతికిస్తాడు. ఆ సమయంలోనే సహజ ప్రసవవేదన పడుతుంది. అనుకోకుండా ఇలా జరగడంవల్ల తన భార్యకు తనే దగ్గరుండి డెలివరీ చేయి స్తాడు. ఓ డాక్టరు భార్య అయినందుకు గర్విస్తున్నానంటుంది.

డాక్టర్ నరేష్ తనకున్న జాండీస్ కారణంగా ఓ పిల్లవాణ్ణి చూడలేక పోతాడు. సహజ వేరే డాక్టర్ని చూసుకోమంటుంది. అప్పటికే ఆలస్యం అయిన ఆ పిల్లవాడు మరణిస్తాడు. నరేష్ నిర్లక్ష్యం కారణంగా పిల్లవాడు మరణించాడని కోర్టులో క్రిమినల్ కేసు వేస్తారు. నరేష్ తరఫున, పిల్లవాడి తరఫున లాయర్ల వాదోపవాదాలలో నరేష్ నెగ్గుతాడు. పిశాచ జీవితాల్ని గురించి అనేక విషయాల్ని తెలుసుకున్న నరేష్ మనసు చలించకుండా ముందుకు సాగిపోవాలన్న నిర్ణయాని కొస్తాడు. సహజ కూడా ప్రతి వృత్తి పరమావధిని గుర్తు చేస్తుంది. డాక్టర్ శ్రద్ధ, నిజాయితీ ఇందులో అడుగడుగునా కనిపిస్తుంది.

సహజ పత్రికా గోష్టి కార్యక్రమంలో మాట్లాడిన మాటల్లో ఆమె అనుభవం, వ్యక్తిత్వం, ఔదార్యం, సహనం దర్శనమిస్తాయి. కోర్టులో కేసుపెట్టిన వ్యక్తి తను కేసుల్ని ఉపసంహరించుకుంటాడు. డాక్టర్ భార్యగా తన భర్తకు ఆ విధంగా తోడు, నీడగా నిలబడుతుంది.

నరేష్ కోర్టుకు వెళుతున్న సమయంలో స్కూటర్ ఆక్సిడెంట్ వల్ల మేజిస్ట్రేట్ కొడుకుని కాపాడుతాడు. నరేష్‌కు మేజిస్ట్రేట్ కొడుకు అని తెలియదు. కోర్టుకు ఆలస్యంగా వెళ్ళిన నరేష్‌ను మేజిస్ట్రేట్ మందలిస్తాడు. విషయం తెలుసుకున్న మేజిస్ట్రేట్ నరేష్‌కి కృతజ్ఞతలు తెలుపుకుంటాడు. నరేష్ 'వ్యాధులు - మనస్సులూ' అన్న శీర్షికతో రేడియోలో ప్రసంగిస్తాడు. ఒకవిధంగా రోగుల్లోను, మానసికంగా బాధపడుతున్నవారికి ఉపశమనం కల్గిస్తాడు.

జయచంద్ర భార్య దమయంతి. పిల్లలు లేని కారణంగా నరేష్‌ను బాగా చూసుకుంటారు. దమయంతి కుక్కకాటుచే మరణిస్తుంది. జయచంద్రుడికు జాండీస్ వస్తుంది. తను బ్రతకనని తెలుసుకున్న జయచంద్ర తన యావదాస్తిని ఆసుపత్రి నిర్మాణంకోసం, దాని విస్తరణ కోసం సర్వహక్కులు కల్పిస్తూ వీలునామా రాసి మరణిస్తాడు. జయచంద్ర సేవలకు ఆ విధంగా సహాయపడతాడు. జయచంద్ర మరణంతో నరేష్ మానసికంగా బాగా దెబ్బతింటాడు. సహజ హితోపదేశం ఫలితంగా మళ్ళీ మామూలు మనిషి అవుతాడు. 'జయచంద్ర మెమోరియల్' ఆసుపత్రి నిర్మాణం జరుగుతుంది. సహజ స్మృతికి అందుబాటులో వుండి సమర్థవంతంగా తన వృత్తిధర్మాన్ని నిర్వహిస్తాడు. ఇందులో రోగుల మనస్తత్వాలు, వివిధ రకాల జబ్బులు, వాటి లక్షణాలు నర్సుల దీనగాథలు——వారి నిస్వార్థసేవ మొదలగు విషయాల్ని కూలంకుషంగా వివరించబడినాయి.

**2.4. న్యాయానికి అటూ - ఇటూ**

లాయర్ ప్రదీప్ భార్య శ్వేతబిందు. శ్వేతబిందుకు అంస్యంగా వచ్చిన తొలికాన్పుకై లక్ష్మీ నర్సింగ్‌హోంలో చేర్చబడుతుంది. డాక్టర్ మైథిలి నిర్లక్ష్యం కారణంగా శ్వేతబిందు చనిపోతుంది. ప్రణయమూర్తిగా ఆరాధించిన ప్రదీప్ తన భార్య చనిపోవడంతో బ్రతుకుమీద విరక్తి చెంది త్రాగుడికి బానిస అవుతాడు. డాక్టర్ మాలతి అతన్ని ఓదార్చుతుంది. మైథిలి నిర్లక్ష్యాన్ని మాలతి నిందిస్తుంది. తను తప్పుచేసినప్పటికీ కప్పిపుచ్చడానికి ప్రయత్నిస్తుంది. ప్రదీప్ తన భార్య చనిపోయినప్పటికీ డాక్టర్ వృత్తిలోని నిజాయితిని మాలతికి తెలియజేస్తాడు.

ప్రదీప్ భార్యను పోగొట్టుకున్న పరధ్యానంతో కారును నడుపుతుండగా, రాధ అనే అమ్మాయి అడ్డుపడుతుంది. ఎడమకన్ను ఎర్రబడి కాన్సర్‌తో బాధపడుతున్న రాధ పరిస్థితి తెలుసుకుంటాడు. వాళ్ళ నాన్నను ఒప్పించి ఆమెను తన భార్యను పోగొట్టుకున్న ఆసుపత్రిలోనే చేరుస్తాడు.

డాక్టర్ అశోక్ రాధ ఎడమకంటిని పరీక్షచేసి 'రెటినోమా బ్లాస్టోమా' అని నిర్ణయిస్తాడు. కేన్సర్‌కు సంబంధించినది కావడంవల్ల ఎడమకన్ను తీసివేయాలంటాడు. అశోక్ అసిస్టెంట్ అయిన డాక్టర్ శ్యాంప్రసాద్ అనుకోని పరిస్థితుల్లో ఊరు వదలి వెళ్ళడంతో డాక్టర్ మనోహర్‌కు ఆ కేసు వివరాల్ని అప్పగిస్తాడు. డాక్టర్ మనోహర్ చేసిన తప్పిదం కారణంగా అశోక్ అనుభవగర్వంతో, ఆత్మవిశ్వాసంతో రాధకు ఆపరేషన్ పూర్తి చేస్తాడు. కేన్సర్ వున్న కంటికి బదులు కుడికంటికి ఆపరేషన్ చేసిన సంగతి తెలిసిన అశోక్ నెత్తిపై పిడుగుపడ్డట్టు అవుతుంది. అశోక్ నిర్లక్ష్యంవల్ల రాధ జీవితం శాశ్వతంగా అంధకారమయిపోతుంది. ఈ సంఘటనను తెలుసుకుని పత్రికలు సానుభూతిపక్షం వహిస్తూ డాక్టర్ నిర్లక్ష్యాన్ని దారుణంగా విమర్శిస్తాయి. (భాగ్యనగరంలోని ఒకానొక ప్రయివేటు ఆసుపత్రిలో ఈ సంఘటన 1985 వ సం॥ జరిగినది.)

అశోక్ రాధకు జరిగిన అన్యాయానికి పశ్చాత్తాపపడతాడు. ఆసుపత్రి నిర్మాణకర్త, వాణిజ్యవేత్త అయిన ఉపేంద్ర ఎలాగైనా ఈ ఉపద్రవం నుండి బయటపడటానికే ప్రయత్నిస్తాడు.

రాధ తనకు జరిగిన అన్యాయాన్ని గురించి ప్రదీప్‌తో 'ఎలా వస్తుంది అంకుల్ నాకు ఎడమకంటికి బదులు కుడికంటికి ఆపరేషన్ చేశారుగా' అని కడు దీనంగా చెప్తుంది. రాధ తండ్రి హనుమంతరావు తన కూతురికి జరిగిన అన్యాయానికి లాయర్ ప్రదీప్ ప్రోత్సాహంతో కోర్టులో ఆసుపత్రి యాజమాన్యంపై క్రిమినల్ కేసు పెడతారు. డాక్టర్ మాలతి అన్న ప్రతాపరావు ఆసుపత్రి వైపున ప్రదీప్ రాధ వైపున కోర్టులో వాదోపవాదాలు జరుగుతాయి. ఇరువైపుల న్యాయమున్నట్లే వాదించుకుంటారు.

రాధ తండ్రి హనుమంతరావు ఉపేంద్రతో లాలూచిపడి ప్రదీప్‌తో 'నీ మూలంగానే నా కుటుంబం నాశనం అయింది. ఓ శనిలా దాపురించావు' అని తూలనాడుతాడు. తండ్రి మాటల్ని తిప్పికొట్టిన అరుణ మనకోసం ఆపద్బాంధవుడిలా ఆదుకున్న సంగతి గుర్తుచేస్తుంది. డబ్బుకోసం ఎంత నీచానికి పాల్పడ్డావని, అతని మానసిక సంఘర్షణను గుర్తించావా? అని దుయ్యబడుతుంది. తండ్రిని ఆత్మవంచన చేసుకోవద్దని హెచ్చరిస్తుంది.

డాక్టర్ అశోక్ భార్య జూలీ. ఆమె అంధురాలు. రచయిత్రి. వైద్యవృత్తిలోని నెగ్లిజన్స్‌ను ఆధారంగా చేసుకుని నవల రాస్తుంటుంది. అశోక్ ఆమె మాటల్ని టేప్ చేస్తుంటాడు. అశోక్‌కు ఆ నవలకు దగ్గర సంబంధం వుండటం వల్ల ఒక్కోసారి టేప్ చేసేవాడు కాదు. 'నేరం చేసిన మనిషి శిక్షనుండి తప్పించుకునేందుకు వీలులేదని' కోర్టులను చూపిస్తుంది. జూలీ మాటలవల్ల అశోక్ మానసికంగా మార్పు చెందుతాడు. పరధ్యానంగా కారు డ్రైవ్ చేస్తూ వెళ్ళిన అశోక్ చెట్టుకు ఢీకొని రెండు కళ్ళు పోగొట్టుకుంటాడు. డాక్టర్ అశోక్ మేజిస్ట్రేట్ ముందు పశ్చాత్తాపంతో తన ఆవేదనని చెప్పుకుంటాడు. మేజిస్ట్రేట్ అశోకును దోషిగా నిర్ణయిస్తాడు.

డా॥ అశోక్ విధి వైపరీత్యంవల్ల అంధుడు కావడంతో ప్రదీప్ ప్రయత్నాలన్నీ బూడిదలో పోసిన పన్నీరవుతాయి. ఒక నిజాన్ని వెలికి తియ్యడంకోసం ఒక వ్యక్తిని దోషిగా సమాజం ముందు నిలబెట్టడంకోసం ఇన్ని నెలలు తన శక్తి సంతా ధారపోసి శ్రమించి చివరకు సాధించింది ఏమీ లేకుండాపోతుంది. ప్రదీప్‌ను

నిరాశ, నిర్లిప్తత వహించివేస్తాయి. సత్యాన్ని భరించడం ఎందుకింత కష్టంగా వుందో తెలుసుకుంటాడు ప్రదీప్, విడిపోయిన అశోక్, జానును ప్రదీప్ కలిపివేస్తాడు.

## 2. కదిలే మేఘం

మహేష్ ఎం.బి.బి.యస్. చదువుకునే రోజుల్లో ప్రియంవద అనే అమ్మాయిని గుండగుల బారినుండి కాపాడుతాడు. ప్రియంవద, సునంద ఇరువురు మహేష్‌ను ప్రేమిస్తారు. ప్రియంవద మహేష్‌ను ప్రేమించిన సంగతి తెలుసుకుని సునంద మరొకణ్ణి పెళ్ళాడుతుంది. ప్రియంవద అసలు పేరు హారిణి. ప్రియంవద మహేష్‌కు తన గతాన్ని తెలియజేస్తుంది. తన తండ్రి అర్జునరావు కోరిక ప్రకారం ఎం.బి.బి.ఎస్. చదవడానికి నిర్ణయించుకుంటుంది. మహేష్ హారిణిల ప్రేమ వ్యవహారాన్ని తెలుసుకున్న అర్జునరావు చదువు పూర్తి అయ్యేవరకు మహేష్‌ను కలుసుకోవడానికి వీలులేదని షరతు విధిస్తాడు. తండ్రి కోరికను మన్నిస్తుంది. హారిణి తనతో మాట్లాడడం లేదని మహేష్ మానసికంగా నలుగుతాడు. 'డైజీపాం' మాత్రలకు అలవాటు పడతాడు. అందువల్ల అతని శరీరంలో రోజు రోజుకు చలనం లేకుండా పోతుంది. తనకున్న వ్యాధిని నిర్లక్ష్యం చేస్తుంటాడు. చదువు పూర్తి అయిన తరువాత మహేష్ హౌస్‌సర్జన్‌గా చేరిన తరువాత హారిణిని పెళ్ళాడుతాడు. ఇరువురు డాక్టర్లు కావడంవల్ల ప్రయివేటు ప్రాక్టీస్ పెట్టుకుంటారు. మంచి డాక్టర్లుగా పేరు సంపాదిస్తారు.

డాక్టర్ హారిణి శ్రీకాంత అనే దీర్ఘవ్యాధిగ్రస్తురాలికి చికిత్స చేస్తుంది. ఆమె వ్యాధి హారిణికి అంతుచిక్కదు. శ్రీకాంత తన కుటుంబ దయనీయ పరిస్థితిని, తను పడే నరకయాతనను చెప్పుకుని తనను చంపివేయమని ప్రాధేయపడుతుంది. శ్రీకాంత పడే నరకయాతనను కన్నులారా చూస్తున్న డాక్టర్ హారిణి ఆమెకు 'మార్ఫియా' ఇంజక్షన్ ఇవ్వబోవు సమయంలో డాక్టర్ మహేష్ అడ్డు వస్తాడు. ఇరువురు సంఘర్షణల కారణంగా మహేష్ హారిణిని చేయి చేసుకుంటాడు. హారిణి పుట్టింటికి వెళ్ళిపోతుంది. ఇరువురి దాంపత్యం అగాధంలో పడుతుంది. హారిణి వెళ్ళిపోవడంతో మహేష్ మానసికంగా వ్యథ చెందుతాడు. అప్పటికే వున్న అతని వ్యాధి మరింత ఎక్కువై కదలడానికి వీలులేకుండా

పోతుంది. డాక్టర్ భార్గవ మహేష్‌ను పరీక్షించి 'మైస్తేనియాగ్రేవిస్' అని తేలుస్తాడు. ఆ వ్యాధి అటాక్ అయినప్పుడు మహేష్ శరీరంలోని ఏ ఒక్క భాగం కూడా కదలదు. ఆఖరుకు కనురెప్పలు గూడా కదల్చలేని స్థితి ఏర్పడుతుంది. అటువంటి భయంకర వ్యాధికి లోనౌతాడు. డాక్టర్ భార్గవ మహేష్‌కు ఆపరేషన్ చేస్తాడు.

మహేష్ ఆసుపత్రి నుండి డిశ్చార్జ్ అయి తన భార్యను చేరుకోవాలని కారులో వెళుతున్న మహేష్‌కు మళ్ళీ కాళ్ళు చేతులు పనిచేయవు. అదే సమయంలో హరిణి కూడా తన భర్తను చేరుకోవాలని బయలుదేరి కారు ఏక్సిడెంట్‌కు గురౌతుంది. ఇరువుర్నీ అదే ఆసుపత్రిలో చేరుస్తారు. మహేష్‌కున్న వ్యాధి మరో మలుపు తిరుగుతుంది. ప్రఖ్యాత న్యూరో సర్జన్ అయిన డా॥ నగేంద్ర మహేష్‌ను పరిశీలించి 'క్వాడ్రీప్లీజియా' అని తేలుస్తాడు. ఆ జబ్బువల్ల మెడ కిందిభాగం పూర్తిగా స్పర్శజ్ఞానం కోల్పోతాడు. కళ్ళు మాత్రం కదల్చ డానికి వీలౌతుంది. హరిణికి గాయాలు తగలడంతో అదే ఆసుపత్రిలో చికిత్స పొందుతుంది. కాని తన భర్తను చూడలేదు.

మహేష్ ఆసుపత్రిలో వున్నప్పుడు తన కాలి బొటనవేలిని కందిరీగ తొలుస్తున్నప్పుడు చూస్తూ బాధను భరిస్తాడు. సిస్టర్ ప్రత్యూష చూసి కాపాడుతుంది. హరిణి తన భర్త ఇక్కడే చికిత్స పొందుతున్నాడని తెలుసుకుని వెళుతుంది. ఆ సమయంలో బట్టలు తగలబడిపోతున్నప్పటికీ చూస్తూంటాడు. హరిణి తన భర్త ప్రాణాలను కాపాడుతుంది. తనను చేరుకున్న మహేష్ భార్యతో 'తను చని పోవాలి. నా బ్రతుకు ఒక్క నిముషం మీరు భరిస్తే తెలుస్తుంది. అసలు మీ రెవరూ నా వద్దకు రావద్దు. ఇలాగే వుంటాను. తనను మెర్సీ కిల్లింగ్ చేసేయ్' అని రోధిస్తాడు. హరిణి తన భర్తకు వచ్చిన విషమపరిస్థితిని చూసి హృదయం తరుక్కుపోతుంది. ఆకాశంలో మేఘాలు కదులుతున్నప్పటికీ తనుకదలలేకపోతున్నా నని మహేష్ వ్యధ చెందుతాడు. డా॥ గోవింద్‌ను బ్రతిమలాడి తనకు 'హెపారిన్' ఇంజక్షన్ ఇవ్వమంటాడు. సిస్టర్ ప్రత్యూష వాళ్ళ మాటల్ని పసిగట్టి అక్కడ వేరే మందు వుంచుతుంది. మరోసారి గోవింద్‌తో తన లెగ్‌లోకి వెళుతున్న వీనస్ ట్యూబింగ్‌లోకి ఎయిర్ ఎక్కించమంటాడు. ఆ సమయంలో మహేష్ స్నేహితుడు చంద్ర వచ్చి అడుకుంటాడు. మహేష్ డాక్టరు కావడం కారణంగా తను చనిపోవాలని పతకం పన్నినా సఫలం కాలేకపోతాడు.

మహేష్ తను రోజు రోజుకు అనుభవిస్తున్న మరణయాతన నుంచి విముక్తి శాశ్వతంగా కలిగించమని చట్టపరంగా చంపెయ్యమని కోర్టుకు మనవి చేసుకుంటాడు. ఆసుపత్రి కాన్ఫరెన్స్ హాలులో విచారణ ప్రారంభమౌతుంది. డాక్టర్ భార్గవ, నరేంద్రలు అతనికున్న వ్యాధి పరిస్థితిని వివరిస్తారు. మహేష్ తన హృదయ విదారకమైన మాటల్ని మేజిస్ట్రేట్ ముందు విన్నవించుకుంటాడు. హరిణి మాత్రం తన భర్త కోరికను మన్నించకూడదని వాదిస్తుంది. అందరి మాటలు విన్న మేజిస్ట్రేట్ మహేష్ అభీష్టం మేరకు అన్ని రకాల ట్రీట్‌మెంట్లు ఆపు చెయ్యాలని తీర్పు చెప్తాడు.

మహేష్‌కు మందులు ఆపివేయడంతో ఎబ్డోమినల్ పెయిన్ ప్రారంభమవుతుంది. తను మరణించబోవు సమయంలో ఆకాశంలో కదులుతున్న మేఘాల్ని చూస్తాడు. మెదడు స్తంభించి కోమాలోకి వెళ్ళిపోయి మరణిస్తాడు. హరిణి కూడా తన భర్తతోపాటు తను కూడా మరణించాలని మార్ఫిన్ యాంపిల్స్‌ను శరీరంలోకి కనెక్టు చేసుకుని శ్వాస ఆడక మరణిస్తుంది. రచయిత వేణుగోపాలరావు యీ కథను దుఃఖాంతం చేశారు.

# 3. వృత్తి విశేషాలు

## 3.1 డాక్టర్ల వృత్తి అనుభవాలు - సమస్యలు - పరిష్కారాలు :

'హౌస్ సర్జన్' నవలలో మధుబాబు ఎం.బి.బి.యస్. పూర్తిచేసి హౌస్ సర్జన్‌గా చేరతాడు. మొదటి రోజు అటెండెన్స్‌లో సంతకం చేయడం చెయ్యి వణుకుతుంది. ఓ.పి కి వెళ్ళిన మధుబాబు చీటిమీద కంప్లెయింట్, డయాగ్నసిస్, ట్రీట్‌మెంట్ రాయాలనుకుంటాడు. మధుబాబు పేషెంట్స్ హిస్టరీ తీసుకోవడం మొదలుపెట్టి నీ పేరేమిటి? వయసెంత? బాధేమిటి? పెళ్ళయిందా? పిల్లలెందరు? ఇలాంటి ప్రశ్నలు అడుగుతున్నప్పుడు సిస్టర్ సలహా పాటించి అలాగే చేస్తాడు. 'ప్రతివారిని యిలాగే అడుగుతూపోతే తెల్లవారిపోతుందంటూ' చెప్పిన తరువాతనే మధుబాబు పేషంట్స్‌తో పరిమితి మాటలతో మాట్లాడుతాడు. డాక్టరు దగ్గరకి వచ్చిన ప్రతివాళ్ళు ఏవేవో చెప్తుంటారు. వాటిని ఎంతవరకు వినాలో అంతవరకే విని తన పనిలో నిమగ్నం కావాలని, వృత్తిలో చేరిన ప్రతిఒక్కరు దీన్ని పాటించాలన్నది రచయిత అభిమతంగా తెలుస్తుంది.

మధుబాబు తొలిరోజు జనరల్ వార్డులో వున్నప్పుడు ఓ తల్లి ఆవేదనతో "డాక్టరుగారు నాకు ఒక్కగానొక్క కొడుకు. వీడు పుట్టిన ఆరునెల్లకే కలరా వచ్చి తండ్రి చనిపోయాడు. అష్టకష్టాలుపడి వీడ్ని పెంచుకుంటున్నాను. బ్రతుకుతాడంటారా? చెప్పండి డాక్టరు. నాకు నిజం కావాలి"[1] అని ఆ మాతృహృదయం రోదిస్తుంది. బిడ్డపై ఆ మాతృమూర్తికి వున్న మమకారం, చిరుప్రాయంలోనే భర్తను పోగొట్టుకుని, మాచినచీరతో బలహీనంగావున్న ఆమెను చూసినప్పుడు మధు మనసు వికలమౌతుంది. తన జీవితంలో మొట్టమొదటి కేసు కాబట్టి 'పిల్లవాడికి అన్యాయం జరిగిందా? నా అనవసరపు తెలివితేటలు చూపించానన్న శంక' మధు మనసు వేధిస్తుంది. చివరకు పిల్లవాడు బ్రతుకుతాడు.

టి.బి. వార్డులో మరణించిన స్త్రీని చూసి మధు మరింత వ్యధ చెందుతాడు. ఆఖరుదశలో ఎవరూ దగ్గరలేని అభాగ్యస్త్రీ ఆమె. తెరచివున్న కళ్ళు అస్థిపంజరం లాంటి శరీరాన్ని చూసిన మధు చలించి చూడలేకపోతున్నందుకు ఓ సిస్టర్ 'గవర్నమెంట్ ఆసుపత్రుల్లో పనిచేసే డాక్టర్లు అంత సున్నితంగా వుండగూడదం' టుంది. చివరకు మధు డెత్ సర్టిఫికేట్ ఇవ్వగలుగుతాడు. ఇలా వరుసగా మూడు చావుల్ని కళ్ళారా చూడటం అనుకోకుండా జరిగిపోవడంతో 'ఇవన్నీ చూస్తూ వుండటానికేనా నేను డ్యూటీ చేస్తున్నది? ఈ విద్య అంతా మిథ్యయేనా' అని నిరాశ చెందినప్పటికీ తనకు తానుగా తీర్చిదిద్దుకుంటాడు. ఇలా మొదట మానసిక వ్యథకు గురైన మధు రానురాను విద్యలో రాటుదేలి ముందుకు వెళ్ళడం వృత్తి ధర్మంగా భావిస్తాడు.

మధుబాబు తన కర్తవ్యాన్ని విస్మరించకుండా రోగులకు సేవచేస్తూ ముఖ్యంగా ఆడవాళ్ళ దగ్గర మాత్రం ఉపాయంతో వ్యవహరించి మాట్లాడటం నేర్చుకుంటాడు.

1. నీకేమైనా పొగ త్రాగడం అలవాటుందా?

2. సుఖవ్యాధు లేమైనా వున్నాయా?

3. త్రాగుడు అలవాటుందా? ఇటువంటి ప్రశ్నలవల్ల రోగులు డాక్టరు దగ్గర బయటపడటం జరుగుతుంది. ఇక్కడ మధు సంయమనం పాటించి

పేషంట్స్‌ను ఎలాంటి ప్రశ్నలు వేయాలన్నది తెలుసుకుంటాడు. శరీరం కాలి మరణించిన రాజలక్ష్మి అనే అమ్మాయిని చూసి మనసు వికలమై చలించిపోతాడు. ఆమె నిర్భయత్వం, దుడుకుమాటలు విన్న తరువాత మనోనిబ్బరాన్ని పాటించి నప్పుడే తన వృత్తిధర్మాన్ని నిర్వర్తించగలుగుతాడు. ఇటువంటివి మనసులోకి తెచ్చుకుని "నేను డాక్టర్ని. ఇలాంటి అనుభూతులు, మమకారాలు, మమతలూ పెట్టుకోకూడదు. త్రికరణశుద్ధిగా వైద్యం చేయడమే నా ధర్మం. ఒక రోగికి సానుభూతితో శుశ్రూష చేయాలేగాని అంతరంగికమైన స్పందనలకు చోటివ్వకూడ దనుకుంటాడు."[2] సున్నితహృదయుడైన డాక్టరు పేషెంట్స్‌కు న్యాయం చేయలేక పోతున్నాడని మధు అభిప్రాయం.

డాక్టరుగా తప్పు చేయకుండా చూసుకోవడం తన విద్యుక్తధర్మంగా పాటించాలి. ఒక పిల్లవాడికి జాండీస్ చికిత్స సరిగా చేయలేకపోవడం ఆ పిల్ల వాడు మరణిస్తాడు. మధు పశ్చాత్తాపంతో తన అల్పత్వాన్ని ప్రకటించుకుంటాడు. ఈ విశాల ప్రపంచంలో తను ఎంత అల్పజీవో అర్థమౌతుంది.

'డాక్టరుగారి భార్య' నవలలో నరేష్ మధ్యతరగతి కుటుంబం నుండి వచ్చిన వ్యక్తి. ఆర్థిక ఇబ్బందులవల్ల పైచదువులు చదవలేకపోతాడు. తను ప్రేమించిన సహజను పెళ్ళి చేసుకుని ప్రయివేటు ప్రాక్టీసు పెట్టడానికి నిశ్చయించు కుంటాడు. నరేష్‌కు పరిపూర్ణుడైన డాక్టరుగా పేరురావాలన్న పట్టుదలతోపాటు, అతని భార్య సహజ ఇచ్చే ప్రోత్సాహం మరింత ముందుకు తీసుకెళుతుంది. డాక్టరుకు సంబంధించిన జర్నల్స్‌ను చదువుతూ కేసుల్ని నిశితంగా పరిశీలిస్తాడు. ప్రారంభంలోనే జటిలమైన కేసుల్ని టేకప్ చేయాలనుకుంటాడు. తప్పు దొర్లి నప్పుడు ఆత్మవిమర్శ చేసుకుంటూ సందేహాల్ని నివృత్తి చేసుకుంటూ ముందుకు సాగిపోవడం అన్నది ప్రతి డాక్టరు తెలుసుకోవలసిన అంశం.

డాక్టర్ల జీవితం ఎంతో టెన్షన్‌కు గురవుతుంటుంది. ఒకరకంగా చూస్తే నెత్తురుకూడు లాంటిది. ఇందులో డాక్టర్ నరేష్‌కు ఎదురయే పరిస్థితిని ఇక్కడ చూడవచ్చు. మూడేళ్ళపాపకు వాంతులు అవుతుంటే తల్లిదండ్రులు తీసుకువస్తారు తను సిర్విల్ ఇంజక్షన్ ఇచ్చినప్పటికే కాస్త కుదుటపడి మళ్ళీ కనుగుడ్లు పైకి తిరగటంతో భయపడిపోతాడు. ఫినార్గన్ వన్ సి.సి. ఇవ్వగా పాప మళ్ళీ

హాయిగా కోలుకుంటుంది. అంటే పిల్లలకు ఏ మందు ముందు ఇవ్వాలో ఏ మందు తరువాత ఇవ్వాలో తెలుసుకోవాలన్నది నరేష్ తెలుసుకున్న పరిజ్ఞానంగా తెలుస్తుంది.

నరేష్‌కు వైద్యవృత్తిలో అసంతృప్తి జ్వాలల్లో మచ్చుకు ఒకటి చూడ వచ్చు. సిటీబస్‌కిందపడ్డ ముసలావిడ ప్రమాద పరిస్థితిలో వుంటే నరేష్ ఇంటికి తీసుకువస్తారు. నరేష్ స్నానం చేస్తున్నాడు కాబట్టి ఇంకెవరి దగ్గరకైనా తీసుకెళ్ళ మని సహజ పంపేస్తుంది. ముసలమ్మ మరణిస్తుంది. దహనక్రియలు పూర్తిచేసి వచ్చిన ఓ యువకుడు 'డబ్బులు సంపాదించడంకోసమే బోర్డులు పెట్టుకున్నారని, వీరికి మానవత్వం లేదని, దేశాన్ని అధోగతిపాల్జేస్తున్నార'ని కేకలు వేసి వెళ్ళి పోతారు. అజ్ఞాతవ్యక్తి అన్నమాటలకు నరేష్ చలించిపోయి కలతచెంది భార్యతో "సహజా! ఈ టెన్షన్ భరించలేకపోతున్నాను. ప్రతినిముషమూ, ఉద్రేకంగా, ఎమోషనల్‌గా గడుస్తోంది. ఇన్నిరకాల మనస్తత్వాలను ఇన్ని పరీక్షలను తట్టుకో లేకపోతున్నాను. ఎక్కడికైనా వెళ్ళి ప్రశాంతంగా బ్రతుకుదాం"[8] అన్న మాట లకు నిరుత్సాహం చెందిన తన భర్తతో వృత్తిని గుర్తుచేస్తూ పైగా రోగిని కాని రోగి తాలూకు వాళ్ళనుగాని క్షమించే స్థితికి ఎదగాలంటుంది.

కర్ఫ్యూ సమయంలో ముగ్గురిలో ఇద్దర్ని బ్రతికిస్తాడు. సహజ, నరేష్ చేస్తున్న సేవలకి అ పేషెంట్స్ దండం పెడతారు. వైద్యవృత్తి వెనుక మానవతా దృక్పథం వుండటం ఇక్కడ గమనించవచ్చు.

నరేష్ భార్య సహజ ప్రసవవేదన పడుతుంది. కర్ఫ్యూ సమయం కాబట్టి ఎక్కడికీ తీసుకువెళ్ళడానికి వీలుకాదు. ఒకప్రక్క శవం. మరోప్రక్క చావు బ్రతుకుల మధ్యవున్న పేషెంట్స్, బయట ప్రపంచంతో సంబంధం తెగిపోయిన నిస్సహాయత్వం, అనుకోని ఆ కాలుష్యం, విధిలేక తనను తాను అదుపులోకి తెచ్చుకుంటాడు. సహజ బాధను చూసి ఇంత నిస్సహాయస్థితి ప్రపంచంలో ఏ మానవుడికీ రాకూడదనుకుంటాడు. ఎవరి సహాయం లేకుండా సహజకు డెలివరీ తానే అతికష్టంమీద బిడ్డను బయటకు తీస్తాడు. అంత విషమపరిస్థితుల్లో సహజ డెలివరీ అయినందుకు బాధపడ్డ నరేష్‌తో ఒక డాక్టరు భార్య అయినందుకు

గర్వి స్తున్నానంటుంది. తన భార్యకు తానే డెలివరీ చేయడంతో నరేష్ పాత్రకు సరియైన న్యాయం చేకూర్చగలిగాడు.

డాక్టర్ల దగ్గరకు రోగులెందరో వస్తుంటారు. వాళ్ళ జీవితాల్లో భిన్నాభి ప్రాయాల్ని, విషాదజీవితాల్ని నరేష్ తనలోనే దాచుకుంటాడు. వాళ్ళ విషాద చరిత్రల్ని గురించి నరేష్ "డాక్టర్లకు అయ్యే పరిచయాల్లో ఎక్కువ విషాదచరిత్రలే వుంటాయి. బయటప్రపంచానికి చెప్పలేని, చెప్పకూడని, అనేక రహస్యాలు డాక్టరుముందు ఒప్పుకుంటారు. బయటకు అన్యోన్యంగా కనిపించే భార్యాభర్తలు వాళ్ళ అంతరంగ మధనాలు, విచిత్రభావాలు—అన్నీ ఆకళింపు చేసుకుంటూ, వీలయితే పరిష్కరిస్తూ ఆ రహస్యాలను భద్రపరుస్తూ ముందుకు పోతూవుండాలి. విన్నవే వినాలి. చెప్పిన సలహాలే చెప్పాలి. తాను మాత్రం అడుగులు జాగ్రత్తగా వేస్తూవుండాలి. అదలావుంచి తనచుట్టూ పరిభ్రమించే యీ అశాంతిజీవుల ఆక్రంద నలు, నిస్సహాయ నిట్టూర్పుల్లోని దుఃఖం ఒక్కోసారి ఇముడ్చుకుని ఆ బరువు భరించటం కష్టమవుతూ వుంటుంది. అయినా భరించాలి"[4] అని అంటాడు. ఇతరులకు చెప్పలేని రహస్యాలు డాక్టరుకు చెప్పడంవల్ల వాళ్ళ రోగాల్ని మాన సికంగా బాగుచెయ్యడానికి ప్రయత్నిస్తాడు. వాళ్ళ విషాద చరిత్రలు విన్న డాక్టరు మనసు చలించకుండా ముందుకు సాగాలన్న మనస్తత్వం డాక్టర్లు కలిగివుండా లన్నది నరేష్ అభిప్రాయం.

డాక్టర్ నరేష్ తనకున్న జాండిస్ కారణంగా ఓ పిల్లవాణ్ణి చూడలేకపోతాడు. సహజ వేరే డాక్టర్ని చూసుకోమంటుంది. వాళ్ళ అజాగ్రత్త మూలంగా మర ణించగా, నరేష్ నిర్లక్ష్యంవల్ల తన కొడుకు మరణించాడని కోర్టులో కేసు పెడుతాడు. నరేష్‌పై క్రిమినల్ కేసు బనాయించడంవల్ల ప్రతివారం కోర్టుకు వెళ్ళి రావలసివుంటుంది. డాక్టరు కావడంవల్ల టైముకు వెళ్ళడానికి కుదరకపోవడం అతని తప్పిదం కాదని మనకు తెలిసినా కోర్టుదృష్టిలో డాక్టరుదే తప్పు అని అనిపిస్తారు. నరేష్ తరపున వాదించిన లాయర్ వైద్యవృత్తిలోని లొసుగుల్ని కోర్టుకు తెలియజేసి నరేష్‌ని ఆదుకుంటాడు.

'భారతి' నవల్లో నియంత అయిన డా॥ గోవిందరావు మరణంతో డా॥ సాగర్ కుష్ఠురోగుల ఆసుపత్రికి రావడంతో ఆసుపత్రి వాతావరణం పూర్తి

పోతుంది. సాగర్ రోగులయెడ సానుభూతి చూపుతూ వారికి శుశ్రూష చేస్తూ కావలసిన సదుపాయాల్ని కల్పిస్తూ మంచి డాక్టరుగా పేరు తెచ్చుకుంటాడు. అక్కడి వాతావరణం రమణీయమైన ఆశ్రమంలా మారుతుంది. సాగర్ మాటల్లో నిస్వార్థమైన సేవను కుష్ఠురోగులలోవున్న భయాన్ని పోగొట్టేట్టుగా మాట్లాడుతూ "కుష్ఠువ్యాధి అందరూ భయపడేటంత భయంకరమైన అంటువ్యాధి కాదు. అనాది నుంచి దానికి ఒక విచిత్ర స్వరూపం ఇవ్వబడుతూ వచ్చింది. ఒక రోగిని కొన్ని సంవత్సరాలు రాసుకుని పూసుకుని తిరిగితే తప్ప అంత త్వరగా సంక్రమింపదు." అని రోగుల్లో ధైర్యం ఆత్మవిశ్వాసం కల్గించడానికి ప్రయత్నిస్తాడు. ఆ వృత్తిలో ఆదర్శపురుషుడుగా, ఉన్నతమైన డాక్టరుగా విశాలహృదయుడుగా దర్శనమివ్వడం సంఘసేవాతత్పరుడుగా మనకు అగుపిస్తాడు.

'హౌస్ సర్జన్' నవలలో ప్రభుత్వ ఆసుపత్రి వాతావరణం ఇందులో స్పష్టంగా కనిపిస్తుంది. కార్డియాలజీ డిపార్ట్‌మెంట్ ఓ ఉన్నతమైన స్థానాన్ని ఆక్రమిస్తుంది. డా॥ చక్రవర్తి ఆ డిపార్ట్‌మెంట్ చీఫ్‌గా వుంటాడు. నిస్వార్థపరుడు. పేదవాళ్ళంటే ఎనలేని అభిమానం వుంటుంది. ఆయన రౌండ్స్‌కి వస్తున్నారంటే ఆ వార్డు వాతావరణంలో మార్పువచ్చేది. ప్రతిఒక్కరు చక్రవర్తి దృష్టిలో పడకూడదని వ్యవహరిస్తుంటారు. పేషంట్స్‌పై దాతృగుణం మరువరానిది. పేషంట్స్ తలకు నూనె రాయడం దగ్గర నుంచి బెడ్‌షీట్ శుభ్రంగా వున్నదా? లేదా? మందులు సరిగా అందుతున్నాయా లేదా? అనే విషయాలపై జాగ్రత్తగా గమనిస్తుంటాడు. ఎక్కడో ఏదో ఒక తప్పు అతని దృష్టిలో పడుతూనేవుండేది. అందుకు ఓ అమ్మాయి నిదర్శనం. మా అమ్మని వార్డులో చేర్పించమని ఓ.పి.లో చెప్పారండి, అందుకు ఇక్కడ నిలబడివున్నానని చెప్పడంతో చక్రపాణి హృదయం ద్రవిస్తుంది. డాక్టర్ల నుద్దేశించి "సంస్కారం అనేది జీన్స్ నుండి రావాలండీ. తరతరాలుగా రక్తంతో జీర్ణించుకుని వస్తూవుంటాయి గుణాలు. పొట్ట తిప్పలకోసం నాలుగు రాళ్ల సంపాదించుకుందామని ఉద్యోగంలో చేరిన వాళ్ళకి ఒక్కమాటుమారవు గుణాలు. రెండుగంటల నుండి ఆమె అక్కడ పడిగాపులు కాస్తుంటే, ఎవరో ఎందుకోసం నిలబడిందోనని మీకు తట్టకపోవడం నాకేం ఆశ్చర్యంగాలేదు"[6] చక్రపాణి మాటల్లో సంస్కారంతోపాటు పేదలపట్ల వున్న సానుభూతి వ్యక్తమౌతుంది. డాక్టర్లు నిర్లక్ష్య-స్వభావాన్ని చూపకుండా పేదలకు

సేవ చేయాలన్నది డాక్టర్లు విధిగా గమనించవచ్చు. రోగుల మనస్తత్వాల్ని పసి గట్టిన చక్రపాణి వాళ్ళు మనల్ని గురించి ఎలా మాట్లాడుకుంటారో కూడా ఇలా తెలియజేస్తున్నారు. "మనం వార్డు నుంచి బయటకు వెళ్ళిపోయాక రోగులందరూ మాట్లాడుకునేది మనల్ని గురించే. మనకు అత్యల్పంగా కనిపించే విషయం వారికి ఎంతో పెద్దదిగా కనిపించి దాన్ని గురించి గంటలతరబడి చర్చించుకుంటారు. ఒక రోగికి ఒక పూట యింజక్షన్ ఇవ్వడం మరచిపోతే అది మీకు సామాన్యంగా కనిపించవచ్చు కాని ఆ విషయమే అతని మనసు తొలిచివేసి ఆ రాత్రి నిద్రపట్ట కుండా చేస్తుంది"ని[7] అంటాడు. రోగులు తమ తమ వ్యాధుల్ని గురించి మాన సికంగా బాధపడుతున్న వారికి సేవచేయడం మన కర్తవ్యంగా పెట్టుకుని రోగుల్ని గమనిస్తూ వుండాలన్నది చక్రపాణి మాటల్లోని అంతరార్థం. చక్రపాణి అను భవంతో చెప్పిన మాటలు మిగిలినవారు ఆచరణలో చూపుతారని వైద్యులకు ఇచ్చే సలహాలుగా తెలుస్తుంది.

**7. 2. ప్రభుత్వ ఆసుపత్రుల వాతావరణం :**

హౌస్‌సర్జన్ నవలలో ముఖ్యస్థలం ప్రభుత్వ జనరల్ ఆసుపత్రి. ఆ వాతా వరణంలో అనుక్షణం రోగుల మనోభావాలు, వారి మృత్యుపోరాటలు, ఏడుపులు, నిరాశ నిట్టూర్పులు వినిపిస్తాయి. ఆసుపత్రి చీఫ్స్ మొదలుకుని అటెండర్ వరకు తమ పనిలో నిమగ్నమయ్యేవాళ్ళుగా ఇందులో కనిపిస్తారు. రోగులు శవాలుగా మారుతుంటారు ఆ వాతావరణ అనుభవాల్ని మధుబాబు మనముందు పెట్టాడు. ప్రభుత్వపు ఆసుపత్రుల్లో రోగ నిర్ణయం జరిగినట్లు మరెక్కడ జరగదని మధు బాబు తన ఒక్క సంవత్సర అనుభవంలో తెలుసుకుంటాడు. మధుబాబు లాంటి డాక్టర్లవల్ల ప్రభుత్వ ఆసుపత్రులు ఎంతో విలువైనవనే నమ్మకం రోగుల్లోనే కాదు, ప్రజల్లోను కలుగుతుంది. ప్రభుత్వ ఆసుపత్రుల్లో ఒక్కసారి డాక్టరుకు మంచి పేరు వచ్చిందంటే సామాన్యంగా రోగుల్లోను మామూలు మనుషుల్లోను తొలగిపోదు. మధుబాబు సేవను గుర్తించిన ఓ ఉబ్బసపు రోగి "మీరు ఇదివరకు చూడలేదేమో గాని నాలుగైదుసార్లు ఇంత సీరియస్ దశలో అడ్మిట్ అయ్యాను. కాకపోతే వార్డు వేరుకావచ్చు. ఇక్కడ మనుషులు, వాతావరణం నా కెంతో ఇష్టం. నాలాంటి రోగుల్ని పలకరించే డాక్టర్లను చూస్తుంటే వేడుక ముచ్చటగా వుంటుంది. ఇన్నిసార్లు ఆసుపత్రిలో అడ్మిట్ అయినా మీ అంత కర్తవ్యపరాయణు

లైన డాక్టర్ని చూడలేదు. నీకు ఉన్నతమైన భవిష్యత్తు వుండాలని ఆశీర్వదిస్తున్నాను"[8] అని అనటం ప్రభుత్వ ఆసుపత్రుల పట్ల రోగుల్లో మంచి అభిప్రాయం వున్నట్లు తెలుస్తుంది. ఇందులోనే మరో స్త్రీ తన కుమార్తెను బ్రతికించడంలో సహాయపడిన మధుతో "గవర్నమెంట్ ఆసుపత్రులంటే వున్న దురభిప్రాయాల్ని పోగొట్టారిప్పుడు. మనుషులంటే దురభిప్రాయాన్ని తొలగించారిప్పుడు. ఎవరూ వూహించనంత పెద్ద డాక్టరు అవుతారు" అంటుంది. పేదప్రజల మనస్తత్వంలో డాక్టరు అనేవాడు మధుబాబులా వుండాలన్నది రచయిత అభిప్రాయంగా తెలుస్తుంది.

పేషంట్స్‌కు అన్యాయం అప్పుడప్పుడు ఎదురౌతుంటుంది. కారణం రోగుల నిర్లక్ష్యం కావచ్చు. డాక్టరు అసమర్థత కావచ్చు. అందువల్ల రోగుల తాలూకు ఆసుపత్రుల ముందు అసభ్యంగా కేకలు పెడుతూ అసత్యాలను ప్రచారం చేస్తుంటారు. అటువంటి ప్రచారంపై మధు "ఈ కృత్రిమ యుగంలో, కంటకాలే సత్యాలై విరాజిల్లుతున్న యీ రోజుల్లో, ఆ కంటక సత్యాల మహావృక్షంలో ఒక సత్యం ఏ కొమ్మనో, రెమ్మనో అంటిపెట్టుకుని వున్నా దాని వెలుగు కొమ్మల మాటున ఆకుల చాటున మరుగుపడిపోతుంది గాని భూమిపై[10] పడదు" అని అంటాడు. సత్యాసత్యాలను గురించిన మాటలకు, పుకార్లకు తావివ్వడం మంచిది. కాదని మధు అభిప్రాయంతోపాటు అసభ్యంగా ప్రవర్తించడం మానవమాత్రుల లక్షణం కాదని రచయిత ప్రత్యేకతను చాటుకున్నట్లు తెలుస్తుంది. రోగికి జరిగే చికిత్సా విధానం ప్రభుత్వ ఆసుపత్రుల్లో వున్నట్లు మరెక్కడ జరగదని ఇందులో మధుబాబు తన పాత్రద్వారా నిరూపిస్తాడు.

ప్రభుత్వ ఆసుపత్రుల్లో రాజకీయం చోటు చేసుకోవడం హౌస్ సర్జన్ నవలలో ఓ మంచి ఉదాహరణ. ప్రభుత్వ ఆసుపత్రి సూపరింటెండెంట్ డా॥ రాజు మంచి పేరుప్రఖ్యాతులున్న డాక్టరు. లంచం తీసుకున్నాడని అబద్ధపు ఆరోపణలచే అరెస్టు చేయబడతాడు. రాజకీయంగా రాజును వంచించారని కుట్రదారులు పన్నిన ఎత్తుగడగా తెలుస్తుంది. వికల మనస్కుడైన మధు "ప్రపంచంలో గొప్పవాడు గాని మంచివాడు గాని వున్నవాడు కూడా విరోధుల్ని పెంచుకుంటాడు....ఏ సభల్లో చూసినా ఏ సమావేశాల్లో చూసినా అగ్రస్థానం వహించడం ద్వారా రాజు

గారు విరోధుల్ని పెంచుకున్నాడు. అవినీతిగా ప్రవర్తించిన అనేకమందికి ఆయన సింహస్వప్నంగా తయారైనాడు ఈ విషవలయంలో యిరికించాలని చాటుగా ఎప్పట్నుంచో ప్రయత్నాలు జరుగుతూ వుంటాయనీ"[11] అనుకుంటాడు. ప్రభుత్వ ఆసుపత్రుల్లో రాజు నిస్వార్థసేవను, నిజాయితీని చూడగలుగుతాం. నిస్వార్థపరుడైన వాడు, మంచి మనసు గల సహృదయుడు స్వార్థ రాజకీయాలకు బలికావలసిందేనా అని సమాజాన్ని హెచ్చరిస్తున్నాడు.

## 3.3 అవినీతి, నిర్లక్ష్యపు డాక్టర్ల మనస్తత్వాలు :

సంఘంలో ఎంతో బాధ్యత గలది వైద్యవృత్తి. రోగుల మనస్తత్వానికి అనుగుణంగా వారికి మానసికోల్లాసం కలిగించి మరో జన్మ ప్రసాదించే మహోన్నత వృత్తి. 'భారతి' నవలలో గోవిందరావు వృత్తిధర్మాన్ని విస్మరించి బాధ్యతా రహితంగా ప్రవర్తిస్తాడు. అవినీతికి పాల్పడుతూ రోగుల గాయాల్ని మాన్పటానికి బదులు మానసికంగా గాయపరుస్తుంటాడు. కలికిరిలో కుష్ఠురోగుల ఆసుపత్రికి చీఫ్‌గా వెళ్ళినప్పటి నుండి రోగులపట్ల నిర్లక్ష్యభావాన్ని ప్రకటిస్తూ వాళ్ళను చూసి హేళనగా మాట్లాడుతూ అనుక్షణం హింసిస్తుంటాడు. నర్స్‌గా పని చేస్తున్న భారతి అతని అవినీతిని బయట పెడుతుంది. తన విద్యుక్తధర్మాన్ని నిర్వహించమని సూచనలు చేసిన భారతితో "నువ్వలా అనుకోవడం మంచిదే కాని దేశకాల పరిస్థితుల ప్రకారం మనం పోతూవుండాలి. నువ్వు వెళ్ళే దారే కానీ వచ్చేదారి చూసుకోవడం లేదు....ఒకప్పుడు నువ్వు లెప్రసీ పేషంటువని మర్చిపోకు. మళ్ళీ సంక్రమిస్తుంది"[12] అని అంటాడు. నిజాయితీగల డాక్టరు వృత్తిలో వుంటూ తన వృత్తి ధర్మాన్ని కించపరిచేట్టుగా వుంది. సంకుచిత స్వభావం గల గోవిందరావు స్వార్థపరుడుగా కనిపిస్తాడు. ప్రభుత్వ ఆసుపత్రి కోసం వున్న నిధుల్ని దుర్వినియోగం చేస్తున్నట్టు పట్టుబడతాడు.

డా॥ గోవిందరావు ఆసుపత్రి నిధుల్ని దుర్వినియోగం చేస్తున్నట్లు కనుగొన్న భారతి అతనిని నిలదీస్తుంది. అనవసరపు ప్రసంగం చెయ్యవద్దని మందలిస్తాడు. గోవిందరావులో అవినీతి, లంచగొండితనం యెక్కువ కావడంతో రోగుల్లో కూడా అశాంతి మరింత ఎక్కువవుతుంది. భారతి మాటలకు గోవిందరావు "చిన్న దానివి పైకి రావలసిన దానివి. నీ ఆశలు మంచివే కానీ ఇలా పనికిమాలిన సేవలు చేస్తూ

జీవితాన్ని వృథా చేసుకోవడం నాకు నచ్చలేదు. అందులోను ఇలాంటి రోగుల మధ్యనా ఆదర్శాలు? ఇది లెప్రసీ భారతి. ఏ జన్మలో పాపం చేసుకున్నారో వాళ్లిలా పుట్టారు. వాళ్ళకి యాంత్రికంగా ట్రీట్ చెయ్యాలిగాని ఇలా మితిమీరిన దయ చూపకూడదు.[18]" వైద్యవృత్తి చేపట్టిన డాక్టరు అవినీతికి పాల్పడటమే కాక లెప్రసీ రోగుల గత జన్మలగురించి మాట్లాడం నైతిక పతనానికి గుర్తుగా తెలుస్తుంది. సంఘ సేవకులుగా పేరు తెచ్చుకోవాలన్న వైద్యులు అవినీతితో గోవిందరావు లాంటివాళ్ళు వున్నారనడానికి ఓ చక్కని నిదర్శనం.

గోవిందరావు రోగులతో ఆటలాడుకోవడమే కాకుండా భారతి జీవితంలో భార్యా భర్తలమధ్య, అత్తా మామలమధ్య నిప్పులు పెడతాడు. గోవిందరావు మూలంగా భారతికి కుష్టువ్యాధి వున్నదని అత్తమామలకు చెప్పి ఇంటినుండి గెంటింప చేసేటట్లు చేస్తాడు.

గోవిందరావు భారతిని మానభంగ చేయబోగా కత్తిచూపి బెదరిస్తుంది. తనకున్న డయాబిటీస్ వల్ల భయపడి వెళ్ళిపోయినట్లు నటించినా అతని కాంక్ష తీరక రోగిష్టిదయిన లక్ష్మిని బలవంతం చేయబోగా లక్ష్మి తోసేస్తుంది. క్రింద పడిన గోవిందరావుకు ఇనుపముక్క తగిలి ధనుర్వాతంతో కొద్ది రోజులకు మరణిస్తాడు.

డాక్టర్ వృత్తిలో నిస్వార్థ పరులేగాక నిర్లక్ష్యం చేసేవారుకూడా వుంటారు. అటువంటి వారితో హౌస్‌సర్జన్ నవలలో డా॥ రాజేశ్వరిని చెప్పుకోవచ్చు. ఈమె దుడుకు స్వభావం కలది. శాంత స్వభావం మచ్చుకైనా కనిపించదు! రాజేశ్వరి అశ్రద్ధ ఫలితంగా ఓ పిల్లవాడు మరణిస్తాడు. కాని ఆ పిల్లవాడు తల్లి దండ్రులు తన కొడుకు బ్రతికేవున్నాడన్న భ్రమతో ఆసుపత్రికి తీసుకువస్తారు. మధు ఆ విషయాన్ని కప్పిపుచ్చి పిల్లవాడికి జబ్బు సీరియస్‌గా వుండటంవల్లనే చని పోయాడని చెప్పి రాజేశ్వరిని కాపాడతాడు. మధు కారణంగా రాజేశ్వరిలో మార్పు వస్తుంది. రాజేశ్వరి తనుచేసిన తప్పుకు లోనికెళ్ళి ఏడుస్తుంది. మధుతో 'నేను ఇంజక్షన్ చేయకుండా వుంటే నూరేళ్ళు జీవించేవాడు కదూ!' అని అనడం ఆమెలో పశ్చాత్తాపంతో పాటు నిర్లక్ష్యాన్ని చూపే డాక్టర్ల కళ్లు తెరిపించి నట్లవు తుంది.

## 3.4. డాక్టర్ల రేడియో ప్రసంగాలు

ఆధునిక ప్రపంచంలో వైజ్ఞానికంగా ఎన్నోమార్పులు వచ్చాయి. వస్తు న్నాయి. వైద్యులు రేడియోలలో ప్రసగించడం ద్వారా వారి విద్యుక్త ధర్మాన్ని చాటిచెప్పిన వాళ్ళవుతారు. రోగుల అంతరంగంలో పెట్టుకున్న అనుమానాలు తొలిగి పోవడానికి అవకాశంవుంటుంది. 'డాక్టరుగారి భార్య' నవలలో 'వ్యాధులు - మనస్సులూ' అన్న అంశపై డా॥ నరేష్ రేడియోలో "రకరకాల వ్యాధుల వల్ల క్రానిక్ రోగాలవల్ల రోగి మనసు అలసిపోయి విసిగిపోయివుంటుంది. రొటీన్‌గా ధైర్యం చెప్పటం ఊరడించడం ఆస్థితిలో చాలదు. జీవితం పట్ల ఇన్‌స్పిరేషన్ ఇవ్వాలి. వాళ్లు అలవాటుపడిన దృక్పథాన్ని, గమనాన్ని మార్చాలి. డాక్టరు గంభీ రంగా వుండాలి గానీ, అతీతంగా వుండకూడదు. పేషంటుతో అతని వైఖరితో, అతని ప్రవృత్తితో కలిసిపోవాలి. రోగాన్ని ఎదిరించడానికి కావలసిన శక్తి, రోగంతో పోరాడటానికి కావలసిన చైతన్యాన్ని డాక్టరు ఇవ్వగలగాలి. కృంగి పోయి, ఆత్మ హత్యలు చేసుకుని రోగి సాధించేదేమీ లేదు. తన ఆలోచనా పరశీ మార్చుకుంటే వున్న పరిధిలోనే నూతన జీవితాన్ని సందర్శించవచ్చు."[14] అని అంటాడు. ఇలా రేడియోలో డాక్టర్లు ప్రసంగించడం వల్ల కొందరు రోగులకు ఉపశమనం కలుగుతుంది.

## 3.5. రోగుల మనస్తత్వాలు - వివిధ రకాల జబ్బులు :

వైద్యవృత్తి చేపట్టిన వారికి వివిధ రకాల మనస్తత్వాలను తెలుసుకోవ డానికి ఎంతో అవకాశం వుంటుంది. రోగుల మనస్తత్వాలు భిన్నప్రవృత్తులతో కూడుకునివుండటం గమనించవచ్చు. 'డాక్టరుగారి భార్య' నవలలో నరేష్ వివిధ రకాల మనస్తత్వం గలవాళ్ల ప్రవర్తనల్ని తెలియజేసివున్నారు.

1. రోగులు అయినదానికి కానిదానికి మానసికంగా బాధపడుతూ డాక్టరు దగ్గరకు వస్తుంటారు. వీరినే 'క్రానిక్ పేషెంట్స్' అంటారు. వీరికి ముఖ్యంగా మానసిక ఆందోళనే కారణం.

2. తనకేదో రోగం వున్నట్లు అనుక్షణం బాధపడి డాక్టరు దగ్గరకు వస్తూ పోతూ వుండటం.

3. గోవర్ధనరావు ప్రతి చిన్న విషయాన్ని 'లైఫ్ అండ్ డెత్'గా తీసుకుని మానసికంగా బాధపడుతూ డాక్టర్ని కలిసేవాడు.

4. పల్లె ప్రజలలోని మూఢనమ్మకాల్ని గమనించడం.

5. పిల్లల భవిష్యత్తుకోసం జీవితాన్ని త్యాగం చేసిన తల్లితండ్రుల్ని వృద్ధాప్యంలో సరియైన పోషణ లేకుండా వాళ్ళు పడే ఇబ్బందుల్ని గుర్తిస్తాడు.

6. భార్యాభర్తల మాటల్లో అన్నింటికి అడ్డువస్తున్న కారణంగా అత్తగారంటె ఎలర్జీగా వుంటుందన్న కోడళ్ల మానసికస్థితిని కనుకొనడం.

7. తనకున్నది లెప్రసీ అని తెలిసి కూడా ఆలస్యంగా డాక్టర్ని కలిసినందుకు నాగరాజు అనే అతను ఆత్మహత్య చేసుకోవడం.

8. సెక్స్ సమస్యలతో సతమతమయ్యే రోగుల పరిస్థితిలో ముఖ్యంగా 18 సం॥ల అమ్మాయి తాను కన్య ఔనో కాదో తెలుసుకోవడానికి డాక్టర్ దగ్గరకు రావడం.

9. ఏభై సంవత్సరాల స్త్రీ తాను తప్పుచేశానని ఒప్పుకోవడం.

10. గ్యాస్ ట్రబుల్‌వల్ల తాను మరణిస్తానేమోనని అనుమానంతో వచ్చే వాళ్ళ మానసికస్థితి ఎలా వుంటుందో గుర్తించడం.

రోగుల్లోని వివిధ రకాల కేసుల్ని, వాళ్ళ మానసిక స్థితిగతుల్ని చూసిన తరువాత వారి రోగాలను, బాధలను చూసిన నరేష్ మనసు చలించిపోతుంది. నరేష్ దగ్గరకు వచ్చిన పోలియో, డిఫ్తీరియా, ధనుర్వాతం, గుండెజబ్బులు, బి.పి., పక్షవాతం, డయాబిటిస్, కిడ్నీ,రక్తస్రావం, కేన్సర్, అల్సర్, ఊపిరి తిత్తులు, మానసికవ్యాధులు, యాక్సిడెంట్స్ మొదలగు వ్యాధుల్ని చూసిన నరేష్ మానసికంగా వ్యధ చెందుతాడు. ఈ భూమ్మీద జన్మించినప్పటి నుంచీ ఏదో సమస్య, వ్యాధి, పోరాటం, సంఘర్షణ, ఓడిపోటం, గెలవడం, దుఃఖం జీవచ్ఛవాల్లా తిరుగుతూ గడపవలసివుంటుందని బాధపడతాడు.

డాక్టరు దగ్గరకు వివిధ రకాల రోగులు వస్తుంటారు. వారి మనస్తత్వాలు భిన్నంగా వుంటాయి. లేని జబ్బులు, వల్లమాలిన బాధ నటించి హాస్పిటల్లో

అడ్మిట్ అయినవాళ్ళు ఒకరికి యింజక్షన్ పిచ్చి, మరొకరికి అరకుమందు పిచ్చి' ఇంకొకరికి ఆపరేషన్ పిచ్చి, మరికొందరు ఇంజక్షన్ ఇవ్వకపోతే రాత్రుల్లో నిద్ర పోయేవారు కాదు. రోగుల అనుమానాల్లో మందు ఎంత తాగాలి? ఫలహారం చేసే ముందా? చేశాకా? మాత్రలు వేసుకున్నాక ఎంతసేపటికి మందు తాగాలి. ఇటు వంటి సందేహాల్ని వ్యక్తం చేస్తారు. మరికొంతమంది రోగులు సర్జన్లతోనూ, అసిస్టెంట్స్‌తోను, ఛీఫ్‌తోలతోను తమ బాధల్ని రక రకాలుగా మార్చి చెప్పడాన్ని మధు గమనిస్తాడు. పేషంట్స్‌ను ముఖ్యంగా మూడు రకాలవాళ్ళను గమనించ వచ్చు. 1. సూదిమందు కోరుకునేవాళ్ళు 2. సీసా మందు 3. మాత్రలు కోరుకొనే వాళ్ళు. రక రకాల చర్మవ్యాధుల్ని గురించి వాటిని ఏ విధంగా డయాగ్నైజ్ చేయాలో చికిత్సా విధానాన్ని రచయిత ఇందులో తెలియజేశాడు.

## 3.6. నర్సుల దీనగాథలు – వారి నిస్వార్థసేవ

'డాక్టరుగారి భార్య' నవలలో నర్సుగా అంజన నిస్వార్థ సేవను గుర్తించ వచ్చు. అంజనను ఆమె భర్త అనుమానించి సమాజంమీద నిర్దాక్షిణ్యంగా వదలి వెళతాడు. బ్రతుకు తెరువుకోసం నరేష్ దగ్గర చేరుతుంది. అంజనను నర్స్‌గా తన దగ్గరే వుండమంటాడు. ఒకరోజు అంజన ఒంటరిగా వెళుతుంటే కొందరు దుండగులు ఆమెకు మైకం యిచ్చి అమానుషంగా అనుభవించి విసిరివేయబడ్డ విస్తరవలె నడిరోడ్డుపై తోసి వెళతారు. అంజన గర్భవతి అవుతుంది. నరేష్ ఆ విషయం తెలుసుకుని యెవరికీ తెలియకుండా టెరిమనేట్ చేస్తాడు. అంజన ఆ వేదనను నరేష్‌తో "జీవితం సర్వనాశనమైన దాన్ని ఎవరో సంబంధంలేని, ముక్కూ మొహం యెరుగనివారు తన దారిన తాను యెవరితో ప్రమేయం లేకుండా బ్రతుకుతున్నా దాన్ని నిర్లక్ష్యంగా, నిర్దయగా అర్థంలేకుండా సర్వనాశనంచేసి తన దార్ని తాము నవ్వుకుంటూ వెళ్ళిపోయారని."[15] అంటుంది అంజనలాంటి వ్యక్తులు మన సమాజంలో దుండగులచే వంచింపబడుతున్నారు. సమాజంలో మార్పు రావాలన్నిది రచయిత వుద్దేశం.

అంజన భర్త పశ్చాత్తాపంతో తిరిగివస్తాడు. తన ఆవేదనను తన భర్తతో చెబుతుంది. అందుకు ఆమె భర్త 'నువ్వు నాకన్న ఎంతో ఎత్తుకు ఎదిగావని నాకు ఒక్క అవకాశం ఇవ్వమని' ప్రాధేయపడతాడు.

భార్యా భర్తల్ని కలుపడానికి నరేష్ ప్రయత్నిస్తాడు. కాని అంజన అందుకు సమ్మతింపక "జరగవలసిన ఉపద్రవమేదో జరిగిపోయింది. ఇప్పుడు అలవాటు అయిపోయి ఇదే సుఖంగావుంది. అయినా నా చుట్టూ ఇన్ని ప్రాణాలుండి అందులో లీనమవుతూ ఇంకా ఒంటరిగా వున్నాననుకుంటే నేను వట్టి ఫూల్‌ని సార్[16]" అంటుంది. ఇక్కడ అంజన నర్స్‌గా వృత్తిపట్ల వున్న మానవతా సేవా దృక్పథాన్ని తెలియజేస్తుంది.

'భారతి' నవల్లో భారతి నర్స్‌గా కుష్ఠురోగులకు నిస్వార్థ సేవచేయడం మనం చూడవచ్చు. భారతికి కుష్ఠువున్న కారణంతో అత్త, మామ, భర్తచే ఇంటి నుండి గెంటింపబడుతుంది. తనకు జరిగిన అన్యాయానికి ఆరోగ్యం విషయంలో అలక్ష్యం చేస్తుంది. స్నేహితురాలు మల్లిక కోరికమేరకు భారతి డాక్టర్ సాగర్ దగ్గర వైద్యం పొందుతుంది. భారతికి కుష్ఠువ్యాధి పూర్తిగా నయమయిన తరువాత బాహ్య జగత్తులో విహరించాలని కలలు కంటుంది. మానసికంగా నలుగుతున్న భారతిని చూసి సాగర్ కొన్ని సలహాలిస్తాడు. డాక్టర్ సాగర్ మాటల్ని మన్నించి మళ్లీ చదువుకోవాలను కొంటుంది. తనకోరిక కుష్ఠురోగులకే సేవచేయాలన్న ఆశయంగా పెట్టుకుంటుంది. నర్సరీ ట్రయినింగ్ పూర్తిచేసి కలికిరిలోని కుష్ఠురోగుల ఆసుపత్రికి నర్సుగా వెళతుంది. ఆసుపత్రి చీఫ్‌గా వున్న గోవిందరావుని చూసి ఆశ్చర్యపడుతుంది. తను ఎవరితో నిమిత్తం లేకుండా రోగుల సేవలో నిమగ్నమవుతుంది. కాని తన జీవితంలో నిప్పులు కురిపించినవానిముందు ఉద్యోగం చేయడం చిన్నతనమనిపిస్తుంది. ఉద్యోగధర్మంగా ఎంతో సహనం అలవరచుకొంటుంది. నర్స్ వృత్తిలో రోగుల మధ్య తిరుగుతూ తోటి సిస్టర్స్ పరిహాసాలు, వెటకారాలు, ఆంక్షలు, అధికారాలు, అజమాయిషీల్ని అర్థం చేసుకుంటుంది. తన విధ్యుక్తధర్మాన్ని నెరవేర్చుతుంది. కర్తవ్య నిర్వహణలో ఒకరకం హుందాతనం, గర్వం, సంతృప్తి భారతిలో కనిపిస్తాయి. కుష్ఠురోగుల్ని ముట్టుకునేటప్పుడు ఆమె ఏనాడు సంకోచించలేదు. నిర్దయగా, నిస్సంకోచంగా, ఆప్యాయంగా వాళ్ళను తాకుతుంటే వాళ్ళే భయపడి, సిగ్గుపడి దూరంగా పోయేవాళ్లు. ఇక్కడ భారతి మానవత్వంతోపాటు తన వృత్తిధర్మాన్ని నిర్వర్తిస్తుంది.. సేవాతత్పరురాలుగా భారతి ఇందులో దర్శనమిస్తుంది.

ఆసుపత్రుల్లో పనిచేసే వాళ్ళల్లో డాక్టర్ల తరువాత నర్సుల సేవను చెప్పుకోవాలి. వాళ్ళలో కూడా నిస్వార్థపరులు, కాస్త నిర్లక్ష్యపరులు లేకపోలేదు. హౌస్ సర్జన్ నవలలో మధుబాబు సిస్టర్ల గడుసు మాటల్ని గమనిస్తాడు. వాళ్ళను దబాయించి నెగ్గుకురాలేమని వాళ్ళతో కాస్త వినయంగా వుండాలనుకుంటాడు. తప్పుదారి తొక్కిన సిస్టర్ లలిత మూర్తిచే గర్భవతి అవుతుంది. అబార్షన్ చేయించుకుంటుంది. అది తెలిసిన అధికారులు ఆమెను సస్పెండ్ చేస్తారు. పరాచికాలకు పోయిన లలిత ఆసుపత్రిలో అప్రతిష్ఠపాలవుతుంది. లలితకు జరిగిన అన్యాయాన్ని మధ్తో సిస్టర్ నళినితో మధు "సిస్టర్స్‌ను చూస్తే ఒకందుకు నా హృదయం జాలితో నిండిపోయేది. ఎవరో ఎక్కడో తప్ప వారంతా బీదకుటుంబాల నుంచి వచ్చినవారు. వారిమీద ఎంతో ఆశపెట్టుకుని వుంటారు వారి తల్లిదండ్రులు. అందమైన తెల్లటి యూనిఫామ్‌లో చూసే నర్సుకూ వారి కుటుంబ పరిస్థితికీ ఏమాత్రం సంబంధంలేదు. వారి నిజజీవిత చరిత్రే తెలిస్తే వారిని గురించి ఊహించుకున్న అభిప్రాయాలన్నీ తారుమారవుతాయి"[17] అని అంటాడు. సిస్టర్ వృత్తిని చేపట్టి ప్రతి ఒక్కరు నిస్వార్థంగా కళంకం లేకుండా, రాకుండా జీవితాన్ని మలసుకోవాలని రచయిత యీ పాత్రను సృష్టించాడు.

### 3.7 రోగుల దీన గాథలు :

'హౌస్ సర్జన్' నవలలో డాక్టర్ కామేశ్వరి గైనకాలజిస్టు అసిస్టెంట్ ప్రొఫెసర్ దీనగాథ ఒక ఉదాహరణ. తనకున్న బ్రెస్ట్ కేన్సర్‌ని ఎవరికీ తెలియనివ్వకుండా అవివాహితగానే వుండిపోతుంది. సాధుజీవి. ఎవర్ని గురించినైనా సరే చెడుగా మాట్లాడటానికి అలవాటుపడినవారు కూడా ఆమెను కించెత్తు చెడ్డమాట అనేవాళ్ళు కాదు. వేదాంత గ్రంథాలు చదువుతూ దేవాలయాలకూ, ఆధ్యాత్మిక సభలకు వెళ్ళడ్డం మధు ఎన్నోసార్లు గమనిస్తాడు. కామేశ్వరికి వున్న జబ్బును తెలుసుకున్న డాక్టర్లు బాధపడతారు. అందుకు ఆమె "ఎందుకలా బాధపడతారు నాకు బ్రెస్ట్ - కేన్సర్.....మీరంతా నన్ను ఇలాంటి అసహ్యానికి గురిచేసి పీడిస్తారని ఇన్నాళ్ళు ఎవరికీ చెప్పకుండా దాచాను....ఈ వ్యాధి అంకురించినప్పుడే గుర్తించాను. ఈ వ్యాధితో బాధపడే ప్రతి ఒక్కరూ నా మనసుని దోచుకున్నారు. వారందరితో చెలిమి చేశాను. వారే నా స్నేహితులు."[18] అని అంటుంది కాఫే

శ్వరి ఒక డాక్టరు అయివుండి తన రోగాన్ని చూసుకోకుండా రోగుల బాగును కోరిన ఉత్తమ డాక్టరుగా మనకు దర్శనమిస్తుంది. డాక్టర్ల ప్రోత్సాహంచే కామే శ్వరిని హైదరాబాదులో చేర్చి కేన్సర్ వ్యాధి నయం చేస్తారు. డాక్టర్ల మానవతా వాదం హృదయాకర్షకంగా చిత్రించబడింది.

ఇదే నవలలో స్వాతంత్ర్య యోధుడి దీనగాథ చోటు చేసుకోవడం చెప్పుకో దగ్గ అంశం. డాక్టర్ల అశ్రద్ధమూలంగా తన కుటుంబాన్ని పొట్టన పెట్టుకున్నారని ఆ తండ్రి ఆవేదన నాలుగేళ్ళ కొడుకుని తీసుకువచ్చిన అతను డాక్టర్ల నిర్లక్ష్యాన్ని గుర్తు పెట్టుకుని మాట్లాడుతాడు. రోగులు ఎంత బాధపడుతున్నారో ఒక్కరికీ పట్టదు. వాళ్ళ అవస్థలు ఒక్కరూ వినిపించుకోరు. మీ ఆరాటాలు మీ వినోదలతో కాలంపుచ్చి వెళ్ళిపోతున్నారని హెచ్చరిస్తాడు. ఆయన మాటలకు మధు ఆవేశం అణచుకోలేక డాక్టర్ల విధ్యుక్త ధర్మాన్ని గుర్తుచేస్తాడు. మధు మాటలు విన్న ఆవ్యక్తి తన కుటుంబాన్నంతా పొట్టన పెట్టుకున్న యీ ఆసుపత్రిని కళ్ళలో నీళ్ళు నింపుకుని "మేమంతా కష్టపడి సంపాదించిన ఫలాన్ని మీరెలా అనుభవిస్తున్నారో చూశారా? స్వరాజ్యంకోసం త్యాగంచేసి రక్తంచింది. మేమంతా ఆనాడు స్వాతంత్ర్యం సంపాదించి పెట్టాం. ధానికి ఫలితంగా యువకులైన మీరంతా ఏం చేశారు? ఇదిగో ఇట్లా తగలబెట్టారు దేశాన్ని."[19] అని ఎత్తి పొడుపు మాటలు, అతనిలోని బాధను, ఆవేశాన్నిచూసిన మధుకి మత్తు వదలినట్లు కొత్త సత్యాలు ఎదురైనట్లు అనిపిస్తుంది. కాని అతను చెప్పడంలో తప్పులేదని భావిస్తాడు. భాధ్యతతో మెలగాలన్నది. అతని హృదయాంతరాళాలలో ఉన్న ఆవేదన.

హౌస్‌సర్జన్ నవలలో విశ్వ విఖ్యాత శాస్త్రవేత్త, బయోకెమిస్ట్రీలో ఆచార్యపదవి అలంకరించిన ప్రొపెసర్ హోల్డెన్ కేన్సర్ వ్యాధితో పీడింపబడి మరణించకమునుపే తన శరీరాన్ని ప్రజల ఉపయోగార్థం వాడుకో వచ్చునని దత్తంచేస్తాడు. చనిపోయిన తరువాత ఆయనశరీరానికి ఎటాప్సీ చేస్తుంటే ఎన్నో అవయవాలను ఇంచుమించు ఇరవై భాగాలను కేన్సర్ తినివేయడం చూచి మధు చలించిపోతాడు. మధు పాదాలజీ మ్యూజియంకు వెళ్ళగా అతనిలో వేదాంతధోరణి కనిపిస్తుంది. మానవ జీవితంలోని పరమ రహస్యాన్ని రోగాల కాలూకు అంతః స్వరూపాల్నిసామాన్యజీవి చూడలేని మానవ శరీరావయవాల్లో రోగ చిహ్నాలు చూసిన మధు వేధాంతి అవుతాడు. రకరకాల స్పెసిమెన్‌లు అందమైన గాజు

జార్లలో లోషన్‌లో భద్రం చేయబడిన అమూల్యమైన శిథిలాల్ని కూడా ధైర్యంతో చూడ గలుగుతాడు. ఇటీవల మరణించిన ప్రముఖ కథా రచయిత చాగంటి సోమయాజులు కూడా కాన్సర్‌తో ఉన్న శరీరాన్ని మరణించిన తరువాత వైద్య పరిశోధనకోసం యివ్వవలసిందిగా ముందే కోరిన విషయం గమనించదగింది.

ప్రొఫెసర్ హోల్డన్ తన రోగాన్ని గురించి ఉల్లాసంగా ఓ గేయం రాసుకున్న దాన్ని ఇక్కడ చూడవచ్చు.

"......I know that cancer often kill's
But so do cares and sleeping Pills
And it can hurt one till one sweats
So can bad teeth and unpaid dept."
......     ......     ......     ......     ......
My rectum is a serious loss to me
But I have a very neat colostomy"[20]

ఆపరేషన్ గురించి అతిరమ్యంగా చెప్పుకోవడం మనం గమనించవచ్చు. ప్రొఫెసర్ హోల్డేన్ వ్యాఖ్యల్ని చూసిన మధులాంటి వైద్యులు తన జీవితాన్ని, కళను పవిత్రతజ్ఞానంతో నింపుకుని వారికి సేవ చెయ్యాలని తన లక్ష్యంగా పెట్టుకోవడం అభినందనీయం. భావి తరాల వైద్యులకు హోల్డన్ జీవితచరిత్ర మరపురానిది.

'డాక్టరు భార్య' నవలలో జయచంద్రగా ఉదారస్వభావం, దాతృత్వాన్ని చూడవచ్చు. జయచంద్ర భార్య దమయంతి. పిల్లలులేని కారణంగా డా॥ నరేష్‌ను బాగా చూసుకుంటారు. తన ఇంటి దగ్గర పెంచుకున్న కుక్కలకు ఇంక్షన్ వేయు సమయంలో దమయంతికి చిన్నగాటు పడుతుంది. ఆమె రేబిస్ వ్యాధి సోకి కోమాలోకి వెళ్ళి మరణిస్తుంది. జయచంద్ర ఆ రెండు కుక్కల్ని తుపాకితో కాల్చి చంపేస్తాడు. జయచంద్రకు జాండీస్ సోకుతుంది. తను బ్రతకననుకొని తన యావదాస్తిని ఆసుపత్రి విస్తరణకై నరేష్‌కు సర్వహక్కులు కల్పిస్తూ వీలునామా రాసి మరణిస్తాడు. జయచంద్ర పేదలకు సహాయపడేందుకు భూరివిరాళం ఇవ్వడంలో అతనిలోని దాతృత్వగుణం తెలుస్తుంది. తత్ఫలితంగా జయచంద్రా మెమోరియల్ ఆసుపత్రి అవతరిస్తుంది.

'న్యాయానికి అటూ - ఇటూ' నవలలో ప్రదీప్ కూతురు రాధ. డాక్టర్ అశోక్ రాధను పరీక్షించి ఎడమ కన్ను కేన్సర్‌తో బాధపడుతున్న ఆ పాప పరిస్థితిని తెలుసుకుంటాడు. కేన్సర్‌కు సంబంధించిన 'ట్యూమర్ హైలీమెలిగ్నెంట్' కావడంవల్ల ఎడమకన్నును తీసివేయాలంటాడు. డాక్టర్ అశోక్ అనుభవ గర్వంతో ఆత్మవిశ్వాసంతో రాధిక ఆపరేష్ పూర్తిచేస్తాడు. కేన్సర్ వున్న కంటికి బదులు కుడికంటికి ఆపరేషన్ చేసిన తరువాత అసలు విషయం బయట పడుతుంది. డాక్టర్ నిర్లక్ష్యం కారణంగా రాధ జీవితం శాశ్వతంగా అంధకార మవుతుంది. రాధకు మరో కన్ను ఆపరేషన్ చేస్తారని తెలుసుకున్న ఆ పసిపాప గుండెలు పగిలేలా విలపిస్తూ "నాకీ ఆపరేషన్ వద్దు. నేను చేయించుకోను. నా కీ లోకాన్ని చూడాలని వుంది. మీ అందర్నీ చూడాలని వుంది. నా బతుకుని చీకటి మయం చేసెయ్యకండి. నన్ను చూడనివ్వండి. నన్ను వెలుగును చూడనివ్వం డని"[21] ఏడుస్తుంది. ఆ పసిపాప హృదయ ఆవేదనను కరుణరసపూరితమైన ఈ సన్నివేశాన్ని రచయిత చక్కగా చిత్రీకరించారు. రాధ అంతరాత్మలోని ఆవదనను రచయిత "ఓ నిర్భాగ్యురాలయిన పసిపాపా! నీ నేత్రాలలో నీరు చిగు రించే అదృష్టం నీకు లేదు. నీ లేత గుండెలో ఎన్ని అగ్నిపర్వతాలయినా బద్దలవనీ ని బాధను, దుఃఖాన్ని అశ్రువులుగా మార్చుకునే హక్కు నీకులేదు. నీ గుండెకు మనసుకూ, కంటికీ వుండే ద్వారాలన్నీ, దారులన్నీ నిర్దాక్షిణ్యంగా మూసుకుపోయి నాయి"[22] అని అంటున్నారు. రాధకు పగలుకు, రాత్రికి తేడా తెలియదు. కన్నీటి చుక్క బయటకు రాలకుండా ఏడుస్తుంది. డాక్టర్ల నిర్లక్ష్యం కారణంగా రోగుల ఆవేదనను రచయిత వ్యక్తం చేయడం ముదావహం.

'కదిలే మేఘం' నవలలో దీర్ఘకాలిక వ్యాధిగ్రస్థులయిన ఇరువురి దీన గాధల్ని చూడవచ్చు. ముందుగా శ్రీకాంత హృదయ ఆవేదనను పరిశీలిస్తాం. డాక్టర్ హరిణి శ్రీకాంత అనే దీర్ఘవ్యాధిగ్రస్థురాలికి చికిత్స చేస్తుంది. శ్రీకాంత తన కుటుంబ దయనీయ పరిస్థితిని, తను పడే నరకయాతనను కన్నులారా చూసిన హరిణి ఆమెకు శాశ్వత పరిష్కారం చూపించాలని ఒక నిర్ణయానికి వస్తుంది. ఆ సమయంలో డా॥ మహేష్ అడ్డువస్తాడు. శ్రీకాంత హరిణితో 'అనుక్షణం నరక యాతన అనుభవిస్తూ మృత్యువును తలచుకొని చనిపోతూ రోజులు గడపటం కంటే ముందుగా చనిపోవడం నష్టం లేదని' అంటుంది. ఆమె డాక్టర్ల వృత్తి

ధర్మాన్ని గురించి "డాక్టర్ మీరు గొప్పవారు. డాక్టర్ వృత్తి ధర్మమేమిటి? రోగికి రోగాన్నుండి విముక్తి కల్గించడం, అలా చెయ్యలేనప్పుడు పరిష్కారం మేమిటి? ఆ రోగి కుళ్ళి కుళ్ళి రాని చావుకోసం ఎదురుచూస్తూ నికృష్టమైన జీవితం గడుపు తుంటే చూస్తూ కూర్చోవటమేనా? రోగికి ఆ రోగం నుంచి శాశ్వతమైన విముక్తి కలిగించడం నిజమైన మానవత్వం కాదా? డాక్టర్ నా మనసులో ప్రజ్వరిల్లుతున్న అగ్నిపర్వతాన్ని అర్థం చేసుకోండి. మీరు చేసేది గొప్ప శుభకార్యం. మిమ్మల్ని దేవుడు అభినందిస్తాడు. మీరు డాక్టరు మరో కంటికి తెలియనీయకుండా ఈ కార్యాన్ని నిర్వర్తించడం ఓ లెక్కలోనికి రాదు. నిద్రలోకి హాయిగా మత్తుగా దీర్ఘనిద్రలోకి నన్ను వెళ్ళనివ్వండి. మీరు అప్పుడే నిజంగా దైవస్వరూపులు అవు తారు"[23] అని ప్రాధేయపడుతుంది. జీవనగమనంలో శ్రీకాంతలాంటి రోగులు మన సమాజంలో ఎందరో బాధపడుతుంటారు. వారి మనసుల్లో బాధ బ్రతుకము అని కూడా తెలుస్తుంది. అలాంటి రోగులవల్ల కొన్ని మధ్యతరగతి కుటుంబాలు ఎలా చితికిపోతున్నాయో అని తెలియజేయడానికి శ్రీకాంత పాత్రను ప్రవేశపెట్టి నట్లు తెలుస్తుంది. ఆమె నోట హృదయవిదారకమైన మాటల్ని చెప్పించినందుకు రచయిత అభినందనీయులు. శ్రీకాంత ఆసుపత్రి నుండి డిచ్చార్చ్ అయి శాశ్విత పరిష్కారం కోసం ఆత్మహత్య చేసుకుంటుంది.

ఇదే నవలలో శ్రీకాంత లాంటి పాత్ర డాక్టర్ మహేష్ మానవత్వం మూర్తీభవించి ఎదుటివారిని పూర్తిగా అర్థం చేసుకోగల సహృదయుడు. జీవి తంలో ఎన్నో విషాద గాధల్ని తరచిచూసే మంచిమనిషి. దీర్ఘకాల రోగాల కార ణంగా నాశనమయిన కుటుంబాలు బ్రతికివుండి నిత్యం మరణాన్ని చవిచూసే రోగుల్ని మన సమాజంయందు చూస్తుంటాం. అటువంటివాళ్ళల్లో శ్రీకాంత తరువాత డాక్టర్ మహేష్‌ను ఇందులో చూడగలుగుతాం.

మహేష్ ఎం.బి.బి.యస్. చదివే రోజులో కాళ్ళుచేతులు పనిచేయకపోవడం జరుగుతుంది. కాని నిర్లక్ష్యం చేస్తాడు. డాక్టర్ హారిణితో పెళ్ళి జరుగుతుంది. శ్రీకాంతకు మెర్సీకిల్లింగ్ చేసే విషయంలో ఇరువురు మనస్పర్థలతో విడి పోతారు. మానసిక సంఘర్షణకు గురైన మహేష్‌కు ఆ వ్యాధి మరింత ఎక్కువై 'మైస్థేనియా గ్రేవిస్'కు గురి అవుతాడు. డాక్టర్ భార్గవ మహేష్‌కు ఆపరేషన్

చేస్తాడు. కారులో వెలుతున్న మహేష్‌కు మళ్ళీ అదే వ్యాధికి గురై ఆక్సిడెంట్ వల్ల 'క్వాడ్రిప్లీజియా'గా మారుతుంది. డాక్టర్ మహేష్ తను చనిపోవాలని ఎన్నో యుక్తులు పన్నుతాడు. మనిషి పూర్తిగా కదలలేకపోతాడు. శరీరంలో తల తప్ప మరో భాగం వున్నట్లు అతనికి అనిపించదు. తను అనుభవిస్తున్న నరకయాతన వల్ల మేజిస్ట్రేట్ ముందు తన ఆవేదనను ఇలా విన్నవించుకుంటాడు.

1. ఒక మనిషి జీవితంమీద విరక్తి పుట్టినప్పుడు యీ సొసైటీ ఎందుకు చావనివ్వదు.

2. కొన్ని నిరర్థకమైన జీవితాలు దేనికి?

3. బ్రెయిన్ డెత్ వచ్చాక ఆ జీవునికి ప్రయోజన మేముంది?

4. ఒక మనిషి తనకు ఈ జీవితం దుర్భరమైపోయినప్పుడు ఆ జీవితం నుంచి తప్పుకునే అధికార మతనికి ప్రసాదించరు?

5. ఆధ్యాత్మిక భావంతో శరీరాన్ని వదలిపెట్టే హక్కు మనిషికి వున్నప్పుడు రోగంతో చితికి చితికి కుళ్ళి కుళ్ళి నశిస్తోన్న శరీరాన్ని విడిచిపెట్ట డానికి ఎందుకు అనుమతించరు?

ఇలాంటి ప్రశ్నలు వేసిన తరువాత తనకు దయామరణాన్ని ప్రసాదించ మని కోరతాడు. "క్షణమొక యుగంగా గడుస్తోంది. ఈ శరీరాన్ని యీ హీనమైన జీవితాన్ని ఒక్క సెకను కూడా భరించలేకపోతున్నాను. నన్ను నేను తీవ్రంగా అసహ్యించుకుంటున్నాను. ఒక్క పెంథాల్ సోడియం తరువాత 'లీథల్ డోస్ ఆఫ్ మార్ఫిన్' చాలు నా జీవితం సమసిపోతుంది. ప్లీజ్ సార్ నా వంక దయగా చూడండి. నా గుండెలో చెలరేగే క్షోభను అర్థం చేసుకోండి. నాకు దయా మర ణాన్ని ప్రసాదించండి. ఒక పేషెంట్ యిన్‌క్యూరబుల్ పెయిన్‌తో బాధపడు తున్నప్పుడు డాక్టర్లు అతని జీవితాన్ని పొడిగించడం తప్ప అతని బాధను అతని అథమస్థితిని తగ్గించలేని నిస్సహాయస్థితిలో వున్నప్పుడు 'యిథనేషియా'ని ప్రసా దించడం ధర్మమని"[14] మనవి చేసుకుంటాడు. డాక్టర్ మహేష్ హృదయ ఆవేద నను విన్న మేజిస్ట్రేట్ ట్రీట్‌మెంట్ ఆపివేయమనగా మహేష్ కోమాలోకి వెళ్ళి మరణిస్తాడు.

ఇక్కడ రచయిత మహేష్ పాత్రను సృష్టించడంలో ఓ కొత్త విషయాన్ని చర్చించుకోవచ్చు. డాక్టరు అయిన మహేష్‌కు ఆ వ్యాధి యొక్క ఇబ్బందుల్ని తెలియజేయడానికి అవకాశం లభిస్తుంది. సమాజం నమ్మడానికి అవకాశం వుందని రచయిత అభిమతం. హృదయవిదారకమైన వాళ్ళ మాటల్ని శ్రీకాంత, డాక్టర్ మహేష పాత్రల ద్వారా చెప్పించడంలో వేణుగోపాలరావు కృతకృత్యులయ్యారని చెప్పుకోవచ్చు.

ఈ నవలలోని పలు అంశాల్ని చర్చించినట్లయితే మెర్సీకిల్లింగ్‌ను సమర్థించినట్లే తెలుస్తుంది. 'కదిలే మేఘాలు' ఎప్పుడో వర్షిస్తాయి. కదలని మేఘాలు ఎప్పుడు వర్షిస్తాయో మరి. కదిలే మేఘాలకు చలనం వుంది. కదలని మేఘాలకు ఆ చలనం లేదు.

కదిలే మేఘాలతో కూడివున్న ఆకాశం

కదులుతున్నట్లు కనబడుతున్న ఆకాశం

నిశ్చలంగా నింపుగా సాగిపోయే ఆకాశం.

### 3.8. వృత్తిపట్ల పలువురి సమూహాలు - అభిప్రాయాలు :

పురుషుడు ఏదన్నా సాధించాలంటే వెనుక స్త్రీ హస్తం తప్పక వుంటుంది. ఆమె అనుక్షణం భర్తకు కష్టకాలంలో చేదోడు వాదోడుగా వుంటుంది. డాక్టరుగారి భార్య నవలలో కథానాయిక సహజ. డాక్టర్ నరేష్ భార్య ఆడంబరాలకు అతీతమైంది. తనకు తాను బయిటపడి మాట్లాడే స్వభావి. డాక్టర్ నరేష్ ప్రయివేటు ప్రాక్టీసులో ఎదుర్కొనే లోటుపాట్లను, ఇబ్బందుల్ని సహజ తోడుగా నీడగా తన భర్తను అంటిపెట్టుకుని ముందుకు నడిపిస్తుంది. డాక్టర్ నరేష్ చిన్న ఇంటిని అద్దెకు తీసుకుని వైద్యవృత్తికి కావలసిన పరికరాల్ని, వస్తువుల్ని సమకూర్చుకుంటాడు. వైద్యవృత్తిలో మొదట డబ్బుమీద మమకారం వుండకూడదు మొదట పేరు వచ్చినట్లయితే దానంతట అదే వస్తుంది. ఒకవేళ రాకపోయినా మనకు సరిపోయేటంత డబ్బు వస్తే చాలంటుంది. సహజ తన భర్తకు భవిష్యత్తు మార్గాన్ని చూపిస్తూ ముందుచూపు కలిగిన స్త్రీగా కనిపిస్తుంది.

సహజ రోగులవిషయంలో తనకు తగిన సలహాలిస్తూ "పేషంట్స్ బాధల్ని అధికప్రసంగాలైనా వింటూ నటించాలి. ఎంతవరకు వినాలో అంతవరకే విని మిగతాది వింటున్నట్లు నటించండి. ముఖంలో కోపం విసుగు ప్రదర్శించవద్దు. చిరునవ్వు చెరగనివ్వద్దు. అయితే ఆ వినకపోవడాలు ముఖ్యమైన విషయాలు మిస్ అవకూడదు. మనం వినకపోవడంవల్ల పేషంటుకు హాని కలుగకూడదని"[25] అంటుంది. వైద్యవృత్తిలో ప్రవేశించే ప్రతిఒక్కరూ పాటించవలసిన ప్రథమ కర్తవ్యం.

సహజ రోగులపై తనకున్న సానుభూతిని వ్యక్తంచేస్తూ రోగులు అనవసరంగా అశ్రద్ధతో రోగాన్ని ముదరపెట్టుకొని వస్తుంటారు. తప్పు వాళ్ళదే అయినా మనమే సరిపెట్టుకొనిపోవడం మంచిదంటుంది. మనం పుట్టి పెరిగిన వాతావరణానికి మనస్తత్వాలకు, అపాయింట్‌మెంట్ సిస్టం కుదరదు. ప్రతి పనిని సులభంగా ఎదుర్కొంటే ఫలితం తప్పక దొరుకుతుందన్న అభిప్రాయం సహజలో కనిపిస్తుంది. కొందరు పేషంట్లు కృతజ్ఞత కూడా చెప్పుకోకుండా వెళ్ళిపోతుంటారు. డాక్టరు జీవితంలో ముక్యంగా తారసపడే సంఘటనల్లో అదొకటి. మందులకు అయిన ఖర్చు ఇవ్వకపోవడం కాకుండా కొందరు దుష్ప్రచారం చేస్తుంటారు. అటువంటి సమయంలో నిరాశపడకూడదు. ఇలా ఎన్నో విషయాల్ని సహజ చెప్పినప్పటికీ నరేష్ వైద్యవృత్తిలో నిరాశతోపాటు మానసికంగా కృంగిపోతుంటాడు. సహజ సున్నితహృదయుడైన తన భర్త మనస్తత్వాన్ని కనుగొని సముదాయిస్తూ ఇలా అంటుంది. "వైద్యవృత్తిలో చిత్తశుద్ధితో నిజాయితీగా వుండటమే ముఖ్యం కాని మరీ సెన్సిటివ్‌గా వుండకూడదు. అలా వుండటంవల్ల మానసికంగా మనం దెబ్బతినడమే కాక ఇతర పేషెంట్స్‌ని కూడా ట్రీట్ చెయ్యలేం .. డాక్టర్ తెలివితో మంచితనంతో లౌక్యంతో తనదంటూ ఓ ఇమేజ్‌ను ఏర్పరచుకోవాలి. అప్పుడే జీవితంలో సక్సెస్ అవుతాడు. మీ సాధక బాధకాల్ని అర్థం చేసుకునే గృహిణిగా వుండి మిమ్మల్ని ఓ ఉత్తమమైన డాక్టరుగా రూపొందించటానికి యిన్స్పిరేషన్ వుండాలన్న కోరికే బలీయంగా వుంది"[26] అంటుంది. సహజకు ముందుచూపులో ఉన్నత ప్రమాణాలకు రాచబాటవంటి అమూలమైన సలహాలిస్తుంది. లౌక్యంగల స్త్రీమూర్తిగా మనకు దర్శనమిస్తుంది. ఉత్తమ డాక్టరుగా తీర్చిదిద్దడానికి ఆమె తపన ఏమిటో ఊహించవచ్చు.

'న్యాయానికి అటూ-ఇటూ' నవలలో ప్రదీప్ మంచి పేరున్న లాయరు. చిత్తశుద్ధితో చేస్తే ఏ వృత్తిలోనైనా అనంత విలువలు తీసుకురావచ్చునని అతని విశ్వాసం. ప్రదీప్‌కు తన భార్యద్వారా డాక్టర్ మాలతి పరిచయం అవుతుంది. ప్రదీప్ రెండు వృత్తుల్లోని నిజాయితీని గురించి "మాలతీ మా ప్రొఫెషన్‌మీద ఎంత గౌరవమో, మీ ప్రొఫెషన్ మీద అంతే గౌరవం. ఒక లాయరు కేసును పట్టేముందు అందులోని బలాబలాల్ని, లోపాల్ని బేరీజు వేసుకోవాలి. చేపట్టాక ప్రాణం దారపోసయినా సరే నిజాయితీగా పని చెయ్యాలి. కేసు గెలవచ్చు పోవచ్చు. కాని నిజాతీలో లోపం వుండకూడదు. అలాగే ఒక డాక్టరు కేసు చేపట్టాక ప్రతి కించడానికి సర్వశక్తులూ ధారపొయ్యాలి. అతని ప్రయత్నలోపంవల్ల కేసు ఫెయిల్ కాకూడదు"[27] అనంటాడు. అందుకు మాలతి వైద్యవిధానం గురించి మాత్రమే ప్రదీప్‌తో "వైద్యవిధానం ప్రముఖ వాణిజ్యంగా మారటం యెంతవరకు సబబా అని జీవించడంకోసం, సౌకర్యవంతమైన జీవితంకోసం ఏ వృత్తి చేసేవారయినా సంపాదించుకోవాలి. తమ భవిష్యత్తు, పిల్లల భవిష్యత్తుకోసమైనా సంపాదించుకోవాలి, ఒప్పుకుంటాను. కాని అది పారిశ్రామికరంగంగా మారటం ఔచిత్యముందా? అలా చెయ్యటం ఓ జీవిత లక్ష్యంగా ఆ వైద్యవృత్తికి సంబంధించిన వాళ్ళు చేస్తే సమంజసమేనని సరిపెట్టుకోవచ్చునని కేవలం ఓ పారిశ్రామికవేత్త వాణిజ్య పద్ధతుల్లో యిది నిర్వహించడంవల్ల నా మనస్సుకు సమాధానం చెప్పుకోలేకపోతున్నానని"[28] చెప్తుంది. పెద్దపెద్ద ఆసుపత్రులు పేదప్రజలకు ఉపయోగకారి కాలేకపోతున్నాయని మాలతి మాటల్లో అంతరార్థం. ఆసుపత్రులు ప్రముఖ వాణిజ్య కేంద్రాలుగా మారకూడదన్న ఉద్దేశంతో రచయిత మాలతి పాత్రద్వారా స్పష్టం చేస్తున్నారు.

వృత్తుల్లో వుండే స్వతంత్ర ఆలోచనలకు వాటి ఆచరణకూ ఒక సిద్ధాంతం కోసం పోరాటం వుంటాయని రచయిత నమ్మకం. రోగుల ప్రాణం ఎంతో అమూల్యమైంది. రోగులు తమ ప్రాణాల్ని డాక్టర్ల చేతుల్లో వుంచుతారు. ఏ కారణం చేతనయినా డాక్టరు నిర్లక్ష్యంగా ప్రవర్తిస్తే రోగి జీవితం అంతం కావడమో, అంధకారం కావడమో జరుగుతుంది. వృత్తులన్నిటిలో వైద్యవృత్తి చాలా పవిత్రమైంది. ఉన్నతమైంది. చాలా బాధ్యతతో కూడుకున్నది. వైద్య వృత్తిలో మచ్చ రాకూడదన్న ఉద్దేశంతోనే రచయిత యీ నవలను రాసినట్లు తెలుస్తుంది.

ప్రదీప్ భార్య శ్వేతబిందు ప్రసవవేదనలో డాక్టరు మైథిలి నిర్లక్ష్యం కారణంగా మరణిస్తుంది. డాక్టరుగా మాలతి ఆమె చనిపోవడానికి ఆస్కారంలేదని కొన్ని అనుమానాల్ని బయటపెడుతుంది. ఆలోచనా విధానంకన్నా ఎన్నో రకాలుగా ఆలోచించి రోగిప్రాణం తీయడంకన్నా సరియైన పద్ధతిని అనుసరిస్తే రోగికి న్యాయం చేయగలుగుతారన్నది డాక్టరుగా గుర్తించుకోవలసిన విషయం అని చెప్తుంది.

ప్రదీప్ తన భార్య డాక్టర్ మైథిలి నిర్లక్ష్యం కారణంగా చనిపోయిందని వ్యథ చెందిన ప్రదీప్ మైథిలితో "తన వృత్తిని ఆధారం చేసుకుని చాలా నిజాయితీగా పని చేస్తాం. ఒక్కోసారి కేసులో ఓడిపోతాం. ప్రాణాలతో చెలగాటం అనవద్దు. ప్రాణాలతో సంబంధం వున్న వృత్తి అను. అంతమాత్రంచేత ఆ పరిస్థితిలో వున్న వ్యక్తిని దోషిగా నిర్ణయించటం దుడుకుతనమౌతుంది. ఒక మహోన్నతమైన వృత్తిలో వున్న వ్యక్తిని దోషిగా నిర్ణయించి శిక్షించటంకన్నా అతని నిజాయితీని, ఎదుర్కొన్న సమస్యల్ని అర్థం చేసుకోవటంలో హుందాగా వుంటుందేమో"[29] అని అంటాడు. తన సర్వస్వం అన్న తోడుని పోగొట్టుకుని మానవత్వంతో విశాలదృక్పథంతో మాట్లాడటం ఆశ్చర్యం వేస్తుంది. విచక్షణా జ్ఞానం లేకుండా ఇతరులమీద నిందమోపడం మంచిది కాదని అతని అభిమతంగా విశాలదృక్పథానికి గీటురాయిగా వుంది.

డాక్టర్ నరేష్ ప్రయివేటుగా తన వృత్తిని కొనసాగిస్తాడు. వృత్తిధర్మం పట్ల తన భార్య సహజమాటల్ని, ఆలోచనల్ని అమలుచేస్తాడు. నరేష్‌కు ఆరోగ్యం సరిగాలేనప్పుడు ఓ పిల్లవాణ్ణి తీసుకురాగా తన పరిస్థితిని చెప్పేసరికి మరోచోటుకి తీసుకువెళ్ళరు. ఆ పిల్లవాడు మరణిస్తాడు. డాక్టరు నిర్లక్ష్యంవల్ల తన కొడుకు చనిపోయాడని కోర్టులో క్రిమినల్ కేసు పెడతాడు. నరేష్ కోర్టుల చుట్టూ తిరగవలసి వస్తుంది. సహజ మాత్రమే సాక్షిగా వుంటుంది. లాయరు సహజను ప్రశ్నలతో విసిగించడంతో ఆవేశం తెచ్చుకుని "వృత్తిధర్మం కోసం సుఖాన్ని, ఆరోగ్యాన్ని, సర్వస్వాన్ని త్యాగం చేస్తున్న ఓ ఉత్తముని అపకతవక ప్రశ్నలతో వేధించడమా? ఒక బిజీడాక్టరు ఎంత పనిని, స్వధర్మాన్ని వదులుకొని కోర్టుచుట్టూ తిరుగుతున్నాడో....మీ వాయిదాలతో ప్రతిదానికి ఏదో రూలు చూపించి చేసే కాలయాపనతో సంవత్సరాలకు సంవత్సరాలు మమ్మల్ని హింసిస్తూ మీరు నవ్వు

కుంటూ అంతఃవాస్థ బాధ కాలం విలువ తెలిసినట్లు నిర్లక్ష్యంగా వెళ్ళిపోయే మీకు ఒక మహోన్నత వ్యక్తి వ్యక్తిత్వం, ఉత్తమత్వం ఏమర్థమౌతుంది. ఆయన చేయని తప్పుకు ఊరులు తిట్టారు. హింసించారు. బాధించారు. అయినా మేము కోర్టులకు ఎక్కలేదే . ఉత్తమత్వం గురించి మాకు హితబోధ చేస్తారా"[10] అని అంటుంది. సహజ లాయర్ల వృత్తిపట్లగల అలసత్వాన్ని, కాలయాపనన్ని గుర్తు చేస్తుంది. వైద్యవృత్తిలో అటువంటి కాలయాపన చేయటానికి వీలులేదని ఆమె మాటల్లోని అంతరార్థం. సహజ మాటల్లో తపన, ఆశయసాధన, సజీవత్వం కనిపిస్తుంది. వారి వారి వృత్తిధర్మాన్ని గురించి, వృత్తి పరమార్థాన్ని గురించి గుర్తు చేయడం ప్రతివృత్తికి వర్తించేట్లుగా వుంది.

'న్యాయానికి అటూ-ఇటూ'లో ప్రదీప్ ఆవేదనతోపాటు వైద్యుల వృత్తిలోని నిర్లక్ష్యాన్ని తెలియజేసి తన అభిప్రాయాన్ని పారిశ్రామికవేత్త అయిన ఉపేంద్రతో "నాభార్య యీ ఆసుపత్రిలో చనిపోయినా. ఆ అగ్నిజ్వాలలు నాలో నిరంతరం రగులుతున్నా మీమీద, మీ ఆసుపత్రిమీద, మీ డాక్టర్లమీద, నమ్మకంతో రాధను ఇక్కడే చేర్పించాను. మీరంతా కలసి నా నమ్మకాన్ని వమ్ముచేశారు. మానవత్వపు విలువల మీద నాకున్న అపారమైన విశ్వాసాన్ని పెకలించి పారేశారు. ఓ పౌరుడిగా, లాయర్‌గా నావిధి. కోర్టులో కేసుపెడుతాను. నరేష్‌పై క్రిమినల్ కేసు మీనెగ్లిజెన్స్ కొన్ని జీవితాలను తారుమారు చేసెయ్యగల మీ నెగ్లిజెన్స్ ప్రపంచానికి తెలియజెప్పాలి.. .......మీమీద క్రిమినల్‌గా ప్రొసీడ్ అవుతాను. మిమ్మల్ని సమాజంముందు దోషులుగా నిలబెడుతాను" అని ఆవేశంతో ఆవేదనతో ప్రతిజ్ఞ చేస్తాడు. ప్రయివేటు ఆసుపత్రులు వాణిజ్య కేంద్రాలుగా మారుతున్నాయనడానికి న్యాయానికి అటూ - ఇటూ నవలచక్కటి ఉదాహరణ. ప్రజల ఆశల్ని వమ్ముచేస్తూ రోగులతో ఆడుకుంటున్నారన్నది లాయర్ ప్రదీప్ మాటల్లోని అంతరార్థం.

డాక్టర్‌గారి భార్య నవలలో సహజ కోర్టులో చెప్పిన సమాధానాలు పత్రికా విలేకర్ని ఆకర్షిస్తుంది. డాక్టరు వృత్తిపట్ల వున్న గౌరవం ఆ వృత్తియొక్క అనుభూతి, సమాజాన్ని గురించి, రేప్‌కేసుల్ని గురించి, ప్రస్తుత వైద్యరంగం వున్న తీరుతెన్నుల్ని గురించి, అనవసరమైన ట్రీట్‌మెంట్ గురించి, డాక్టరు నైతిక ప్రవర్తనను గురించి, డాక్టరు భార్యగా, అనుమానం, అసూయల్ని గురించి

అతిసహజంగా సమాధానాలు ఇస్తుంది. వృత్తిని గురించి "ప్రతి వృత్తికీ ఓ పరమావధి వుంటుంది. అది సాధించడానికి దోహదం చెయ్యటంలో యీ అసంతృప్తులన్నీ ఎగిరిపోతాయి. స్పందించే హృదయం వుండాలిగాని అనుభూతుల నిలయం డాక్టరు వృత్తి. ఇది సరిగ్గా అర్థం చేసుకోలేనివాళ్ళు, డాక్టర్ల విలువ తెలుసుకోలేని వాళ్ళు. .... డాక్టర్లుపడే కష్టంలో వాళ్ళు సంపాదించే డబ్బు మూడవవంతుకూడా వుండదు. ... ఒక ప్రాణిని కాపాడటానికి వాళ్ళు తీసుకునే శ్రద్ధ, జాగ్రత్తలు, డివోషన్ – ఆ వైశిష్ట్యం మీరు మరచిపోరు[32]" అని అంటుంది. డాక్టర్ల శ్రద్ధను, నిజాయితీని సహజ గుర్తు చేస్తుంది.

## 3.9. కోర్టు వ్యవహారాలు :

'డాక్టరుగారి భార్య' నవలలో నరేష్ తనకున్న జాండీస్‌వ్యాధి కారణంగా ఒక పిల్లవాణ్ణి చూడలేక పోతాడు. నరేషభార్య వేరే డాక్టర్ని చూసుకొమ్మని చెప్పి పంపివేస్తుంది. తన కొడుకు మరణం నరేష్ నిర్లక్ష్యంవల్ల జరిగిందని బనాయించడంవల్ల ప్రతివాదిగా కోర్టుకు వెళ్ళవలసి వస్తుంది. అలస్యంగా వెళ్ళినప్పుడు మేజిస్ట్రేట్ మందలించడంకూడా జరుగుతుంది. డాక్టరు కావడం వల్ల టైముకు వెళ్ళడానికి కుదరక పోవడం అనేది తప్పిదం కాదని మనకు తెలిసినా కోర్టుదృష్టిలో డాక్టరునే తప్పు అని అనిపిస్తాడు. నరేష్ తరఫున లాయర్ ఇలా వాదించగలుగుతాడు. "డాక్టర్ నరేష్ ఒంట్లో తీవ్ర అస్వస్థతగా వున్నందు వల్లనే ఆ కేసుకు అటెండ్ కాలేక పోయాడనీ, అప్పటికే వేరే డాక్టరు దగ్గరకు వెళ్ళమని సలహాచెప్పినా వాళ్లు వెళ్లక మూర్ఖత్వంతో టైము వృథాచేసుకున్నారనీ, ఏ డాక్టరయినా అనారోగ్యంతో బాధపడుతూ లేవలేని స్థితిలో వున్నప్పుడు అంతకన్నా ఏమీ చెయ్యలేడని జరిగినదానికి బిడ్డ తల్లిదండ్రులకన్నా తనకు ఎన్నోరెట్లు బాధగావున్నా — ఆ పరిస్థితిలో నిస్సహాయుడినని ప్రశ్నలద్వారా జవాబులు చెప్పించాడు."[33] లాయర్ వృత్తిలో వున్నటువంటివాడు డాక్టరు వృత్తిలోని లోసుగుల్ని అర్థంచేసుకున్న లాయర్‌గా అక్కడ రచయిత దర్శనమిస్తాడు. నరేష్‌కి వ్యతిరేకంగా కేస్ ఎగ్జామ్ చేసిన లాయర్ సారాంశాన్నికూడా గమనించవచ్చు. డాక్టరు అశ్రద్ధవల్ల, ఇంటికివెళ్ళి కాళ్ళావేళ్ళాపడి ప్రాధేయపడ్డా కనికరించక పోవడం పిల్లవాడు చనిపోయాడు. అతని భార్య అమానుషంగా

ప్రవర్తించారని వాదిస్తాడు. లాయర్‌కి నరేష్‌కి జరిగిన క్రాస్ ఎగ్జామ్‌లో కొన్ని 'లా'పాయింట్లను రచయిత చూపగలిగాడు.

లాయర్ : "మీ శరీరపరిస్థితి చాలా హీనంగా వుందని ఏ డాక్టరుతో నయినా సర్టిఫికేట్ యిప్పించగలరా ?

నరేష్ : నేను డాక్టర్ని కాబట్టి నేను చెప్పగలను నా శరీరం గురించి.

లాయర్ : వేరే డాక్టరుతో సర్టిఫికేట్ యిప్పించగలరా ?

నరేష్ : అప్పుడు వాళ్లు లేనప్పుడు, చూడనప్పుడు వారిని సర్టిఫికేట్ అడగటం భావ్యంకాదు కాబట్టి యిప్పించలేను.

లాయర్ : మళ్ళీ అదేప్రశ్న.

నరేష్ : కొన్ని ప్రశ్నలకు వ్యాఖ్యానం లేకుండా జవాబు చెప్పలేం. అలా చెబితే వేరే అర్థం రావ్వటానికి అవకాశం వుంది, కాబట్టి అదే నా సమాధానం అది నాకు భావ్యంగా తోచలేదు. కాబట్టి ఇప్పించలేను" అని అంటాడు.

నరేష్ మాటల్లో నిజాయితీతోపాటు క్రాస్ ఎగ్జామ్‌కు సరియైన సమాధానాలు ఇవ్వగలుగుతాడు. ఇరువైపుల న్యాయమున్నట్లు మాట్లాడగలిగిన రచయితను అభినందించాలి. చేయి తిరిగిన రచయిత ఔదార్యం కోర్టు వ్యవహారాల్లో కనిపిస్తుంది.

'న్యాయానికి అటూ-ఇటూ'లో డాక్టర్ల నిర్లక్ష్యం కారణంగా రాధ అంధురాలవుతుంది. రాధ తండ్రి హనుమంతరావు ఆసుపత్రిపై క్రిమినల్ కేసు వేస్తారు. ఆసుపత్రివైపు నుంచి లాయర్ ప్రతాపరావు, రాధవైపు నుంచి ప్రదీప్‌కి వాదోపవాదాలు జరుగుతాయి. ప్రతాపరావు క్రాస్ ఎగ్జామ్ చేసిన పూర్తి సారాంశాన్ని మేజిస్ట్రేట్‌తో ఇలా తెలియజెప్పాడు. "రాధ రెండు కళ్ళల్లోను కాన్సర్ వుంది కాబట్టి ఏ కన్ను ముందు చేయాలన్నది టెక్నికల్ పాయింట్. దానికి యితరమైన విలువలూ నేరారోపణా అంటగట్టడం అర్థంలేదు. డాక్టర్ అశోక్ తన కన్వీనియన్స్ కోసం మొదట కుడికంటికి ఆపరేషన్ చేశాడు. ఈ కేసు మొదటి నుండి పరిశీలిస్తే కేవలం ద్వేషంతో పెట్టబడినదని తెలుస్తుంది. ప్రదీప్ కేసు నిరూపించటంతో

ఘోరుణంగా ఫెయిలయ్యాడని మరోసారి మనవి చేస్తూ తన అర్గ్యుమెంట్ ను ముగిస్తున్నా[35]నంటాడు. రాధకు జరిగిన అన్యాయాన్ని కప్పిపుచ్చడానికే ప్రతాప రావు యిలా మాట్లాడతాడు.

లాయర్ ప్రదీప్ మేజిస్ట్రేట్ ముందు తన ఆర్గ్యుమెంటును యిలా విన్న వించుకుంటాడు. "యువరానర్ ఈ ప్రపంచంలో పరిస్థితులు ఏమయినా కానీ, వ్యక్తిగతంగా యెంత ఉన్నతశ్రేణికి చెందినవాడయినా కానీ చాలా విషయాల్లో ఎంత ఉత్తముడయినా కానీ అతడొక నేరం చేసినప్పుడు శిక్షార్హుడు. డాక్టర్ అశోక్ నిర్లక్ష్యవైఖరివల్ల ఒక చిన్నారి బాలిక జీవితం చిన్నాభిన్నమైపోయింది ... రాధ కుడికన్ను ఆరోగ్యంగా వున్నట్లు డాక్టర్ గురునాథ్ ధృవీకరించాడు. డాక్టర్ అశోక్ అదే విధంగా ధృవీకరించాడు. అయితే దురదృష్టవశాత్తు ఆయన పొరపాటున కుడికంటిని తీసివేయడం జరిగింది. ఉపేంద్రతో ఎన్నో కుయుక్తులు ప్రదర్శించాడు శ్యాంప్రసాద్ సంతకం ఫోర్జరీ చేయబడింది. ఈ కేసుని తారు మారు చేయడంకోసం సుబ్బుల్ని వినియోగించి హనుమంతరావు ఇంటిలోని ఓ.పి. చీటీని మాయంచేశారు. ఆమె స్వయంగా ఒప్పుకొంది. ఇన్ని నిజాలు చాటి చెప్తున్నా ఇందులోని లోపం లేదనటం, రెండు కళ్లలోను ట్యూమర్ ఉందని బుకాయించడం హాస్యాస్పదంగా వుంది. డాక్టర్ అశోక్ నిస్సందేహంగా నెగ్లిజెన్స్ వల్ల ఈ కేసు పాడుచేశాడు. దిస్ ఈజ్ ఎ ఫాక్ట్".[36] అని ముగిస్తాడు.

మేజిస్ట్రేట్ వాదప్రతివాదనలు విన్న తరువాత తన తీర్పులో డాక్టర్ అశోక్ ను దోషిగా ప్రకటిస్తారు. కాని రాధకు పోయిన కళ్ళు తీసుకురాలేరు. డాక్టర్ అశోక్ విధివైపరీత్యంవల్ల కారు ప్రమాదంలో అంధుడు కావడం జరుగుతుంది. ప్రదీప్ ప్రయత్నాలన్నీ వ్యర్థమవుతాయి. అశోక్ చేసిన నిర్లక్ష్యానికి గుర్తుగా విధి అతనిని కూడా అంధుణ్ణి చేస్తుంది.

'కదిలే మేఘం' నవలలో డాక్టర్ మహేష్ దీర్ఘకాల వ్యాధిగ్రస్తుడు. మొదట 'మైస్తేనియా గ్రేవిస్'కు గురి అవుతాడు. ఆ తరువాత ఆ వ్యాధి 'క్వాడ్రీ ప్లీజియా'గా మారుతుంది. మహేష్ తను చనిపోవాలని ఎన్నో కుయుక్తులు పన్ను తాడు. తను అనుభవిస్తున్న నరకయాతనకు శాశ్వత విముక్తి కలిగించమని తన గోడు అంతా చెప్పుకుంటాడు. మహేష్ డాక్టరు కావడంవల్ల ఆ వ్యాధులవల్ల

మనిషి జీవితం ఎలా వుంటుందో వివరిస్తాడు. తనకు దయామరణాన్ని ప్రసాదించమని మనవి చేసుకుంటాడు. మహేష్ భార్య హారిణి భర్త మాటలకు వ్యతిరేకంగా తీర్పు చెప్పమని ప్రాధేయపడుతుంది. కాని డాక్టర్ మహేష్ మాటల్లోని మానవత్వాన్ని చూసి జడ్జిమెంట్ తీర్పు వివరిస్తాడు. "ఒక రోగి ఆరోగ్యం నుండి కోలుకునే అవకాశం లేనప్పుడు రోగమతన్ని పిచ్చి ఒప్పచేస్తున్నప్పుడు అతనికి బాధాకరంగా మారినప్పుడు అతనా జీవితం నుండి విరక్తి కోరుకుంటున్నప్పుడు అతనికి మెర్సీకిల్లింగ్ ప్రసాదించడంలో తప్పులేదని నిర్ధారణకు వచ్చాను. కాని ఇండియన్ లీగల్ కోడ్‌లోని ఏ యాక్టుప్రకారం కూడా అతనికి మెర్సీకిల్లింగ్ యిచ్చే అధికారం నాకులేదు. అందుకని అతని అభీష్టం నెరవేర్చడానికి అన్నిరకాల ట్రీట్‌మెంట్ ఆపు చెయ్యమని ఉత్తర్వు చెయ్యటమైనది"37 అని తన తీర్పుని ప్రకటిస్తాడు.

3.10 సాంఘిక దురాచారాలు :

నేటి సమాజంలో నానాటికి సాంఘిక దురాచారాలు పెచ్చుపెరిగిపోతున్నాయి. ముఖ్యంగా దీనుల్ని మోసం చేయడం, తమ కామదాహాన్ని తీర్చుకోవడంవంటి దురాచారాలు బాగా ప్రబలిపోయాయి. డాక్టరుగారి భార్య నవలలో నాట్యమయూరాల సుమాంజలి దీనగాథను మనం చూడవచ్చు. బ్రతుకుతెరువుకోసం సుమాంజలి ఆర్టిఫిషియల్ లెగ్‌తో నాట్యంచేస్తుంది. ఓర్వలేని కొందరు దుండగులు ఆమెను ఇబ్బంద పెట్టడంవల్ల కాలు మరలా దెబ్బతింటుంది. డాక్టర్ నరేష్ ఆమెకు వైద్యం చేస్తాడు. సుమాంజలిని అంటిపెట్టుకుని వున్నవాళ్లే ఆమె శీలాన్ని కాజేయాలని చూడటంవల్ల ఆత్మహత్యా ప్రయత్నం కారణంగా కాపాడబడుతుంది. డాక్టర్ నరేష్ మాటలకు ఆమె ఆత్మహత్య తప్ప వేరు శరణ్యంలోంచి కొత్త జీవితాన్ని సృష్టించుకొని కాళ్ళు లేకపోయినా నా కాళ్ళమీద నిలబడగలిగి తిరిగి జీవితం నందనవనం కాబోతున్న తరుణంలో తిరిగి విధి తిరగబడింది. ఎవరైతే నన్ను ఉద్ధరిస్తారనుకున్నానో వాళ్ళు శరీరమే గాని మనస్సు లేనివారని తెలిసింది. ప్రకృతితో పోరాడ నగ్గుకు వస్తోన్న నాపైన సానుభూతి చూపించాల్సింది పోయి నన్ను కబళించి వారపెట్టడానికి శత్రువులు....అందుకే విరక్తి పుట్టింది....మంచితనంలోని బలహీనతల్ని స్వార్థానికి వాడుకునే నికృష్టం తృప్తికోసం సానుభూతి

అనే పదానికి అర్థం తెలీని యీ సమాజం దాహం తీర్చడం కోసం నా జీవితం యింకా యింకా దుర్భరంగా వుండాలి"[38] అని తన మనసులోని మానసిక క్షోభను, ఆవేదనను తెలియజేస్తుంది. సుమాంజలి ఆశయాలకు అనుగుణంగా కొత్త ఆశల్ని చిగురింపజేయగలుగుతాడు. ఇందులోనే అంజనను ఆమె భర్త అనుమానించి సమాజంమీద నిర్దాక్షిణ్యంగా వదలి వెళుతాడు. బ్రతుకుతెరువుకోసం నరేష్ దగ్గర చేరుతుంది. నర్స్‌గా తన వృత్తి ధర్మాన్ని పాటిస్తుంది. అంజన ఒంటరిగా వెళుతుంటే కొందరు దుండగులు ఆమెకు మైకం ఇచ్చి అమానుషంగా అనుభవించి విసిరివేయబడ్డ విస్తరవలె నడిరోడ్డుపై తోసివేళుతారు. అంజన గర్భవతి అవుతుంది. ఎవరికీ తెలియకుండా నరేష్ ఆమె గర్భాన్ని టెరిమినేట్ చేస్తాడు. అంజన ఆవేదనతో మాట్లాడుతుంది. అంజనలాంటి వ్యక్తులు మన సమాజంలో ప్రతిరోజూ అనేకమంది వంచింపబడుతున్నారు. సమాజ మార్పు కోసం రచయిత అభిమతంగా మరోచోట ఓ స్త్రీ బిడ్డలు లేని కారణంగా స్వాములు దగ్గరకు వెళుతుంది. దొంగస్వాములవారు భర్తలేని సమయంలో ఆమెను తన దానిగా చేసుకోవడంవల్ల గర్భవతి అవుతుంది. మూఢుడైన ఆమె భర్త ఇదంతా స్వాముల దయ అని అందరితో చెప్పుకుని వాపోతాడు. ఆమె మాత్రం దొంగ సన్యాసికి పుట్టిన బిడ్డ అని మానసికంగా కృంగుతుంది. ఆ బిడ్డకు ఫిట్స్ వస్తుంది ఆమె జరిగినదంతా డాక్టర్ నరేష్‌కు విన్నవించుకుంటుంది. తన కర్తవ్య పరాయణత కారణంగా పిల్లవాడు బ్రతుకుతాడు. ఆ సమయంలో ఆ తల్లి ముఖంలో ప్రతిఫలించిన భావాలు 'సృష్టిలో ఏ కళాప్రక్రియ చిత్రించలేదంటాడు. ఆమెను మానసికంగా మార్పుకు తీసుకువచ్చి మూఢవిశ్వాసాలకు దూరంగా వుండేటట్లు చెయగలుగుతాడు. పైన కనబరచిన ముప్పుర్ని డా॥ నరేష్ సంఘంలో తలెత్తుకు బ్రతికేటట్లు చేయగలుగుతాడు. మానవతా దృక్పథంతో తనవృత్తి ధర్మానికి న్యాయం చేకూర్చగలిగాడు.

### 3.11 వైద్యవృత్తిపై వైద్యుల అభిప్రాయాలు :

హౌస్‌సర్జన్ నవలలో మధుబాబు విజ్ఞానతృష్ణ ఏమిటో తెలుస్తుంది. ఉత్తరంలో తనకొడుకు వృద్ధిలోకి రావాలని ఆ తల్లి కాంక్షిస్తుంది. తనలోవున్న విజ్ఞానతృష్ణను గుర్తించిన తోటి డాక్టరు మృదులతో "నేనో ఉన్మాదిని. నా తృష్ణకు అంతులేదు. ఎక్కడెక్కడో పోవాలని ఏవేవో ఘనకార్యాలు చేయాలని

ఉద్రూతలూగి పోతున్నాను. విశ్వ జనీనత్వంకోసం నామనసు తహతహ లాడుతోంది. .... పిచ్చిగా తిరగాలి. వెర్రిగా చదవాలి. మెడిసన్‌లో విపరీత మైన అనుభవాన్ని సంపాదించాలి. అది ఇంత పురోగమిస్తున్నా యిప్పటికే అంతంకాదు కదా, మొదలుకూడా తెలియని సమస్యలు లక్షోపలక్షలున్నాయి. వాటిలో కొన్నిటినైనా నేను తెలుసుకోగలిగి పరిష్కరించగలగాలి" అనడం వైద్యవిద్యార్థిగా స్వతంత్ర ఆలోచనలతో పైకి రావాలన్న ద్యాస, పట్టుదల, జిజ్ఞాస అతనిలో ప్రస్ఫుటం అవుతాయి. ప్రేమానురాగాలకు మధు ఇందులో అతీతుడుగా కూడా కనిపిస్తాడు. తటస్థపడే ప్రతి సంఘటనకు ప్రతి అనుభవానికి అంతువుండదు. అది ఓ సంఘర్షణ, ఓ తపస్సు, ఓ యజ్ఞంలాంటిదని తెలుసు కుంటాడు. మెడిసన్ గురించి "మెడిసన్ ఓ మహాసముద్రం. లోతు తెలియని, అవతలి ఒడ్డు తెలియని మహాసముద్రం. దాని లోతుపాతులు తెలుసుకోకుండా బయట నిలబడి చూస్తే అందులో యీదటం చాలా తేలికనిపిస్తుంది. లోనికి దిగామా ఆ ఆరాటానికి అవధులు లేవు. విజ్ఞానంమీద తృష్ణేగాని తృప్తి అనేది లేదు. మెడిసన్ ! మెడిసన్ !! అవే నా కలలు. అదే నా ఆశాజ్యోతి అదేనా జీవిత పరమావధి"[40] అంటాడు. వృత్తిపట్ల ఎంత వ్యామోహం కలిగి ఏదో నేర్చుకోవాలన్న తృష్ణ అతనిలో అడుగడుగునా కనిపిస్తుంది. పై అంశాల్ని మెడిసన్ విద్యార్థులు గుర్తించుకోవాలి.

'హౌస్ సర్జన్'లో మధుబాబు సభ్యత సంస్కారాన్ని మనం చూడ గలుగుతాం. హౌస్‌సర్జన్ చేరిన కొద్ది రోజులకే మృదుల బాగా పరిచయం అవుతుంది. మృదుల మధుని ప్రేమిస్తుంది. కాని మధు అంత ఎత్తుకి ఎదగలేక పోతాడు. అలసిపోయిన మృదుల నిద్రావస్థలోకి వెళుతుంది. ఆమె పైట స్థాన భ్రంశం పొందివుండగా అది చూసిన మధుకి 'నిషా కలిగించే కావ్యకన్య'లా వుందనుకుంటాడు. మధుకి ఆమెను అలా వదలి వెళ్ళడం ఇష్టంలేక ఆమె పైట యధాస్థానంలో కప్పి వెళుతాడు. తను చేసింది మంచిపనా? కాదా? మధుకి సందేహం వస్తుంది. డాక్టర్లకు నిద్ర ఎంత విలువైందో స్వానుభవంవల్ల తెలిసిన వాడు ఆమెను గౌరవనీయస్థితిలో వుంచి వెళ్ళటం తన కర్తవ్యమని భావిస్తాడు. సభ్యమానవుడిగా తనకు తోచిన కర్తవ్యాన్ని నెరవేర్చి అక్కడనుండి వెళ్ళి పోతాడు. నిషాకలిగించే కావ్యకన్యలా వుందని మధు అనుకున్నప్పటికీ అతని

మనసు చలించకుండా వెళ్ళగొండుకు ఎంత నిగ్రహం పాటించాలన్నది గమనార్హం. ఇది చాలా ఉదాత్తమైన దృశ్యంగా మనం భావించుకోవచ్చు. రచయితను ఆ సన్నివేశం కల్పించినందుకు అభినందించాలి. మధుబాబుని మృదుల ప్రేమిస్తుంది. ఆమె అంత ఎత్తుకు ఎదగలేని మధుతో "రాగద్వేషాలకు అతీతుడివి. ఈ కాల్పనిక జగత్తులో నీలాంటి వ్యక్తితో పరిచయం కావడం నా అదృష్టంగా భావిస్తున్నాను. ఓ డాక్టరు మహాశయా! సూర్యకాంతికి తళతళలాడే నీటి బిందువులో ఎంత స్వచ్ఛత వుందో, నీ మనోహరమైన చిరునవ్వులో అంతటి స్వచ్ఛత ఆకర్షణ వున్నాయి, ఎప్పుడూ నీ చదువు, పంటకాతనం, రోగులు. జబ్బులు యిదే నీ జీవిత పరమావధి. ఇదే నీకు శాశ్వతానందం—ఓయీ జడుడా! కొంచెం నీలోని బండరాయిని బ్రద్దలు కొట్టి ఆలోచించు. వెన్నెల నా పరిమళాన్ని కూడా నీ హృదయంలో నింపుకో నిగ్రహంతో, సహనంతో సర్వం నీకు ధారపోయడానికి సిద్ధంగా వున్న రాకుమారిని నన్ను పరిగ్రహించావని అడిగితే ఏమంటావు?"[41] అని అడుగుతుంది. అందుకు మధుబాబు "నీ ప్రేమకు, నీ అనురాగానికీ, నీ దయకు కృతజ్ఞుణి. కాని నేను అథముణ్ణి. నీకు సమఉజ్జీని కాదు. ఏడంతస్తుల మేడమీద సుకుమారంగా విహరించే బంగారు పిచ్చిపిల్లవు నీవు. కటిక నేలలో కష్టంగా. దుమ్ములో శ్రమపడే శ్రామికుణ్ణి నేను. ఇంత కరుణ తగదు. ఆ కరుణ కిరణాలు నామీద ప్రసరింపబడే యోగ్యత, అర్హత నాకు లేవు"[42] అని అంటాడు. మృదుల మాటలకు సమాధానంగా మధు మాటల్లో విజ్ఞానమనే తృష్ణవల్ల రాగద్వేషాలకు దూరంగా వుంటాడు. పైగా తనకున్న లేమిని ఆమెకున్న కలిమిని గుర్తు చేస్తున్నాడు. పేదవాడు కాశ్యం అందని కొమ్మలకు నిచ్చెన వేయని స్వభావిగా తెలుస్తుంది.

## సూచికలు :

| నెం. | రచయిత | నవలపేరు | పుట |
|---|---|---|---|
| 1. | వేణుగోపాలరావు కొమ్మూరి | 'హౌస్ సర్జన్' | 28 |
| 2. | ,, | | 121 |
| 3. | ,, | 'డాక్టరుగారి భార్య' | 102 |

| నెం. | రచయిత | నవల పేరు | పుట |
|---|---|---|---|
| 4. | ,, | ,, | 216 |
| 5. | ,, | 'భారతి' | 148 |
| 6. | ,, | 'హౌస్ సర్జన్' | 65 |
| 7. | ,, | ,, | 93 |
| 8. | ,, | ,, | 81 |
| 9. | ,, | ,, | 180 |
| 10. | ,, | ,, | 43 |
| 11. | ,, | ,, | 156 |
| 12. | ,, | 'భారతి' | 129 |
| 13. | ,, | ,, | 235 |
| 14. | ,, | డాక్టరుగారి భార్య | 244 |
| 15. | ,, | ,, | 119 |
| 16. | ,, | ,, | 153 |
| 17. | ,, | 'హౌస్ సర్జన్' | 81 |
| 18. | ,, | ,, | 137 |
| 19. | ,, | ,, | 189 |
| 20. | ,, | ,, | 123 |
| 21. | ,, | 'న్యాయానికి అటూ-ఇటూ' | 145 |
| 22. | ,, | ,, | 116 |
| 23. | ,, | 'కదిలే మేఘం' | 183 |
| 24. | ,, | ,, | 274 |
| 25. | ,, | 'డాక్టరుగారి భార్య' | 15 |
| 26. | ,, | ,, | 21 |
| 27. | ,, | 'న్యాయానికి అటూ-ఇటూ' | 11 |
| 28. | ,, | ,, | 24 |
| 29. | ,, | ,, | 52 |
| 30. | ,, | 'డాక్టరుగారి భార్య' | 191 |

| నెం. | రచయిత | నవల పేరు | పుట |
|---|---|---|---|
| 31. | ,, | 'న్యాయానికి అటూ-ఇటూ' | 123 |
| 32. | ,, | ,, | 196 |
| 33. | ,, | ,, | 186 |
| 34. | ,, | ,, | 189 |
| 35. | ,, | ,, | 273 |
| 36. | ,, | ,, | 278 |
| 37. | ,, | ,, | 280 |
| 38. | ,, | 'డాక్టరుగారి భార్య' | 241 |
| 39. | ,, | 'హౌస్ సర్జన్' | 218 |
| 40. | ,, | ,, | 63 |
| 41. | ,, | ,, | 214 |
| 42. | ,, | ,, | 215 |



# కుటుంబ జీవిత చిత్రణ - 3

## 1. కుటుంబ స్వరూపం :

ప్రాక్తన మానవుడు ఆటవిక దశ నుండి నాగరిక జీవితానికి అలవాటుపడు తున్న దశలో కుటుంబ జీవనం ప్రారంభమైందని చెప్పవచ్చు. నా ఇల్లు, నా ఆస్తిపాస్తులు అనే భావాలే కుటుంబ వ్యవస్థకు పునాది. ఈ కుటుంబ వ్యవస్థకు స్త్రీ, పురుషులు మూలస్తంభాలు. వీరిరువురు ఒకరిపై ఒకరు ప్రేమను కురిపించుకుని కలిసి జీవించాలను కోవడంతో కుటుంబ జీవనం ప్రారంభమౌతుంది. మానవుడు తన సహజ వాంఛలను సక్రమ పద్ధతిలో తీర్చుకొనే ఉత్తమ సాధనమే కుటుంబం.

ఆనందమయమయిన కుటుంబజీవనం ఆ కుటుంబీకుల శక్తిసామర్థ్యాల మీదనే ఆధారపడి వుంటుంది. కుటుంబం అన్న తరువాత ప్రతి వ్యక్తి స్వార్థాన్ని విడనాడి నిస్వార్థంతో బాధ్యతల్ని గుర్తించి ప్రవర్తించడం, సద్విమర్శలను స్వీక రించి తమకు తాముగా సంస్కరించుకోవడం ఎంతో అవసరం, చిన్నవాళ్ళ అవస రాలను గుర్తించి వాటిని తీర్చడానికి ప్రయత్నించడం, వాత్సల్యంతో అభిమా నించడం తెలుసుకోవాలి. వచ్చిన సమస్యలను కష్టాలను సామూహికంగా ఎదు ర్కొని పరిష్కరించుకోవడం, నిబ్బరమైన ఆలోచనలు కలిగివుండటం ఎంతో మంచిది. ఆపదలో, అనారోగ్యంలో, శైశవదశలో, వృద్ధాప్యంలో అండగా నిలిచేది కుటుంబమే. కుటుంబ జీవితం కేవలం వంశాన్ని నిలిపే సాధనమే కాదు, సంస్కృతి, సంప్రదాయాలనూ వ్యాపింపచేసే వాహిక.

ఉమ్మడికుటుంబం చిన్న సమాజం వంటిది. ఇందులో ప్రతి ఒక్కరూ సభ్యత్వం కలిగివుంటారు, ఉమ్మడికుటుంబానికి తండ్రి మకుటంలేని మహారాజు కుటుంబంలో విభిన్న మనస్తత్వాలు గల మనుషులుంటారు. వారి పద్ధతుల్లో కూడా వైవిధ్యముంటుంది, అందువల్ల అప్పుడప్పుడు వారి మధ్య సంఘర్షణ తలెత్తే ప్రమాదం కూడా ఉంది. ఎలాంటి ఒడుదుడుకులు వచ్చినా సర్దుకుపోయే మనస్తత్వం గలవాళ్లు కొంతమందైనా వుండటంవల్లనే ఉమ్మడికుటుంబ వ్యవస్థ ఇంకా కొద్దిగానైనా నిలబడివుంది.

డాక్టర్ కొమ్మూరి వేణుగోపాలరావుగారు కుటుంబ జీవితాన్ని చిత్రించే నవలలు కూడా అనేకం రాశారు. వాటిలోని కుటుంబవ్యవస్థకు, కుటుంబ జీవితానికి సంబంధించి కుటుంబ సభ్యుల సంబంధబాంధవ్యాలు గురించి చర్చించడమే ఈ అధ్యాయం యొక్క ప్రధానోద్దేశం.

డాక్టర్ కొమ్మూరి వేణుగోపాలరావుగారు వ్రాసిన కుటుంబ జీవితచిత్రణ సంబంధించిన నవలలు 'పెంకుటిల్లు', 'ఈ దేశంలో ఒక భాగమిది', 'ఒకే రక్తం ఒకే మనుషులు', 'మేడలో నీడలు', 'విషవలయం', 'సూర్యుడు దిగిపోయాడు' 'హారతి', 'భారతి' నవలలు.

## 2. కుటుంబ జీవిత కథాసన్నివేశాలు

### 2.1. పెంకుటిల్లు :

**మధ్య తరగతి కుటుంబానికి చెందిన వ్యక్తి చిదంబరం.** అతని భార్య శారదాంబ. వీరికి ఆరుమంది సంతానం. చిదంబరం ఇంటి బరువు బాధ్యతల్ని పట్టించుకోడు. పేకాట వ్యసనపరుడు కావడం. పెళ్ళీడు వచ్చిన పిల్లల విషయాల్ని గుర్తు చేసిన శారదాంబతో 'చూద్దాం, చేద్దాం' అనేవాడు. భర్త మాటలకు ఎదురు చెప్పలేని శారదాంబ తనలో తానే కుమిలిపోతుంది.

చిదంబరం పెద్దకొడుకు నారాయణ. బి.ఏ. వరకు చదివివుంటాడు. సాహిత్యాభిమాని. తన రచనల్ని సాహితీలోకానికి పరిచయం చేస్తూ వచ్చిన ఆదాయంతో కుటుంబాన్ని పోషిస్తూంటాడు. చిదంబరం రెండో కొడుకు ప్రకాశం పట్నంలో 'లా' చదువుతుంటాడు. తన ఇంటి ఆర్థిక పరిస్థితుల దృష్ట్యా డబ్బు అందకపోవడంతో ఇబ్బందిపడుతుంటాడు. చిదంబరం పెద్దకూతురు అన్నపూర్ణ. బంధువుకిచ్చి పెళ్ళి చేస్తాడు. రెండో కూతురు రాధ. ప్రకాశం ఆర్థిక ఇబ్బందుల్ని అర్థం చేసుకుని తన స్నేహితురాలైన ప్రమీల దగ్గర అరువు చేసి పంపేది. రాధ తన కోర్కెల్ని వ్యక్తపరచేదికాదు. శారదాంబ ప్రకాశం పరిస్థితిని అర్థం చేసుకొని కన్నీళ్ళు పెట్టుకోవడం తప్ప ఏమీ చేయలేని నిస్సహాయురాలు. ఆస్తి వ్యవహారాల వల్ల చిదంబరం తమ్ముడు పట్నం వెళ్ళిపోతాడు.

పట్నంలో చదువుతున్న ప్రకాశం రామారావు ఇంటిలో అద్దెకుంటాడు. ఆయన ఒక్కగానొక్క కూతురు శకుంతల. ప్రకాశం పరిస్థితిని శకుంతల అప్పు

దప్పుడు గమనిస్తుండేది. ఒకసారి ఆకలితో స్పృహతప్పి పడిపోయిన ప్రకాశంను శకుంతల కాపాడుతుంది. తన కుటుంబ దయనీయ పరిస్థితిని చెప్పుకుంటాడు ప్రకాశం. వాళ్ళు చేస్తున్న సహాయానికి మానసికంగా నలుగుతూ ఇబ్బందిపడతాడు. శకుంతల ప్రకాశంను ప్రేమిస్తుంది. ప్రకాశం మాత్రం కులం అడ్డు వస్తుందన్న భయంతో ప్రేమజోలికి పోడు. అక్కడ తండ్రి కూతుళ్ళ సానుభూతిని మాత్రం పొందగలుగుతాడు. రాధను మాత్రం ఆనందరావు ప్రేమిస్తాడు. కుటుంబాల్లో తార తమ్యం వున్నందువల్ల రాధ తిరస్కరిస్తుంది. రాధ ప్రమీలతో సినిమాకు వెళ్ళి వచ్చినందుకు ముసలమ్మ 'ఆడపిల్లలు కట్టుదిట్టాలతో వుండాలని' సుందలిస్తుంది. చిదంబరం చిన్నకొడుకు వాసు తోటి విద్యార్థులతో 'గోలీ ఆట' ఆడి పావలా పోగొట్టుకోగా తన అన్న జేబులో పావలా దొంగిలిస్తాడు. తను దొంగతనం చేశానన్న భయంతో పరుగెత్తుతుండగా కారు ప్రమాదంలో ఒక కాలు పోగొట్టు కుంటాడు. ఆపరేషన్ ఖర్చులకుగాను రాధ స్నేహితురాలు ప్రమీల ఆదుకుంటుంది. వాసు పరిస్థితిని చూసి ఇంటిలోని అందరూ దుఃఖిస్తారు. శకుంతల తండ్రి రామారావు గుండెపోటులో మరణిస్తాడు. ప్రకాశం ఓదార్పు మాటలతో శకుంతల మనసు కుదుటపడుతుంది. ఇద్దరి మనసులు కలవడంతో రిజిష్టర్ పెళ్ళి చేసుకుంటారు. కానీ ప్రకాశం ఇంటికి మాత్రం తెలియనివ్వడు.

చిదంబరం తల్లికి పెరాలసిస్ స్ట్రోక్ రావడంతో ఇంటిలో ఒకరికి యిద్దరు అవిటివాళ్ళవుతారు. ఇల్లు గడపడం మరీ కష్టమౌతుంది. ముసలమ్మ కోరికమేరకు సుగుణతో నారాయణ పెళ్లి జరుగుతుంది. సుగుణ ఇంటి పరిస్థితుల్ని ఆకళింపు చేసుకొని బాధ్యతగల కోడలిగా మసలుకొంటుంది. నారాయణకు బ్యాంకులో ఉద్యోగం వస్తుంది.

సుగుణ తన భర్తను పుట్టింటికి తీసుకెళుతుంది. నారాయణ కుటుంబాన్ని సుగుణ తండ్రి గోవిందరావు విభజించడాన్ని ప్రయత్నిస్తాడు. గోవిందరావు కుటిల బుద్ధిని అర్థం చేసుకున్న నారాయణ తగిన విధంగా బుద్ధిచెప్పి వస్తాడు.

చిదంబరం తన కొడుకు నారాయణ పెళ్లికోసం పరంధామయ్య దగ్గర అప్పు తీసుకుంటాడు. గంగాధరం తన కూతుర్ని చిదంబరం కొడుక్కి తీసుకోనన్న కారణంగా పరంధామయ్యను ఎక్కుపెట్టి చిదంబరంపై కోర్టులో దావా వేయిస్తాడు.

అందువల్ల గంగాధరంపై చిదంబరం ఛేయి చేసుకోగా మూడు సంవత్సరాలు జైలుశిక్ష పడుతుంది.

చిదంబరం పెద్దకూతురు అన్నపూర్ణ పురుడుకోసం పుట్టింటికి వస్తుంది పిల్లవాణ్ణి ప్రసవించి చనిపోతుంది. భార్య చనిపోయిన వ్యథతో ముకుందరావు కుమిలిపోతాడు. రాధ తన బావకు ధైర్యం చెప్తుంది. తను అండగా నిలబడా లనుకుంటుంది.

రాధ స్నేహితురాలయిన ప్రమీల భర్త శ్రీపతి, కుటిలబుద్ధితో ఇంటికి రప్పించి రాధ శీలాన్ని అపహరిస్తాడు. రాధ ఆత్మహత్యాప్రయత్నం చేసుకోబోగా ఆనందరావు కాపాడతాడు. అయినా రాధను పెళ్ళాడతానంటాడు. రాధ మౌనం వహిస్తుంది. తన బావ పరిస్థితి అర్థం చేసుకున్న రాధ ముకుందరావును పెళ్ళి చేసుకుంటుంది.

పట్నం వెళ్లిన శ్రీపతికి అనుకోకుండా ప్రకాశం కనిపించి ఇంటి దగ్గర పరిస్థితుల్ని వివరిస్తాడు. అప్పటికే శకుంతల ప్రోత్సాహంతో ఇద్దరూ ఇంటికి వెళతారు. ఇంటిలో అందరూ వారిని సాదరంగా ఆహ్వానిస్తారు. చిదంబరం కూడా జైలు నుండి తిరిగి వస్తాడు. ప్రకాశంకు కూడా ఉద్యోగం రావడంతో ఆ ఇంటి ఆర్థిక పరిస్థితులు మరింత మెరుగుపడతాయి.

## 7.2. ఈ దేశంలో ఒక భాగమిది :

రంగారావు శారదమ్మ దంపతులకు నలుగురు సంతానం. రంగారావుగారిది సమిష్టి కుటుంబం. ఈయన వృత్తిరీత్యా వైద్యుడు. రంగారావు పెద్దకొడుకు కుమార్ కూడా తండ్రితోబాటు వైద్యవృత్తిని స్వీకరిస్తాడు. రంగారావు ఎవరితో నైనా నిర్మొహమాటంగా మాట్లాడే వ్యక్తి. ఇంటిలో జరిగే ప్రతి విషయాన్ని గమనిస్తుంటాడు. స్వశక్తిమీద పైకి వచ్చానన్న తృప్తి, ధీమా, గర్వం వుండేవి. అతని భార్య శారదమ్మ భర్త మాటలకు ఎదురు చెప్పక మౌనం వహించేది.

రంగారావు పెద్దకొడుకు కుమార్. సున్నిత మనస్తత్వం గల మనిషి. జీవితంలో కారిన్యం అలవాటు చేసుకుంటాడు. కుమార్ భార్య ప్రభావతి. ఈమె

ఇంటిలోని మనుష్ని అర్థం చేసుకోకుండా మాట్లాడేది. చీటికి మాటికి పిల్లలపై చేయిచేసుకోవడం అలవాటు. 'ఈ కొంపలో కాపురం చేయటం నావల్ల కాదని' విసుగుతనంగా మాట్లాడేది. కుమార్ సముదాయింపు మాటలకు మీరు మారి పోయారు అంటుంది. ఉమ్మడి కుటుంబాల్లోని మాధుర్యాన్ని చవిచూడాలన్న కుమార్‌కు తన భార్యవల్ల నిరుత్సాహపడతాడు.

రంగారావు రెండో కొడుకు హరి. బ్యాంక్ ఉద్యోగి. విలాసపురుషుడు. ప్రతివిషయానికీ తండ్రి దగ్గర సంజాయిషీ చెప్పుకోవాలని బాధపడేవాడు. ఇతని భార్య విమల. పిల్లల వ్యవహారాల్లో తోడకోడళ్లరువురూ మనస్పర్థలు తెచ్చుకుంటారు.

రంగారావు మూడో కొడుకు సుధాకర్. ఇంటి వ్యవహారాల్ని తను గమనిస్తున్నప్పటికీ పట్టించుకోడు. ఎవరికీ సలహా చెప్పడు. తన దగ్గర డబ్బున్నా లేకపోయినా ఒకేమాదిరిగా కాలం గడుపుతాడు. విచిత్ర మనస్తత్వం కలవాడు. రంగారావు కూతురు సుజాత. సుజాత భర్త భాస్కర్ మామ ఇంటిలో మకాం పెడతాడు. అతని ప్రవర్తనకు ఇంటిలోని వాళ్ళు చులకనగా చూస్తారు. విమల మేనమామ గోవిందరావు కూడా ఆ ఇంటికి వస్తాడు. వీరిద్దరి కారణంగా ఆ కుటుంబంలో కలతలు మరింత ఎక్కువవుతాయి. బంధువులు ప్రవర్తించవలసిన తీరు వారిలో మచ్చుకైనా కనిపించదు. ఇంటిలో పనిపాటల్లో తోడికోడళ్ళ మనస్పర్థలు నానాటికీ ఎక్కువవుతాయి. పిల్లలమీద చేయిచేసుకున్న ప్రభావతికి కుమార్ మంచి మాటలు చెప్తాడు. తోడికోడళ్ళ వ్యవహారంలో ప్రభావతి విసిగి ఆత్మహత్యకు సిద్ధమవుతుంది. అయితే కుమార్ కాపాడుకుంటాడు. చివరకు కుమార్ కుటుంబంలో కలతలు రావడానికిగల కారణాల్ని తెలుసుకుంటాడు. ఇరవైనాలుగు గంటలు ఎదురెదురుగా ఉంటూ ఒకరితోపాటు యింకొకరు యిలా సంవత్సరాల తరబడి కళ్ళయెదుట కనబడటంవల్లనే ఉమ్మడి కుటుంబాలు విడిపోతున్నాయని గ్రహిస్తాడు.

సుధాకర్‌ను రాధ ప్రేమిస్తుంది. తను ప్రేమవిషయాన్ని బయటపెడుతుంది. ఇంటిలోని మనుషుల మనస్తత్వాల్ని తెలుసుకున్న సుధాకర్ రాధను తిరస్కరిస్తాడు.

పెట్టల నిర్ణయాలు, కట్టుబాట్లు సంప్రదాయాలు మొదలయిన విషయాల్ని గురించి రాధకు వివరిస్తాడు.

కుమార్ తన తండ్రి అనుమతి లేనిదే షికారుకు రానంటాడు. ఇరువురికీ మాటామాటా పెరగడంతో ప్రభావతిమీద చేయి చేసుకుంటాడు.

ఇంటిలోని అల్లకల్లోలాలు రంగారావుని బాగా కలవరపరుస్తుంది. అందర్నీ సమావేశపరచి ప్రతివారిలో సన్నగిల్లుతున్న కారణాల్ని తెలుపుతూ 'ఒక కప్పుకింద పదిమంది జీవించడానికి సమకట్టినప్పుడు స్వపరభేదం మనుషుల్లో రానివ్వకూడదు. నువ్విలా అన్నావు, అలా అన్నావు అని అనుక్షణం అనుకుంటూ ఒక చూరుకింద జీవించటం అసాధ్యం, అహాస్యం. అందుకే మనం మూడు కుటుంబాలుగా విడివడి పోతున్నాం' అని చెప్పి రంగారావు తన కుటుంబాన్ని మూడు భాగాలుగా విభజిస్తాడు.

**2 3. మేడలో నీడలు :**

విశ్వనాథరావు. లలితమ్మ దంపతులకు నలుగురు పిల్లలు. రామం, సుందరం. సుభద్ర, ఆశ. విశ్వనాథరావు తన పిల్లల్ని క్రమశిక్షణతో పెంచి పెద్ద చేస్తాడు. రామం విశాఖలో చదువుకునేటప్పుడు సహవిద్యార్థిని అయిన మనోరమ రామంను ప్రేమించి పెళ్లి చేసుకుంటుంది. మనోరమ అత్తమామల్ని గౌరవంగానే చూస్తుంది. కానీ మనోరమకు ఆ ఇంటి వాతావరణం ఆమెకు యిరుకనిపిస్తుంది. జీవితంలో మానవత్వంకోసం ఆరాటపడుతుంది.

విద్యార్థినిగా ఉన్నప్పుడే మనోరమకు మంచి కళాకారిణిగా పేరుండేది. అందుకే పెళ్ళయ్యాక కూడా నటజీవితాన్ని కొనసాగించాలనుకుంటుంది. అయితే రామం మనోరమ కోర్కెను తిరస్కరిస్తాడు. ఇరువురికీ మనస్పర్థలు పెరగడంతో రామం మనోరమపై చేయిచేసుకుంటాడు. మనోరమ ధైర్యం కూడగట్టుకొని ఆ రోజు రాత్రి ఇంటిలో పనిచేస్తున్న వయసు కుర్రాణ్ణి వెంటబెట్టుకొని వెళ్లిపోతుంది. మనోరమ ప్రవర్తన మూలంగా ఆ యింటి గౌరవ మర్యాదలు వీధిపాలవుతాయి.

మనోరమ యింటినుండి వెళ్ళిపోయాక విశ్వనాథరావు తన గత జీవితం తలుచుకుంటాడు. విశ్వనాథరావు ఫారెస్ట్ రేంజర్‌గా ఉన్న కాలంలో గుర్రుపులు

ప్రోత్సాహం కారణంగా విధవ కనకవల్లితో అక్రమసంబంధం ఏర్పడుతుంది. తత్ఫలితంగా వసంతబాల పుట్టింది. కనకవల్లి కూడా యావదాస్తిని విశ్వనాథరావు పేర రాసి కూతుర్ని తీసుకొని పట్నం వెళ్ళిపోతుంది.

విశ్వనాథరావు రెండో కొడుకు సుందరం. విశాఖలో ఇంజనీరింగ్ చదువు తుంటాడు. అతని భార్య జ్యోతి. సుందరం తనకు టి.బి. వ్యాధి వున్నందున ఇంటిలో ఎవ్వరికి తెలియనీయకుండా అదే వూరిలో వేరే కాపురం పెడతాడు. సుందరంను అతని తల్లిదండ్రులు అపార్థం చేసుకుంటారు.

విశ్వనాథం తన చెల్లెలుకొడుకు ప్రసాద్‌ను చేరదీసి బి.ఎ. వరకు చదివిస్తాడు. తన కూతురు ఆశాను ప్రసాద్‌కు ఇవ్వకుండా ఓ ఉన్నతకుటుంబంలో యిచ్చి పెళ్ళి చేస్తాడు. ఆశా భర్త రాఘవరావు. కట్నం ఎక్కువ తీసుకురానందుకు రాఘవరావు ఆశాను హింసిస్తాడు. ఆశ ఆ బాధను తట్టుకోలేక పుట్టింటికి వచ్చే స్తుంది. ఇంటిలో ఎవ్వరికీ చెప్పుకోదు.

విశ్వనాథరావు పెద్దకూతురు సుభద్ర. తన ఇద్దరి పిల్లల్తో పుట్టింటికి వస్తుంది. రాఘవరావు ఆశకు రాసిన ఉత్తరం ద్వారా తన చెల్లెలు ఎంత చిత్రవధ అనుభవించిందో తెలుసుకుంటుంది. సుభద్ర ఇద్దరి పిల్లలకు 'మశూచి' సోకడంతో మరణిస్తారు. పిల్లలు పోయిన వ్యథతో సుభద్ర భర్త అయిన ముకుందరావు మార్ఫియాకు అలవాటుపడతాడు.

మనోరమ పట్నం చేరుకున్న తరువాత స్నేహితురాలు అయిన లీల ఆమెకు ఆశ్రయమిస్తుంది. మనోరమ పరిస్థితిని తెలుసుకున్న ఆశ మనిషికి 'స్వేచ్ఛ వుండకూడదని, రాజీపడకపోతే అశాంతి మిగులుతుందని' హితవచనాలు పలుకుతుంది. ఓ లక్షాధికారిచేత మానభంగానికి గురికాబోయి తప్పించుకు వచ్చే స్తుంది. మనోరమ పశ్చాత్తాపంతో పుట్టినిల్లు చేరుతుంది.

వ్యాపార నిమిత్తం వెళ్తున్న రామంకు రైలుప్రయాణంలో వసంతబాల పరిచయం అవుతుంది. కనకవల్లి కూతురు వసంతబాల. వసంతబాల పరిచయం ప్రేమగా మారుతుంది. ఆమె తన చెల్లెలు అని రామంకు తెలియదు.

మనోరమ తన తండ్రి కోరికప్రకారం తన భర్త కాళ్ళమీద పడి క్షమించమని ప్రాధేయపడుతుంది. 'నేను తప్పు చేయలేదని పశ్చాత్తాపంతో కుమిలి

పోతున్నానని' కడుదీనంగా అడుగుతుంది. రామం తిరస్కరిస్తాడు. తన కోడలికి జరుగుతున్న అన్యాయాన్ని భరించలేకపోతుంది లలితమ్మ. ఆమె కోడల్ని మన్నించమని కోరుతుంది. లలితమ్మ తన మాటల్ని కూడా తిరస్కరించినందుకు తన యాంత్రిక జీవితాన్ని తలచుకొని ఆత్మహత్యా ప్రయత్నం చేసుకోబోగా మనోరమ కాపాడుతుంది.

రామం ఇంటికి వస్తుంది వసంతబాల. తరువాత కనకవల్లి కూడా అక్కడికే వస్తుంది. మేడపై రామం, వసంతబాల మాటల్ని వింటాడు. తన కూతురు వసంతబాల అని అనడంతో విశ్వనాథరావు నిశ్చేష్టుడవుతాడు. కనకవల్లికి కూడా విశ్వనాథరావు కొడుకని తెలుసుకుని స్పృహ కోల్పోతుంది. ఆ సంఘటనల్ని చూసిన వసంతబాల రామంను తిరస్కరిస్తుంది. రామం మనోరమను మన్నిస్తాడు. విశ్వనాథరావు తన కూతురు ఆశా పరిస్థితిని తెలుసుకుని తన మేనల్లుడికి ఆశా నిచ్చి పెళ్ళి చేస్తాడు.

విశ్వనాథరావు మనసులో "ఈ బంధం, మమకారం లేకపోతే ఎన్ని కుటుంబాలు చితికిపోయేవో" అని ఒక్కసారి మననం చేసుకుంటాడు.

**2.4 ఒకే రక్తం—ఒకే మనుషులు :**

కొమ్మూరి వేణుగోపాలరావు, 'ఒకే రక్తం - ఒకే మనుషులు' నవలలో మేనరికపు పెళ్ళిళ్ళలో జరిగే అనర్థాలు శుణ్ణంగా పరిశీలించి తన రచనకు మెరుగులు దిద్ది తుదిరూపం ఇవ్వగలిగాడు.

పుండరీకాక్షయ్య, వైకుంఠంగార్ల కుటుంబాలు కొన్ని తరాలుగా మేనరికపు పెళ్ళిళ్ళకు అలవాటుపడి వుంటాయి. పుండరీకాక్షయ్య అనసూయమ్మ దంపతులకు పదమూడుగురు పిల్లలు. పుండరీకాక్షయ్య చిన్నకొడుకు మన్మథరావు, చిన్న కూతురు గిరిజ. వైకుంఠం పెద్దకూతురు సామ్రాజ్యం. ఆమె తన పెళ్ళికి అయిష్టతను తెలుపుతుంది. అందుకు కారణం చిన్నప్పుడు పెరాలసిస్ రావడం, రెండు కాళ్లు పడిపోవడం. పెద్దల బలవంతంతో సామ్రాజ్యంను మన్మథరావు కిచ్చి పెళ్ళి చేస్తారు. అలాగే పుండరీకాక్షయ్య చిన్నకూతురు గిరిజను తన చెల్లెలు కొడుకు అయిన సుందరంకిచ్చి పెళ్ళి చేస్తారు.

గిరిజ స్నేహితురాలు సరోజ. సరోజ మేనమామ డాక్టర్ కిషోర్. సరోజ కిషోర్‌ను పెళ్ళి చేసుకోవాలనుకుంటుంది. ఆమె కోరిక తెలుసుకున్న కిషోర్ మేనరికపు వివాహాలవల్ల కలిగే అనర్థాల్ని సరోజకు ఉత్తరం ద్వారా తెలియజేస్తాడు. ఆ ఉత్తరాన్ని గిరిజ చదువుతుంది. అప్పటి నుండి గిరిజ తన జీవితాన్ని, ఈ కుటుంబాన్ని ఎలా ముందుకు తీసుకెళ్ళాలని ఆలోచిస్తుంది. గిరిజ తన భర్తతో సినిమాకు వెళ్ళగా స్నేహితురాలు 'ఏం అన్నయ్యా' అనడంతో ఆ మాట రోజూ ప్రతిధ్వనిస్తుంది. 'ఇరువురిలో ప్రవహిస్తున్న రక్తం ఎన్నో తరాల నుండి వస్తూ కొత్త రక్తాలకు చోటు ఇవ్వకపోతున్న సత్యాన్ని తెలుసుకుంటుంది. గిరిజకు మరికొన్ని ఆధారాలుగా ఇంటిలో పిల్లల్ని పరిశీలించడం ద్వారా తెలుస్తుంది.

ఆలోచనం వత్తిడి ఫలితంగా గిరిజ అత్తవారింటికి వెళ్ళనని మొండికేస్తుంది. వదిన సామ్రాజ్యం గిరిజతో 'మన చుట్టూవున్న వాతావరణం ఎదిగినట్టుగా మసలుకోవాలని ప్రాధేయపడుతుంది.' గిరిజ విడాకులు తీసుకుంటానన్నందుకు అనసూయమ్మ కూతుర్ని కొడుతుంది. సామ్రాజ్యం కోరిక మేరకు అత్తవారింటికి వెళుతుంది. భర్తను దగ్గరకు రానీయకుండా జాగ్రత్తపడుతుంది. అందువల్ల గిరిజ భర్త సుందరం నాటకాల వ్యామోహంతో ఇంటిపట్టున వుండేవాడు కాడు. సుందరంతోటి నటి అయిన రాధారాణి దగ్గరే గడిపేవాడు. భర్తను అదుపులో పెట్టుకుని సుందరంతల్లి కోడలితో చెప్తుంది. భార్యాభర్తల మధ్య ఒకరి స్వాతంత్ర్యానికి మరొకరు అడ్డు రాకూడదంటుంది గిరిజ.

సుందరంకు ఒకసారి జబ్బుచేయగా గిరిజ దగ్గరుండి కాపాడుతుంది. గిరిజ చూపిన చనువువల్ల సుందరం ఏదో దాస్తున్నావని అంటాడు. అందుకు గిరిజ భర్తతో 'నీవాన్నిమాత్రం కాదు' అంటుంది. సుందరం కోపంతో చేయి చేసుకుంటాడు. అంతకుముందే స్నేహితులు దగ్గర సుందరం పెళ్ళి అయిన బ్రాహ్మచారిగా పిలువబడతాడు. గిరిజ పుట్టింటికి వెళ్ళిపోతుంది.

సామ్రాజ్యంకు పెరాలసిస్‌పిల్ల ఆరోగ్య పరిస్థితి రోజురోజుకూ క్షీణిస్తుంది. సామ్రాజ్యం చెల్లెలు శ్రీలక్ష్మి. మన్మథరావు కల్లబొల్లి మాటలతో శ్రీలక్ష్మి శీలాన్ని అపహరిస్తాడు. చూడ ముచ్చటయిన ఆ జంటను గమనిస్తుంటుంది సామ్రాజ్యం. చెల్లెల్ని తన భర్తకిచ్చి పెళ్ళి చేయమని ఉత్తరం రాసిపెట్టి సామ్రాజ్యం నిద్రమాత్రలు వేసుకుని మరణిస్తుంది.

పుట్టింటికి వెళ్ళిన గిరిజను పలుకరించే వాళ్ళు కరువవుతారు. 'అత్తిల్లు ఎంత భయంకరమో పుట్టినిల్లుకూడా అంతే దుస్సహంగా వుందన్న సత్యాన్ని గ్రహిస్తుంది' గిరిజ. గిరిజ ఆత్మహత్యా ప్రయత్నం చేయబోగా సరోజ భర్త శంకర్ కాపాడి ఇంటికి తీసుకెళతాడు. శంకర్‌లాంటి భర్తను చేసుకునివుంటే బాగుండే దనుకుంటుంది గిరిజ. గిరిజ పశ్చాత్తాపంతో తిరిగి తన భర్తను చేరుకుంటుంది. కొంత కాలానికి గిరిజ పురుడుకోసం ఇంటికి వస్తుంది. మగ పిల్లవాణ్ణి ప్రసవిస్తుంది. పుట్టినటువంటి బిడ్డ నల్లగా చూడటానికి వికారంగా వుంటాడు. గిరిజకు తన జీవితంలో మరుగునపడ్డ సంఘటనలు మళ్ళీ గుర్తుకు వస్తాయి. అందరిలో మార్పు తీసుకురావడానికి ప్రయత్నిస్తుంది.

గిరిజ ఇంటిలోని వారందర్నీ వుద్దేశించి 'మన మనుష్యుల్లో ఓ యంత్రం లాగా నడుపుతున్నాం. తెలివిహీనులు, వికృతాకారులు, రోగగ్రస్తులు పుడుతున్నారు. నా రక్తం ఏ రూపంలో బయటపడటానికి వీలులేదు. నా శరీరం లోనే యింకిపోవాలని' పిల్లవాణ్ణి డాబామీద నుంచి క్రిందకు నెట్టేసి తాను ఆత్మహత్య చేసుకోవడానికి సిద్ధమవుతుంది. కాని భర్త కాపాడుతాడు.

## 25 తోడూ - పోడూ :

సుదర్శనం కమలమ్మ దంపతులకు ఒక్కగానొక్క కొడుకు చిరంజీవి. తిరుపతిలో బ్యాంక్ ఉద్యోగం. అతనికి భార్య దివ్య. దివ్య అత్తమామల్ని వెంట తీసుకురాకుండా జాగ్రత్తపడుతుంది. బాల్యమిత్రుడయిన చక్రవర్తి చిరంజీవితో జీవిత వాస్తవాన్ని గురించి అప్పుడప్పుడు బోధిస్తుంటాడు. చిలకమ్మ చెప్పుడు మాటలు విని దివ్య భర్తను సాధిస్తుంది. చిరంజీవి హైదరాబాదుకు బదిలీ అవుతాడు. ఆఫీసు పనులవల్ల అప్పుడప్పుడు ఇంటికి ఆలస్యంగా వస్తుండేవాడు. అక్కడ దివ్యకు సత్య పరిచయం అవుతుంది. సత్య మాటలు విన్న దివ్య, భర్తను రోజూ సాధిస్తుంది. చిరంజీవి తన భార్యతో రాజీపడటానికే ప్రయత్నిస్తాడు.

సుదర్శనం, కమలమ్మలు చిరంజీవి దగ్గరకు వెళతారు. సత్య మాటల్ని నమ్మిన దివ్య అత్తమామల్ని సూటిపోటీ మాటల్తో బాధపెడుతుంది. మానసికంగా దెబ్బతిన్న సుదర్శనంకు 'పెరాలసిస్ స్ట్రోక్' వస్తుంది. ఆ సమయంలో కూడా

మామ పరిస్థితిని చూసి జాలిపడకుండా సూటిపోటు మాటలు మాట్లాడుతుంది. భార్యను సాధించడం కష్టమౌతుంది చిరంజీవికి. సుదర్శనం ఆరోగ్యం కుదుట పడగానే తనింటికి వెళ్ళిపోతాడు.

సత్య భర్తకు బ్యాంక్‌లో రెకమండేషన్ చేయనందువల్ల దివ్య చిరంజీవిని సాధిస్తుంది. బజారులో కనిపించిన చిలకమ్మ తిరుపతిలో వున్నప్పుడు పనిమనిషి సీతకు చిరంజీవికి అక్రమ సంబంధం వున్నట్లు చెప్తుంది. ఇంటికి వచ్చిన దివ్య తన భర్తతో పరుషంగా మాట్లాడుతుంది. చిరంజీవి దివ్యపై చేయిచేసుకుంటాడు. కొడుకును తీసుకొని దివ్య పుట్టింటికి వెళ్ళిపోతుంది. చిరంజీవి తండ్రి సుదర్శనం మరణిస్తాడు. సుదర్శనం మరణించక ముందు దివ్యను ఒంటరిగానే వదలమని కొడుక్కి ఉత్తరం రాస్తాడు. అన్నీ మరచి ఇంటికి రమ్మని దివ్యకు ఉత్తరం రాస్తాడు చిరంజీవి. తన్ను మరచిపొమ్మని, తిరస్కార భావంతో తెలియ జేస్తుంది దివ్య.

పుట్టింటికి వెళ్ళిన దివ్యను అందరూ సూటిపోటి మాటలతో హింసిస్తారు. ఆమె స్కూల్ టీచర్‌గా పనిచేస్తుంది. హరగోపాల్ పరిచయం అవుతాడు. స్కూల్ హెడ్‌మాస్టరు దివ్యను ఇంటికి పిలిపించి మానభంగం చేయపోగా తప్పించుకుని వచ్చేస్తుంది. తనకు 'తోడు' కావాలని బాగా ఆలోచించి ఇరువురు తమ గత జీవితాల్ని ప్రస్తావించుకోకుండా దివ్య హరగోపాల్‌లు పెళ్ళి చేసుకుంటారు.

చిరంజీవికి ప్రవేట్ కంపెనీలో పనిచేస్తున్న క్లర్క్ కిషోరితో పరిచయ మవుతుంది. పరిచయం ప్రేమగా మారుతుంది. గత జీవితాలతో పనిలేకుండా చిరంజీవి, కిషోరీలు పెళ్ళి చేసుకుంటారు. హరగోపాల్‌కు హైదరాబాద్‌కు ట్రాన్స్‌ఫర్ అవుతుంది. చిరంజీవి, కిషోరివున్న ఇంటిముందే హరగోపాల్, దివ్యలు కూడా అద్దె ఇంటిని తీసుకుంటారు. నలుగురూ ఒకరినొకరు చూసు కుంటారు. కానీ ప్రతి ఒక్కరిలోనూ నిజం సగంమాత్రమే తెలుస్తుంది.

హరగోపాల్ అవినీతి సంపాదనవల్ల దివ్యకు, హరగోపాల్‌కుమధ్య విభేదా లొస్తాయి. హరగోపాల్‌కు ఆక్సిడెంట్ జరగ్గా ఆసుపత్రిలో హరగోపాల్‌కి కిషోరి

సేవ చేస్తుంది. కిషోరి మాజీ భర్త అయిన హరగోపాల్ అవిసీతి సంపాదనపల్ల నే విడాకులిస్తుంది. చిరంజీవికి జ్వరం రాగా దివ్య తన కొడుకుద్వారా చిరంజీవికి సేవ చేస్తుంది.

సత్య కోరికలు తీర్చలేక ఆమె భర్త అప్పుల భారం అధికమై మానసిక వ్యథతో మరణిస్తాడు. భర్త చనిపోయిన తరువాత పశ్చాత్తాపంతో తను పడుతునక మానసిక వ్యథను సత్య దివ్యతో వివరిస్తుంది.

ఆసుపత్రి నుండి ఇంటికి వచ్చిన హరగోపాల్ తన్ను చూడటానికి రాలేదని దివ్యపై కోప్పడతాడు. ఇరువురి మధ్య మనస్పర్థలు ఎక్కువ కావడంతో దివ్యను హరగోపాల్ చేయి చేసుకుంటాడు. అడ్డు వచ్చిన దివ్య కొడుకయిన సందీప్‌ను కూడా చేయిచేసుకుంటాడు. తన కళ్ళముందు జరుగుతున్న హింసను ఆపుచేయాలని చిరంజీవి 'వాడు నా కొడుకు' అని అంటాడు. చిరంజీవి, దివ్యలు భార్యాభర్తలని తెలిసిన కిషోరి వాళ్ళను కలపడానికి ప్రయత్నించి విఫలమౌతుంది.

రెండు కుటుంబాల మధ్య మధ్యవర్తిగా నిలిచిన చక్రవర్తి తన తీర్పును ప్రకటిస్తాడు. 'ఇప్పుడున్నట్లే వారి వారి జీవితాల్లో మనస్పర్థలు రాకుండా జీవించ' మంటాడు. చక్రవర్తి తన కోరిక మేరకు సందీప్‌ను తనవెంట తీసుకువెళతాడు.

## 2.6 విషవలయం :

బలరామయ్య, రాధమ్మ దంపతులకు ఒక్కగానొక్క కూతురు విజయ. మగపిల్లలు లేనికారణంగా బలరామయ్య తన దూరపు బంధువైన రామక్రిష్ణయ్య చిన్నకొడుకు అయిన సత్యమూర్తిని దత్తత తీసుకుంటాడు. సత్యమూర్తి బి.ఎ. చదువుతుంటాడు. స్వేచ్ఛాజీవి. సున్నితమనస్కుడు. తోటి విద్యార్థిని సుధను ప్రేమిస్తాడు. సహవిద్యార్థి ప్రసాద్, అతని చెల్లెలు కూడా పరిచయం అవుతారు.

విజయ తన తండ్రి మాట కాదని ప్రేమించిన క్రిష్ణమూర్తితో వెళ్ళిపోతుంది. బలరామయ్యకు పెరాలసిస్ రావడంవల్ల సత్యమూర్తి తండ్రిని చేరుకుంటాడు. బలరామయ్య ఆస్తిపరుడు. సత్యమూర్తిని దగ్గరకు తీసుకుని దత్తత తీసుకున్న విషయం చెప్తాడు. బలరామయ్య తన యావదాస్తిని తన భార్య రాధమ్మ

పేర సగం, సత్యమూర్తి పేర సగం వీలునామా రాస్తాడు. బలరామయ్య తన 'ఆస్తిని కాపాడమని, తన ఆత్మకు ద్రోహం తలపెట్టవద్ద'ని చెప్పి మరణిస్తాడు. తన పెంపుడు తండ్రి మరణంతో కుటుంబ భారమంతా సత్యమూర్తిపై పడుతుంది.

బలరామయ్య మరణం రాధమ్మ తమ్ముడు వీరభద్రం, సత్యమూర్తి తండ్రి రామక్రిష్ణయ్య ఆ ఇంటిని చేరుకుంటాడు. వీరభద్రంగారి మాటలు విన్న రాధమ్మ సత్యమూర్తితో ఆస్తితగాదాలు పెట్టుకుంటుంది. రాధమ్మ ఆస్తిని వీరభద్రం తన పేర రాసుకుంటాడు. అది తెలుసుకుంటాడు సత్యమూర్తి. ఇరువర్గాలవారు కోర్టు కెళ్ళి వృథా ఖర్చు చేస్తారు. దుష్టశక్తుల కారణంగా ఆ ఇంటి వాతావరణం అల్లకల్లోలమౌతుంది. రాధమ్మకు పెంపుడు కొడుకుపై మంచి అభిప్రాయం వుంటుంది. కాని విధి చేతిలో కీలుబొమ్మ అయిన రాధమ్మ మానసిక సంఘర్షణలతో మంచం పట్టి మరణిస్తుంది.

సత్యమూర్తి ఏ మాత్రం దయాదాక్షిణ్యం లేకుండా రావలిసిన డబ్బును వసూలు చేస్తాడు. ఈ విషవలయంలో చిక్కుకున్నందువల్ల ప్రేమించిన సుధను, ప్రసాద్‌ను మరచిపోతాడు. తన తండ్రి చేస్తున్న మోసాల్ని ఎదిరించలేకపోతాడు. బలరామయ్య లాగా పరిమలోభిగా తయారవుతాడు. కోర్టుపక్షిగా తిరుగుతాడు. కుటుంబ విషయంలో అంతులేని ప్రశ్నలు సత్యమూర్తిని వెన్నాడి వేదిస్తోంది.

విజయ తన తల్లికి రాసిన ఉత్తరాన్ని వీరభద్రం గూడుపుఠాణి చేస్తాడు. విజయ రాసిన ఉత్తరం సత్యమూర్తి కంటపడటంతో వీరభద్రంను అనుమానిస్తాడు. ఆస్తి విషయంలో విజయ మోసపోకూడదని విజయ దగ్గరకు వెళతాడు సత్యమూర్తి. విజయ భర్తకు క్రిష్ణమూర్తికి టి.బి. రావడంవల్ల కుటుంబం కష్టమౌతుంది. చెల్లెలు పరిస్థితిని చూసిన సత్యమూర్తికి హృదయం ద్రవిస్తుంది. విజయకు యింటి దగ్గర విషయాన్ని చెప్తాడు. సత్యమూర్తిని అపార్థం చేసుకుని కటువుగా మాట్లాడుతుంది. విజయ తన భర్త క్రిష్ణమూర్తి ఇష్టప్రకారం యింటికి తిరిగి వస్తుంది.

విజయ యింటికి రావడంతో వీరభద్రం చిందులు త్రొక్కుతాడు. విజయకు కొంత డబ్బు ఇచ్చి పంపివేద్దామని సత్యమూర్తితో లాలూచిపడతాడు. సత్యమూర్తికి వాడి కుత్సితబుద్ధి అర్థమౌతుంది. ఇంటిలో దొంగతనం చేస్తున్న వీరభద్రం

సత్యమూర్తికి పట్టుబడగా గాయపరచి వెళ్లిపోతాడు. ఆసుపత్రి చేరిన సత్యమూర్తిని పరామర్శించడంకోసం సుధ, ఉష యిరువురూ వెళతారు. వారితో తనకు జరిగిన అన్యాయాన్ని చెప్పుకుంటాడు సత్యమూర్తి.

జీవితంమీద కోరిక వదులుకున్న సత్యమూర్తి సముద్రంలోపడి ఆత్మహత్యా ప్రయత్నం చేసుకోబోగా సుధ తండ్రి సత్యానంద్ కాపాడుతాడు. ఉషను పెళ్లి చేసుకోమని సుధ సత్యమూర్తిని ప్రాధేయపడుతుంది. ఈ విషయంలో మరొక్కసారి చిక్కుకోకూడదనుకుని సత్యమూర్తి తన యావదాస్తిని ధర్మసంస్థలకు దత్తం చేస్తాడు. సుధ కోరిక ప్రకారమే ఉషను పెళ్ళాడి విశాఖపట్నం వెళ్లిపోతాడు.

## 3.7. హారతి

ఆదిశేషయ్య, సుశీలమ్మ ఆదర్శదంపతులు. వీరికి ఒక్కగానొక్క కొడుకు శ్రీధర్. శ్రీధర్ భార్య హరిలీల. వీరికి ఒక్కడే కొడుకు చిట్టిబాబు. తండ్రీకొడుకులు, అత్తాకోడళ్ళు చాలా అన్యోన్యంగా వుంటూ వీరు ఎక్కడికి వెళ్లినా కలిసే వెళ్ళేవారు. తండ్రీకొడుకులు చూసేవాళ్ళకు అన్నదమ్ముల్లాగా కనిపించేవారు. అత్తాకోడళ్ళు ఇరువురూ పెళ్ళికి వెళుతుండగా రైలుప్రమాదంలో మరణిస్తారు.

తండ్రీకొడుకులకు భార్యావియోగం కలగడంతో ఇరువురూ వ్యసనపరులౌతారు. ఆదిశేషయ్య చిట్టిబాబుతో షికారుగా వెళ్ళగా టాంక్‌బండ్ వద్ద వున్న అమ్మాయితో పరిచయం ఏర్పడుతుంది. ఆమె పేరు హారతి. ఆదిశేషయ్య హారతిని ఇంటికి తీసుకువస్తాడు. ఆదిశేషయ్య అక్క 'కులం గోత్రం లేని అమ్మాయి మన ఇంటిలో ఉండటమా?' అని వాపోతుంది. అందుకు ఆదిశేషయ్య అక్కను సముదాయిస్తాడు. హారతి యింటి పనులు పూర్తిగా చేస్తూ చిట్టిబాబుకు కూడా దగ్గరవుతుంది. పరిచారిక అయిన హారతివల్ల చిట్టి తన తల్లిని మరచిపోతాడు.

చిట్టిబాబు పిల్లలతో ఆడుకోవడానికి చెరువుకు వెళతాడు. పక్కింటి ఆమె కొడుకు కేశవులు చెరువులో మునిగి మరణిస్తాడు. ఈ నింద చిట్టిబాబుపై మోపబడుతుంది. కేశవులు మరణాన్ని చూసిన చిట్టికి జ్వరం వస్తుంది. కేశవులు తల్లి విలపిస్తూ 'తాగుబోతుల కొంప' అని యింకా నానామాటలతో దూషిస్తుంది. హారతిని చూసి వ్యంగ్యంగా మాట్లాడుతుంది. చిట్టిబాబుకు జ్వరం ఎక్కువ కావడం

వల్ల హారతి ఆసుపత్రికి తీసుకెళ్ళి కాపాడుతుంది. హారతి చేసిన ఈ సహాయంతో ఆదిశేషయ్య, శ్రీధర్ ఆత్రాగుడు మానేస్తాడు. ఆదిశేషయ్య మిత్రుడు భుజంగరావు అతని కూతురు కామాక్షి ఇంటిలో తిష్ఠవేస్తారు. భుజంగరావు తన కూతుర్ని శ్రీధర్‌కిచ్చి ఆస్తిని కాజేయాలని కుట్రపన్నుతాడు. వాళ్ల కుట్రను పమ్ముచేస్తుంది హారతి ఇంటి నుండి వెళ్లగొడ్తుంది.

తండ్రీకొడుకులు ఒకరికొకరు హారతి విషయంలో ఏదో అనుగాలను కుంటారు, కానీ ఇరువురికి కూడా ఎవరిమట్టుకు వారికి భయం. శ్రీధర్ హారతితో 'మా ఇంటి గృహలక్ష్మివి', 'నువ్వు నా తల్లిలాంటిదాని'వని అంటాడు. ఆ మాటల్ని విన్న ఆదిశేషయ్య నివ్వెరపోతాడు. ఆదిశేషయ్య కొడుకు శ్రీధర్‌తో 'చిట్టిబాబుకు తల్లిగా, నీకోసం నిన్ను మనిషి చేద్దామని తీసుకొచ్చానని' మనసులో వున్నది చెప్తాడు. శ్రీధర్ తండ్రితో హారతి మీకే చెందాలన్న ధ్యేయంతో మాట్లాడతాడు. తండ్రీకొడుకుల మాటల్ని హారతి మరుగున వుండివింటుంది.

హారతి తన జీవితంలో జరిగిన అగాధాన్ని ఇలా వివరిస్తుంది. 'మీ భార్యలు మరణించిన రైలు ప్రమాదంలో పెళ్ళిఅయి పసుపుబట్టలు ఆరని తన భర్తకూడా మరణించాడని' చెప్తుంది. హారతి తన భర్తకు మూగకంఠంతో యిచ్చిన మాటను నిలబెట్టుకోవడం కోసం వెళ్ళిపోతానంటుంది. బయలుదేరిన హారతికి కాళ్ళకు బంధం వేస్తాడు చిట్టి. హారతి బాగా ఆలోచించి చిట్టిబాబుని ఎత్తుకుంటుంది. తండ్రీకొడుకులు ఇరువురూ చూసి ఆనందపడతారు.

## 2.8 సూర్యుడు దిగిపోయాడు :

రాఘవరావు, అనంతమూర్తి చిన్నప్పటినుంచి ప్రాణస్నేహితులు, రాఘవరావుకు సంగీతమన్నా, అనంతమూర్తికి సాహిత్యమన్నా మక్కువ. రాఘవరావుకు పెద్దల యిష్టప్రకారమే లక్ష్మితో పెళ్లవుతుంది. రాఘవరావు గుమాస్తా ఉద్యోగి. అనంతమూర్తి చదువు చాలించి తను ప్రేమించిన వసంతను పెళ్ళాడుతాడు. అనంతమూర్తి కులాంతర వివాహం చేసుకోవడం తల్లిదండ్రు లకు సుతరామూ నచ్చదు. అంచేత అనంతమూర్తి వేరు కాపురం పెడతాడు. రఘురామయ్య ప్రెస్‌లో చేరిన అనంతమూర్తి సబ్ ఎడిటర్ దాకా ఎదుగుతాడు. తన పిల్లలకు ఏలోటు రానీయకుండా క్రమశిక్షణతో పెంచుతాడు.

రాఘవరావు తన అయిదుమంది పిల్లలతో సతమతమౌతాడు. తన పిల్లలకుగాని, భార్యకుగానీ, ఏ చిన్నజబ్బు చేసినా ఆఫీసుకు శెలవు పెట్టేవాడు. అందువల్ల రాఘవరావుకు ప్రమోషన్ రాదు. కుటుంబ పోషణభారం ఎక్కువవుతుంది. రాఘవరావు పిల్లల్ని అతి గారాబంగా పెంచడంవల్ల వాళ్లు చెడు అలవాట్లకు లోనవుతారు. రాఘవరావు కూతురు విమలపాషా అనే ముస్లిం పిల్లవానితో తిరిగి గర్భవతి అవుతుంది. ఇద్దరూ మతాంతర వివాహం చేసుకుంటారు. రాఘవరావు పెద్దకొడుకు రామం క్రిస్టియన్ అమ్మాయిని పెళ్ళిచేసుకుంటాడు. రెండో కొడుకు ఇంజనీరింగ్ ఉద్యోగం చేస్తున్నప్పటికీ ఇంటి పరిస్థితుల్ని పట్టించుకోడు. రాఘవరావు తన మిత్రుడయిన అనంతమూర్తితో తన పిల్లల దుస్థితిని చెప్పుకుంటాడు.

రాఘవరావు పిల్లలకోసం తన సర్వశక్తులను ధారవోసి అలసిపోతాడు. రిటైరు కాబోతున్న సమయంలో అతని పిల్లలు రాఘవరావులో అశాంతిని రేపుతారు. వాళ్ళనుండి ఆశించిన విధేయత, సేవలు సుఖాలు రాఘవరావుకు కరువవుతాయి. దగాపడ్డ తండ్రి అవుతాడు. తన జీవితాన్ని పిల్లలకోసమే అంకితమయినప్పటికీ. రాఘవరావుకు అశాంతి, నిరుత్సాహం తప్ప ఏమీ మిగల్చలేకపోతాడు.

రాఘవరావు భార్య లక్ష్మికి కేన్సర్ వస్తుంది. పిల్లలకోసం చేసిన అప్పుల భారం ఎక్కువ కావడంతో ఇంటిని అమ్మేస్తాడు. రాఘవరావు లక్ష్మిని హైదరాబాదు ఆసుపత్రిలో చేర్పిస్తాడు. లక్ష్మి మరణించేముందు తనపిల్లల్ని చూడాలంటుంది. కాని ఒక్క విమలనుమాత్రం చూసి ఆమె ప్రాణాలు విడుస్తుంది. రాఘవరావును పిల్లలు ఎవరూ చేరనీయకపోవడంతో దేశ 'బహుదూరపు బాటసారి' అవుతాడు.

## 2.9 భారతి :

గౌరీపతి ఒక్కగానొక్క కూతురు భారతి. చిన్నప్పుడే తల్లి చనిపోవడంతో పిన్ని రాధమ్మ దగ్గర పెరుగుతుంది. భారతి స్నేహితురాలు మల్లిక డాక్టర్ గోవిందరావు భారతికున్న వ్యాధి కుష్ఠు అని నిర్ధారిస్తాడు. మల్లిక తన స్నేహితురాలి దీనస్థితిని చూసి ఏడుస్తుంది. భారతి అందాన్ని చూసి సారధి ప్రేమిస్తాడు. సారధి తండ్రి గంగాధరం గౌరీపతి ఇంటికి వెళ్ళి పెళ్ళి నిశ్చయిస్తాడు. భారతి తండ్రితో

తనకున్న వ్యాధిని గుర్తుచేస్తూ పెళ్ళికి తన అయిష్టతను తెలియజేస్తుంది. మూగదైన తన పిన్ని జీవితాన్ని ఉదహరిస్తుంది. వచ్చిన అవకాశాన్ని వదులుకోకూడదని గౌరీపతి భారతికి నచ్చచెప్పి సారథితో పెళ్ళి చేయిస్తాడు.

రంగాజమ్మ కోడలు భారతిని బాగా చూసుకుంటుంది. ఇంటిలో ఎలా నడుచుకోవాలో తెలియజేస్తుంది. అత్తాకోడళ్ళు అన్యోన్యంగా వుంటారు. షికారు కెళ్ళి ఇంటికి వచ్చిన భారతితో గంగాధరం కుష్టువ్యాధిని గుర్తు చేస్తాడు. గంగాధరంకు డాక్టర్ గోవిందరావు చెప్పిన విషయం భారతికి తెలియదు. భారతి తన మామ మాటలన్నిటికి సమ్మతిస్తుంది. గంగాధరం భారతిని 'తమ కుటుంబ పరువు మర్యాదలు మంటగలిపావని' మాటలతో రూటనాడి భారతిని పుట్టింటికి పంపి వేస్తాడు. తన భార్యకు జరుగుతున్న అన్యాయాన్ని ఎదిరించలేకపోతాడు సారథి. సాటి స్త్రీకి జరుగుతున్న అన్యాయాన్ని చూసి రంగాజమ్మ భర్తను ఎదిరిస్తుంది. పర్యవసానంగా దెబ్బలు తింటుంది.

భారతి పుట్టింటికి వెళ్ళగా తన కూతురికి జరిగిన అన్యాయానికి గౌరీపతి గుండెపోటుతో మరణిస్తాడు. భారతికి మల్లిక కుటుంబం చేదోడుగా వుంటుంది. భారతికి డాక్టర్ సాగర్‌వల్ల వ్యాధి తగ్గుతుంది. జబ్బుపడినవేళ భారతికి అపనిందలు గుర్తుకు వస్తాయి.

గంగాధరం కోరికమేరకు భారతి తన భర్తకు విడాకులిస్తుంది. తన కోడలికి జరుగుతున్న అన్యాయానికి రంగాజమ్మ ఏడుస్తుంది. భారతి మనసులో తన భర్త అసమర్థుడనీ, అయినా అతనికి ప్రేమ, కరుణ ఉన్నట్టు గ్రహిస్తుంది.

భారతికి కుష్టు పూర్తిగా నయమవుతుంది. భారతికి జరిగిన అన్యాయాన్ని చూసిన మూగదైన రాధమ్మ మానసిక వ్యథతో మంచం పట్టి మరణిస్తుంది. భారతి రోగులకు సేవ చెయ్యాలన్న ధ్యేయంతో నర్సరీ ట్రయినింగ్ పూర్తిచేసి కలికిరి కుష్టువ్యాధి ఆసుపత్రిలో నర్స్‌గా చేరుతుంది.

కలికిరి ఆసుపత్రిలో డాక్టర్ గోవిందరావు ఉండటం చూసి ఆశ్చర్యపడుతుంది. అతని అవినీతిని లంచగొండితనాన్ని ఖండిస్తుంది. తన జీవితంలో నిప్పులు పోసిన వ్యక్తి అని తెలుసుకుంటుంది. గోవిందరావు ధనుర్వాతం రావడంతో మర

ణిస్తాడు. గోవిందరావు స్థానంలో డాక్టర్ సాగర్ రావడంతో భారతి సంతో షిస్తుంది. ఆసుపత్రి వాతావరణంలో చాలా మార్పు వస్తుంది. డాక్టర్ సాగర్ రోగుల సేవలో నిమగ్నమౌతాడు. నిస్వార్థపరుడై మంచిపేరు సంపాదించు కుంటాడు.

గంగాధరం కొడుకు సారధికి కుంతలతో రెండో పెళ్ళి జరిపిస్తాడు. నరాల జబ్బు కారణంగా సారధి సంసార సుఖానికి నోచుకోడు. తన భర్త పరిస్థితి తెలుసు కున్న కుంతల భారతి దగ్గరకెళ్ళి పుత్రభిక్ష పెట్టమని ప్రాధేయపడుతుంది. కుంతల మాటల్ని మన్నించి భారతి తన భర్త సారధి దగ్గరకు వస్తుంది. సారధి మానసిక క్షోభను అర్థం చేసుకుంటుంది భారతి. భారతికి సారధిని చూస్తే ఓ పరాయి మగాణ్ణి చూసినట్లుండేది. తను విడాకులు తీసుకున్నప్పటికీ ముత్తయిదువ స్థానాన్ని నిల బెట్టుకుంటుంది.

భారతి సారధితో 'నా బలహీనతకొద్దీ మంగలసూత్రాలు వుంచుకున్నానని' చెప్పి అతని పాదాలచెంత వుంచేసి వెళ్ళిపోతుంది. భారతి తిరిగి కలికిరి ఆసు పత్రిలో వున్న డాక్టర్ సాగర్‌ను కలుసుకుంటుంది. సాగర్‌కు సోకిన కుష్ఠువ్యాధిని చూసి భారతి హృదయం బరువెక్కుతుంది. సాగర్‌ను గుంటూరు ఆసుపత్రికి తీసుకెళ్లి కాపాడుతుంది.

## 3. కుటుంబ వ్యవస్థలో సంబంధ బాంధవ్యాలు

### 3.1. తల్లిదండ్రులు :

కుటుంబ బాధ్యతనంతటిని వహిస్తూ కుటుంబ నిర్వహణలో కీలకపాత్ర నిర్వహిస్తాడు తండ్రి. కుటుంబాన్ని ఆదర్శవంతంగా తీర్చిదిద్ది అత్యున్నతస్థితికి తీసుకురావడం తండ్రి కర్తవ్యమే. అలాంటి తండ్రితో కాపురంచేసే తల్లి ఏ చీకూ చింతా లేకుండా తన సంతానాన్ని ఉత్తమ పౌరులుగా తీర్చిదిద్దటంలో దృష్టి కేంద్రీకరిస్తుంది. ఆ కుటుంబ ఉన్నతికి తండ్రిచేసే కృషిలో సముచితంగా పాలు పంచుకుంటుంది. కొమ్మూరి వేణుగోపాలరావుగారి 'పెంకుటిల్లు' నవల్లో కుటుంబ యజమాని అయిన చిదంబరం ఇందుకు భిన్నంగా కనిపిస్తాడు, కుటుంబ భారం

వహించవలసిన తండ్రి చిదంబరం పేకాటలో ప్రపంచాన్ని, ప్రపంచంలోని తన కుటుంబాన్ని మరిచిపోతాడు. కుటుంబపట్ల తన కర్తవ్యాన్ని నిర్వహించేందుకు ఆసక్తి చూపడు. నామమాత్రంగా వున్న అతనితో కాపురం చేయడం ఎంత యిబ్బందో వూహించుకోవలసి వుంది. చిదంబరాన్ని యీసడించుకోగా అతని దుర్వ్యసనాన్ని నిష్ప్రయోజనత్వాన్ని శారదాంబ నిర్లిప్తంగా మౌనంగా భరిస్తుంది. ఈ తరహా తల్లిదండ్రుల అనుబంధంలో సహనం కూడా కనిపిస్తుంది.

చిదంబరం తల్లికి పెరాలసిస్ వచ్చినప్పుడు తన కొడుకు వాసు కారు ఆక్సిడెంట్‌లో కాళ్ళు పోగొట్టుకొన్నప్పుడు చిదంబరం ప్రవర్తనల్లో మార్పు వస్తుంది. కొంత డబ్బును అరువు తీసుకువచ్చి తన మనోవ్యథను వాళ్ళతో వ్యక్తం చేస్తాడు. అదే విధంగా చిదంబరం తను జబ్బుపడినప్పుడు వ్యక్తం చేసిన మనసులోని భావాలు మనం ఇక్కడ గమనించవచ్చు. "తను యీ యింటికి పెద్దవాడు. ఇంటి యజమాని. తనకు ఒక్క పనా ఒక్క బాధ్యతా? ఇంటికి సంబంధించిన ప్రతి విషయం తానే చూసుకోవాలి. వెయ్యి కళ్ళతో ప్రతి సంగతీ కనిపెడుతూ వుండాలి. పాపం వాళ్ళంతా చిన్నపిల్లలు. అమాయకులు. తననే నమ్ముకొనివున్నారు. ఎదుర్కొంటున్న ప్రతి అపాయంలోంచి వాళ్లను ఆదుకొంటూ వుండాలి. లేకపోతే వాళ్ళను వేరే యెవరు చూస్తారు. ఈ సమస్యకు పరిష్కారం చెయ్యాలి చొరవ తీసుకుని తన సమర్థత వాళ్లముందు రుజువు చెయ్యాలి"[1] అని మనసులో అనుకుంటాడు.

కొమ్మూరి వేణుగోపాలరావుగారి మరో కుటుంబ నవల 'ఈ దేశంలో ఒక భాగమిది', సమిష్టి కుటుంబంలో తలెత్తే సమస్యలను ఈ నవల్లో చక్కగా చిత్రీకరించారు. ఇందులో తల్లిదండ్రులుగా శారదమ్మ, రంగారావు. రంగారావు తన పెద్దరికాన్ని నిలబెట్టుకోవడానికి ప్రతి చిన్నవిషయంలోనూ అడ్డుపుల్లలు వేస్తూ అందర్నీ విసిగిస్తాడు. ఛాదస్తుడయినప్పటికీ పిల్లలపై అతనికి గల ప్రేమానురాగాలు అతని మాటల్లో చూడవచ్చు "నేను చిన్నప్పుడు చాలా కష్టపడ్డాను. అష్టకష్టాలుపడి పైకి వచ్చాను. నేను పడిన కష్టం నా పిల్లలు పడకూడదనుకున్నాను. అందుకే మీకన్నీ అమర్చిపెడుతున్నాను. అయినా నేనుపడ్డ కష్టంలో మీరు వెయ్యోవంతు కూడా పడలేరు"[2] అని అంటాడు. స్వశక్తిమీద పైకి వచ్చానన్న

తృప్తి, గర్వం రంగారావు మాటల్లో మనకు వ్యక్తమౌతాయి. రంగారావు భార్య శారదమ్మ, భర్త మాటకు యెదురు పలకకుండా అతని అడుగుజాడలో నడిచే ఉత్తమ ఇల్లాలు.

'విషవలయం' నవల్లో బలరామయ్య, రాధమ్మ తల్లిదండ్రులు. వాళ్లకు మగసంతానం లేని కారణంగా వాళ్ల ముచ్చట తీరేందుకు దూరపు బంధువయిన రామక్రిష్టయ్య చిన్నకొడుకు సత్యమూర్తిని దత్తత తీసుకుంటారు. అయినా రాధమ్మ అష్టు చెప్పదు. వీరిది అనుకూల దాంపత్యం.

'ఒకే రక్తం ఒకే మనుషులు' నవల్లో పుండరీకాక్షయ్య, అనసూయమ్మ తల్లిదండ్రులు. మేనరికపు వివాహవ్యవస్థకు కట్టుబడి సాంప్రదాయాలకోసం ప్రాకులాడేవాళ్ళుగా కనిపిస్తారు.

వృద్ధాప్యంలో కొడుకు కోడలు ఆదరణకు నోచుకోని తల్లిదండ్రులుగా 'తోడూ జోడూ'లో సుదర్శనం కమలమ్మలు కనిపిస్తారు. తన భర్తకు పెరాలసిస్ రావడంవల్ల అతను పడే కష్టాల్లో కమలమ్మ మౌనంగా పాలుపంచుకుంటుంది. కొడుకు, కోడల్ని పల్లెత్తు మాట కూడా అనదు. మౌనమే సమాధానమన్నట్లు కమలమ్మ తన భర్తకు చేదోడు వాదోడుగా వుంటుంది. కోడలి సూటిపోటు మాటల్ని వృద్ధాప్యంలోవున్న చిరంజీవి తల్లిదండ్రులు మౌనంగా వింటారు.

'హారతి' నవల్లో ఆదిశేషయ్య, సుశీలమ్మ ఆదర్శదంపతులు. పరస్పర ప్రేమానురాగాలతోవున్న ఆదిశేషయ్య ఒంటరివాడవుతాడు. అందుకు కారణం అతని భార్య, కోడలు రైలు ప్రమాదంలో మరణిస్తారు. తల్లిదండ్రుల మధ్య వుండాల్సిన అన్యోన్యత, అవగాహన సువ్యక్తం చేస్తుంది.

విశ్వనాథరావు, లలితమ్మలు 'మేడలో నీడలు' నవల్లో తల్లిదండ్రులు. విశ్వనాథరావు కనకవల్లితో అక్రమసంబంధం పెట్టుకున్నప్పటికి సహిస్తుంది లలితమ్మ. విశ్వనాథరావు భార్యపట్ల అవాంఛనీయంగా ప్రవర్తించడు. వీరిది అనుకూల దాంపత్యమే. తమ కొడుకులకు కావలసినంత ఆస్తిని సంపాదించి పెట్టాడు విశ్వనాథరావు. తమ పిల్లలకు ఏ లోటూ రానీయకుండా పెంచి పెద్ద చేస్తాడు.

'భారతి' నవల్లో భారతి తలిదండ్రుల సంబంధం గురించి మనకు సరిగ్గా తెలిసే అవకాశంలేదు. అందుకు కారణం భారతి తల్లిలేనిది కావడమే. భారతి భర్త సారథి. వారి తలిదండ్రులుగా గంగాధరం, రంగాజమ్మ. వీళ్ళిద్దరి మనస్తత్వాల మధ్య అంతరం చక్కగా చిత్రింపబడింది. గంగాధరం సంకుచిత స్వభావుడు. స్వయంగా పెళ్ళి తెచ్చుకున్న కోడలు భారతికి క్షయరోగం అని తెలియగానే ఆమె జీవితంలో నిప్పులు పోస్తాడు. రంగాజమ్మ తన భర్త చర్యను వ్యతిరేకిస్తూ "ఈ ఒంటిమీద ఏ మచ్చ ఎంతకాలం నిలుస్తుంది. అందరిచేతా మోసగింపబడేదేగాని, ఆమె ఒకర్ని మోసం చేయగలదని మీకనిపిస్తుందా? పెద్దలు కూతురిమీద ప్రేమ కొద్దీ చేసిన పనికి ఆమెదెలా బాధ్యత అవుతుంది? శిక్ష విధించే అధికారం మీకుందా? నేను ఈ ఇంటి ఇల్లాలిని. ఈ ఇంటి బాగోగులతో మీకెంత నిమిత్తం వుందో నాకూ అంతే వుంది. భారతి యిక్కడ వుండాలని శాసిస్తున్నాను. తోటి ఆడదానికి అన్యాయం జరుగుతుంటే నా కాపురం కోసం ప్రాకులాడేతంటటి స్వార్థపరురాల్ని కాదు"[3] అంటుంది. ఇక్కడ కోడల్ని దృష్టిలో పెట్టుకుని విశాల భావంతో రంగాజమ్మ మాట్లాడుతుంది. తోటి ఆడదిగా సానుభూతి చూపడమేగాక రంగాజమ్మ తమ కాపురాన్ని నిలబెట్టుకోవాలని ప్రయత్నిస్తుంది.

'సూర్యుడు దిగిపోయాడు' నవల్లో రాఘవరావు, లక్ష్మి తలిదండ్రులు. పిల్లల పెంపకం విషయంలో రాఘవరావు ఖచ్చితంగా వ్యవహరించాలంటాడు. లక్ష్మి మాత్రం తీవ్రంగా మందలించకూడదంటుంది. మరోప్రక్క బిడ్డలు చెప్పిన మాటల్ని వినకపోవడంవల్ల వారిని గురించి అనునిత్యం బాధపడే తల్లిదండ్రులుగా కూడా మనకు దర్శనమిస్తారు. రాఘవరావు భార్య లక్ష్మికి కేన్సర్ రాగా అనేక కష్టాలకోర్చి, ఇంటిని కూడా అమ్మి తన భార్యను దక్కించుకోవాలని ఆరాటపడతాడు. కాని లక్ష్మి మరణిస్తుంది. వీరిద్దరి మధ్య అనుకూల దాంపత్యం ఉంది. ఇందులో రాఘవరావు దగాపడిన తండ్రిగా మనకు దర్శనమిస్తాడు. ఇదే నవల్లో మరో కుటుంబంలోని తలితండ్రులుగా వసంత అనంతమూర్తులు అనుకూల దాంపత్యం కలిగివుంటారు. తమ పిల్లల్ని క్రమశిక్షణతో పెంచిన తల్లిదండ్రులుగా మనకు దర్శనమిస్తారు. జర్నలిస్ట్ ఉద్యోగం నిర్వహణలో అనంతమూర్తి నిరుత్సాహపడినపుడు అతని భార్య వసంత హితోపదేశం చేస్తూ మంచి ప్రోత్సాహమిస్తుంది.

ఇంతవరకు పరిశీలింపబడిన కుటుంబ నవలల్లో తల్లిదండ్రులు, కుటుంబ నిర్వహణలో తమ తమ పాత్రలను, వాళ్ళ సంబంధ బాంధవ్యాలు, కుటుంబ జీవిత చిత్రణ, ఒకటి రెండు నవలల్లో మినహా దాదాపు అన్నింటిలోనూ సమానంగానే కనిపిస్తాయి.

## 3.2 తల్లీ కొడుకులు :

ప్రపంచంలో ప్రతి తల్లీ కొడుకుల మధ్యవున్న సంబంధ బాంధవ్యాలు ఎంతో పవిత్రంగా అమృతప్రాయంగా వుంటాయి. ప్రతి మానవుడూ తన తల్లికి హృదయంలో ఒక ప్రత్యేకమైన స్థానం కల్పించి పూజిస్తుంటాడు. తమ సంతానం వృద్ధాప్యంలో అండదండలుగా వుంటారని ఆశిస్తుంది. వారు తమకంటే ఉన్నత స్థాయిలో హాయిగా జీవనం గడపాలని కోరుకుంటుంది ప్రతి తల్లి. అయితే కొన్ని కారణాలవల్ల వీరిద్దరి మధ్య వున్నటువంటి సంబంధం దెబ్బతిని యెడ ముఖం పెడ ముఖం అయ్యే అవకాశం కూడావుంది. మొదట అమృత ప్రాయంగా వుండేవాళ్ల అనురాగం పిదప విషపూరితంగా తయారై చేదు అనుభవాలు చవిచూచే ప్రమాదం కూడా వచ్చే అవకాశం కూడా వుంది. అందుకు కారణం ఒకరినొకరు సరిగా అర్థం చేసుకోక పోవడమే కావచ్చు. ఇలాంటి సన్నివేశం 'పెంకుటిల్లు' నవల్లో కనిపిస్తుంది.

శారదాంబకు ముగ్గురు కొడుకులు. నారాయణ, ప్రకాశం, వాసు, నారాయణ కుటుంబ బాధ్యతలు భరిస్తూ తన వివాహాన్ని వాయిదా వేస్తుంటాడు. శారదాంబ మాత్రం సకాలంలో కోడల్ని తెచ్చుకోవాలని సంబర పడుతుంది, తమ కొడుకులకు పెళ్ళిళ్లు చేసి కోడళ్లను తెచ్చుకోవడం ఆమెను ఆకర్షించి వుండవచ్చు. కోడలు వస్తే తనకు పనిపాటల్లో కొంతైనా తగ్గుతుందని ఇంటి ఆర్థిక పరిస్థితి మెరుగుపడుతుందని ఆమె విశ్వసించి వుండవచ్చు.

నారాయణ ఆలోచనలు మాత్రం యిందుకు భిన్నంగా వున్నాయి. పెద్ద కొడుకుగా కుటుంబ బాధ్యతలు వహించిన తాను పెళ్ళికి వాయిదా వేస్తేనే మంచిదని భావిస్తాడు. తన అభిరుచులకు, ఆశయాలకు అనుగుణంగానే కుటుంబంలోని అందరూ నడుచుకోవాలని వచ్చిన కోడలు యెదురుచూసే అవకాశం వుంది. అందువల్ల కుటుంబంలో సంఘర్షణ సంక్షోభం తలెత్తుతాయి. ఇలాంటి పరిస్థితుల్లో తమ్ముడి

చదువు, చెల్లెలి పెళ్లి కుటుంబ యాత్ర అనుకున్న విధంగా సాగడం కష్టం. తాను తెచ్చిన కట్నం రూపేణ పైకాన్ని కుటుంబానికి వినియోగించడం పూర్తిగా కోడలికి యిష్టంలేక పోవచ్చు. అలాంటప్పుడు తనపెళ్లి విషయంలో తల్లి కలలుకనే ఆశలు తలక్రిందులయ్యే ప్రమాదంవుంది అనుకొని తల్లి శారదాంబతో నారాయణ ఈ విధంగా అంటాడు. "నీ మాట వినలేదే అని బాధపడటం కన్నా, యెందుకు వినలేదో అని కాస్త ఆలోచించావా? మనం రోజులు యెలా నెట్టుకువస్తున్నామో నీకు తెలియని విషయమా? మనం ఈ రోజు బ్రతికే విధానం మీద రేపు జరుగ బోయేవన్నీ ఆధారపడి వుంటాయి. మనం యెలా బ్రతుకుతున్నాం. సంఘంలో మనకున్న స్థితి ఏమిటి? రాధ పెళ్లి యెలా అవుతుంది? నా పెళ్లి విషయమే ముఖ్యమా? ప్రకాశం డబ్బులేక అక్కడ యెంత ఇబ్బంది పడుతుంటాడో? నీ కేమైనా తెలుసా, తృణమో, ఫణమో మనం పంపిస్తున్నాం. వాడి 'లా' పూర్తి అయ్యేవరకు నేను పెళ్లి చేసుకోదలచుకో లేదు. రాధ పెళ్లి అయ్యేదాకా నేను పెళ్లి చేసుకోను. వయసుతోపాటే పెళ్లి అన్న సూత్రాన్ని నేను అంగీకరించను, నన్ను సగం సగం కాకుండా పూర్తిగా అర్థం చేసుకో అమ్మా"[4] అని అంటాడు. నారాయణ తనకుటుంబ పరిస్థితుల దృష్ట్యా త్యాగమూర్తిగా సముచితమైన నిర్ణయమే తీసు కుంటాడు.

తల్లీ కొడుకులిద్దరూ కుటుంబ శ్రేయస్సునే కాంక్షిస్తున్నారు. అందుకు మార్గాలనే ఆలోచిస్తున్నారు. తల్లి ఆలోచనా పరిధి చాలా తక్కువ. కొడుకు ఆలోచన పరిధి కాస్త యెక్కువ. తను కనిపెంచిన కొడుకు తన మాట లక్ష్య పెట్టడం లేదని అపార్థం చేసుకుని శారదాంబ బాధపడుతుంది. తనను, పరిస్థితులను పెళ్లి అయిన తరువాత తలెత్తే పరిణామాలను తల్లి సరిగ్గా అర్థం చేసుకోలేక పోవడం నారాయణకు బాధ కలిగిస్తుంది. ఆమెపట్ల జాలిపుట్టిస్తుంది.

పట్నంలో చదువుకుంటున్న ప్రకాశం పడుతున్న పాట్లను వూహించ గలిగిన శారదాంబకు హృదయం ద్రవిస్తుంది. తాను వాడికి యెలాంటి ఆర్థిక సహాయం చేయలేక పోగా కన్నీళ్ళు పెట్టుకోవడమే శారదాంబ కర్తవ్యమౌతుంది. ప్రకాశం శకుంతలను కులాంతర వివాహం చేసుకుని యింటికి వచ్చినప్పటికి సాదరంగా ఆహ్వానిస్తుంది. అది మాతృహృదయం. చిన్నకొడుకు వాసు అవిటి వాడు కావడంతో శారదాంబ ఖేదపడుతుంది. దుఃఖిస్తుంది. వాడిమీద జాలితో ఆ

మాతృహృదయం విలపిస్తుంది. ఈ విధంగా శారదాంబలోని మాతృహృదయాన్ని చూడ గలుగుతాం.

ఇదే నవలలో చిదంబరం తల్లి ఉదాసీనంగా వుండబట్టే చిదంబరం వ్యసనాలకు గురయ్యాడని వూహించవచ్చు. తరువాత ఆ కుటుంబ దుస్థితికి దిగజారడం, అందరూ తన కొడుకును చులకనగా చూడటం ఆ తల్లి మనసు సహించలేక పోయింది. పైగా కొడుకును మందలించింది. ప్రయోజకుడు కమ్మని ప్రబోధించింది. బాధ్యతనెరిగి గుర్తించమని బతిమాలుకొంది. తల్లి పక్షవాతంలో మంచాన పడగానే చిదంబరం తను నిష్ప్రయోజకుడని తెలుసుకుని కళ్లు తెరుచుకుంటాడు. అతనిలో బాధ్యతలు మేలుకున్నాయి. తండ్రిగా ఆ ఇంటిలో తన కర్తవ్యాన్ని నిర్వహించటం మొదలు పెట్టాడు.

'ఈ దేశంలో ఒక భాగమిది' నవల్లో శారదమ్మకు ముగ్గురు కొడుకులు. కుమార్, హరి, సుధాకర్. కుటుంబంలో తోడికోడళ్ళ వల్ల సంఘర్షణ సంభవించినప్పటికి ముగ్గురు కొడుకులు కట్టుకు నిలబడి సమిష్టిగా వుండగలుతారు. భార్యల పత్తిళ్ళకు ఏమాత్రం అవకాశం యివ్వక తల్లిచూపిన మమతానురాగాల వల్ల వాళ్ళనలా దృఢంగా నిలబడేటట్టు చేసి వుండవచ్చు. తల్లి దండ్రుల పట్ల భయభక్తులు ప్రదర్శించి ఉమ్మడి కుటుంబంగానే వుండే నిర్ణయం తీసుకునేందుకు దోహదం చేస్తుంది.

'విషవలయం' నవల్లో రాధమ్మ పెంపుడు కొడుకు సత్యమూర్తి. సత్యమూర్తికి తన భర్త బలరామయ్య దత్తత తీసుకోవడాన్ని రాధమ్మకు యిష్టం లేక పోయినా తీసుకువచ్చిన ప్రేమతో పెంచుతుంది. బలరామయ్య మరణించాక ఉభయుల ఆశ్రితులు వచ్చి చేరడంతో వాళ్ళిద్దరి మధ్య అనురాగం స్థానే ద్వేషం చోటు చేసుకొంది. రాధమ్మ సత్యమూర్తితో "నీ వెప్పుడైతే పెంపుడు కొడుకుగా వచ్చావో అప్పుడే ఆ సంబంధాలన్నీ తెగిపోయాయి . కుటుంబాలు, కులంబాలు నెలల తరబడి పడివుండటానికి ఇదేమీ సత్రంకాదు. ఇంట్లోకి వచ్చిన ఇన్నాళ్ళకీ, ఇన్నేళ్ళకి నన్నే ఎదురిస్తున్నా వట్రా. ఆ కాస్త ఆస్తి చేజిక్కేసరికి కళ్ళు నెత్తి మీదికి వచ్చాయా? అప్రాచ్యుడా.........వీలు రాశాక కూడా ఉమ్మడిగా వుండటం

ఒక్క క్షణం కూడదని"[5] అంటుంది. సత్యమూర్తి రాధమ్మ వేరుపడతారు. ఒకర్ని ఒకరు తీవ్రంగా నిరసించుకుంటారు. కోర్టు కెక్కుతారు. అయినా సత్యమూర్తిపై రాధమ్మకు అంతరాంతరాల్లో మెనలేని ప్రేమ వుంటుంది. తను చరమదశలో సత్యమూర్తి వచ్చి చూడలేదని రాధమ్మ వాపోతుంది. సత్యమూర్తికి కూడా రాధమ్మ అంటే ప్రేమాభిమానాలు లేక పోలేదు. అయితే సత్యమూర్తి వాటిని బయట పెట్టలేని బలహీనుడతడు.

'మేడలో నీడలు' నవల్లో లలితమ్మ – రామం, సుందరం తల్లీ కొడుకులు. ఒకరు ప్రేమించి పెళ్ళి చేసుకుంటే మరొకరు పెద్దల యిష్టప్రకారం పెళ్ళి చేసుకుంటారు. కోడళ్ళ విషయంలో యెక్కడా మనస్తాపం కలిగించిన లలితమ్మకు కొడుకుల విషయంలో మనస్తాపం చోటు చేసుకుంటుంది. రామం భార్య మనోరమ, కొత్త జీవితంకోసం ఇల్లు వదలి వెళ్ళిపోయిన మనోరమ కొద్ది కాలానికి పశ్చాత్తాపంతో తిరిగివస్తుంది. 'నా తప్పును క్షమించి స్వీకరించమని' భర్తను ప్రాధేయ పడుతుంది మనోరమ. అయినా రామం, మనోరమ మాటల్ని అంగీకరించడు. ఆవేశాన్ని విడిచి తప్పు తెలుసుకున్న కోడల్ని స్వీకరించమని లలితమ్మ కొడుకును కోరుతుంది. రామం తల్లి మాటల్ని కూడా నిరాకరిస్తాడు. లలితమ్మ అహం దెబ్బతింటుంది. కొడుకుతో లలితమ్మ సానునయంగానే యిలా అంటుంది. "కేవలం ఆవేశంతో తొందరపడక నిదానంగా ఆలోచించిచూడు. ఇప్పుడు తనతప్పు తెలుసుకుని పశ్చాత్తాప పడుతోంది. ఈ ఇంటికోడలు దుడుకుతనం తప్ప వేరే కల్మషం లేదని నా వుద్దేశం . . ఆమెకు మనం ఆశ్రయం యివ్వకపోతే యెవరిస్తారు. జరిగినదంతా మరిచిపోయి ఈ ఇంటి స్థితిగతుల్ని కూడా దృష్టిలో పెట్టుకుని ఆలోచించిచూడు. . . . .తల్లిపై నుండి బ్రతిమాలుతున్నాను. నీ కోసం, మన కోసం, ఈ ఇంటి సుఖ శాంతులకోసం నువ్వు కోడల్ని అంగీకరించవా? మీ ఆవేశాలు, ప్రతాపాలు మీవేగానీ, మా గొడవ మీకు ఒక్కరికీ అక్కరలేదురా?" అని మనస్తాపంతో అంటుంది. లలితమ్మ మాటల్ని కూడా తిరస్కరించగా ఆమె మాతృహృదయం గాయపడుతుంది. పెద్దరికం చిన్నబోతుంది. తన బిడ్డే తనమాట విననప్పుడు జీవితానికి అర్థం లేదనిపిస్తుంది. ఆత్మ హత్యకుకూడా పాల్పడుతుంది. చివరకు లలితమ్మ ఎలాగో ఒప్పించి కృతకృత్యురాలవుతుంది.

**3.3 తండ్రీ కొడుకులు :**

పురుష స్వామ్య కుటుంబ వ్యవస్థలో పురుషునికి అధికారంతోపాటు ఎన్నో బాధ్యతలు కల్పించబడతాయి. పురుషుడు కుటుంబాన్ని పోషిస్తూనే పిల్లలకు బ్రతుకు తెరువు చూపించవలసి వుంది. లోకజ్ఞానం కలిగించవలసి వుంది. తండ్రుల్లో రకరకాల వారున్నట్టే కొడుకుల్లో కూడా వున్నారు. తండ్రిని గౌరవించి అతని మనసు కనుగుణంగా నడుకునేవారు కొందరయితే, అతన్ని నిర్లక్ష్యం చేసి బుద్ధి పుట్టినట్లు ప్రవర్తించేవాళ్ళు ఎందరో వున్నారు. వేణుగోపాలరావుగారి కుటుంబ జీవిత నవలల్లో తండ్రీకొడుకుల సంబంధం వారి కుటుంబ జీవితం పరిశీలిద్దాం.

'పెంకుటిల్లు' నవల్లో చిదంబరం—నారాయణ, ప్రకాశం వాసు తండ్రీ కొడుకులు. చిదంబరం బాధ్యతారహితంగా వ్యవహరించే తండ్రి. ఎప్పుడూ పేకాటలో మునిగివుండటంవల్ల కుటుంబాన్ని పట్టించుకోడు. ఆ ఇంటి పెద్దకొడుకు నానారాయణమీద కుటుంబ బరువుబాధ్యతలు పడతాయి. ఆలోచించగలవాడు కాబట్టి అన్నిటిని సరిపెట్టుకుంటూ నెట్టుకుపోతాడు. తండ్రి ప్రవర్తన బాధ కలిగించినా పల్లెత్తుమాట అనడు. జన్మనిచ్చిన తండ్రి కాబట్టి అతనిమీద గౌరవం. నారాయణకు స్వతహాగా అబ్బిన సంస్కారం. తండ్రిపట్ల యిలాంటి విధానం అవలంబించేందుకు దోహదం చేసివుండవచ్చు.

రెండవ కొడుకు ప్రకాశం కూడా తండ్రిపట్ల గౌరవప్రపత్తులే కలిగి వుండటం గమనార్హం. చిదంబరం తన తప్పు తెలుసుకున్నాక తాను సంతానంపట్ల అవలంభించిన వైఖరికి పశ్చాత్తాపపడ్డాడు. కొడుకులపట్ల వాత్సల్యాభిమానాలు ప్రదర్శించాడు. నారాయణ పెళ్ళి జరగడానికి గట్టిగా కృషి చేస్తాడు. కులాంతర వివాహం చేసుకుని కొడుకు ప్రకాశం ఇంటికి వచ్చినప్పటికి అతన్ని ఆదరిస్తాడు. వాసు కాలు పోగొట్టుకొన్నప్పుడు చిదంబరంకు ఇంటి పరిస్థితు లేమిటో గుర్తుకు వస్తాయి. కొడుకు వైద్యం కోసం ఎన్నో తంటాలు పడి తనకు చేతనైనంత డబ్బు తీసుకువస్తాడు.

'మనిషిలోని మానసిక బలహీనతలు కాలానుగుణంగా మార్పు చెందుతా యన్న సత్యాన్ని గుర్తించి రచయిత తండ్రీకొడుకుల మధ్య అనుబంధం ఇక్కడ సృష్టించడం జరిగింది.

'ఈ దేశంలో ఒక భాగమిది' నవల్లో తండ్రీకొడుకుల మధ్య వున్న సంబంధం అతి సహజంగా చిత్రింపబడింది. రంగారావు క్రమశిక్షణ పేరుతో ప్రతి చిన్న విషయంలోనూ కొడుకుల్ని ఇబ్బందిపెట్టే తండ్రిగా మనకు దర్శనమిస్తాడు. తండ్రి అంటే ముప్పురి కొడుకులకు ఎలర్జీ. ముగ్గురు కొడుకుల హృదయాల్లో ఎన్నో సంఘర్షణలు చెలరేగుతున్నప్పటికీ తండ్రికి ఎదురు మాట్లాడలేక లోపల్నే కుమిలిపోతుంటారు. ఆ కుటుంబంలో తోడికోడళ్ళ మధ్య తలెత్తే తగాదాలు తండ్రీ కొడుకుల మధ్య కూడా అగాధాన్ని సృష్టిస్తాయి.

డాక్టర్ రంగారావు కారును సైతం పరాయివాళ్ళదిగాను, డ్రైవర్ని చూస్తే తండ్రి తరువాత అతనే యజమాని అని కుమార్ భావించడంతో తండ్రీకొడుకుల మధ్య ఆప్యాయతలు దూరమై అగాధం పెరుగుతున్న సంగతి వ్యక్తమౌతుంది. ఈ వ్యతిరేకతకు తోడు పయిపురితో రంగారావు "మావాడిదేముందండీ అరటిపండు ఒలిసినట్టుగా అంతా వాడి చేతిలో పొలిచిపెట్టాను. ఎందుకంటే నా చిన్నతనంలో నేను పడిన బాధలు వాడి జీవితంలో వాడు పడడం నా కిష్టంలేదు. ...కుమార్ చదువు పూర్తిచేయించాను. నేను వుండడం వాడికి ఎంత ఎసెట్. వాడు ప్రాక్టీస్ బిల్డ్ చేసుకున్నాడంటే నలుగురిలో మంచిపేరు తెచ్చుకున్నాడంటే ప్రక్కన పెద్ద వాడ్ని నేనున్నాను కాబట్టి"[7] అని రంగారావు మాట్లాడటంలో కొడుకుగా కుమార్ ఎంత ఆత్మన్యూనతా భావం కలిగివుంటాడో ఆ మాటలవల్ల తెలుస్తుంది. కుమార్ డాక్టరుగా తన తండ్రితోపాటు తానూ ప్రాక్టీస్ చేయడంవల్ల అతను ఎదుర్కొనే ఇబ్బందులు వర్ణనాతీతం.

రంగారావు మాటల ధోరణిబట్టి రచయిత "కొడుకుకోసం తండ్రి చేసింది రివాజయినా, అది ధర్మమైనా నలుగురూ, గొప్పగా చెప్పుకుంటారు. తండ్రికోసం కొడుకు చేసింది రివాజు కాకపోయినా, ధర్మాన్ని మించిందయినా ఘనంగా చెప్పుకోరు సరికదా సామాన్యమైనదిగా, తేలిగ్గా కొట్టిపారేస్తారు. చెయ్యనిదాన్ని గురించి మాత్రం చెప్పుకుంటారు. ఆ మాటకొస్తే 'ఈ దేశంలో కొడుకులవల్ల తండ్రులు పడే యిడుములు కంటె తండ్రులవల్ల కొడుకులు నలగటం చాలా ఎక్కువ"[8] అని అంటున్నారు. ఈ మాటలవల్ల రంగారావు ఎలాంటి మనస్తత్వం కలవాడో తెలుస్తుంది. రంగారావు మనస్తత్వాన్ని గుర్తించుకునే రచయిత తన అభిప్రాయాన్ని చెప్పినట్టు మనకు ద్యోతకమవుతుంది.

'విష వలయం' నవల్లో బలరామయ్యకు సత్యమూర్తి దత్తపుత్రుడు. అయినా బలరామయ్య సత్యమూర్తిని కన్నకొడుకుగానే గౌరవిస్తాడు. అతడు అమాయకుడని, లోకం పోకడ తెలియనివాడని జాలిపడతాడు. బలరామయ్య అవసానదశలో వున్నప్పుడు సత్యమూర్తి దగ్గరకు పిలిచి "జీవితాన్ని నిర్మలంగా తేలిగ్గా భావిస్తున్నటువంటివాడివి. ఒకప్పుడు నేను అమిత పేదవాణ్ణి. జీవితంలోకి ఎగబడ్డాను. చెప్పుకోదగ్గ ఆస్తి గడించాను. ఆస్తితోపాటే అనేక సమస్యలు తలెత్తుతాయి. నాకు డబ్బు విలువ తెలుసు. నా మీద కక్షగట్టారు. ఎన్నో ఎత్తులు వేశారు. డబ్బు పాపిష్టిది, అందులో నువ్వు దత్తపుత్రుడివి. నువ్వు ఎలా నెగ్గుకు వస్తావో తెలీదు. సగం నీ పేరా, సగం మీ అమ్మ పేరా రాసిపోతున్నాను. నా కష్టం, నా శ్రమ మీరు నిర్లక్ష్యం చేత వృథాపరిస్తే నా ఆత్మ అశాంతితో అలమటిస్తుంది. నా ఆత్మకు ద్రోహం చెయ్యకు ఎవర్ని దగ్గరకు చేరనియ్యకు. నాకు న్యాయం చెయ్యి"[9] అని హితబోధ చేసి ప్రాణం విడుస్తాడు.

సత్యమూర్తి కూడా తండ్రిపట్ల గౌరవభావం కలిగివున్నవాడే. అయినా తండ్రి మరణానంతరం వచ్చిన ఆశ్రితులకు తన హృదయ దౌర్బల్యంవల్ల స్థానమిచ్చి బలరామయ్య మాట నిలబెట్టుకోలేకపోతాడు. తన తల్లి ఆస్తిని కాజేసిన వీరభద్రంకు కోర్టుద్వారా బుద్ధి చెప్తాడు. అతడు పన్నిన కుట్రను భంగపరచి చెల్లెలు విజయకు ఆస్తి సంక్రమించేటట్టు చూస్తాడు. అయినవాళ్ళ దగ్గర అవహేళనలకు. అవమానాలు భరించలేని సత్యమూర్తి తనకు వచ్చిన ఆస్తినంతా ధర్మ సంస్థలకు రాసి ఆ విషవలయంలోంచి బయటపడతాడు. ఆస్తి వ్యవహారాలవల్ల సత్యమూర్తి మరింత కృంగి ఆస్తిమీద నిరాశ జనించి వదలి వెళ్ళిపోవడం ఇక్కడ మనం గమనించవలసిన విషయం.

'మేడలో నీడలు'లో విశ్వనాథరావుకు ఇద్దరు కొడుకులు. రామం, సుందరం. ఫారెస్టు రేంజరు అయిన విశ్వనాథరావు తన అక్రమ సంపాదనతో కొడుకుల అభ్యున్నతికి పాటుపడతాడు. పెద్దకొడుకు రామం విశ్వనాథరావు అక్రమ సంతానమయిన కనకవల్లి కూతురు వసంతబాలను పెళ్ళి చేసుకోవాలనుకుంటాడు. తన పిల్లలకు తన గతజీవితం తెలియనందుకు విశ్వనాథరావు ఎంతగానో బాధపడతాడు. అతని మానసిక సంఘర్షణ వర్ణనాతీతం. చివరికి నిజం చెప్పి పెళ్ళి

నిర్ణయాన్ని వారించేందుకు దోహదపడతాడు. రామం, వసంతబాల పెళ్ళి జరిగినట్లయితే అంతకంటె నీచమైనది, పాపమైనది మరొకటి లేదనుకొన్న సత్యాన్ని తెలుసుకున్న విశ్వనాథం తన రహస్యాన్ని చెప్పక తప్పలేదు. జీవితంలోని కొన్ని ముఖ్యమైన విషయాల్ని మరుగుపరచకూడదన్న రచయిత అభిప్రాయంగా మనకు తెలుస్తుంది.

'ఒకే రక్తం – ఒకే మనుషు'లో పుండరీకాక్షయ్యకు నలుగురు కొడుకులు. తన కొడుకు లందరికీ మేనరికపు పెళ్ళిళ్ళు చేస్తాడు. వాళ్ల ఇష్టాయిష్టాలను గుర్తించడు. పుండరీకాక్షయ్య కొడుకులు కూడా తమ తండ్రి ప్రయత్నాన్ని వారించరు. మేనరికపు పెళ్ళిళ్ళవల్ల వారికి కలిగే పిల్లలు అంగహీనులుగా, కురూపులుగా పుట్టడం జరుగుతుంది. అనారోగ్య సంతానం కలిగినప్పటికీ తండ్రిని పల్లెత్తు మాట అనరు. పెద్దల మూర్ఖత్వపు ఆచారాలకు కొడుకులు ఎలాంటి ఒడుదుడుకుల్ని ఎదుర్కొంటారో వేణుగోపాలరావుగారు ఇందులో స్పష్టం చేశారు.

'సూర్యుడు దిగిపోయాడు'లో రాఘవరావుకు తమ పిల్లలమీదే పంచప్రాణాలు. వాళ్ళకోసమే తను జీవిస్తున్నామనుకుంటాడు. వాళ్లకు చిన్న జబ్బు చేసినప్పటికీ తను ఆఫీసుకు సెలవుపెడతాడు. ఎంతో కష్టపడి వాళ్లను పెంచి పెద్దవాళ్లను చేస్తాడు. వాళ్ళు తలకో పద్ధతి అవలంభించినా, తలోదారి వెళ్ళినా తనను నిర్లక్ష్యం చేసినా బాధపడతాడేగాని, వాళ్లను మనసులో కూడా అసహ్యించుకోడు. రాఘవరావు కొడుకులు తండ్రి ప్రదర్శించే ప్రేమను గుర్తించలేరు. తండ్రి ఇచ్చే చనువును దుర్వినియోగం చేస్తారు. తండ్రికి యిష్టంలేని పనులుచేసి కష్టం కలిగిస్తారు పెదకొడుకు మోహన్ రోజాకో ఉద్యోగం చేస్తూ ఇంటిపట్టున వుండేవాడు కాదు. రెండో కొడుకు ఇంజనీర్ ఉద్యోగం చేస్తున్నప్పటికీ తమ ఇంటిని ఆదుకోలేకపోతాడు. చివరికి వృద్ధాప్యంలో రాఘవరావుని నిరాదరంగా విడిచి తమ దారిని తాను చూసుకుంటారు. వేణుగోపాలరావుగారు రాఘవరావును కొడుకులచే దగాపడ్డ తండ్రిగా బహుచక్కగా చిత్రీకరించారు. తండ్రీ కొడుకుల మధ్య సఖ్యత లేనట్టయితే రాఘవరావును వారి పిల్లల్ని ఉదాహరణగా మనం తీసుకోవచ్చు.

'భారతి' నవల్లో గంగాధరం కొడుకు సారధి. సారధి ప్రేమించిన అమ్మాయి అయిన భారతిని పెళ్ళి చేసుకుంటాడు. భారతి కుష్ఠురోగి అని తెలుసు

కాని గంగాధరం అసహ్యించుకుంటాడు. తన కొడుకుకు వచ్చిన దుస్థితికి బాధ పడతాడు. భారతిని సారధి నుండి దూరం చేస్తాడు. భారతి దగ్గర బలవంతంగా విడాకులు యిప్పిస్తాడు. గంగాధరంకు అన్నిటికంటె తన కొడుకు శ్రేయస్సే ముఖ్యం. అందువల్ల అతడు ఏమైనా చేసేందుకు సిద్ధమే. కొడుకు సారధికి తన భార్య భారతిమీద ప్రేమ వున్నప్పటికీ ఆమెను ఆదుకోలేకపోతాడు.

సారధి తన తండ్రి మాటకు ఎదురు చెప్పలేని బలహీనుడు. తండ్రి ప్రేరణ వల్లనే సారధి కుంతలతో మరోపెళ్ళి చేసుకుంటాడు. తాను ఎంత మానసికవ్యథకు గురవుతున్నప్పటికీ తండ్రి మాటకు ఎదురు చెప్పలేని అసమర్థుడుగా సారధి ఈ నవల్లో మనకు కనిపిస్తాడు. తండ్రి కారణంగా సారధి జీవితం మోడుగానే వుండి పోతుంది. తండ్రి ప్రవర్తనవల్ల కొడుకు జీవితం దగాపడిందని రచయిత అభి ప్రాయం పడినట్లుగా తెలుస్తుంది. ఈ విషయంలో రచయితతో ఏకీభవించవలసి వుంటుంది.

"తోడూ-జోడూ"లో సుదర్శనంకు ఒక్కగానొక్క చిరంజీవి. చిరంజీవికి మంచి సంబంధంలోనే పెళ్లి జరిపిస్తారు. చిరంజీవి భార్య దివ్య. తండ్రీ కొడుకును పెంచి ప్రయోజకుడ్ని చేస్తాడు. చిరంజీవికి బ్యాంక్‌లో ఉద్యోగం వస్తుంది. కొడుకు దగ్గర కొన్నాళ్ళుండి గడపాలనే ఆతురతతో కొడుకు ఇంటికి వస్తాడు సుదర్శనం, కమలమ్మలు. కోడలు పెట్టే బాధల్ని, వ్యంగ్యపు మాటల్ని కూడా మౌనం వహిస్తూ భరిస్తారు. కొడుకు చిరంజీవికున్నంతలో తండ్రికి ఏ లోటూ లేకుండా చూసుకోవడానికి ప్రయత్నిస్తాడు. సుదర్శనంకు పక్షవాతం వచ్చినప్పుడు ఆసుపత్రికి తీసుకువెళ్లి నయం చేయిస్తాడు. కాని కొద్దిరోజులకే సుదర్శనం మర ణిస్తాడు. తన భార్య మాటలవల్ల తన తండ్రి మానసికంగా కృంగి పెరాలసిస్‌తో మరణించడంతో చిరంజీవికి తీరనిలోటు ఏర్పడుతుంది.

'హారతి' నవల్లో తండ్రీ కొడుకుల అనుబంధం ఆదర్శమయంగా చిత్రింప బడింది. ఆదిశేషయ్య, శ్రీధర్ తండ్రీ కొడుకులయినా మిత్రుల్లాగా మెలగడం యిక్కడ గమనార్హం. రైలు ప్రమాదంలో భార్యల్ని పోగొట్టుకున్న వీరిద్దరూ సమానంగానే దుర్వ్యసనాలకు గురి అవుతారు. శ్రీధర్ తండ్రి ఆదిశేషయ్య ట్యాంక్‌బండ్ మీద కనిపించిన హారతిని తన ఇంటికి తీసుకువస్తాడు. ఆమెను తన

కొడుక్కి పెళ్లి చేయాలని అతన్ని మామూలు మనిషిని చేయాలని అనుకుంటాడు. శ్రీధర్ కూడా హారతిని చూసిన తరువాత తన తండ్రి పెళ్లి చేసుకోవాలని దానితో ఆయన జీవితం యథాపూర్వంగా కలగాలని భావిస్తాడు. తండ్రికి కొడుకు మీద, కొడుక్కి తండ్రిమీద యెనలేని ప్రేమానురాగాలున్నట్లు వారి సంభాషణల వల్ల తెలియవస్తుంది. శ్రీధర్ తన తండ్రితో "ఆమెతో నిన్ను చూసిన ప్రతి సంఘటన లోనూ నాకు ఆమెలో అమ్మ కనిపించింది ...... ఆమె నిన్ను ప్రేమిస్తే యెంత బాగుండునని వువ్విళ్ళూరాను. నేను స్థిమితంగా, హాయిగా వున్నాను. అమ్మ లేకుండా ఈ భూమిమీద నువ్వెంత నిస్పృహాయుడివో నాకు తెలుసు. అమ్మలేని లోటు తీరాలి. నువ్వు మామూలు మనిషివి కావాలి .. హారతి దేవత. మనపట్ల చేసిన అపరాధానికి దేవుడు పశ్చాత్తాపంతో క్రుంగి ప్రాయశ్చిత్తం చేసుకోవటానికై కటాక్షించి వరంగా పంపిన దేవత. ఈ ఒక్క కోరిక చెల్లించు నాన్నా"[10] అని ప్రాధేయపడతాడు. ఇక్కడ తండ్రీ కొడుకుల మధ్యవున్న ప్రేమానురాగాలు వ్యక్తమౌతాయి.

కొమ్మూరి వేణుగోపాలరావు గారి నవలల్లో తండ్రీ కొడుకుల సంబంధం ఒకే విధంగా లేదు. ఎక్కడా కుమారులు తండ్రుల్ని యెదిరించినట్టు కనిపించదు. 'హారతి' నవల్లో మాత్రం యెంతో ఆదర్శనీయంగాను, కనుపిస్తుంది. ఇందులో అధికృత, వ్యసనపరులు, ఆస్తిపరులు, సంప్రదాయానికి కట్టుబడ్డ, దగాబడ్డ తండ్రులుగా మనకు దర్శనమిస్తారు. న్యూనతాభావం, సఖ్యత క్రమశిక్షణ, క్రమ శిక్షణారాహిత్యం గల కొడుకుల్ని కూడా మనం యిందులో గమనించవచ్చు.

3.4 తల్లీ కూతుళ్లు :

ప్రపంచంలో అన్ని బంధాల కన్నా తల్లీ కూతుళ్ల అనుబంధమే దృఢ తరమైంది, నాలుగు కాలాలపాటు నిలువ గ్గలిగేది. అయితే వేణుగోపాలరావు గారి నవలల్లో యెక్కువగా చోటు చేసుకోక పోవడం చెప్పుకో తగ్గ విషయం. నామ మాత్రంగానే అక్కడక్కడా కనిపిస్తుది.

'పెంకుటిల్లు' నవల్లో శారదాంబ కూతుళ్ళు అన్నపూర్ణ, రాధలు అన్న పూర్ణకు ముకుందరావుతో పెళ్లవుతుంది పురుడు పోసుకోవడం కోసం పుట్టింటికి వస్తుంది అన్నపూర్ణ. బిడ్డను ప్రసవించిన తరువాత తనువు చాలిస్తుంది. అప్పటి

శారదాంబ దుఃఖం మాటల కందనిది. మాతృ హృదయాన్ని ఆవిష్కరించ గలిగి నది. శారదాంబ రెండో కూతురు రాధ. సినిమాకు వెళ్ళివచ్చిన రాధను నాన్నమ్మ మందలిస్తుంది. రాధ మనసు చివుక్కుమంటుంది. శారదాంబ మాతృ హృద యంలో వాతావరణాన్ని తేలిక పరుస్తుంది. కుటుంబ ఆర్థిక పరిస్థితులతో యెదు ర్కొంటున్నప్పుడు, వాసు కాలు పోగొట్టుకున్నప్పుడు ఆసుపత్రులకు కావలసిన డబ్బుని రాధ తన స్నేహితురాలైన ప్రమీల దగ్గర అరువుతెచ్చి ఆదుకుంటుంది. తన కూతురు చేస్తున్న ఈ సహాయానికి శారదాంబ సంతృప్తి చెందుతుంది.

'ఈ దేశంలో ఒక భాగమిది' నవల్లో శారదమ్మ కూతురు సుజాత. సుజాత భర్త భాస్కర్. తన భర్తతోపాటు పుట్టింటిలోనే వుంటుంది. భాస్కర్ యెన్ని యిబ్బందులు పెట్టినప్పటికీ శారదమ్మ వీళ్ళను ఇంటిలోనే వుండనిస్తుంది. సుజాత కూడా తల్లి మనసు గుర్తించి అనుగుణంగా నడచుకుంటుంది.

"ఒకే రక్తం ఒకే మనుషులు"లో అనసూయమ్మ కూతురు గిరిజ. గిరిజకు మేనరికపు పెళ్ళి యిష్టం ఉండదు. భర్త ఇంటికి వెళ్ళకుండా మొండికేస్తుంది. అనసూయమ్మకు కూతురు పరిస్థితి అసంమంజసంగా అనిపిస్తుంది. కూతురు కాపురానికి వెళ్ళాలని అనసూయమ్మ పట్టుబడుతుంది. చివరికి వొప్పించి పంపు తుంది. గిరిజ తన యిష్టానికి వ్యతిరేకంగా పెళ్ళి జరిగినా కాపురానికి వెళ్ళమని తల్లి బలవంతం పెట్టినా, కొట్టినా సహిస్తుంది. ఎదురుదిరగదు. అనసూయమ్మకు గుండెజబ్బుతో పడిపోయినప్పుడు గిరిజ తల్లికి సపర్యలు చేయడానికి ప్రయత్ని స్తుంది.

'మేడలో నీడలు'లో లలితమ్మ కూతుర్లు సుభద్ర, ఆశ. సుభద్ర తన ఇద్దరి మగపిల్లలతో పుట్టింటికి వస్తుంది. మసూచితో పిల్లలు మరణిస్తే లలితమ్మ తన కూతురి దుఃఖంలో పాలుపంచుకుంటుంది. రెండో కూతురు ఆశ. కట్నం ఎక్కువ తీసుకురాని కారణంగా ఆశ భర్త రాఘవరావు ఆశను హింసించి, చిత్ర హింసలు పెట్టి పుట్టింటికి పంపిస్తాడు. లలితమ్మ తన కూతురుకు జరిగిన అన్యా యాన్ని అర్థం చేసుకొని ఇంట్లోనే వున్న మేనళ్ళుడు ప్రసాద్ కిచ్చి మళ్ళీ పెళ్లి చేయడంలో తోడ్పడుతుంది. ఈ నవల్లోని మరో తల్లీకూతుళ్ళుగా కనకవల్లి, వసంతబాలలు. కనకవల్లి వసంతబాలను ఉన్నత స్థితికి తీసుకుపోవాలని ఆరాటపడు

తుంది. అందుకే మద్రాసు తీసుకెళ్లి శాయశక్తులా ప్రయత్నిస్తుంది. తన కూతురు ప్రేమించిన రామం, తన అక్రమ భర్త సంతానమేనని తెలుసుకుంటుంది కనకవల్లి. కనకవల్లికి నిజానిజాలు తెలిసి ఆవేదన చెంది రామం, వసంతబాలల పెళ్ళి జరగకుండా చూస్తుంది.

'విషవలయం' నవలలో రాధమ్మ కూతురు విజయ. తల్లిదండ్రుల మాటల్ని నిరాకరించి ప్రేమించిన కృష్ణమూర్తితో వెళ్ళిపోతుంది, విజయకోసం రాధమ్మ మాతృహృదయం చివరి ఘడియల్లో ఆక్రోశిస్తుంది. కూతురు రాలేదని వాపోతుంది. విజయ తాను ఇంటినుండి ప్రేమించినవాడితో వెళ్ళిపోతున్నప్పటికీ తల్లిమీద వున్న భక్తికొద్దీ ఉత్తరాలు మాత్రం రాయగలుగుతుంది. విజయ తిరిగి ఇంటికి వచ్చేవేళకె రాధమ్మ మరణించి వుంటుంది. విజయ బాధకు అంతం వుండదు.

వేణుగోపాలరావుగారికి నవలల్లో తల్లికూతుళ్ళ అనుబంధం వుండవలసిన దృఢతరంగా కాక సాధారణంగానే వుంది. దీన్ని తెలిపే సన్నివేశాలు కూడా తక్కువగానే మనకు కనిపిస్తాయి. బహుశః రచయిత పురుషుడు కావడమే కారణం కావచ్చు.

### 3.5 తండ్రీ కూతుళ్ళు :

తల్లీ కూతుళ్ళ అనుబంధం తరువాత తండ్రీ కూతుళ్ళ అనుబంధమే దృఢతరమైందిగా చెప్పుకోవచ్చు. మమకారం సానుభూతి ఈ అనుబంధానికి ప్రాణమని గుర్తించవచ్చు.

'ఒకే రక్తం—ఒకే మనుషులు' నవల్లో వైకుంఠరావు కూతుళ్ళు సామ్రాజ్యం. శ్రీలక్ష్మి. తల్లి లేకపోయినా వైకుంఠం తన ఇద్దరి కూతుళ్ళను ప్రాణప్రదంగా పెంచుతాడు. పెద్దకూతురు సామ్రాజ్యంకు తన 12వ ఏటనే పక్షవాతం రావడంతో వైకుంఠం తట్టుకోలేకపోతాడు. సాంఘీకాచారాలకు లోబడి సామ్రాజ్యం పెళ్ళి తన బావమరిది కొడుకు మన్మధరావుతో నిశ్చయం చేస్తాడు. తండ్రి అంతర్యం గ్రహించిన సామ్రాజ్యం "నా గురించి బెంగపెట్టుకోకండి నాన్నా. నా జీవితం నిరర్థకమైపోయింది. నాకు పెళ్ళి జరిగితే అది యింకొకరి

జీవితాన్ని కూడా నాశనం చేసినట్లవుతుంది. మంచంమీద నుంచి లేవలేనివానికి పెళ్ళెందుకు నాన్నా! మొగాడితో సేవలు చేయించుకోవటానికా! వద్దు. శ్రీలక్ష్మి నిచ్చి వాడకు చెయ్యండి"[11] అని తన అంతరంగంలోని ఆవేదనను తెలియ జేస్తుంది. కాని కూతురు ఘోష వినిపించుకోని బండరాయి అయిన వైకుంఠం సామ్రాజ్యంను మన్మథరావుకు ఇచ్చి పెళ్ళి చేస్తాడు. నిర్ణయం మేరకు సామ్రాజ్యం తన భర్తకు సంసారం లో సుఖసంతోషాలు ఇవ్వలేకపోతుంది. తను ఆ సుఖానికి నోచుకోలేకపోయింది.

ఆదే నవల్లో పుండరీకాక్షయ్య చిన్నకూతురు గిరిజ. గిరిజకు కూడా మేనరికపు పెళ్ళి చేయాలని నిర్ణయిస్తాడు పుండరీకాక్షయ్య. గిరిజ తన పెళ్ళికి నిరాకరించినప్పటికీ సుందరంతో పెళ్ళి చేస్తారు. వాళ్ళ సంసారం అనునిత్యం అగాధాలు చోటు చేసుకుంటుంది. గిరిజకు పుట్టినబిడ్డ నల్లగాను, వికారంగాను పుట్టడంతో తన మనోవ్యథను తండ్రితో "మీ అందరికీ సహజంగా కనిపించింది ఆనాడు నాకు విపరీతమయింది నాన్నా. ఇప్పుడు నాకు సహజంగా కనిపించేది మీకు విపరీతమనిపిస్తోంది. జరగరాని పనే జరిగిపోయింది నాన్నా! జరగకూడనిది ఇంకా జరగనివ్వరానిది; మనమంతా కలిసి కూలి పండగ ఎందుకని మనుషుల్తోనే ఓ యంత్రాంగం నడుపుతున్నాం నాన్నా! ఈ యంత్రాంగంలోంచి తెలివిహీనులు, వికృతాకారులూ, రోగగ్రస్థులూ, పుట్టుకువచ్చి వాళ్ళ సౌభాగ్యంతో మన కుటుంబాలు వృద్ధి చేసుకుంటున్నారు.......నా రక్తం నాలో గడ్డకట్టుకుపోయింది. నా రక్త బిందువులు ఏ రూపంలోనైనా బయటకు చిందటానికి వీల్లేదు. ఈ శరీరంలోనే, ఈ శరీరంలోనే యింకిపోవాలి. ఈ చరిత్ర ఒంటరిగానే నశించిపోవాలి"[12] అని అంటుంది. ఇచటి మేనరికపు పెళ్ళిళ్ళవల్ల కలిగే అనర్థాల్ని గురించి తన తండ్రితో చెప్పడం ఇక్కడ గమనించవచ్చు. పుండరీకాక్షయ్య ఏమీ చేయలేని నిస్సహాయంగా వింటూ వుండిపోతాడు.

మేనరికపు పెళ్ళిళ్ళలోని అనర్థాల్ని, పెద్దల మూర్ఖత్వపు పెళ్ళిళ్ళను గిరిజ మయ్యాటపరుస్తుంది. మేనరికపు పెళ్ళిళ్ళవల్ల కలిగే అనర్థాల్ని సామ్రాజ్యం, గిరిజ పాత్రల ద్వారా వ్యక్తీకరించి డాక్టర్ వేణుగోపాలరావుగారు హితోపదేశం చేశారు.

భారతి నవల్లో గౌరీపతి, భారతి తండ్రీకూతుళ్ళు. భారతికి కుష్ఠువ్యాధి సోకడంతో గౌరీపతి మనసు విలవిలలాడుతుంది. ఆమెకు పెళ్ళి కాదేమోనన్న ఆలోచన అతన్ని మరింత కృంగదీస్తుంది. ఎదురుచూడని విధంగా వచ్చిన సారధి సంబంధాన్ని ఎలాగైనా దక్కించుకోవాలని ఆరాటపడతాడు. అందుకు తండ్రితో భారతి తనకున్న వ్యాధిని గుర్తు చేస్తుంది. గౌరీపతి దూరదృష్టితో కూతురు చెప్పే మాటల్ని కూడా వినిపించుకోడు. అన్నిటికన్నా తన కూతురి శ్రేయస్సే ముఖ్యమని ఆరాటపడుతూ గౌరీపతి, "భారతీ మనం నరకయాతన అనుభవిస్తున్న సమయంలో దేవుడు కరుణించినట్లు ఈ సంబంధం మనల్ని కోరివస్తే ఈ అదృష్టాన్ని కాలదన్నుకుంటావా? నీ దుఃఖాన్ని నేను చూడలేను. నేను నీకు కేవలం తండ్రినే అనుకోకు. చిత్తశుద్ధితో కూడిన శ్రేయోభిలాషిని . . ఇంక యెక్కువ రోజులు బ్రతకటం అసాధ్యం. నీ అయిష్టానికి కారణం నాకు తెలుసు. కాళ్ళదగ్గరకు వచ్చిన అవకాశాన్ని సద్వినియోగం చేసుకుని జీవితాన్ని సరిదిద్దుకోవడం, నిన్ను చేసుకున్న వ్యక్తి అదృష్టహీనుడెలా అవుతాడమ్మా, నీ ఉన్నత స్వభావం వ్యక్తిత్వాలవల్ల పునీతుడై ప్రకాశిస్తాడని"[13] సముదాయిస్తాడు.

గంగారాం కొడుకు సారధితో భారతి పెళ్ళి జరుగుతుంది. భారతి కుష్ఠురోగి అని తెలుసుకున్న గంగారాం చీవాట్లు పెట్టి పుట్టింటికి పంపిస్తాడు. ఆ సంఘటనకి దుస్సహం, దుర్భరం అవుతుంది. పశ్చాత్తాపంగా గౌరీపతి గుండెపోటుతో మరణిస్తాడు. తల్లిలేని కూతురు కోసం శ్వాస నిలుపుకొన్న గౌరీపతి, ఆమె కోసమే చివరిశ్వాస విడిచి అనురాగమూర్తిగా నిలిచిపోతాడు. తండ్రికి తనపట్ల వున్న ప్రేమాభిమానాల్ని భారతి గుర్తిస్తుంది. తన పెళ్ళి విషయంలో యథార్థం చెప్పి తప్పించడానికి ప్రయత్నిస్తుంది. అతడు వినకపోవడంతో అడ్డు చెప్పలేక తండ్రిని నొప్పించడం యిష్టం లేక మౌనంతో తల వంచుతుంది. ఈ తండ్రీ కూతుళ్ళ అనుబంధాన్ని అనుబంధ వైవిధ్యాన్ని కూడా రచయిత చక్కగా ప్రదర్శించారనే చెప్పాలి.

### 3.6 భార్యాభర్తలు :

కుటుంబ జీవితంలో భార్యాభర్తల పాత్ర ఎంతో కీలకమైంది. భార్యాభర్తలు లేని కుటుంబ జీవితం తీగలు లేని వీణవంటిది. సారధి లేని రథం వంటిది. కుటుంబ వ్యవస్థకు భార్యాభర్తలు పునాది.

ఈ శీర్షికలో కుటుంబంలోని తల్లితండ్రుల్ని గురించి చర్చించడం ప్రధానాంశం. వివిధ రకాల మనస్తత్వాలు గల భార్యాభర్తలు ఇందులో ఒకే విధంగా గాక పలురకాలుగా మనకు కనిపిస్తారు.

'పెంకుటిల్లు' నవల్లో అన్యోన్యమైన దంపతులు కనిపిస్తారు. చిదంబరం పెద్దకొడుకు నారాయణతో సుగుణ పెళ్ళవుతుంది. వీరు ఎంతో అన్యోన్యంగా వుంటూ ఒకరి బాధలు ఒకరికి మనసు విప్పి చెప్పుకుంటాడు. ఒకరినొకరు అర్థం చేసుకుని కష్టాలను కలిసే ఎదుర్కోవడానికి ప్రయత్నిస్తారు. నారాయణ తన భార్య సుగుణపట్ల సానుభూతితో "చూడు సుగుణా! మాకేం డబ్బు లేదు. బీద వాళ్ళం. ఈ కాలపు చాలామంది పిల్లల్లాగా లేనిపోని గొంతెమ్మ కోరికలు కోరి అవి తీర్చమని అడిగినట్లయితే తీర్చటం అసాధ్యం. అందరితో మంచిగా వుంటూ కలుపుగోలుతనంగా వుండే మంచి కోడలివని పేరు సంపాదించుకోగలుగుతావు"[14] అని అంటాడు. తన భార్యముందు లేనిపోని గొప్పలు చెప్ప ప్రయత్నించక కుటుంబ సమస్యల్ని ఎలా ఎదుర్కోవాలో చెప్తాడు. ఈ మాటలు నారాయణ మానసిక పరిపక్వతకు గీటురాళ్లుగా నిలుస్తాయి.

భర్త మాటల్ని విన్న తరువాత సుగుణ ఆ ఇంట్లో ఒక వ్యక్తిగా కష్ట సుఖాల్లో పాలుపంచుకోవడానికి సంసిద్ధతను తెలుపుతూ, భర్తకు భరోసా ఇస్తుంది. మధ్య తరగతి దంపతులకు ఆదర్శనీయులుగా ఈ దంపతులను కొమ్మూరిగారు తీర్చిదిద్దారు.

ఇదే నవల్లో చిదంబరం చిన్నకొడుకు ప్రకాశం, తన పరిస్థితుల్ని గుర్తించి అన్నివిధాల అనుకున్న శకుంతలతో పరిచయం ఏర్పడుతుంది. శకుంతల కోరిక మేరకు ఆమెను ప్రకాశం రిజిస్టర్ పెళ్లి చేసుకుంటాడు. వారిది కులాంతర వివాహం. కాబట్టి ఇంటికి వెళ్ళడానికి వెనుకాడిన భర్తతో శకుంతల ఆలోచించమంటూ "మొగవాడు కీర్తి ప్రతిష్ఠలలో ఏది కోల్పోయినా తిరిగి సంపాదించుకోవచ్చు. కాని ఆడది అలాకాదు. సౌశీల్యం కాని, మంచిపేరు కాని ఒకసారి పోగొట్టుకుంటే తిరిగి తెచ్చుకోవడం సామాన్యమైన విషయంకాదు"[15] ధైర్యం చెప్తుంది. శకుంతల మాటల్నిబట్టి ఆమెకు అత్తవారింటిపై ఎంత మమకారం వుందో తెలుస్తుంది. భార్యాభర్తలు ఎలాంటి సంబంధ బాంధవ్యాలు కలిగివుండాలో, ఒకరికొకరు

ఎలా పరిష్కరించాలో పైమాటలు నిర్దేశిస్తాయి. ప్రకాశం ఒక భార్య మాటల్ని అర్థం చేసుకుని తల్లిదండ్రులున్న చోటికి వెళతాడు. కులాంతర వివాహం చేసుకున్న నుంచి అనురాగంతో కులం నిలబెట్టగల దాంపత్యం వీరిది.

పై పంక్తులకు విరుద్ధంగా ప్రవర్తించే భార్యాభర్తలు 'ఈ దేశంలో ఒక భాగమిది' నవల్లో మనకు కనిపిస్తారు. సమిష్టి కుటుంబాల్లో వున్న భార్యాభర్తలు ఎలా ప్రవర్తిస్తారో, వారి మానసిక ప్రవృత్తి ఎలా వుంటాయో మాయిపోయే మాటలతో, స్వార్థంతో, అసూయాద్వేషాలతో వారిమధ్య సంబంధాలెలా వుంటాయో ఎలాంటి స్థితికి దారితీస్తాయో కొమ్మూరిగారు ఈ నవల్లో చక్కగా చిత్రీకరించారు.

కుమార్, ప్రభావతి ఇందులో భార్యాభర్తలు. ప్రభావతి కుటుంబ పరిస్థితుల్ని, తోడికోడళ్ల గొడవల్ని ప్రభావతి, కుమార్ ముందు పెడుతుంది. అన్ని విషయాల్లోనూ భర్త తనను సమర్థించాలన్న తపన ఆమెలో కనిపిస్తుంది. ఓపికే మాయితే చిన్నా పెద్దా అన్ని విషయాల్లోనూ జోక్యం కలిగించుకోవాలంటే కుమార్‌కు ఇష్టం వుండదు. వీలైనంతవరకు అన్ని విషయాల్లో ఆడవాళ్లే సర్దుకోవాలి. తను జోక్యం తప్పనిసరి అయ్యే విషయాలు మాత్రం తన దృష్టికి తీసుకువస్తే చాలు అనుకునే మనస్తత్వం నారాయణది. జీవితం ఎన్నో సంఘర్షణలతో నిండివుంది. వాటిని అర్థం చేసుకోగలిగే ఓర్పు వుండాలని బోధిస్తాడు.

కుమార్, ప్రభావతుల దృక్పథాలు భిన్నంగా కనిపించినా వీరిమధ్య అగాధం లేదు. దారులు వేరుకావు. వీరిమధ్య భిన్నత్వంలో ఏకత్వం గోచరిస్తుంది.

ఇదే నవల్లో రంగారావు రెండో కొడుకు హరి. అతని భార్య విమల. ఈ ఆలుమగల మధ్య అన్యోన్యం కనబడదు. తోడికోడళ్ల మనస్పర్థల మూలంగా ఇంటికి వచ్చిన తన భర్త స్నేహితులపట్ల అయిష్టంగా ప్రవర్తిస్తుంది. ఆసమయంలో తన భర్తకు నలుగురిలో పరువు పోతుందన్న ధ్యాసవుండదు. భర్తకు అనుగుణంగా నడుచుకోవాలన్న ఇంగితజ్ఞానం లేకుండా విమల నడుచుకుంటుంది. విమల మనస్తత్వాన్ని గ్రహించిన హరి ఆమెను మందలిస్తాడు. బాధ్యతను గుర్తుచేస్తూ విమలతో "రకరకాల మనుషుల్ని మనం సహించగలగాలి. నేను నా బంధువుల్ని, నా స్నేహితుల్ని, నేను గౌరవించేవాళ్లను నువ్వు గౌరవించాలి. అది నీ బాధ్యత. మీ మామయ్యవచ్చి మన ఇంట్లోవున్నా, నేను విముఖంగా వుంటున్నానా?

ప్రతిదానికి జవాబు చెప్పి ఎదిరించడమేగాని అవతలివాళ్ళు ఎందుకంటున్నారో ఆలోచనక్కరలేదన్నమాట"[16] అని గుర్తు చేస్తాడు.

హరి ఎంత హితబోధ చేసినా ఆమె ధోరణి మార్చుకోదు. భర్తతో నిర్మొహమాటంగా ఓ స్నేహితుల్ని తీసుకురావద్దని చెప్తుంది. ఈ దంపతుల మధ్య ఏకత్వంకన్నా విరోధమే చోటుచేసుకుంది. తోడికోడళ్ళ మనస్పర్ధల కారణంగా వాళ్ళ భర్తలు అనుభవించే మానసిక సంఘర్షణను వేణుగోపాలరావుగారు అతి సహజంగా చిత్రీకరించారు.

'ఒకే రక్తం - ఒకే మనుషులు'లో మేనరికపు సంబంధంగల భార్యాభర్తలు ఎలాంటి మానసిక సంఘర్షణకు లోనౌతారో. చర్చించబడింది. వీరివల్ల కుటుంబంలో ఎటువంటి ఒత్తిడులు కూడా పెరగ్గానడం జరిగింది.

సామ్రాజ్యం, మన్మథరావులు భార్యాభర్తలు. పెరాలసిస్‌తో బాధపడుతున్న సామ్రాజ్యాన్ని మేనరికాల కారణంగా మన్మథరావు పెళ్లి చేసుకోవలసి వస్తుంది. సామ్రాజ్యం ఎప్పుడు మంచాన్ని అంటిపెట్టుకుని వుండటంవల్ల భర్తకు ఎలాంటి సుఖం అందించలేకపోతుంది. సంసార జీవితానికి దూరమైన సామ్రాజ్యం భర్తతో "నేను పాపిష్టిదాన్ని, మీ సుఖాన్ని అనుక్షణం చంపేస్తున్నాను. మీకు సుఖంకన్నా నా దుఃఖమే ఎక్కువ కదూ. అందరి జీవితాలు బాగుంటే ఏ ఒక్కరి జీవితమో ఎందుకు బలికావాలి. నేనంటే నీకెంత ఓర్పో తలుచుకుంటే ఆశ్చర్యమేస్తుందని"[17] అంటుంది. సామ్రాజ్యం భర్తతో తన హృదయ గతాభిప్రాయాలను తెలియజేస్తుంది. తాను అందించలేని సుఖాన్ని తన భర్త రహస్యంగా బలవంతంగా తన చెల్లెలు శ్రీలక్ష్మిద్వారా పొందాడని తెలిసినా అసూయపడదు. అధిక్షేపించదు. ఆమెను పెళ్ళాడవలసిందిగా తన భర్తను కోరుతూ ఉత్తరం రాసిపెట్టి నిద్రమాత్రలు వేసుకుని ఆత్మహత్య చేసుకుంటుంది.

మన్మథరావు తన భార్య పెరాలసిస్‌తో బాధపడుతుంటే చూసి ఆవేదన చెందుతాడు. ఆదుకోలేకపోతున్నందుకు ఆక్రోశిస్తాడు. సామ్రాజ్యం కోరికమేరకు ఆమె చెల్లెలు శ్రీలక్ష్మిని పెళ్ళి చేసుకుంటాడు.

ఇందులో మరో జంట గిరిజ, సుందరంలు. గిరిజకు ఇష్టంలేకపోయినా సుందరంతో పెళ్ళవుతుంది. మేనరికపు పెళ్లిళ్లవల్ల వచ్చే అనర్థాల్ని, కొన్ని

సంభాషణల ద్వారా, డాక్టర్ కిషోర్ ఉత్తరం ద్వారా గిరిజ తెలుసుకుంటుంది. గిరిజ తన భర్తకు శారీరకసుఖం అందించేందుకు నిరాకరిస్తుంది. పుట్టింటికి వచ్చి పశ్చాత్తాపపడి భర్తను పిలుచుకుంటుంది అతనివల్ల సంతానం పొందుతుంది. పుట్టిన బిడ్డ నల్లగా వికారంగా పుట్టడంతో గిరిజ తల్లడిల్లిపోతుంది. తన భర్తతో "బావా నీ జీవితం నాశనం చేశాను. పెళ్లి అయిన దగ్గరనుంచీ నువ్వు నరకాన్ని చూస్తున్నావు. నువ్వు నా కళ్ళకి ఎప్పుడూ నా భర్తగా కనిపించలేదు. నా శరీరంలోని ఒక్క అణువు కూడా నిన్ను భర్తగా ఒప్పుకొని స్పందన పొందలేదు. . నువ్వు మళ్ళీ ఇంకొకర్ని పెళ్ళి చేసుకోవాలి. కాపురం చెయ్యాలి"[18] అని అంటుంది. మేనరికపు వివాహపు వ్యవస్థలో తను ఏర్పరచుకున్న అభిప్రాయాలు సరియైనవే అని తెలుసుకుంటుంది. అందరికీ స్పష్టపరుస్తుంది.

సుందరం తన భార్య ప్రతికూలంగా ప్రవర్తించగా ఆ గాయం మానడానికి హాయి కలుగడానికి నాటక కంపెనీల వెంట తిరుగుతాడు. అయితే పశ్చాత్తాపంతో తిరిగి వచ్చిన భార్యవల్ల ఒక కుమారుణ్ని కంటాడు. వీరిద్దరి మనస్తత్వాలు భిన్నాలు. ఒకరిది తీవ్రతర నవ్యభావ సంకలిత మనస్తత్వం, మరొకరిది సామాన్యమైన సాంప్రదాయ భావ సంకలిత మనస్తత్వం.

వేణుగోపాలరావు మేనరికపు పెళ్ళిళ్ళవల్ల వచ్చే అనర్థాలు. వాటిలో సమ్మతమయ్యే దాంపత్య జీవనం తద్వారా ఆలుమగలలో కలిగే మానసిక క్షోభ మొదలగు విషయాల్ని గురించి యథార్థంగా చిత్రించబడటం విశేషం. మేనరికపు వ్యవస్థవల్ల తలెత్తే ఇబ్బందులను సూచించడానికే ఈ నవలలోని దంపతుల్ని రావుగారు సృష్టించినట్లు తెలుస్తుంది.

'మేడలో నీడలు' నవల్లో రామం, మనోరమలు భార్యాభర్తలు. సంఘాన్ని సంప్రదాయాన్ని అనుసరించి సర్దుకుపోవాలన్న మనస్తత్వం కలవాడు రామం. మనోరమ కళాకారిణి. వాస్తవిక జగత్తుకంటె భిన్నమైన ఊహాజగత్తులో విహరిస్తోంది. స్వేచ్ఛగా జీవించాలన్న ఆమె కోరిక తెలుసుకున్న రామం, మనోరమతో "నీకు ఎన్నో అభిరుచులు వుండవచ్చు మనోరమా? కాని ఇది ఊహాప్రపంచం కాదు. వాస్తవిక జగత్తు. ఇంటిలో సుఖంగా జీవించడానికి మనం ఎన్నో పరిస్థితు

లతో రాజీపడాలి. కొంత త్యాగం చేసుకోవాలి మనల్ని. లోకం నువ్వనుకున్నంత అమాయకమైందీ, అందమైనదీ కాదు. అయినా ఆసక్తులూ, ప్రవృత్తులు ఒక దశలోనే మనోరమా? ఈ దశవేరు. ఓ యిల్లు, అత్త, మామ, మా అమ్మా నాన్నగారూ చాలా బాధపడుతున్నారు నీ గురించి"[19] అని అంటాడు. కాని భర్త మాటల్ని కాతరుచేయకుండా స్వేచ్ఛగా జీవించాలనే ఆమె అసహజమైన కోరిక భర్తతో దెబ్బలాటకు దారితీస్తుంది. భర్త చేయిచేసుకోగా ఇంటినుండి వెళ్ళిపోతుంది. మనోరమకు లీల ఆశ్రయమిస్తుంది. మనోరమ కథను విన్న లీల హితోపదేశం చేస్తుంది. మనోరమ జరుగుతున్న సంఘటనలవల్లను పశ్చాత్తాపంతో ఇంటికి తిరిగి వస్తుంది. భర్తకు అనురూపవతి అయినభార్యగా మసులుకోవడానికి సంసిద్ధమౌతుంది. కాని తిరస్కరించిన తన భర్తతో మనోరమ "జీవితం అంధకార బంధురమని పించింది. మిమ్మల్ని చూడాలన్న కాంక్షతో, మీ సాన్నిహిత్యం సంపాదించాలను కుని దినదినానికి పెరిగిపోతున్న వాంఛతో క్రుంగిపోయాను. మీరు నన్ను స్వీకరించరనీ, నన్ను చూడటానికి కూడా అసహ్యించుకుంటారని నాకు తెలుసు. అందుకనే ఆ కోరికను అణచిపెట్టుకుని యిన్నాళ్లు భరించాను. జీవితంలో నేను క్షమించరాని పనిచేశాను. నన్ను దహిస్తోంది. దానికి ఉపశాంతి మీదగ్గరే పొందాలి. ఆ ఆశతోనే యిక్కడికి వచ్చాను. అది దురాశ, పేరాశ, మీ భార్యగా, గృహిణిగా తిరిగి జీవించాలని వుంది."[20] అని పశ్చాత్తాపం చెందుతుంది. మనోరమ మాటలకు చలించిపోతాడు. చివరకు తన భార్యతో "గతాలు అంత తేలిగ్గా మాసిపోవు మనోరమా! నేను పొందిన దగా, అనుభవించిన అవమానం నరకం నీకేం తెలుసు. నా జీవితాన్ని దుర్భరం చేశావు. నీ స్వార్థానికి పరిధి లేదు. నా వాంఛ, ఆవేదన నాలోనే యిముడ్చుకున్నాను. మళ్ళీ మనిషినయ్యాను. నాలో యెంత సంస్కారం పెరిగిందో నాకే దిగ్భ్రమగావుంది. నాకింత అపకారం చేసిన నువ్వు నా యెదుట నిలబడి మాట్లాడుతుంటే నిన్ను కసితీరా హింసిద్దామనుకుని కూడా ఆపని చెయ్యలేక పోతున్నాను. పరిస్థితులు కలుషితం చేయకు వెళ్లిపో"[21] అని ఆదేశిస్తాడు. రామం భార్యతో సాంఘిక పరిస్థితులు గురించి కుటుంబంలో ఆమె పాత్ర గురించి చెప్తాడు. మనోరమను స్వీకరించడానికి నిరాకరిస్తాడు. తల్లి దండ్రుల జోక్యంతో ఆమెను తన భార్యగా అంగీకరించక తప్పలేదు. ఈ దంపతుల్లో మొదట ఆకర్షణతో కూడిన ప్రేమ, తరువాత ద్వేషం, తరువాత అమలినమైన అనుభవంతో కూడిన అర్థవంతమైన ప్రేమ చోటు చేసుకుంటుంది.

ఇదే నవల్లో మరోజంట జ్యోతి, సుందరం. పెద్దల యిష్ట ప్రకారమే సుందరం, జ్యోతిల పెళ్లి జరుగుతుంది. సుందరంకు టి.బి. వున్న కారణంగా ఇంట్లో ఎవ్వరికి తెలియనివ్వరు. అందువల్ల అదే ఊరిలో వేరుకాపురం పెడతారు. తల్లి దండ్రులు సుందరంను అపార్థం చేసుకుంటారు. జ్యోతి వేరు కాపురం మానేసి అత్త మామలతో కలిసిమెలిసి వుంటామని "మనం చేసేది ఎంత న్యాయమో ఆలోచించండి. పెద్ద వయసు, అనేక మానసిక వ్యథల్లో వున్నారు. ఈ స్థితిలో మనం ఆవేశంతోను దూరంగా వెళ్ళిపోతే వాళ్ళకు తోడు ఎవరు? నీడ ఎవరు? కని, పెంచి పెద్ద చేసిన తల్లిదండ్రుల్ని వృద్ధాప్యంలో సుఖ పెట్టవలసిన బాధ్యత మీమీద లేదా? ఆ ఇంటి కోడలిగా మీకు నచ్చ చెప్పవలసిన బాధ్యత నాకు వుంది. ఇప్పుడు తొందరపడితే తర్వాత పశ్చాత్తాపం ధరించవలసిందే. కాస్త సముదాయించుకోండి. వాళ్ళ ప్రాణాల్ని క్షోభ పెట్టబోకండని"[24] నచ్చచెబుతుంది. సుందరం కూడా తన భార్యమాటల్ని మన్నించి తల్లి దండ్రులతో అన్నతో కలిసి వుంటానికి నిర్ణయిస్తాడు. తరువాత వీళ్ళిద్దరి మధ్య అనుకూల దాంపత్యం నెలకొంటుంది.

"తోడూ నీడూ" నవల్లో చిత్రించబడిన ఆలుమగల అనుబంధం కొత్త ప్రయోగమనే చెప్పుకోవాలి. భార్యాభర్తల మధ్యవున్న సంబంధాలను తారుమారు చేసి చిత్రీకరించిన నవల యిది. పెళ్ళయిన స్త్రీ పురుషులు ఏకారణం చేతనైనా విడిపోయే పరిస్థితి వస్తే వారు హాయిగా విడిపోయి వేరే పెళ్ళిళ్ళు చేసుకుని సుఖంగా కాలం గడపవచ్చుననే అంశం ప్రతిపాదించేందుకు వేణుగోపాలరావు గారు ఈ నవల్లో రెండు జంటల్ని సృష్టించారు. వారిలో ఒక జంట చిరంజీవి, దివ్యలు. చిరంజీవి అన్నివిధాల సౌమ్యుడు. తల్లి దండ్రులకు విధేయంగా నడుచుకుంటూ కుటుంబాన్ని నెట్టుకు రావాలనే మనస్తత్వం కలవాడు. దివ్య మొదట భర్తకు అనుకూలంగానే కాపురంచేసినా ఇరుగింటి ఇల్లాండ్ర చెప్పుడు మాటలు విని ప్రతికూలంగా తయారవుతుంది. అత్త మామల్ని అలక్ష్యం చేస్తూ మాట్లాడుతుంది. అందుకు దివ్య నుద్దేశించి చిరంజీవి "సంసారమంటే వెన్నెల్లో పడుకోవటం, కలలు కనడం. కబుర్లు చెప్పుకోవటం, సినిమాలు, షికార్లు చూడడం యింతేకాదు. అవసరమొచ్చినప్పుడు కష్టపడటం, అయిన వాళ్ళని ఆదుకోవడం, ఇదికూడా సంసారంలో ఒక భాగమేని"[25] గుర్తుచేస్తాడు. అయినా దివ్య భర్తను

నాదా మాటలు అని రాసి పంపానని చెపుతుంది. సంసారాన్ని నిర్లక్ష్యం చేస్తుం వంటి వాటిలో చిరంజీవి ఆగ్రహానికి గురవుతుంది. అతనిచేత దెబ్బలు కూడా తింటుంది. చెప్పుడు మాటలు విని సంసారాన్ని చేజేతులా నాశనం చేసుకుంటుంది. పుట్టింటికి వెళ్లిన మనోరమను ఇంటిలో వ్యంగ్యంగా మాట్లాడతారు.

దివ్యకు హరిగోపాల్‌తో పరిచయం ఏర్పడుతుంది. అతనితో తను పెళ్ళి చేసుకుంటుంది. హరిగోపాల్ మానసిక ప్రవృత్తిలో కూడా రమేష్‌ను పోలివుంటాడు. ఆ దంపతులలో చిరంజీవిని సౌమ్యుడుగాను, దివ్యను రాలుగాయిగాను కొమ్మూరి గారి చిత్రించారు.

ఇందులో మరోజంట కిషోరి, హరిగోపాల్. హరిగోపాల్ కిషోరిల జంట చిరంజీవి, దివ్యల జంటకన్నా భిన్నంగా కనిపిస్తుంది. హరిగోపాల్ అక్రమ ఆర్జనపల కిషోరికి భర్తపై నమ్మకం లేక పోతుంది. ఆమె చెప్పే విషయాల్ని అలక్ష్యం చేస్తాడు. పర్యవసానంగా వాళ్లలో కూడా తగాదాలు తలెత్తుతాయి. హరిగోపాల్, కిషోరిని హింసించి, చేయి చేసుకోవటంతో ఆమె అతన్నుంచి విడిపోయి విడాకులు తీసుకుంటుంది. తరువాత పరిచయం అయిన చిరంజీవిని పెళ్లి చేసుకుని సుఖంగా కాలం గడుపుతుంది. అన్యోన్యంగా వుంటారు. భిన్న ప్రవృత్తులు గల స్త్రీ పురుషులు ఆలుమగలుగా జీవించటం కంటె ఒకే మనస్తత్వం గలవాళ్ళు ఒకటి కావటం అన్ని విధాల శ్రేయోదాయక మని వేణుగోపాలరావు గారు యిందులో సూచించారు.

'భారతి'లో భారతి, సారథి భార్యాభర్తలు. భారతి అందచందాల్ని చూసి సారథి పెళ్ళి చేసుకుంటాడు. డాక్టర్ గోవిందరావుద్వారా గంగాధరం తన కోడలికి కుష్టువ్యాధి వున్నట్లు తెలుసుకుంటాడు. అందువల్ల గంగాధరం భారతిని పుట్టింటికి పంపేస్తాడు. సారథి తన భార్యకు జరుగుతున్న అన్యాయాన్ని ఎదిరించలేక పోతాడు. సారథిది చాలా దుర్బల మనస్తత్వం. అతని మనసెప్పుడూ భారతి అండకోరుకుంటూనే వుంటుంది. కాని సారథి తండ్రి బలవంతం మీద కుంతలతో రెండో పెళ్లి చేసుకుంటాడు. భర్త మానసిక వ్యధను గుర్తించిన కుంతల భారతిని ఆశ్రయించి తనకు పుత్రభిక్ష పెట్టమని ప్రాధేయపడుతుంది. భారతి అందుకు సమ్మతించి సారథిని చేరుకుంటుంది. సారథి పశ్చాత్తాపంతో "భారతీ నువ్వు

లేకుండా ఏ అయిదారు సంవత్సరాలో, ఏ ఇంట్లో ఎలా సంచరించానో తెలియదు. నన్నెప్పుడూ ఎవరో ఒకరు కాపాడుతుండాలి. ఒకనాడు మన మిద్దరం భార్యా భర్తలం. అది ఎంతటి మహాతత్వమంటే ఎన్నో శక్తులు విడదీసినా, మధ్య యింకా వ్యక్తులు ప్రవేశించినా అది చెరిగిపోకుండా వుంది. జీవితంలో శారీరకంగానూ, మానసికంగానూ అనేక వ్యథలకు గురి అయ్యావు. నీకు పరిశుభ్రమైన ఆత్మవుంది. అదే నీకు ఉన్నతమైన మనుగడను ప్రసాధిస్తుందని నా నమ్మకం"[24] అని చెప్తాడు.

సారధి మాటలు విన్న భారతి అతనికి కొన్ని చేదు నిజాలు చెప్పి ఆ బంధం నుంచి తనను విడిపించుకుంటుంది. క్రమంగా సారథి భారతి ఒకరినొకరు ప్రేమించుకుని ఒకరికోసం మరొకరు ఆరాటపడతారు. వారిద్దరి మధ్య సత్సంబంధమే నెలకొంటుంది. భారతిపై వున్న మక్కువతో సారధి తన రెండవ భార్య కుంతలను చేరదీయక పోతాడు. సారధి భార్య కుంతల అది గుర్తించి భారతి ద్వారా తమ సమస్యలను పరిష్కరించుకో ప్రయత్నిస్తుంది. కాని ఆమె ప్రయత్నం నిష్ఫలమౌతుంది.

'సూర్యుడు దిగిపోయాడు'లో వసంత, అనంతమూర్తి భార్యా భర్తలు. అనంతమూర్తి జర్నలిస్టుగా, రచయితగా విఫలుడైపోయినప్పుడు వసంత ఓదార్చి ప్రోత్సహిస్తుంది. భర్తను అర్థం చేసుకున్న భార్యగా తన కర్తవ్యాన్ని నిర్వర్తిస్తుంది. వీరిద్దరు కులాంతర వివాహం చేసుకున్నప్పటికీ, అన్యోన్య దంపతులుగానే వుంటూ తమ కుటుంబ పరిస్థితుల్ని చక్కబెట్టుకో గలుగుతారు.

కొమ్మూరి వేణుగోపాలరావుగారు అనేక నవలల్లోను భార్యా భర్తల అనుబంధం చిత్రింపబడినప్పటికీ కుటుంబ జీవిత చిత్రణకు ప్రాధాన్య మిచ్చి నప్పటికీ, కొన్ని నవలల్లో భార్యా భర్తల్లోని అనుబంధం యిక్కడ చెప్పడం ప్రధానాంశం. ఈ అధ్యాయంలోనే తల్లిదండ్రుల సంబంధాన్ని పరిశీలించేటప్పుడు కొన్ని జంటల దాంపత్యానుబంధాన్ని కూడా విశ్లేషించడం జరిగింది. అందువల్ల ఆ దంపతుల్ని గురించి యిక్కడ ప్రస్తావించలేదు.

వేణుగోపాలరావుగారు రకరకాల దంపతుల గురించి వాళ్ల మనస్తత్వాలు గురించి చక్కగా తెలియజేశారు. ఈ నవలల్లో పరిశీలించినంత మట్టుకు పురుషుడు

సౌమ్యంగానూ, స్త్రీ అవిధేయురాలుగానూ యెక్కువ నవలల్లో చిత్రించడం జరిగింది. ప్రస్తుతం సంఘానికి అద్దం పట్టడం కోసమో లేక అలాంటి మనస్తత్వం వున్న వ్యక్తుల ద్వారా తలెత్తే సమస్యలు గురించి నేటి యువతరానికి తెలియ జేయడం కోసమో రావుగారిలా చిత్రించి వుండవచ్చు. భార్యాభర్తల మధ్య వొడుదుడుకులు రావడం సమసి పోవడం సహజంగా చిత్రించబడింది. కాని ఒక్క 'భారతి' నవలలో మాత్రం భర్తను వదలి వెళ్ళిపోతుంది. అందుకు ప్రధాన కారకుడు ఆమె మామ గంగాధరం.

### 3.7. అన్నా తమ్ముళ్ళు :

అన్నను తమ్ముడు ఆదుకోవడం, అన్న తమ్ముని ఆలనాపాలనా చూసు కోవడం అన్నదమ్ముల అనుబంధంలో అతిముఖ్యమైన అంశం. కుటుంబ నిర్వ హణలో కూడా ఒకరికొకరు చేదోడువాదోడుగా వుంటూ దాని ఔన్నత్యానికి సమైక్యంగా కృషి చేయడం సాధారణంగా జరుగుతున్నదే.

'పెంకుటిల్లు' నవల్లో అన్నగా నారాయణ తమ్ముడుగా ప్రకాశం, వాసు కనిపిస్తారు. ప్రకాశం పట్నంలో 'లా' చదువుతుంటాడు. తన తమ్ముడి చదువు కోసం నారాయణ అతికష్టంమీద ధనం ఆర్జించి పంపిస్తుంటాడు. ప్రకాశం చదువు కోసం, తన పెళ్ళిని వాయిదా వేస్తాడు. అందుకు తమ్ముడు చదివి పైకి రావాలని తద్వారా తామంతా వెలుగులోకి రావాలని నారాయణ పడుతున్న ఆరాటం ఇందులో మనకు వ్యక్తమౌతుంది. నారాయణ మరో తమ్ముడు వాసు. అవిటివాడు కావడంతో వాసు తన ఆవేదనను తెలియజేస్తాడు. అతనిమీద అభిమానంకొద్దీ అరువు తీసుకు వచ్చి సాయపడతాడు. నారాయణ అన్నగా తన బాధ్యతను చక్కగా నిర్వర్తిస్తాడు. వాళ్ళను ఆదుకుంటాడు.

'ఈ దేశంలో ఒక భాగమిది' నవల్లో కుమార్, హరి. సుధాకర్‌లు వరుసగా అన్నాతమ్ముళ్ళు. కుమార్ తన తండ్రితోపాటు వైద్యవృత్తిని స్వీకరిస్తాడు. హరి బ్యాంక్‌లో ఉద్యోగం చేస్తుంటాడు. కుమార్‌కి తన తమ్ముళ్లు విలాసంగా తిరుగు తుండటం బాధ కలిగిస్తుంది. ముఖ్యంగా హరి మీద అసూయపడతాడు. కుటుంబ జీవితంలో భార్యలతో సతమతం కాకూడదని రెండో తమ్ముడు సుధాకర్ పెళ్ళిని

వాయిదా వేయమని హితోపదేశం చేస్తాడు. తొందరగా పెళ్ళి చేసుకోవడంవల్ల ఎన్నో ఇబ్బందులు ఎదుర్కోవాలని అంటాడు. హరి, సుధాకర్‌లు కూడా తండ్రి వల్ల తమ అన్నకు తనదైన స్వేచ్ఛ లేకుండాపోతున్నదని బాధపడతారు.

'మేడలో నీడలు'లో రాము తమ్ముడు సుందరం. రాము భార్య అయిన మనోరమ భర్తతో స్పర్థలు తెచ్చుకుని వెళ్ళిపోవడంతో సుందరం తన అన్న వైఖరిని అపార్థం చేసుకుంటాడు. అన్నను యీసడించుకుంటాడు. ఈ అన్నదమ్ముల అనురాగ రాహిత్యం కొట్టొచ్చినట్లు ఇందులో కనిపిస్తుంది.

'విషవలయం'లో సత్యమూర్తి అన్న రామ్మూర్తి. సత్యమూర్తిని పెంపుడు తండ్రి బలరామయ్య పెంచుకుంటాడు. బలరామయ్య చనిపోయిన తరువాత ఆ ఇంటిలో ప్రవేశించిన రామ్మూర్తి తమ్ముళ్ళను మోసంచేస్తూ దుబారా ఖర్చు పెడుతుంటాడు. అయినా అతనిమీద గౌరవంకొద్దీ అన్న కదా అనే అభిమానంకొద్దీ సత్యమూర్తి వారించలేకపోతాడు. రామ్మూర్తి అన్నగా, ఆ ఇంటి బాధ్యతను నిర్వహించక వాళ్ళకు తగాదాలు తెచ్చిపెడతాడు.

### 3.8. అన్నాచెల్లెళ్ళు :

కుటుంబ జీవితంలో అన్నాచెల్లెళ్ళలో అనురాగం, ఆత్మీయత చోటు చేసుకుంటుంది. ప్రతి అన్న తండ్రిలా తన చెల్లెలు జీవితం బాగుండాలని కోరుకుంటాడు. చెల్లెలు కూడా అన్న అభివృద్ధిని కాంక్షిస్తుంది.

'పెంకుటిల్లు' నవల్లో నారాయణ, రాధలు అన్నాచెల్లెళ్లు. కుటుంబ పోషణార్థం తల్లిదండ్రులు నారాయణను పెళ్ళి చేసుకోమంటారు. రాధకు పెళ్ళయ్యేంతవరకు తాను పెళ్ళి చేసుకోనని భీష్మించి కూర్చుంటాడు. తన అన్నపెళ్లి జరిగితీరాలని రాధ పట్టుబడుతుంది. రాధ తన అన్నతో చొరవతీసుకొని మాట్లాడుతుంది. "నేను పెద్దదాన్ని కాకపోయినా మన కుటుంబ బాగోగులు చూడవలసిన బాధ్యత నామీద కూడా వుంది. మన ఇంటి పరిస్థితులు ఎప్పటికైనా మారుతుందని నాకు నమ్మకం లేదు. తెలిసినవాళ్ళు కూడా కొన్ని విషయాల్లో ఎందుకింత తొందరపాటు చేస్తారో అర్థంకాదు. పరిస్థితులకోసం ప్రపంచం, ప్రపంచధర్మాలు ఆగవు. ప్రతివిషయాన్ని

చాలా తార్కికదృష్టితో చూస్తుంటావు. నీ చదువు, నీకోసం మానివేయలేదు. ఉద్యోగం చేయటం నీకోసం కాదు. అలాగే పెళ్ళికూడా ఇతరులకోసమే ఎందుకు చేసుకోరాదూ"[25] అని అంటుంది. అన్నను రాధ సానునయ వాక్యాలతో ఒప్పిస్తుంది. ఇందువల్ల వాళ్ళిద్దరి మధ్య వున్న పరస్పరాభిమానరాగాలు మనకు ఇక్కడ స్పష్టం అవుతాయి.

పట్నంలో చదువుకుంటున్న రెండో అన్న ప్రకాశం పడుతున్నపాట్లను రాధ వూహించగలుగుతుంది. తాను నిస్సహాయస్థితిలో వున్నప్పటికి తన స్నేహితురాలి సహాయంతో అన్నకు డబ్బు పంపుతుంది. చెల్లెలికి అన్నలపై ఉండే మమకారానికి చక్కటి ఉదాహరణగా ఈ పాత్రను మనం భావించవచ్చు.

రాధ స్నేహితురాలి భర్త అయిన శ్రీపతి తన కుటిలబుద్ధితో రాధ శీలాన్ని అపహరిస్తాడు. అందుకు రాధ ఆత్మహత్యా ప్రయత్నంలో ప్రేమించిన ఆనందరావు కాపాడతాడు. రాధ అన్న నారాయణతో తను శీలం పోగొట్టుకున్న విషయం చెప్తూ "తను మోసం చేయబడ్డానని, నాజీవితం భగ్నమైందని, నన్నెందుకు సముదాయిస్తావని, చెప్తుంది." దాని మాటలకు నారాయణ చెల్లెలి జీవితం నాశనం కాకూడదని ఆ విషయాన్ని గోప్యంగా వుంచుతూ "నన్నెందుకు మూర్ఖుడికింద భావిస్తావు. నువ్వు ఎక్కడో అక్కడ వున్నావనుకున్నాను. నిన్ను దాచి తీసుకు వచ్చేవరకు అలానే అనుకున్నాను. అప్పటినుంచీ ఎవరికీ తెలియకుండా జాగ్రత్త పడ్డాను. నువ్వు మామూలు మనిషివే. మనం ఇతరుల్ని మోసం చెయ్యాలి, మనల్ని మనం మోసం చేసుకోవాలి. మనం కష్టాల్లోవున్నా, సుఖంగా వున్నట్లు కనిపించాలి. మనలో కల్మషం వున్నా, పవిత్రులమైనట్లు నటించాలి
జరిగిన అవినీతిని కప్పిపుచ్చితే చాలు. కష్టాలు ఎప్పుడూ వుండేవే రాధా! మనం చుట్టూవున్న సుఖాలని చూడగలగటం నేర్చుకోవాలి. నేను అనుభవం మీద ఆకళింపు చేసుకున్న సత్యం అది. ఈ విషయాన్ని కప్పిపుచ్చి నిన్ను యెవరికైనా యిచ్చి పెళ్లి చేయగలను. ఆ సాహసం ఆ సమర్థత యిప్పుడు నాలోవుంది. నీవు అదృష్టవంతురాలివమ్మా, నిన్ను పెళ్ళిచేసుకునే మనిషి సిద్ధంగా వున్నాడు"[26] అని నిజ జీవితంలోని నగ్న సత్యాన్ని చెల్లెలికు తెలియజేస్తాడు. రాధను తన బావ అయిన ముకుందరావుతో పెళ్ళి జరిపిస్తాడు. ఈ నవలలో అన్నా చెల్లెళ్ళయొక్క ఆదర్శం తొంగిచూపినటంలో అతిశయోక్తి లేదు.

'విష వలయం'లో సత్యమూర్తి, విజయ అన్నా చెల్లెళ్ళు. సత్యమూర్తి ఆ ఇంటికి దత్తపుత్రుడు అయినప్పటికి విజయను తన సొంత చెల్లెలుగానే చూసుకుంటాడు. రాగ తల్లి దండ్రుల్ని కాదని ప్రేమించిన క్రిష్ణమూర్తితో హైదరాబాదు వెళ్ళిపోతుంది. విజయ ఆస్తిని కాజేయాలని ఆమె మేనమామ వీరభద్రం విజయ రాసే ఉత్తరాల్ని ఆమె తల్లికి తెలియనీయడు. సత్యమూర్తి వాని కుటిల బుద్ధిని తెలుసుకుని విజయ దగ్గరకు వెళతాడు. అమ్మా నాన్నలు చనిపోయిన సంగతిని యింటి దగ్గర వీరభద్రం గూడుపుఠాణిని వివరిస్తాడు. యుక్తాయుక్త విచక్షణా జ్ఞానాన్ని కోల్పోయిన విజయ తన మీద కుట్రపన్నుతున్నాడని ఆవేశంతో మాట్లాడుతుంది. విజయ ఆవేశంతో తనను దూషిస్తున్నప్పటికీ ఆమె దుర్భర జీవితాన్ని చూసి సత్యమూర్తి తన చెల్లెలుతో సముదాయింపుగా "అనవసరంగా దురుసుగా మాట్లాడుతున్నావు. ఆస్తికోసం దుష్కారుడ్నైనట్లు భావిస్తున్నావు. నాన్నగారు పోతూ పోతూ ఆస్తినంతా నాకు సగం, అమ్మకు సగం చేసి చనిపోయారు. అమ్మకూడా పోయాక ఆమె ఆస్తిని కాజేసి వీరభద్రం అనుభవిస్తున్నాడు. నీకు అన్యాయం జరుగుతోందన్న బాధతోనే, నీ ఆస్తి నీకు దక్కేటట్లు చేయాలన్న తలంపుతోనే నిన్ను తీసుకువెళదామని వచ్చాను. మన కిద్దరికీ రక్త సంబంధం లేకపోయినా తోబుట్టువన్న అభిమానం యేర్పడింది. నువ్వెప్పుడూ నా చెల్లెలివే అనుకున్నాను. దిక్కులేని దానివై పోతావన్న ఆరాటంలోనే తీసుకెళ్ళాలని [illegible]" అని అంటాడు. సానునయ వాక్యాలతో ఆమె ఆవేశాన్ని తగ్గించి యింటికి తీసుకువస్తాడు. సత్యమూర్తి ఆమె ఆస్తి ఆమెకు దక్కేటట్లు చేస్తాడు. సహనంతో బాధ్యతను నిర్వర్తించే అన్నగా మనకు కనిపిస్తాడు. సత్యమూర్తిని ఆవేశంతో అపార్థంగా చేసుకునే చెల్లెలుగా విజయ మనకు గోచరిస్తుంది.

'ఒకే రక్తం – ఒకే మనుషులు'లో మలుపురి అన్నలకు చెల్లెలు గిరిజ. గిరిజ అత్తవారింటికి వెళ్ళక మొండికేస్తున్నప్పుడు అన్నలుగా ఆమెను వెళ్ళమని కోరుతారు. ఆమె శ్రేయస్సునే కాంక్షిస్తారు. మొండిది అయిన గిరిజ యెవర్నీ లక్ష్యపెట్టదు. ఇందులో అన్నా చెల్లెళ్ళ సహజ సంబంధాలు చెప్పుకోదగిన విధంగానే లేవని చెప్పుకోవాలి.

**3.9 అక్కాచెల్లెళ్ళు :**

'ఒకే రక్తం – ఒకే మనుషులు' నవల్లో సామ్రాజ్యం, శ్రీలక్ష్మి అక్కాచెల్లెళ్లు. ఇరువురి మధ్యవున్న అనురాగబలంతో ఒకరికోసం మరొకరు త్యాగం చేస్తారు. సామ్రాజ్యం తన భర్తకు ఏ సుఖాన్ని అందించలేకపోతుంది. తన చెల్లెల్ని తన భర్తతో పెళ్ళి చేయించాలన్న తలంపుతో నిరాశజీవితం గడుపుతున్న సామ్రాజ్యం తన చెల్లెలు శ్రీలక్ష్మితో "నా గురించి కొంత గమనించివుంటావు, నేను రోగిష్టిదాన్ని. నావల్ల మీ బావకి సుఖంలేదు. నాకు నిండు జీవితమేగాని దానివెనుక బోలెడు అగాధం వుంది. ఇద్దరి జీవితాలు నరకాలు. నీవల్ల నాకో ఉపకారం జరగాలి. నువ్వు బావని పెళ్ళాడు... నీలాంటి సంపూర్ణ వ్యక్తిగా వుండాలి. సాంఘికధర్మానికి విరుద్ధంగా ఇలాంటి సంఘటనలు తరచు జరుగుతూనే వుంటాయి. సంఘాన్ని కాతరుచెయ్యక్కర్లేదు. ఈ మంచమే నా ప్రపంచ మనుకుంటాను. మీ దారికి అడ్డురాను"[28] అని తన మానసిక సంఘర్షణను మనోవ్యధను దీనగాథను తెలుపుతుంది. తన అక్క కోరికప్రకారం శ్రీలక్ష్మి, మన్మథరావుని పెళ్ళాడుతుంది.

ఇక్కడ అవిటితనంతో అవస్థపడే సామ్రాజ్యానికి చెల్లెలు శ్రీలక్ష్మి అభిమానంతో సేవలు చేస్తుంది. సామ్రాజ్యం తను మరణిస్తే చెల్లెల్ని పెళ్ళాడమని చీటీ రాసిపెట్టి నిద్రమాత్రలతో సామ్రాజ్యం మరణిస్తుంది.

'మేడలో నీడలు'లో సుభద్ర, ఆశ అక్కాచెల్లెలు. సుభద్ర పుట్టింటికి వస్తుంది. తన చెల్లెలకు భర్త రాసిన ఉత్తరాలు కంటపడుతుంది. ఆశ ఎంత చిత్రహింసలు అనుభవిస్తుందో తెలుసుకుంటుంది. ఆశ కూడా తన భర్త హింసించినట్టు ఇంటిలో ఎవరితోనూ చెప్పలేదు. సుభద్ర తన చెల్లెలి పరిస్థితుల్ని, ఆమె సమస్యల్ని తల్లిదండ్రులకు చెప్పి రెండో పెళ్ళి జరగడానికి ప్రోత్సాహం చేస్తుంది.

**3.10. అక్కా తమ్ముళ్ళు :**

కుటుంబ జీవితంలో అక్కాతమ్ముళ్ళ అనుబంధం కూడా తీసివేయరానిది. 'పెంకుటిల్లు'లో రాధ, వాసు అక్కాతమ్ముడు. వాసు అవిటివాడయినపుడు తమ్ముడి కోసం ఆరాటపడుతుంది. అన్నివిధాల ఆదుకోవడానికి ప్రయత్నిస్తుంది. వాసు పట్ల

వున్న అభిమానంతో రాధ తన స్నేహితురాలైన ప్రమీల దగ్గర డబ్బు తీసుకువచ్చి వాడికి చికిత్స కోసం ఖర్చు చేస్తుంది. వాసు అంగవైకల్యంవల్ల విరక్తిగా మాట్లాడినప్పుడు ఆర్ద్ర హృదయంతో కన్నీళ్ళు పెట్టుకుంటుంది. మిగిలిన నవలల్లో అక్కా తమ్ముళ్ళ అనుబంధం అక్కడక్కడా కనిపించినా చెప్పుకోదగ్గ విశేషంగా కనబడదు.

## 3·11 అత్తాకోడళ్లు :

భారతదేశంలో ఉమ్మడికుటుంబాల్లో అత్తాకోడళ్ల సంబంధం అతి ముఖ్యమైంది. వీరి మధ్య ఆప్యాయతే గాక స్పర్థలు కూడా ఎక్కువగా తలెత్తుతాయి. వేణుగోపాలరావుగారి నవలల్లో అత్తాకోడళ్ళ స్పర్థలు రేఖామాత్రంగా చోటు చేసుకుంది. అన్యోన్యత మాత్రం బాగా చోటుచేసుకుంది.

'ఈ దేశంలో ఒక భాగమిది' నవల్లో శారదమ్మ ప్రభావతి, విమల అత్తాకోడళ్ళు. తోడికోడలుమీది అక్కసు తీర్చుకోవడానికి పిల్లల్ని కొడుతుంది ప్రభావతి. అందుకు శారదమ్మ వారిస్తుంది. ప్రభావతి కోపం అత్తమీదికి మళ్లుతుంది. అంతా తన యిష్టమే అన్నట్లు దురుసుగా మాట్లాడుతుంది. అత్తగా తనపట్ల తన పిల్లలపట్ల ఆప్యాయత, అనురాగం చూపించలేదని దుయ్యబడుతుంది. శారదమ్మకు మౌనమే శరణ్యమౌతుంది. ఈ నవలలో అత్తాకోడళ్ల అనుబంధం ఎడమొఖం పెడముఖంగా కనిపించినా అన్నిటికి సర్దుకుపోయే అత్తగారి మనస్తత్వం ఆమె పెద్దరికానికి వన్నెపెడుతుంది. ఈ తరం కోడళ్ల దురుసుతనానికి ప్రభావతి విమలలు ప్రాతినిధ్యం వహిస్తారు. ఉమ్మడి కుటుంబాల్లో ఇటువంటి సంఘటనలు సర్వసాధారణంగా జరుగుతుంటాయి. అత్తగారు కూడా పిల్లల్ని దగ్గరకు చేరదీసి అందర్నీ ఒకేలాగ చూడాలి. అలా చేయని పక్షంలో అనురాగమున్నచోట ద్వేషం చోటు చేసుకుని కుటుంబాలు విడిపోవడానికి కూడా కారణమవుతుంది.

'పెంకుటిల్లు' నవలలో శారదాంబ సుగుణ అత్తాకోడళ్ళు. ఇందులో వీరిద్దరి మధ్య ఎలాంటి మనస్పర్థలకు తావీయకుండా రచయిత చిత్రించారు. ఇటువంటి అత్తాకోడళ్ళు కూడా మన సమాజంలో వుంటారనే వుద్దేశమే రచయిత అభిప్రాయంగా మనం గ్రహించవచ్చు. పైగా ఇంటికి వచ్చిన కోడలు సుగుణ ఆ

ఇంటి పరిస్థితుల్ని అర్థం చేసుకుని నడుచుకుంటుంది. శారదాంబ కూడా తన కోడల్ని కన్నకూతురులాగే చూసుకుంటుంది. ఇందులో అత్తాకోడళ్ళ యొక్క సఖ్యతే మనకు సుస్పష్టం అవుతుంది.

'ఒకే రక్తం - ఒకే మనుషులు'లో యశోద, గిరిజ అత్తాకోడళ్ళు. గిరిజ భర్త సుందరం. సుందరం తన భార్య మానసిక సంఘర్షణను గుర్తించి నాటకాల వ్యామోహంతో తిరుగుతాడు. గిరిజ వైముఖ్యంవల్ల ఆమె భర్త సుందరం అన్య కాంతా సక్తుడు అయ్యే ప్రమాదముందని యశోదమ్మ గుర్తిస్తుంది. యశోదమ్మ కుటుంబగౌరవం పతనం కాకూడదని ఆరాటపడుతుంది. కోడలు గిరిజతో తన భర్తను అదుపులో పెట్టుకోమని ప్రబోధిస్తుంది. గిరిజ హేతువాది. తేలిగ్గా తీసుకుని 'భార్యాభర్తలు ఒకరి స్వాతంత్ర్యానికి మరొకరు అడ్డురాకూడదు' అని అంటుంది. పెడసరంగా సమాధానమిచ్చిన కోడలి మాటల్ని మన్నిస్తుంది. ఈ అత్తాకోడళ్ళు ఇద్దరూ రెండు తరాలకు ప్రతినిధులు.

'మేడలో నీడలు'లో లలితమ్మ, మనోరమలు అత్తాకోడళ్ళు మనోరమ జీవితంలో నూతనత్వం కోసం ప్రాకులాడి కొత్తదనాన్ని అన్వేషించుకుంటూ ఇల్లువిడిచి వెళ్ళిపోతుంది. మనోరమ పశ్చాత్తాపంతో తిరిగిరాగా ఆమె భర్త రామం నిరాకరిస్తాడు. లలితమ్మ తోటిఆడదిగా విశాల హృదయంతో కోడల్ని క్షమిస్తుంది. ఆమెను స్వీకరించమని కొడుకును అభ్యర్థిస్తుంది. మనోరమ పవిత్రతను లలితమ్మ దృఢంగా తెలియజేస్తుంది. కొడుకు లన్నా కూడా ఖాతరు చేయనట్లు భావిస్తుంది. లలితమ్మ ఆత్మహత్యకు సిద్ధమౌతుంది. మనోరమ కాపాడు తుంది. ఇక్కడ అత్తాకోడళ్ళ మధ్య అన్యోన్యత కనిపిస్తుంది. ఒకరి మనస్తత్వాన్ని మరొకరు సరిగ్గా అర్థం చేసుకున్న వైఖరి గోచరిస్తుంది. తల్లి ప్రోత్సాహంతో రామం, మనోరమను దగ్గరకు తీసుకుంటాడు.

'భారతి' నవల్లో రంగాజమ్మ, భారతి అత్తాకోడళ్లు. భారతి కోడలుగా ఇంటిలో అడుగుపెట్టిన తరువాత రంగాజమ్మ ఇంటిలోపల ఎలా మసులుకోవాలో చెప్తుంది. భారతిలాంటి కోడలు రావడం రంగాజమ్మ తన ఇంటి అదృష్టంగా భావిస్తుంది. రంగాజమ్మ శాంతిరేఖవంటి మహిళ. రంగాజమ్మ భర్త గంగాధరం తన కోడలికి కుష్టువ్యాధి వున్నదని తెలుసుకుని ఇంటి నుంచి వెళ్ళిపొమ్మంటాడు.

భారతి తమ అత్తగారి ఆప్యాయతకు ముగ్ధురాలౌతుంది. రంగాజమ్మ కోడల్ని ఇంటినుండి వెళ్ళగొట్టడం మాత్రం సబబుకాదని భర్తను ఎదుర్కొంటుంది. అతడు కొట్టినా రంగాజమ్మ తన అభిప్రాయాన్ని మార్చుకోదు. తనవల్ల తమ అత్తగారు దెబ్బలు కూడా తిన్నందుకు భారతి "అత్తయ్యా! మళ్ళీ జన్మలో మిమ్మల్ని కలుసుకున్నా కలుసుకోకపోయినా మీ మంచితనమే స్పర్శ ఎల్లకాలం నా ఒంటిమీద మెదులుతూనే వుంటుంది. నేను పాపిష్టిదాన్ని, జబ్బు పాపిష్టిది కాదత్తయ్యా! నా జీవితం పాడుచేసుకోవటమే గాకుండా మీ జీవితంలో కూడా పెద్దగండి ఏర్పరచి పోతున్నాను. నన్ను క్షమించండత్తయ్యా"[29] అని విలపిస్తుంది. భారతి మాటలు విన్న రంగాజమ్మ కడుపు తరుక్కుపోతుంది. తన కోడలికి జరుగుతున్న అన్యాయాన్ని చూసి భారతితో "ఈ పాపిష్టి జబ్బు నీ కెందుకొచ్చిందమ్మా? నీ కన్యాయం జరిగిపోయింది తల్లీ. ఈ లోకంలో జరిగేదే అదమ్మా. క్షమించవలసినవాళ్ళే క్షమాపణలు అడుగుతుంటారు. నిన్ను పరీక్షించే శక్తి నీకు వుందనుకున్నాను. కాని ఆ గురి నుంచి నువ్వు దాటిపోయావు. కాని వెన్నెలలాంటి దానవు. నీకు అశుభం జరుగుతుందా? నీ జీవితం శుభప్రదంమౌతుందని ఏ అజ్ఞాతశక్తో చాటుతోంది నాకు"[30] అని నిట్టూరుస్తుంది. తోటి ఆడదానికి అన్యాయం జరుగుతుంటే తను ఏమీ చేయలేని స్థితిలో వున్నప్పటికీ తన కాపురం కోసం రంగాజమ్మ ప్రాకులాడినట్లు మాట్లాడుతుంది. ఈ అత్తాకోడళ్ళ మధ్య అనురాగం ఎంత గాఢంగా పెనవేసుకుందో చక్కగా వ్యక్తమౌతుంది.

### 3.12 తోడికోడళ్ళు :

కుటుంబ వ్యవస్థలో గృహవాతావరణంలో తోడికోడళ్ళ పాత్ర ముఖ్యమైందే. తోడికోడళ్ళందరూ అన్యోన్యంగా వుంటూ, యెవరి పనులు వారు చేసుకుపోతుంటే ఆ కుటుంబం మూడుపువ్వులు ఆరు కాయలుగా ముందడుగు వేస్తుంది. వాళ్ళల్లో మనస్పర్థలు తలెత్తి ఘర్షణకు దారితీస్తే కుటుంబ విచ్ఛిత్తికి అది మూల హేతువవుతుంది. మన దేశంలోని తోడికోడళ్ళలో ఈ రెండు లక్షణాలు కనిపిస్తాయి.

'ఈ దేశంలో ఒక భాగమిది' నవల్లో ప్రభావతి, విమల తోడికోడళ్లు. సాధారణంగా కుటుంబాల్లో తలెత్తే విధంగానే వీళ్ళిద్దరి మధ్యకూడా స్పర్థలు తలెత్తుతాయి.

పిల్లల వ్యవహారంలోనూ, ఇంటిపనులవల్లనూ అప్పుడప్పుడూ ఇరువురిలో వాగ్వివాదాలు వస్తాయి. వీళ్ళ వ్యవహారం కుటుంబ విభజనకు దారితీస్తుంది. తోడికోడళ్ళిదువురు పరస్పరం ద్వేషంతో తమ తమ తప్పులను కుటుంబ శ్రేయస్సును కూడా నిర్లక్షిస్తారు. భర్త కొట్టినపుడు గాయపడిన విమలకు ప్రభావతి ఆసుపత్రిలో సపర్యలు చేస్తుంది. ఇవే ఆమెలోని మానవతా విలువల్ని సూచిస్తుంది. ఉమ్మడి కుటుంబాలు ఆడవాళ్ళ వ్యవహారాలవల్లనే విడిపోతున్నాయని వేణుగోపాలరావుగారు ఈ నవల్లో సుస్పష్టంచేసి చిత్రీకరించారు. తోడికోడళ్ళ అన్యోన్యం నామమాత్రంగానే చోటుచేసుకుందని చెప్పవచ్చు.

**3.13. మామా కోడళ్లు :**

కుటుంబ జీవితచిత్రణలో మామాకోడళ్ళ సంబంధం, కుటుంబంలో వాళ్ళ పాత్ర చర్చనీయాంశంగానే వుంటూ వస్తూవుంది. అధికారంతో కర్కశంగా కోడళ్ళని అదుపుచేసే మామలు వున్నారు. కన్నతండ్రిగా గౌరవించి కంటిపాపలా చూసుకునే మామలూ వున్నారు. మామను కన్నతండ్రిలా చూసుకుని వార్ధక్యంలో ఏర్పడే లోటును మరిపించే కోడళ్లూ వున్నారు. నిర్దయగా నిర్దాక్షిణ్యంగా మామల్ని రాసిరంపానపెట్టే కోడళ్ళు కూడా మన కుటుంబాల్లో లేకపోలేదు. కొమ్మూరి వేణుగోపాలరావుగారు ఈ సంబంధాన్ని రేఖామాత్రంగానే స్పృశించారు.

'ఈ దేశంలో ఒక భాగమిది'లో రంగారావు, ప్రభావతి, విమల మామా కోడళ్ళు. వీరిది సమిష్టి కుటుంబం. రంగారావు యింటిలో ప్రతివిషయంలోనూ జోక్యం చేసుకుని మాట్లాడేవాడు. సాంప్రదాయం ప్రకారం యింటి విషయాల్ని పెద్దకోడలితో మాత్రమే చర్చించేవాడు. తోడికోడళ్ళ వ్యవహారాల్ని బాగా గమనించిన రంగారావు మూడు కుటుంబాలుగా విభజిస్తాడు.

'భారతి' నవలలో గంగాధరం, భారతి మామాకోడలు. తన కోడలికి కుష్ఠువ్యాధి ఉండేది స్నేహితుడైన గోవిందరావు ద్వారా తెలుసుకుంటాడు. ఆ కారణం చేత తన కోడలిని పుట్టింటికి పంపివేయతలుస్తూ గంగాధరం "నువ్వు కుష్ఠురోగివి కదా? నిన్ను చూడ్డానికి వచ్చినప్పుడు ఆ విషయం ఎందుకు దాచావు? నువ్వు మాతో ఏవిధంగా చూసినా సరితూగని మీకు ఆస్తీ, అంతస్తూ, హోదా, వైభోగం

అన్నీ సమకూడి సర్వసౌఖ్యాలు అనుభవించవచ్చుకదూ! నువ్వు అందర్నీ వంచించావు. మా అందరి ఆశలు ముక్కలు చేశావు. పరిశుద్ధమైన మా యింటి వాతావరణాన్ని కలుషితం చేశావు"[31] అని తూలనాడుతాడు. కరినాత్ముడు అయిన గంగాధరం భారతిని బలవంతంగా యింటినుండి వెళ్ళగొట్టి ఆమె బ్రతుకులో నిప్పులు పోస్తాడు. ఇక్కడ గంగాధరం కర్కశుడుగా మారినట్లు కనిపిస్తుంది.

భారతి పుట్టింటికి వెళ్ళిపోయిన తరువాత గంగాధరం ఆమె యింటికి వెళ్ళి 'నీకు వ్యాధి బాగా పెరిగిపోయిందని' ఎగతాళిగా మాట్లాడుతూ తరువాత హృదయశల్యంగా మాట్లాడుతూ "నీ జీవితం యెలాగూ భంగపడింది. కారణం వ్యక్తపరచడూ కాదు. విధి అంటే ఒప్పుకుంటావనుకుంటాను. నువ్వు చాలా బుద్ధిమంతురాలివి. మారుమాట చెప్పకుండా నేను వెళ్ళమనగానే మౌనంగా పుట్టింటికి దారితీసినప్పుడే నీ వ్యక్తిత్వాన్ని, సుశిక్షితనూ అర్థం చేసుకున్నాను. ఇన్నాళ్లూ మాతో మంతనాయి జరపకుండా నిశ్చలంగా వూరుకున్నందుకు నీ ఆత్మగౌరవాన్ని అభినందిస్తున్నాను. నీ కారణంగా మా సారధి జీవితం పాడుకాకూడదు. నువ్వు వాడి జీవిత సుఖాలకు అడ్డురాకూడదు. నేను నిక్కచ్చి మనిషిని. అన్ని ఖండితంగా జరగాలి. ప్రతిదీ చట్టబద్ధంగా సమకూరాలి ... తల్లిదండ్రులు నీకిష్టంలేని పెళ్ళిచేశారు. భర్తతో కాపురం చెయ్యనని భీష్మించి ఎవరెంత చెప్పినా వినకుండా పుట్టింటికి వచ్చేశావు. ఇహ వేరే గత్యంతరం లేక నీ భర్త నీతో తెగతెంపులు చెయ్యమని కోర్టుకు మొర పెట్టుకుంటున్నాడు. కోర్టులో కూడా మేము చెప్పిన ప్రతిదానికి నువ్విలాగే తల వూపాలి"[32] అని చెప్తాడు. గంగాధరం మాటల్లో విపరీతాలు ధ్వనిస్తాయి. ఎన్ని అశనిపాతాలు పడినా చలించకుండా భరించే స్థితిలోవుంది భారతి. ఇక్కడ భారతి ఆత్మస్థైర్యానికి గీటురాయిగా నిలుస్తుంది.

భారతి తనకు జరుగుతున్న అన్యాయం అంతటినీ మౌనంగా భరిస్తోంది. మామ కోరుకొన్నట్లుగానే కోర్టువారు విడాకులిప్పిస్తారు. భారతి తన మామను నిందించదు, శాపనార్థాలు పెట్టదు. తనదాలేదో వెతుక్కొంటుంది. తన కుటుంబ యాజమాన్య అధికారంతో కోడలిపట్ల కఠినంగానూ, కర్కశంగాను వ్యవహరించే మామ గంగాధరమయితే, సుగుణ సంపన్నురాలయిన కోడలిగా భారతి మనకు కనిపిస్తారు.

'తోడూ - జోడూ' నవల్లో మామాకోడళ్ళ సంబంధం ఇందుకు భిన్నంగా చిత్రింపబడింది. సుదర్శనం, దివ్యలు మామా కోడళ్ళు. మామ ఎంత సౌమ్యుడో కోడలు అంత గయ్యాళిగంప. చెప్పుడు మాటలు విని అత్తమామల్ని ఎప్పుడూ సవ్యంగా చూడలేదు. తన ఏకైక కుమారుని మీద అపేక్షకొద్దీ వచ్చిన మామను చెప్పుడు మాటలతో నిరాదరించడమేగాక యాతనకు గురిచేస్తుంది. కోడలు మాట్లాడిన మాటలకు మానసికంగా బాధపడ్డ సుదర్శనంకు పెరాలసిస్ వస్తుంది. అప్పుడు కూడా కోడలిగా మామకు సపర్యలు చేయలేకపోతుంది. వ్యంగ్యంగా మాట్లాడుతుంది. అన్నింటిని భరించిన సుదర్శనం తన యింటికి వెళ్ళిపోయి కొన్ని రోజులకు మరణిస్తాడు. నేటి సంఘంలో ఎక్కువగా కనిపించే ఈ అంశాన్ని వేణుగోపాలరావుగారు సున్నితంగా చిత్రించగలిగారు.

### 3.14. మామ అల్లుళ్లు :

మామా అల్లుళ్ళ సంబంధం కుటుంబజీవితానికి లోబడిందికాదు. అయితే కుటుంబజీవితంలో కొంత సంబంధం కలిగివుంటుంది. ఈ మామా అల్లుళ్ళవల్ల కొన్ని కుటుంబాలు నిలబడటం, కొన్ని కూలిపోవడం కూడా జరుగుతుంది.

'పెంకుటిల్లు' నవలల్లో గోవిందరావు మామ. నారాయణ అల్లుడు. నారాయణ తన యింటి ఆర్థిక పరిస్థితులలో సతమతమౌతున్న సమయంలో బ్యాంక్‌లో ఉద్యోగం వస్తుంది. నారాయణ భార్య సుగుణ భర్తను పుట్టింటికి తీసుకెళుతుంది. అయితే గోవిందరావు, తన అల్లుడు వేరుకాపురం పెట్టుకోవాలనే ఉద్దేశంతో శక్తి సామర్థ్యాలు ఉన్నప్పుడే భవిష్యత్తుమీద ముందుచూపు కలిగివుండాలని మనసు మార్చే మాటల్ని చెప్తాడు.

గోవిందరావు ఉద్దేశమేమిటో అర్థం చేసుకున్న నారాయణ నిర్మొహమాటంగా మామ మాటల్ని అధిక్షేపిస్తూ "నాకంతా బోధపడింది. ఒక్క మాటలో చెప్పాలంటే మా కుటుంబం నుంచి వేరుపడమనేగా మీభావం. మీ అల్లుడు అర్థం చేసుకోవడంలో మీరు చాలా పొరపాటు పడ్డారు. నేనేం ప్రయోజకుణ్ణి కాకపోయినా, దయావిహీనుణ్ణి, హృదయంలేని పశువును కాదు. ఇవి ఒకరి బాగోగుల విషయం నేను పట్టించుకోను. ఒకరు శ్రమపడటంల్లేదే అని నొచ్చుకోను. నాకు చేతనైనంత వరకు శ్రమపడతాను. అంతే నాతో యిటువంటి మాటలనకండి"[83] అని ఆయన

పన్నాగం బయటపెడతాడు. అది సబబుకాదని బుద్ధి చెప్తాడు. తన దృఢసంకల్పం వెల్లడచేస్తాడు. నారాయణ మామ గోవిందరావు తన కూతురి కుటుంబ శ్రేయస్సునే దృష్టిలో పెట్టుకొని అల్లుడికి హితబోధ చేసినా అది సంకుచితంగానే కనిపిస్తుంది. నారాయణ తను నిర్ణయించుకున్న మార్గంనుండి వైదొలగకపోవడం అతని నిశ్చల మనస్తత్వానికి నిదర్శనం. ఈ మామా అల్లుళ్ళు ఇద్దరూ తమ వారి హితం కోరినా పరిస్థితిరీత్యా భిన్నమార్గాలు. భిన్నప్రవృత్తులు. నేటి సామాజిక పరిస్థితులదృష్ట్యా ఉమ్మడి కుటుంబాలు విడిపోవడానికి ఎవరు కారకులవుతారో గోవిందరావు పాత్ర ద్వారా రచయిత మనకు తెలియజేస్తున్నారు. అంటే గోవిందరావులాంటి కుత్సిత బుద్ధిగల మనుషులు మన సంఘంలో వున్నారని మనం గ్రహించి, దానికి తగ్గట్టుగా నడుచుకోవాలనడమే రచయిత అభిప్రాయంగా తెలుస్తుంది.

## 3.15. వదిన ఆడబిడ్డలు :

కుటుంబాల్లో వదిన ఆడబిడ్డల సంబంధం కలహాలు, కలతలు తలెత్తేట్టు చేయడమేగాక మంచిని వెల్లివిరిచేందుకుకూడా దోహదం చేస్తుంది. 'పెంకుటిల్లు'లో సుగుణ, రాధ వదిన ఆడబిడ్డలు. సుగుణ యింటి కోడలుగా రాగానే రాధ తమ ఇంటి పరిస్థితిని, ఇక్కడ మసలుకోవలసిన విధానాన్ని ఆమెకు తెలియజేస్తుంది. సుగుణ కూడా ఇంటి పరిస్థితుల్ని దృష్టిలో పెట్టుకుని మసలుకుంటుంది. వదిన ఆడబిడ్డల మధ్య సత్సంబంధాలే నెలకొన్నట్లు తెలుస్తుంది.

'మేడలో నీడలు'లో మనోరమ సుభద్ర వదిన ఆడబిడ్డలు. సుభద్ర తన ఇద్దరు కొడుకులతో పుట్టింటికి వస్తుంది. మళ్ళీచి రాగా యిద్దరు మరణిస్తారు. భర్త ముకుందరావు 'మార్ఫియా' అలవాటుపడతాడు. తన భర్త దుర్వ్యసనాన్ని మాన్పించి, సుభద్ర గర్భవతి అవుతుంది. ఆ విషయం మనోరమతో "నాకు బ్రతుకుమీద తీపి యేమీలేదు. కాని వారు పుత్రశోకంతో జీవితాన్ని దుర్భరం చేసుకున్నారు. అది అనుక్షణం నా హృదయంలో కార్చిచ్చులా రగులుతోంది. మళ్ళీ ఓ బిడ్డని కని వారిని ఆ దుర్వ్యసనం నుండి మాన్పి మనిషిని చేయగలిగితే చాలు; నా జీవితం ధన్యమైనట్టులే. ఆ పవిత్రాశయం కోసమే నాకూ బ్రతకాలని వుంది. వారిని మనిషి చేయాలి వదినా"[34] అని చెప్తుంది. కొత్తదనం కోసం పరితపించిన మనోరమ సంతానం వద్దనుకుని జాగ్రత్తపడుతుంది. ఆడపడుచు

బాలు ఆమెలో పశ్చాత్తాపాన్ని స్పందనను కలిగిస్తుంది. ఈ వదిన ఆడపడుచుల మధ్య సత్సంబంధాలున్నట్లు కనిపిస్తుంది.

'ఒకే రక్తం - ఒకే మనుషులు' నవల్లో సామ్రాజ్యం, గిరిజ వదిన ఆడబిడ్డలు, పిల్లద్దరి మధ్య సానుభూతి, సహజ ప్రేమలు చోటు చేసుకుంటాయి. తన బాధలను, భావాలను యెవరికీ చెప్పుకోలేని గిరిజ తన వదిన దగ్గర మనసువిప్పి చెప్తుంది. సామ్రాజ్యం పెరాలసిస్ వల్ల మంచం మీద పడివుంటే గిరిజ వదినకు సేవలు చేస్తుంది.

గిరిజకు పెళ్ళయిన తరువాత మానసిక సంఘర్షణల కారణంగా అత్త వారింటికి వెళ్ళనని పట్టుబడుతుంది. అప్పుడు సామ్రాజ్యం 'నాలోని కొత్త అందాలు చూసుకోవాలని యెంతగానో కలలు కన్నాను. నాలో చూసుకోలేని కొత్త దనం యితరుల్లో చూసుకోవడం సరదా' అని మెట్టినింటికి వెళ్ళమని ప్రాధేయ పడుతుంది. అప్పుడు గిరిజ తన వదినతో "ప్రకృతి విరుద్ధంగా పోరాడాలనీ, పోరాడే శక్తి నాకుందని నే ననుకోవడం లేదు. నా మనస్సుకు విరుద్ధంగా మాత్రం నడుచుకో లేక పోతున్నాను. నాకు బావ భర్తగా కనిపించడంలేదు. నన్ను పులింపజేసే ఒక పురుషుడుగా, తియ్యదనం చిలికించే ఓ ప్రేమికుడుగా కనబడటం లేదు. అతని స్పర్శ నాకే అనుభూతి నివ్వటం లేదు. నిన్ను, అమ్మని, నాన్నని తాకితే యెలావుందో అంతే. అతనిలో నాకేం థ్రిల్ లేదు. నివశత్వం లేదు. తాళికట్టాడు కాబట్టి భర్త. కాని నేనెంత ఆత్మవంచన చేసుకుని పడింతలు జారి పోయినా ఆ భావం నాలో కలగడంలేదు. మీ అందరిలా కన్విన్స్ కాలేక పోవడం నా దురదృష్టం వదినా"[35] అని తన మనోవేదనను మానసిక వ్యధను వెళ్ల గ్రక్కుతుంది. గిరిజ మాటల్లో యెంత బడబాగ్ని దాగివుందో యిక్కడ తెలుస్తుంది.

గిరిజ మాటలకు విస్తుపోయిన సామ్రాజ్యం, అత్తవారింటికి వెళ్లడానికి గిరిజ సుముఖంగా లేక పోవడం తెలుసుకుని, ఆమె జీవితం యే మౌతుందోనన్న ఆందోళన పడుతుంది. సామ్రాజ్యం గిరిజతో "బేబీ యిది నా - నీ సమస్య మాత్రమే కాదు. తరతరాల చరిత్ర, యుగయుగాల చరిత్ర, ప్రపంచంలో ఎన్నో జాతుల చరిత్ర. మన ఇతిహాసాలు, పురాణాలు, సంస్కృతి అన్ని యిందులో

ముడిపెట్టబడి వున్నాయి. ఈ పంపలపేం చరిత్రలోని మాధుర్యాన్ని నీ అవకతవక ఆలోచనలతో, కలుషితం చెయ్యటానికి ప్రయత్నించకు. ఛేబీ నీకాళ్ళు పట్టు కుంటాను. నీ దోరణి కట్టిపెట్టు. నీ జీవితం ఏమయి పోతుందోనని నాకు భయంగా వుంది. నువ్వు సుఖపడాలి. మంచానపడి వుండాల్సిన దురదృష్టం నీకేమీ లేదు. నువ్వు సుఖపడాలి"[6] అని ఓదారుస్తుంది. తన ఆడబిడ్డ జీవితం సుఖంగావుండాలనే తపన సామ్రాజ్యం మాటలవల్ల తెలుస్తుంది. అంతేగాక ఆమె పట్ల సామ్రాజ్యంకు వున్న వాత్సల్యం కూడా వ్యక్తమౌతుంది.

గిరిజ తన చుట్టూవున్న వాతావరణం యెంతో యెదిగినట్లు మాట్లాడుతుంది. పాత సంప్రదాయాల్ని. నిరాకరించే విధంగాను, కొత్త అలోచనలకోసం, కొత్త స్పందన కోసం ఆరాటపడినట్లు గిరిజ మాటల్లో మనకు ద్యోతకమౌతుంది. వీరిద్దరి మధ్యా మంచి సంబంధాన్ని సృష్టించిన రచయిత తన రచనా విధానానికి ఒక వొరవడి పెట్టుకున్నట్టు కూడా తెలుస్తుంది.

### 3.16 బావా మరదళ్లు :

కుటుంబ వాతావరణంలో స్తబ్దత పోగొట్టి హుషారు కలిగించే హాస్య రస భరితమైన మంచి సంబంధం బావా మరదళ్లది. పరాచికాలు ఆడుకుంటూ పట్టు విడుపులతో పరవశించిపోయే వారి అనుబంధం రస్యమానం.

'పెంకుటిల్లు'లో ముకుందరావు, రాధ బావా మరదళ్ళు. ముకుందరావు భార్య అన్నపూర్ణ ప్రసవ వేదనతో మరణిస్తుంది. భార్య పోయిన వ్యధతో ముకుందరావు తాత్త్విక చింతనుడవుతాడు. సానునయ వాక్యాలతో రాధ ముకుంద రావుని ఓదార్చుతుంది. ముకుందరావు కూడా తన భావాలను రాధతో పంచు కుంటాడు. బావను అర్థం చేసుకున్న రాధ తనను వెంటాడి అరాధించే ఆనంద రావును కూడా అలక్ష్యంచేసి ముకుందరావుని పెళ్లి చేసుకుంటుంది. ఈ బావా మరదళ్ళ అనుభంధంలో హాస్యరసానికి బదులు కరుణరసం చోటు చేసుకుని పాఠకుల మన్ననలకు పాత్రం చేస్తుంది.

'ఒకే రక్తం - ఒకే మనుషులు' మన్మధరావు శ్రీలక్ష్మి బావా మరదళ్ళు. మన్మధరావు భార్య పెరాలసిస్ వచ్చి మరణిస్తుంది. మన్మధరావు మరదల్ని మంచి

మాటలతో మరిపించి పచ్చిక చేసుకుని ఆమె శీలాన్ని దోచుకుంటాడు. శ్రీలక్ష్మి తన అక్క కోరిక మేరకు బావను పెళ్ళి చేసుకుంటుంది. శ్రీలక్ష్మి, మన్మథరావుల మధ్య సరసం లేక పోయినా మోటు సరసం కనిపిస్తుంది.

'మేడలో నీడలు'లో ప్రసాద్, ఆశ బావా మరదళ్ళు ప్రసాద్ ఆశను ప్రేమిస్తాడు. ప్రేమభిక్ష అందిస్తాడు. ఆశకు పెద్దల యిష్ట ప్రకారం దూరపు సంబంధంతో పెళ్ళి చేస్తారు. భర్త హింసకు గురై పుట్టింటికి తిరిగి వస్తుంది. ఆశ తన కడగండ్లను ప్రసాద్‌తో ప్రస్తావిస్తుంది. ప్రసాద్ తాము భార్యా భర్తలై జీవించడాన్ని మళ్ళీ ప్రతిపాదిస్తాడు. ఆశ అత్తవారింటి జీవితం తెలుసుకున్న పుట్టింటివాళ్ళు ఆశను ప్రసాద్ కిచ్చి పెళ్లి చేస్తారు. వీరిద్దరి మధ్య మొదట కొంత సరసం కనిపించినా సరసమే తరువాత స్థానం యేర్పరచుకొంది.

కొమ్మూరి వేణుగోపాలరావు గారు తమ రచనల్లో బావా మరదళ్ళ మధ్య సంబంధ బాంధవ్యాలు యెక్కువగా చోటు చేసుకోలేక పోయింది.

## 3.17 కుటుంబ జీవితాల్లో స్నేహితులు :

అనాది నుంచీ కూడా స్నేహానికి మన సంస్కృతిలో ఒక ప్రత్యేక స్థానం వుంది. దేవతల్లోను దీని పాత్ర విశిష్టంగా వున్నట్టు మన పురాణ వాఙ్మయం చెబుతుంది. ఒకరికొకరు తక్షణం ఆదుకోవడమే స్నేహ లక్షణం స్నేహాలు రెండు రకాలు, మంచి స్నేహం, చెడు స్నేహం, మంచి వాళ్ళతో స్నేహం చేస్తే మంచి కలుగుతుంది. అవగుణాలున్న వాళ్ళతో స్నేహంచేస్తే హాని వాటిల్లుతుంది. ఈ రెండు రకాల స్నేహాలు కొమ్మూరి వారి నవలల్లో గోచరిస్తాయి.

రాధ, ప్రమీలలు 'పెంకుటిల్లు'నవలలో స్నేహితురాండ్రు. రాధ తన కుటుంబ పరిస్థితుల దృష్ట్యా ప్రమీలను ఆదుకోమంటుంది. ప్రమీల వాళ్ళ ఆర్థిక పరిస్థితుల్ని చూసి ప్రేమతో ఆదుకొంటుంది. రాధ కూడా ఆమె పట్ల యెంతో స్నేహాభిమానాలు కలిగి వుంటుంది. వీళ్ళిద్దరి మధ్య స్నేహ బంధాన్ని వేణుగోపాలరావు ఆదర్శవంతంగా చిత్రించారు.

'మేడలో నీడలు'లో మనోరమ, లీల స్నేహితురాండ్రు. మనోరమ భర్తను, కుటుంబాన్ని విడిచి కొత్త జీవితం కోసం మద్రాసు వెళుతుంది. అక్కడ

స్నేహితురాలు లీల ఆశ్రయమిస్తుంది. తన కుటుంబ పరిస్థితులు, తన అభిరుచులు మనోరమ లీలకు తెలియజేస్తుంది. లీల తన స్నేహితురాలి అభిరుచులు వాస్తవ జీవితానికి విడుద్ధాలని కుటుంబ జీవితమే అనుసరణీయమని హితబోధ చేస్తుంది. మనోరమ పశ్చాత్తాపంతో భర్తను చేరుకుంటుంది. చెలికత్తెలిద్దరు ఒకరినొకరు అర్థం చేసుకుని సమస్యలను పరిష్కరించుకునేందుకు ప్రయత్నించడం ప్రశంస నీయంగా వుంది. లీలవల్ల మనోరమ జీవితానికి సార్థకత యేర్పడుతుంది. ఈ స్నేహితురాళ్లు యెందరో స్నేహితులకు ఆదర్శనీయులుగా యీ నవలలో కనిపిస్తారు.

'ఒకే రక్తం-ఒకే మనుషులు' నవలలో గిరిజ, సరోజ స్నేహితురాండ్రు. సరోజ మేనమామ డాక్టర్ కిషోర్ మేనరికపు పెళ్లిళ్ళవల్ల కలిగే అనర్థాల్ని గురించి రాసిన ఉత్తరాన్ని గిరిజ చదువుతుంది. ఆ ఉత్తరం గిరిజ మనసుపై చెరగని ముద్ర వేస్తుంది. గిరిజ బలవంతం పెళ్ళి చేసుకుని సుందరంతో రాజీ పడలేక పోతుంది. ఆత్మ హత్యా ప్రయత్నం చేసికూడా విఫలమవుతుంది. స్నేహితురాలైన సరోజతో తన బాధను వెళ్ళబోసుకుంటుంది. సరోజ తన స్నేహితురాలి అంతరంగ వేదన, సంఘర్షణ మానసిక క్షోభలను అర్థం చేసుకుని గిరిజతో "జీవితం బ్రతకడనికి, యెక్కడికక్కడ రాజీపడక పోతే బ్రతకలేం. నేను చూడు, గతం మరచిపోలా? రాజీపడి కొత్త జీవితం వెదుక్కోలా? అతన్నుంచి నువ్వు విడిపోయి కొత్త జీవితం ప్రారంభించ కలిగితే అలా చెయ్యి. లేకపోతే లొంగిపోయి వుండిపో. కొన్నాళ్ళకి అదే అలవాటయిపోతుంది మనసుని పెంచబోక, నిర్దాక్షిణ్యంగా అణి చెయ్యి. మనసుకు లొంగబోకు. దాన్ని జయించు సుందరం నీకు బావని మరచిపో. అతనికి నీకున్న పూర్వ బంధుత్వాన్ని మరచిపో, భర్తగానే చూడు. ఓ పురుషుడుగానేచూడు. చచ్చి సాధించేదేమీ లేదు. బ్రతకడం ఓ కళ. క్రూరత్వం ఒక వరం. సున్నితత్వం ఓ శాపం. దాన్ని తొక్కేయి. ఈ లోకంలో కఠినులే నిర్దయగా ఆలోచించ గలిగినవారే, మనసుని పట్టించుకొనివారే యెక్కువ సుఖపడతారు. నువ్వు జీవించాలి"[37] అని అంటుంది. స్నేహ ధర్మాన్ని పాటించిన సరోజ, గిరిజ జీవితం మళ్ళీ చిగురించేటట్టు చేస్తుంది. ఆపదల్లో ఆదుకునేది స్నేహితులే నన్న సత్యాన్ని కొమ్మూరి వారు గుర్తు చేస్తున్నారు. వీరిద్దరి గాఢమైన స్నేహబంధమే మనకు కనిపిస్తుంది.

'మేడలో నీడలు'లో మనోరమ, లీల స్నేహితురాండ్రు. మనోరమ జీవితంలో నూతనత్వం పొందటం కోసం భర్తతో మనస్పర్ధలు తెచ్చుకుని భర్తను, కుటుంబాన్ని విడిచి మద్రాసు వెళ్ళిపోతుంది. అక్కడ స్నేహితురాలు లీల ఆశ్రయమిస్తుంది. తన కుటుంబ పరిస్థితులు తన అభిరుచులు మనోరమకు తెలియ జేస్తుంది. లీల తన స్నేహితురాలి అభిరుచులు వాస్తవ జీవితానికి విరుద్ధాలని తెలుసుకుని మనోరమతో "స్వేచ్ఛాప్రియా! నువ్వు ఊహావాసివిగా, అతీతపు వ్యక్తిగా చేసుకుని మాట్లాడకు. ఇందులో బంధం తప్పని సరి. అనుభవ పూర్వక మైన మాటలు బంధాలు లేకుండా జీవించాలనుకోవడం అవొక ప్రగల్భం అవు తుంది. ప్రపంచంలో అన్నిటికంటె మధురమైంది యీ బంధమే. స్వేచ్ఛ అనే పదానికి తప్పు అర్థాలు కలిగించకు. రాజీ పడక హద్దులు అక్కర లేదనుకుంటే మిగిలేది అశాంతే. అగ్నే. నిండు తనంలేక ఆ జీవితం చిక్కి చివికి ఆ నాట్యకత్తె అలిసి సొలిసి వేసిన తప్పటడుగులు లాగానో, గాయని గొంతుపోయి చేసిన అపశ్రుతిలాగానో వుంటుంది. వాళ్ళకోసం మనం యెంత త్యాగం చేసుకుంటు న్నామో వాళ్లూ మనకోసం అంత త్యాగం చేస్తుంటారని గ్రహించాలి. సంస్కారం మంతా మనదే అనుకోవడం కేవలం ప్రకర్ష. నాకు తెలిసినంతవరకు దాంపత్య బంధాన్ని మించిన సత్యం భూమ్మీద మరొకటిలేదు. ఈ అదృష్టాన్ని నువ్వు చేతులారా పోగొట్టుకోకు"[3] అని చెప్తుంది.

మనోరమ పశ్చాత్తాపంతో భర్తను చేరుకుంటుంది. స్నేహితురాలిగా లీల తన ధర్మాన్ని నెరవేర్చుతుంది. మనోరమ కాపురాన్ని నిలబెడుతుంది. మనోరమ జీవితం ముక్కలు చింపిన విస్తరి కాకుండా రచయిత మనోరమ పాత్రను సృష్టించి హితోపదేశం చేశాడు. భర్త మాటలకు యెదురు చెప్పి ఇల్లు విడిచిన స్త్రీలకు సున్నితంగా చురక అంటించినట్టు వేణుగోపాలరావుగారు చాల నేర్పుగా లీల పాత్రను సృష్టించి, మనోరమకు న్యాయం చేకూర్చగలిగారు. ఈ స్నేహితురాళ్ళు యెందరో స్నేహితులకు ఆదర్శనీయంగా కనిపిస్తారు.

'భారతి' నవల్లో భారతి, మల్లికలు ప్రాణస్నేహితులు. భారతి తనకున్న కుష్ఠువ్యాధివల్ల మల్లికతో తనను ముట్టుకోవద్దంటుంది. మల్లిక ఎంతో బాధను అనుభవిస్తుంది. అందుకు భారతి "నేను కుష్ఠురోగిని. నాది అసహ్యమైన వ్యాధి, భరించలేని అంటువ్యాధి మల్లికా. ఈ వ్యాధితో నేను మగ్గిపోతున్నాను. నశించి

పోతున్నాను. నా జీవితం చాలా అధ్యాయాలుగా గడిచిపోయాయి. ఇంకా పెళ్ళి కాలేదు, బంగారు కలలు నిజాలై రూపొందబోయే శుభదినాలెన్నో వున్నాయి. నన్ను ముట్టుకుని నాతో గడిపి పండువంటి జీవితం పాడుచేసుకోకు"[39] అని మల్లికతో ప్రాధేయపడుతుంది. కుష్ఠు అంటువ్యాధి కాబట్టి మల్లికకు కూడా తనగతే పట్టకూడదని భారతి అంతరంగ ఆవేదన. ఆ మాటలు విన్న మల్లిక హృదయం ద్రవిస్తుంది. మల్లిక కోరికమేరకు భారతిని గుంటూరు ఆసుపత్రికి తీసుకెళ్ళి చూపిస్తుంది.

భారతి తండ్రి గౌరీపతి తన కూతురుకు కుష్ఠు వున్న సంగతి దాచి భారతిని సారథికి యిచ్చి పెళ్ళి చేస్తాడు. భారతి మెట్టినింటిలో నోచుకోక తిరిగి పుట్టినిల్లు చేరుతుంది. భారతి మామ ఆమెచేత విడాకులిప్పిస్తాడు. భారతి విడాకులు తీసుకొనేంత త్యాగమెందుకు చేశావు అని మల్లిక ఆవేశంతో మాట్లాడుతుంది. అయినా మల్లిక భారతిని ఆపద సమయాల్లో ఆదుకుంటుంది. డాక్టర్ మల్లికను డాక్టర్ వినయ్ ప్రేమించి పెళ్ళి చేసుకోవడానికి ముందుకు రాగా సున్నితంగా తిరస్కరిస్తుంది. తన స్నేహితురాలి జీవితం గురించి చెప్పి ఆమెకు లేనిసుఖం నాకు వద్దని దృఢంగా నిలబడుతుంది.

భారతికి వ్యాధి పూర్తిగా నయమవుతుంది. సారధి రెండవ భార్య కుంతల. ఆమె భారతి దగ్గరకు వచ్చి తన భర్తను కాపాడమని, తమకు పుత్రభిక్ష పెట్టమని ప్రాధేయపడుతుంది. అందుకు భారతి మల్లిక సలహాను అడుగుతుంది. అప్పుడు భారతితో మల్లిక "నువ్వ పట్టి వెర్రిబాగులదానివే. ఇప్పటికే నీ జీవితం చాలా కాలిపోయింది. నువ్వు అడవిలోనైనాసరే, ఆటవికులతోనైనాసరే మనసారా సుఖంగా వుంటే సంతోషపడతాను. అతన్ని ప్రేమించావు. వివరాలు నాకనవసరం . ఇనేళ్ళ తర్వాత చిగురిస్తోంది నీ జీవితం పాతవంక మలుపు తిరుగుతోంది. ఈ మలుపుల మడతలతో నువ్వు నలగకూడదు. సుఖంగా వుండాలి. అదేనే నాచిరకాలవాంఛ"[40] అని చెప్తుంది. తన స్నేహితురాలి సంసారం నిలబడాలన్న కాంక్షతోనే మల్లిక, భారతి పురోభివృద్ధిని కోరుతుంది. కాని భారతి, తన భర్తచెంత చేరినా అతని పరిస్థితి విషమించడంతో వెనక్కి తిరిగివస్తుంది.

'సూర్యుడు దిగిపోయాడు'లో రాఘవరావు, అనంతమూర్తి స్నేహితులు. రాఘవరావు ఎక్కువమంది పిల్లలతో సతమతమౌతాడు. కుటుంబ భారం ఎక్కు

నవుతుంది. చేతికందిన పిల్లలు చెడువ్యసనాలకు గురి అవుతారు. తమ పిల్లలు ఉద్యోగాలు చేస్తున్నప్పటికి తమను చూడడంలేదని తన ఆవేదనను విన్న అనంత మూర్తి "సృష్టిలో మన కిష్టంలేనివీ, బాధ కలిగించేవీ, మనసును గ్రుచ్చుతూ వుండేవి అనేకం జరుగుతూ వుంటాయి. వాటిని గురించి బుర్ర బ్రద్దలుకొట్టు కోవటంకన్నా కాలమాన పరిస్థితులకు కొన్ని కొన్ని సహజంగా భావించి తేలిగ్గా తీసుకోవడం మంచిది కదా, వాళ్ళ గురించి మన ఉనికినీ, జీవితాన్ని పాడుచేసు కోవడం అంతకన్నా సబబుకాదు. డిసిప్లెన్ మొదట్నుంచీ ఓ పద్ధతిలో వుండాలి. అతి ప్రేమల నుంచి మితిమీరిన గారాబాల నుంచీ అది పుట్టుకురాదు. ఆ డిసిప్లెన్ అనేది చెయ్యిజారి పోయినప్పుడు దాన్ని గురించి వున్మాదంగా ఆరాట పడటం నష్టాలను కొనితెచ్చుకోవడమే. అయినా పరిస్థితుల్నిబట్టి కొన్ని కొన్నిటిని స్వల్పమైనవాటిగా భావించి వొదిలెయ్యటం మంచిదని"[11] రామవరావుకు హితవు చేస్తాడు. వర్ణాంతర వివాహాలవల్ల కూడా మంచివేనని, మనం పిల్లల్ని క్రమ శిక్షణలో పెంచి పెద్దచేయడం తల్లిదండ్రుల బాధ్యతని కూడా గుర్తుచేస్తాడు. తన స్నేహితుడి కుటుంబం అగాధంలో పడకూడదనే ధ్యాసతోనే స్ఫూర్తి కలగ జేసుకుని మాట్లాడతాడు.

హారతి నవల్లో ఆదిశేషయ్య రామనాథం స్నేహితులు. అదిశేషయ్య భార్య, కోడలు రైలుప్రమాదంలో మరణిస్తారు. ఆ కారణంగా పేకాట వ్యసనపరు డవుతాడు. త్రాగుడు అలవాటుకు కూడా బానిస అవుతాడు. మంచివాడయినా అది పెడదారి పట్టించేందుకు రామనాథం యత్నిస్తాడు. రామనాథంవల్ల ఆదిశేషయ్య బలహీనత బయటపడుతుంది.

సంఘంలో ఇలాంటి స్నేహితుల ఉనికి, వానివల్ల కలిగే ప్రమాదం పాత్ర కుల దృష్టికి ఆత్మీయంగా పలుకరించుకుంటారు. శ్రీధర్ తల్లి, భార్య రైలుప్రమా దంలో మరణించడంతో చంద్రమోహన్ శ్రీధర్ దుస్థితికి జాలిపడతాడు. మరో పెళ్ళి చేసుకొమ్మని సలహా ఇస్తాడు. శ్రీధర్ చంద్రమోహన్‌తో తన ఆవేదనను వెల్లడిస్తాడు. సర్వదా సర్వులకు మంచినే కోరే వీరి స్నేహం ఆదర్శప్రాయంగా చిత్రింపబడింది.

'తోడూ – జోడూ' నవల్లో దివ్య, సత్య స్నేహితురాండ్రు. చిరంజీవి హైదరాబాదులో కాపురం పెట్టిన తరువాత అతని భార్య దివ్యకు సత్య పరిచయ

మవుతుంది. మగవాళ్ల మనస్తత్వాలు యెలాంటివో భర్తను ఎలా అదుపులో పెట్టుకోవాలో అన్నది సత్య దివ్యతో ఇలా అంటుంది. "ప్రతి మొగాడికి పరస్త్రీమీద కాంక్ష, మోజు వుంటాయి. అది ఆచరణలో పెట్టడానికి అవకాశమివ్వకూడదు. సంవత్సరాలు గడిచినకొద్దీ భార్యమీద ఆసక్తి తగ్గిపోయి బుద్ధి పెడదోవపడుతు వుంటుంది. పరాయి ఆడది కనిపిస్తే వాళ్ళ మేనరిజమ్స్ మారిపోతాయి. తాను ఏదో ఆకర్షణలున్న పురుషుడిలాగా గోచరించడానికి రకరకాలుగా ప్రయత్నిస్తాడు. అందుకని యివన్నీ గమనిస్తూ భార్య మొదట్నుంచీ జాగ్రత్తపడుతుండాలి. లేకపోతే దొంపలంటుకుపోతాయి"[42]. అని అంటూ దివ్య కాపురానికే కొంపకే చిచ్చుపెడుతుంది. సత్య దుర్బోధను అక్షర సత్యంగా విశ్వసించిన దివ్య, భర్తను హింసించి అతన్నుండి వేరు పడుతుంది. దివ్య మరొకతన్ని పెళ్లి చేసుకుంటుంది. వీళ్లిద్దరి మధ్య స్నేహానుబంధంకన్నా ఇరుగు పొరుగుల సంబందమే యెక్కువగా మనకు కనిపిస్తుంది. మిడిమిడి జ్ఞానం వల్ల తామేర్పరచుకున్న అభిప్రాయాలను యితరుల మీద రుద్దడం వల్ల యేర్పడే ప్రమాదాలను గురించి హెచ్చరిస్తూ రచయిత సత్య పాత్రను సృష్టించినట్లు తెలుస్తుంది. చెడు స్నేహం వల్ల కుటుంబాలు యెలా కూలి పోతున్నాయో కూడా వేణుగోపాలరావుగారు యిందులో స్పష్టపరిచి వున్నారు.

ఈ నవల్లోనే చక్రవర్తి, చిరంజీవి స్నేహితులు. చక్రవర్తి చిరంజీవి కుటుంబంలో భార్యతో యెలా నడుచుకోవాలో సూచిస్తాడు. "చిరంజీవి భార్యను యెంతవరకూ అవసరమో అంతే చనువియ్యి. అంతే స్థానమియ్యి. అభిమానించు ఆమెకు కావలసిన అన్ని సౌకర్యాలను కలిగించు. ఆమెను ఒక మనిషిగా చూడు. కాని అర్థం లేకుండా ఆరాధించకు. నీ సొంత విషయాలు యేమీ చెప్పకు. నీ తల్లి దండ్రుల గురించి నీమీద వున్న యితరుల గురించీ తేలికగా మాట్లాడకు. అలాగే ఆమె సొంత విషయాలలో కూడా తలదూర్చకు, నువ్వు నీ వ్యక్తిత్వం మొదట్నుంచీ ఆమె తెలిసేలా ప్రయత్నిస్తూ వుండు"[43]. అని అంటాడు.

స్త్రీల మనస్తత్వాన్ని పసిగట్టిన చక్రవర్తి తన స్నేహితునితో యథార్థంగా వున్నది వున్నట్లు చెప్తాడు. జీవిత దృక్పథాన్ని తెలుసుకున్న చక్రవర్తి మాటలు యీ నవల్లో ఉటంకించదగ్గవిగా వున్నాయి.

## సూచికలు

| నెం. | రచయిత | నవల పేరు | పుట |
|---|---|---|---|
| 1. | వేణుగోపాలరావు కొమ్మూరి | 'పెంకుటిల్లు' | 149 |
| 2. | ,, | ,, | 124 |
| 3. | ,, | 'భారతి' | 62 |
| 4. | ,, | 'పెంకుటిల్లు' | 77 |
| 5. | ,, | 'విషవలయం' | 88 |
| 6, | ,, | 'మేడలో నీడలు' | 97 |
| 7, | ,, | 'ఈ దేశంలో ఒక భాగమిది' | 51 |
| 8. | ,, | ,, | 23 |
| 9. | ,, | 'విషవలయం' | 53 |
| 10. | ,, | 'హారతి' | 212 |
| 11. | ,, | 'ఒకే రక్తం ఒకేమనుషులు' | 12 |
| 12. | ,, | ,, | 195 |
| 13. | ,, | 'భారతి' | 14 |
| 14. | ,, | 'పెంకుటిల్లు' | 249 |
| 15. | ,, | ,, | 340 |
| 16. | ,, | 'ఈ దేశంలో ఒక భాగమిది' | 169 |
| 17. | ,, | 'ఒకే రక్తం ఒకే మనుషులు' | 24 |
| 18. | ,, | ,, | 203 |
| 19. | ,, | 'మేడలో నీడలు' | 21 |
| 20. | ,, | ,, | 175 |
| 21. | ,, | ,, | 176 |
| 22. | ,, | ,, | 196 |
| 23. | ,, | ,, | 140 |
| 24. | ,, | 'భారతి' | 202 |
| 25. | ,, | 'పెంకుటిల్లు' | 183 |
| 26. | ,, | ,, | 333 |

| నెం. | రచయిత | నవల పేరు | పుట |
|---|---|---|---|
| 27. | వేణుగోపాలరావు కొమ్మూరి | 'ఒకే రక్తం ఒకే మనుషులు' | 155 |
| 28. | ,, | ,, | 156 |
| 29. | ,, | 'భారతి' | 64 |
| 30. | ,, | ,, | 55 |
| 31. | ,, | ,, | 95 |
| 32. | ,, | ,, | 96 |
| 33. | ,, | ,, | 293 |
| 34. | ,, | 'మేడలో నీడలు' | 215 |
| 35. | ,, | 'ఒకే రక్తం ఒకే మనుషులు' | 77 |
| 36. | ,, | ,, | 78 |
| 37, | ,, | ,, | 185 |
| 38. | ,, | 'భారతి' | 164 |
| 39. | ,, | ,, | 87 |
| 40. | ,, | ,, | 191 |
| 41. | ,, | 'సూర్యుడు దిగిపోయాడు' | 71 |
| 42. | ,, | 'తోడూ-జోడూ' | 127 |
| 43. | .. | ,, | 17 |



# ప్రేమ జీవితం - 4

## 1. ప్రేమ - స్వభావం :

మానవ జీవితంలో రాగద్వేషాల పాత్ర ప్రముఖమైంది. మనోవికాసానికి శాస్త్రజ్ఞులు ప్రేమను జీవపరిణామంలో ఉన్నతశ్రేణి జీవరాసుల మానసిక చిహ్నంగా పరిగణిస్తున్నారు. ప్రేమ స్వరూప స్వభావాల్ని గురించి సాహిత్యవేత్తలు, మనో విశ్లేషణ శాస్త్రవేత్తలు వారి వారి కోణాల్నుండి అధ్యయనం చేశారు. ప్రణయం నుండి పెళ్ళిదాకా, సంతోషం నుండి సంతానందాకా ఆశ నుంచి నిరాశదాకా ఎన్నో అంశాలతో కూడుకున్న విషయమే ప్రేమ. ప్రేమ ఉద్వేగపరమైన మౌలికాంశం.

ప్రేమించడం, ఇష్టపడటం అన్నవిషయాలు స్త్రీ పురుషుల ప్రవృత్తులకు భిన్నం. ప్రేమ కొన్ని పరిస్థితుల్లో గతిశీలకమైనదని చెప్పవచ్చు. ఒక వ్యక్తిని చూడగానే వారి ఉనికినిబట్టి వారితో పరిచయం లేకపోయినా వారి గుణాల్ని మనం అంచనావేసుకుంటాం, మానసికమైన ఉద్వేగభావమే ప్రేమ. స్త్రీ పురుషుల మానసిక సంఘర్షణల నుండి ఏదో ఒక సుముహూర్తాన ఉద్వేగంగా ఉప్పొంగే మధురానుభూతినే ప్రేమ అని నిర్వచించవచ్చు.

ఉత్తమ మానవుని ప్రధానమైన గుణం ప్రేమ. ప్రేమించడం ప్రేమింపబడటం మానవ జీవలక్షణం. ప్రేమ ఒక సృజనాత్మక కళ. ప్రేమ జీవనరాగం. ప్రేమ జీవనవేదం. ప్రేమ మనిషికి జీవనధాతువు. ప్రేమ అంతంలేని జీవనప్రవాహం. రెండు హృదయాల పరస్పరస్పందన ప్రేమ. ప్రేమ ప్రేమకోసమే జీవిస్తుంది. ప్రేమకున్న ఆకర్షణశక్తి మరే భావానికిలేదు. కామవాసనతో కలిగిన ఆనందానుభూతి ప్రేమే. వస్తుగతమైన తృప్తిని కోరే కామ ప్రవృత్తి ప్రేమ. ఒక వ్యక్తికోసం యేర్పరచుకున్న బలమైన ఆసక్తి ప్రేమ. ఇలా ప్రేమకు ఎన్ని నిర్వచనాలైనా యివ్వవచ్చు.

ప్రేమ అనే శబ్దానికి సమానార్థక పదాలు అటు వ్యవహారంలోను ఇటు సాహిత్యంలోను దొరుకుతాయి. అవి కరుణ, దయ, జాలి, ఆదరణ, ఆకర్షణ, ప్రణయం, కోరిక, హర్షం మొదలైనవి.

ప్రేమ కొందరి జీవితాల్లో వెలుగును చిలికేచంద్రిక అయితే, మరికొందరి బ్రతుకుల్లో నిరాశ మిగిల్చే మరీచిక. కొందరి పాలిట వెన్నెల పతాకమయితే, మరి కొందరి నుదుట వెచ్చటినెత్తుటి సంతకం. కొన్ని హృదయాలకు ప్రేమ మధురమైన గేయమై పులకరింపజేస్తే కొన్ని జీవితాల్లో మాయనిగాయంగా మిగిలి పోతుంది. రెండు హృదయస్పందనలు ఏకమై సహజీవనం సాగించడం నిజంగా ప్రేమ గొప్పతనమే. తరతరాల మానవజాతి నైతిక ఆధ్యాత్మిక సంఘర్షణల ఆరాధ్యమూర్తిమత్వం ప్రేమ. ప్రేమకు ప్రయోజనం ఆనందం. ఆద్యంతాలులేని శాశ్వతానందం ప్రేమ. మానసికధర్మాలన్నిటికి అతీతం ప్రేమ. ప్రేమ దివ్యం, సత్యం. ప్రేమకు మోసం, దగా, వటన, అబద్ధంలాంటి విపరీత లక్షణాలు ఉండవు. "ప్రేమ ఒక దేవాలయం. ప్రేయసీప్రియులు దేవాలయ స్తంభాలు" అని అభిప్రాయ పడతాడు గిర్బన్ డిప్రోపిట్ అను గ్రంథంలో. ప్రేమ ఒక దివ్యమైన మానసిక భావం. తల్లికి బిడ్డకి మధ్య ప్రేమవుంటుంది. ఈ ప్రేమలో కామభావం (Libido) వుంటుందని మనస్తత్వ శాస్త్రవేత్తలు చెపుతున్నారు. ఒకవేళ అది నిజమైనా ఈప్రేమ శృంగారానికి దారితీయదు. తల్లికి బిడ్డకి మధ్యవున్న ప్రేమ వాళ్ళ బ్రతికి నంతకాలం శాశ్వతంగా వుంటుంది. ఈ ప్రేమ కామవాసనా దూషితం కావడం జరగదు. ఇద్దరి వ్యక్తులమధ్య ఏర్పడిన స్నేహాన్ని కూడా ప్రేమ అనవచ్చు ఈ ప్రేమకూడా స్థిరమైనదే" అని అంటారు డా॥ చలపతిగారు రాసిన 'ప్రేమ తాత్త్విక పరిశీలన' అన్న పుస్తకంలో ప్రముఖ నవలా రచయిత వడ్డెర చండీదాస్‌గారు.

"ప్రేమ విరిస్తే రంగుల హరివిల్లు. ప్రేమ కురిస్తే అమృతపు జల్లు. ఎడారిలో పూలు పూయిస్తుంది ప్రేమ. భగ్నహృదయాలలో ఆశలను మొలిపిస్తుంది ప్రేమ" అంటారు డా॥ చలపతిగారు తన 'ప్రేమ తాత్త్విక పరిశీలన' అన్న పుస్తకంలో.

ప్రేమను గురించి వ్యక్తీకరించిన నవల్లో కొమ్మూరి వేణుగోపాలరావు అయిదు నవలలు ప్రేమ జీవితానికి దర్పణంలాంటివి. ఇతివృత్తం మొత్తం ప్రేమ చుట్టూ తిరిగి ఒక్కొక్క నవలలో ఒక్కోరీతి ప్రేమ లక్ష్యసాధనకై పాత్రల సంఘర్షణ కనిపిస్తుంది.

పరిపక్వదశలో ప్రేమ మంచి చెడ్డలను ఆలోచించని అత్యల్ప ప్రజ్ఞాపాటవంతో దొర్లిపోయే ప్రేమ నవలే 'ఊగవే ఉయ్యాల'.

మమతానురాగాలతో ప్రేమతో మానవతాదృక్పథంతో పెళ్ళి జరగడానికి కరదీపిక 'ప్రేమకాంతి' నవల.

బ్రతుకుతెరువుకై అన్వేషణలో యెదురయ్యే ప్రణయగాథాలహరి 'ప్రేమ నక్షత్రం'.

ప్రేమానురాగాల మధ్య ఎడబాటు, వేదన ఆరాధనల సంఘర్షణరూపం 'పసుపు-కుంకుమ'.

ముగ్గురు నాయికలు నాయకులికి స్వచ్ఛమైన ప్రేమను అందించాలని అనుకున్నా కారణాంతరాలవల్ల అతనిలో జీవితాన్ని పంచుకోవడానికి ఆసక్తి కనపరచరు. అందుకే జాలిలేని నాయికులకు 'జాలిలేని జాబిలి' నాయకుడు కావడం ఇందులోని ఇతివృత్తం.

## 2. ప్రేమ కథాసన్నివేశాలు :

### 2.1. ఊగవే ఉయ్యాల :

మెడికల్ కళాశాలలో అడుగుపెట్టిన విద్యార్థుల్ని ర్యాగింగ్ చేయడం పరిపాటి. ఇందులో సీనియర్ విద్యార్థులుగా రాజా, దివాకర్ జూనియర్ విద్యార్థులుగా మాధవి, కళ్యాణి. జూనియర్ విద్యార్థులచేత సీనియర్ విద్యార్థులు మెస్‌లో సర్వ్ చేయించుకోవడం, డాన్సులు చేయించుకోవడం జరుగుతుంది. రాజా, దివాకర్ యెవరి గ్రూపుకు వారు నాయకులు. మాధవి యెవరిపక్షం వహించక నిర్మొహమాటంగా మాట్లాడుతుంది.

ర్యాగింగ్‌లో రాజా కళ్యాణిని అవమానిస్తాడు. రాజాను ఆసరాగా తీసుకున్న దివాకర్‌మనుషులు కళ్యాణిని బ్లాక్‌మెయిల్‌చేసి బలవంతం చేయబోగా మాధవి కాపాడుతుంది. రాజాను అనుమానించి మాధవి ఆతన్ని చేయిచేసుకుంటుంది.

రాజా తమ్ముడు సుధాకర్. కళాశాలలో ర్యాగింగ్‌వల అనుభవించిన మానసికక్షోభను వర్ణిస్తూ తన అన్నకు ఉత్తరం రాస్తాడు. తమ్ముడి ఉత్తరంద్వారా రాజా తను కళాశాలలో చేసిన పనులకు పశ్చాత్తాపం చెందుతాడు. కళ్యాణి

విషయంలో మాధవి దగ్గర తన నిర్దోషిత్వాన్ని తెలుపుకుంటాడు. రాజా మాధవిని ప్రేమించిన విషయం చెప్తాడు. మాధవి కొన్ని షరతులు పెడుతుంది. మొదటిగా క్రికెట్‌లో సెంచరీ చేయడం, పాతకక్ష కారణంగా దివాకర్ రాజా తలను బంతితో గాయపరుస్తాడు. రాజాకు న్యూరోసర్జరీ ఆపరేషన్ జరుగుతుంది. రెండవ షరతుగా స్కూటర్ ఆక్సిడెంట్‌వల్ల స్పృహకోల్పోతాడు. మాధవి రాజాను ఆసుపత్రిలో చేర్పుతుంది. కోమాలోకి వెళ్ళిపోయిన రాజాను డాక్టర్ల సలహామేరకు ఇంగ్లండు తీసుకెళతారు. డాక్టర్ స్మితా రాజాకు న్యూరోసర్జరీ ఆపరేషన్ చేస్తాడు. మూడు సంవత్సరాల తరువాత రాజాకు స్పృహవస్తుంది.

మాధవి అక్క సరస్వతి. ఆమె భర్త ప్రతాప్. సత్యవతి టి.బి. పేషెంట్ కారణంగా మాధవితో తన పెళ్ళి జరగాలని పట్టుపడతాడు. అందుకు సత్యవతి నిరాకరిస్తుంది. ఆమెను మానసికంగా. శారీరకంగా హింసిస్తారు. ప్రతాప్‌తో పెళ్ళికి మాధవి తిరస్కరిస్తుంది. సత్యవతి ఆత్మహత్య చేసుకుంటుంది. తన అక్కను కాపాడబోయిన మాధవికి ఓ చెంప కాలిపోతుంది. ప్రతాప్ ప్రవర్తనకు ఇంటినుండి వచ్చేసిన మాధవి దారిలో స్పృహ కోల్పోతుంది. డాక్టర్ నరేంద్ర ఆమెను కాపాడుతాడు.

డాక్టర్ నరేంద్ర భార్య మాధురి. ఆమె గుండెజబ్బు మనిషి. మాధవితో మాధురి పరిచయం చేసుకుంటుంది. మాధురి కోరిక ప్రకారమే ఆమె చర్మంతో మాధవి చంపకు ప్లాస్టిక్ సర్జరీ చేస్తాడు నరేంద్ర. తన భర్తతో మాధవిని పెళ్లి చేసుకోమని చెప్పి మాధురి మరణిస్తుంది. నరేంద్ర మాధవిని భార్యగా చూస్తాడే గాని శారీరకసుఖాన్ని పొందలేకపోతాడు. మాధవి మాలతి పేరుతో అదే ఆసుపత్రిలో నర్స్‌గా పనిచేస్తుంది.

డాక్టర్ స్మిత దగ్గర చికిత్స పొందుతున్న రాజాను నరేంద్ర దగ్గరకు పంపుతాడు. రాజాను నరేంద్ర తన ఆసుపత్రిలో చేర్చుకుంటాడు. నర్స్‌గావున్న మాలతిని చూసిన రాజాకు మాధవి గుర్తుకు వస్తుంది. రాజా మాలతిని ముద్దు పెట్టుకోబోయి ఆమెదగ్గర చెంపదెబ్బలు తింటాడు.

డాక్టరుగా, రచయిత్రిగా పేరుగాంచిన ప్రమీలాదేవి రాజా జీవితానికి దగ్గరగా వున్న నవలను సీరియల్‌గా రాస్తుంది. మానసిక వికాసాన్ని పొందిన రాజా ప్రమీలా

దేవిని చేరుకోవాలంటాడు. రాజా కోరిక మన్నించి ప్రమీలాదేవిని తీసుకువస్తుంది రాజా ప్రమీలాదేవితో తన గతజీవితాన్ని చెప్తాడు. రాజా జీవితం పత్రికలో సీరియల్‌గా రావడంవల్ల మానసిక సంఘర్షణకు లోనై స్పృహ కోల్పోతాడు మాలతి దగ్గరుండి కాపాడుతుంది. ప్రమీలాదేవి తనకున్న ఆస్థమా వ్యాధివల్ల సీరియల్‌ని సకాలంలో అందించని కారణంగా మాలతి ఆ రచనను పూర్తిచేస్తుంది రాజా గతజీవితాన్ని మలుపుతిప్పాలన్న ధ్యేయంతోనే రచనను మలుపు తిప్పుతుంది రాజా పరిస్థితి రోజురోజుకు ఆందోళనకరమవుతుంది. డా॥ స్మిత కోరిక ప్రకారం ప్రమీలాదేవి తన రచనను పూర్తి చేస్తుంది. రాజా మానసికంగా మార్పుచెంది గతజీవితాన్ని మరచిపోతాడు.

డాక్టర్ నరేంద్రకు రాజా, మాధవి (మాలతి)ల గతజీవితం తెలుస్తుంది అందువల్ల డాక్టర్ నరేంద్ర మాలతిని పెళ్ళి చేసుకోమని రాజాకు ఉత్తరం రాసి విదేశాలకు వెళ్ళిపోతాడు. నరేంద్ర కోరికమేరకు మాలతి, రాజా కలసి జీవిస్తారు.

2.2. జాలిలేని జాబిలి :

మధుబాబుకు చిన్నప్పటినుంచి సాహిత్యం మీద మక్కువ మక్కువ సాహిత్య పిపాస కలగడానికి అతని తల్లి కారకురాలవుతుంది. ఇంటర్ చదువు తున్న రోజుల్లో రాజ్యలక్ష్మి అతని రచనలకు ముగ్ధురాలౌతుంది. కళాశాల వార్షి కోత్సవ నాటకంలో ఆమె అందానికి ముగ్ధుడై, ఆకస్మిక ప్రలోభానికి లోనై వసంధిస్తాడు. రాజ్యలక్ష్మి మధుని చేయి చేసుకుంటుంది. విద్యార్థులు కూడా మధుని గాయపరుస్తారు. పశ్చాత్తాపంతో యిద్దరూ దగ్గరవుతారు. మధు రాజ్యలక్ష్మితో తన పెళ్ళిని ప్రస్తావిస్తాడు. అందుకు రాజ్యలక్ష్మి కొన్ని అనుకోని పరిస్థితుల్లో తన పిన్ని తమ్ముడికి శరీరాన్ని అర్పించానంటుంది. నిజంచెప్పిన ఆమె తనను మరచి పొమ్మంటుంది. రాజ్యలక్ష్మి ఆత్మహత్య చేసుకుంటుంది. ఆమెపై అమిత మైన ప్రేమ, జాలిని నింపుకుంటాడు.

మధుబాబు జీవితంలోకి ప్రవేశించిన మరో ప్రణయవీచిక పద్మజ. ఆమె కూడా మధు రచనలకు ముగ్ధురాలై ఉత్తరాలు రాస్తుంది. ఉత్తరాలద్వారానే సన్ని హితులవుతారు తప్ప ఒకరినొకరు చూసుకోరు. ఇద్దరి మధ్య అనురాగ భావం ఏర్పడుతుంది. మధు పద్మను ప్రేమించిన విషయం కూడా ఉత్తరంద్వారా

బయటపెడతాడు. అందుకు సమాధానంగా మూడు సంవత్సరాల ముందుగానే పెళ్ళి అయిపోయిందని తెలుస్తుంది. మధు వికలమనస్కుడవుతాడు. పద్మజకోసం ఆమె యింటికి వెళతాడు. పద్మజ అతన్ని ఓదార్చడానికి ప్రయత్నిస్తుంది. మధు ఆమెతో పుడలేని జీవితం శూన్యమంటాడు. అందుకు పద్మజ తన్ను తీసుకు వెళ్ళింది. తిరిగి వచ్చేటప్పుడు మాత్రం మీరొక్కరే రావాలి అని తన సంసారాన్ని గుర్తుచేస్తుంది. ఆమె మానసిక ఆవేదనను అర్థంచేసుకుని తిరిగి వచ్చేస్తాడు.

మధు సాహిత్యంపై విపరీత వ్యామోహాన్ని పెంచుకున్న మరో స్త్రీ ఇందిర. ఒద్దరూ ఒకరికొకరు దగ్గిరవుతారు. కాని ఆమె కొత్త జీవితంకోసం ప్రయత్నిస్తుంది. తన కులస్థుడు కాని మధుని వివాహం చేసుకోనని నిశ్చయించుకుని మరొకడిని పెళ్ళిచేసుకుంది. ఇలా మధు జీవితంలో ముగ్గురు తుఫాను రేపి వెళ్ళిపోతారు.

పద్మజ పాత్రతోపాటు మధు జీవితంలోకి తొంగిచూసిన ఓ అపూర్వ స్త్రీ రజని. రాము అక్క స్నేహితురాలు. రజని శైలజగా పేరు మార్చుకొని సినిమా నటి అవుతుంది. శైలజ వ్యాధి గ్రస్తురాలవుతుంది. డాక్టరుగా వృత్తిని స్వీకరించిన మధు దగ్గర చికిత్స పొందాలన్నది ఆమె ఆశయం. మధు తన జీవితంలో మరో స్త్రీకి చోటివ్వడు. అతని బ్రతుకు రోగుల సేవకు సాహితీ పిపాసువు తృప్తికి అంకితమవుతుంది. అతడు ఓ బాటసారిగా మిగిలిపోతాడు.

## 2.3. ప్రేమకాంతి :

వినీల MBBS చదువుతున్న ఓ పేదపిల్ల. రఘు వినీలను ప్రేమిస్తాడు. రఘు వినీలను ఆర్థికంగా ఆదుకుని పై చదువులకు ప్రోత్సహిస్తాడు. రఘుకి 'న్యూరో సర్జరీ' ఆపరేషన్ సందర్భంలో దగ్గరుండి చూసుకుంటుంది వినీల. రఘు మేనమామ కూతురు వినత. వినత రఘుని పెళ్ళాడాలనుకుంటుంది. అందుకు రఘు తిరస్కరిస్తాడు. వినీల రఘుని ప్రేమించిన సంగతి చెప్తుంది. రఘు తనకున్న వ్యాధివల్ల వినీలను పెళ్ళిచేసుకోవడానికి సమ్మతించడు. కాని వినీల బలవంతం వల్ల వినత రఘు రిజిష్టర్ పెళ్ళి చేసుకోవాలని నిర్ణయించుకుంటారు. వినత రఘు జబ్బు నయంచేసి పెళ్ళి చేసుకోవడానికి అతన్ని అమెరికా తీసి కెళుతుంది. రఘు తప్పించుకు వస్తాడు.

వినీల పై చదువులకోసం విశాఖనుంచి హైదరాబాదు వెళుతుంది. అక్కడ జరిగిన హర్తాళ్ళలో వినీల గాయపడగా రవికిషోర్ కాపాడుతాడు. అతను బాంక్ మేనేజర్. రవికిషోర్ చెల్లెలు పద్మజ. పద్మజకు పెరాలసిస్ రావడంతో వినీల నయంచేస్తుంది. రఘు సంతకాన్ని వినత ఫోర్జరీచేస్తూ వినీలకురాసిన ఉత్తరంలో వినతను పెళ్ళి చేసుకున్నానని తెలియజేసి వుంటుంది. వినీల ఆ విషయాన్ని నమ్ముతుంది. రవి, వినీల మరింత దగ్గరవుతారు. రఘుకి పెళ్ళి అయిందని నమ్మిన వినీల రవికిషోర్‌ని పెళ్ళాడుతుంది. రఘు వినీలతో తన సంతకాన్ని వినత ఫోర్జరీ చేసిన విషయాన్ని చెప్తాడు. రఘుకి అన్యాయం చేయలేనని వినీల రఘుని కూడా పెళ్ళాడుతుంది. రవికిషోర్‌ని పెళ్ళాడిన విషయం రఘుకి తెలియనివ్వదు.

వినీల తన జీవితానికి భవిష్యత్తును చూపినందువల్ల కృతజ్ఞతతో రఘుని పెళ్ళాడుతుంది. ఇరువురి పెళ్ళాడిన వినీల మానసికంగా వ్యథ చెందుతుంది. తన ఉదంతాన్ని డైరీలో రాసుకుంటుంది. ముందుగా రవికి భార్య అయినప్పటికీ వినీల రఘుతో సంసారం చేస్తుంది. ఇరువురితో జీవితం ఎలా మలుపు తిప్పుకోవాలో తెలియక వినీల బాధపడుతుంది.

రఘుచేసిన ఆర్థిక సహాయంతో వినీల ప్రయివేట్ నర్సింగ్‌హోమ్ నడుపుతుంది. రఘు అక్కడే చికిత్స పొందుతాడు. రవికి ఆసుపత్రి వాతావరణం అంటే అలర్జీ కావడంవల్ల లోనికి వెళ్ళేవాడు కాదు. వినీలను అనుమానించడు. ఆసుపత్రిలోవున్న అటెండర్ బైరాజు వినీలజీవితాన్ని పసికట్టి బ్లాక్‌మెయిల్ చేస్తాడు. రఘుకి న్యూరో సర్జరీ ఆపరేషన్ జరిగి జబ్బు నయమౌతుంది. రఘు ఆరోగ్యం కుదుటపడటంతో వినీల తను ఎవరికీ చెందకూడదన్న తలంపుతో ఒకే ఉత్తరంలో ఇరువుర్ని సంబోధిస్తుంది. వినీల కొడుకుతో రైలులో ప్రయాణించగా వాణ్ణి కిడ్నాప్ చేస్తాడు. బైరాజు రంగనాయకులు కాపాడి తీసుకువస్తాడు.

రవికిషోర్ వినీల ఉత్తరంచూసి ఆమెకు చేరువకావాలన్న ఆదుర్దాతో బయలుదేరుతాడు. రవికి కారు ప్రమాదంలో తలకు బలమైన గాయం తగులుతుంది. రవి గత జీవితాన్ని మరచిపోతాడు. వినీల రవికి చేరువ అవుతుంది. రఘు వాళ్ళ శ్రేయస్సును కోరి దూరంగా వెళ్ళిపోతాడు.

2.4. ప్రేమ నక్షత్రం :

ఫణి విశాఖపట్టణంలో MSc. చేస్తుంటాడు. తోటి విద్యార్థిని శైలజ, ఫణిని ప్రేమిస్తుంది. ఇరువురు పేదవాళ్ళు కావడంవల్ల ఒకరినొకరు అర్థంచేసుకుని రిజిష్టర్ పెళ్ళి చేసుకుంటారు. డాక్టర్ కల్నల్ సంజీవరావు జనతా ఫార్మా స్యూటికల్స్ స్థాపిస్తాడు. ఆ కంపెనీల నిబంధనల ప్రకారం పెళ్ళి కానివారికి ఉద్యోగమిస్తాడు. బ్రతుకు తెరువుకోసం ఫణి శైలజలు ఇరువురూ పెళ్ళి కాలేదని చెప్పి అదే కంపెనీలో ఉద్యోగి అయిన రామకృష్ణ శైలజ అందానికి ముగ్ధుడై ఫణితో ఆమెకు ప్రేమలేఖ రాసి పెట్టమంటాడు. తన యెదుటే తన భార్యను పొగుడుతున్న రామకృష్ణను చూసి ఫణి మానసికంగా నలిగిపోతాడు.

డాక్టర్ సంజీవరావు ఆల్కాహాల్‌కు విరుగుడు మందు కనిపెట్టాలన్నది అతని ఆశయం. సంజీవరావు ఆశయాన్ని నెరవేర్చుతాడు ఫణి. ఆ మందును సేవించిన యిద్దరు మైకంలో తారుమారై సంజీవరావు శైలజ యింటికి, ఫణి చూడామణి యింటికి వెళతారు. ఫణిని అపార్థం చేసుకుంటుంది శైలజ. ఫణి చెల్లెలు వసుమతి ఫణి తరువాత కుటుంబభారాన్ని వహిస్తుంది. తన అన్న దగ్గరకు వెళుతున్న వసుమతిని ఆమె మేనమామ సురేష్ వెంటాడుతాడు. వసుమతిని రక్షిస్తాడు రామకృష్ణ. రామకృష్ణతో వసుమతి తన జాలిగాథను వివరిస్తుంది. రామకృష్ణకు ఫణి శైలజలు భార్యా భర్తలని తెలుస్తుంది. ఫణి దగ్గరకు వెళ్ళి రామకృష్ణ తన తప్పును క్షమించమంటాడు. రామకృష్ణ వసుమతిని ప్రేమించిన సంగతి ఫణితో వివరిస్తాడు. ఫణి, శైలజ, రామకృష్ణ, వసుమతి కనకదుర్గ గుడి దగ్గర వుండటం చూసి సురేష్ సంజీవరావుకి ఫిర్యాదు చేస్తాడు. సంజీవరావు తనని అందరు మోసంచేశారని అందర్నీ ఉద్యోగంనుండి సస్పెండ్ చేస్తాడు. చూడామణి మాటలవల్ల సంజీవరావులో మార్పువస్తుంది. పెళ్ళయిన వాళ్ళను విడగొట్టడం సరికాదని పశ్చాత్తాప పడతాడు. సంజీవరావు కంపెనీ నిబంధనల్ని సడలించి అందరికి ఉద్యోగ వసతులు కల్పిస్తాడు, ఫణి కనిపెట్టిన ఆల్కాహాలు విరుగుడు మందు మంచి ప్రాచుర్యాన్ని పొందుతుంది. ఫణి, శైలజ భార్యాభర్తలుగా జీవితాన్ని గడుపుతారు.

2.5. పసుపు – కుంకుమ :

మాలతి, భానుమతి స్నేహితురాళ్ళు. ప్రయివేటు కంపెనీలో ఉద్యోగం చేస్తుంటారు. కంపెనీ మేనేజర్ మాలతిని ప్రేమిస్తాడు. చంద్రశేఖర్ తల్లి

మరణిస్తుంది. మాలతి, చంద్రశేఖర్‌లు పెళ్ళి చేసుకుంటారు. తల్లి మరణించిన వ్యథతో చంద్రశేఖర్‌కు గుండెపోటు వస్తుంది. డాక్టర్ కృష్ణారావు 'కన్‌జెనిటల్ హార్ట్ డిసీజ్' అని తేలుస్తాడు. ఆరోగ్యం కొద్దిగా కుదుటపడుతుంది. మాలతితో తమ శారీరకవాంఛ తీర్చుకునే సమయంలో గుండెపోటు రావడం పరిపాటి అవుతుంది. చంద్రశేఖర్‌కి రాయవెల్లూరులో ఆపరేషన్ జరుగుతుంది. దాంపత్య జీవితానికి దూరంగా వుండమంటారు. హైదరాబాదు తిరుగుప్రయాణంలో చంద్రశేఖర్‌కు తన మిత్రుడు శంకర్ కనిపించగా యింటికి తీసుకెళతాడు.

మాలతి స్నేహితురాలు భానుమతి. చిన్నప్పటి నుండి అనాథ శరణాలయంలో పెరుగుతుంది. విధివైపరీత్యంవల్ల భానుమతికి వయసుమళ్ళిన వాడితో పెళ్ళి జరుగుతుంది. భానుమతి భర్త విదేశాలకు వెళ్ళిపోవడంతో మంగళసూత్రాన్ని తీసివేస్తుంది. మాలతి భానుమతి ఇరువురూ తమ వైవాహిక జీవితాన్ని చర్చించుకుంటారు.

చంద్రశేఖర్ తన ఇంటికి తీసుకెళ్ళిన స్నేహితుడు శంకర్ మాలతి అందాన్ని చూసి హరించాలని ఆరాటపడతాడు. అప్పుడప్పుడు మాలతిని వేధిస్తాడు. అవకాశంకోసం వేచివున్న శంకర్ మాలతి శీలాన్ని కొట్టేస్తాడు. చంద్రశేఖర్ తన భార్యతో వచ్చేయమనే ప్రాధేయపడుతున్న శంకర్ మాటల్ని వింటాడు. మిత్రద్రోహానికి పాల్పడిన శంకర్‌ను ఇంటినుండి వెళ్ళగొడతాడు. మాలతి మంగళసూత్రాన్ని త్రెంచుకుని యింటినుండి తరిమేస్తాడు. తన స్మృతిపథంలో వున్న మాలతి వస్తువుల్ని కాల్చివేస్తాడు. ఆ మంటలు ఎక్కువకావడంతో అందులో చిక్కుకున్న చంద్రశేఖర్ అంధుడవుతాడు.

భానుమతిని కంపెనీ మేనేజర్ యింటికి రప్పించి ఆమెను బలవంతం చేయబోగా మందలిస్తుంది. ఆఫీసులో వున్న రామ్మోహన్ భానుమతిని పెళ్లి చేసుకుంటాడు. భానుమతి ముందుభర్త రాసిన ఉత్తరం రామ్మోహనకు దొరుకుతుంది. ఆ కారణంచే ఆమెను వదలి వెళ్లిపోతాడు. తన ముందుభర్త నుంచి వచ్చేసిన మాలతికి భానుమతి ఆశ్రయమిస్తుంది.

చంద్రశేఖర్ యింటిలో బంట్రోతుగావున్న గోపయ్య మనవరాలిగా మాలతి దుర్గగా మళ్ళీ తన యింటిలో ప్రవేశిస్తుంది. చంద్రశేఖర్‌కు గుండెపోటు రావడం

వల్ల మాలతి దగ్గరుండి కాపాడుతుంది. చంద్రశేఖర్‌కు తన భార్య అని తెలియదు. మాలతి దుర్గగా ఆ యింటిలో ప్రవేశించినందుకు ఆమెను బ్లాక్‌మెయిల్ చేస్తాడు. మాలతి గోపయ్యల సంభాషణలు విన్న చంద్రశేఖర్ తిరిగి దుర్గగా ప్రవేశించి నందుకు యింటినుండి వెళ్ళిపొమ్మంటాడు. తన భర్తను చంపబోయిన శంకర్‌ను మాలతి కాపాడుతుంది. తన ప్రాణాల్ని అనుక్షణం కాపాడినందుకు మాలతి నిజాయితీని తెలుసుకున్న చంద్రశేఖర్ పశ్చాత్తాపంతో ఆమెను దగ్గరకు తీసు కుంటాడు. ఇరువురి మధ్య నడచిన సుదీర్ఘ ఎడబాటు అదృశ్యమవుతుంది.

# 3. ప్రేమ నవలల్లో విశేషాలు :

## 3.1 ర్యాగింగ్ :

'ఊగవే ఉయ్యాల' నవల ర్యాగింగ్ ఇతివృత్త నేపథ్యం. ఇందులో మెడికల్ కళాశాల చేరిన మాధవి, కళ్యాణి స్నేహితులు. కళ్యాణిని సీనియర్ విద్యార్థి అయిన రాజా ర్యాగింగ్ చేస్తాడు. దివాకర్ రాజాపై కక్ష సాధించాలన్న ఉద్దేశంతో దివాకర్ మనుషులు కళ్యాణిని బ్లాక్‌మెయిల్ చేస్తారు. మాధవి కళ్యాణిని కాపాడుతుంది. మాధవి రాజాను అనుమానించి చేయిచేసుకుంటుంది. తన స్నేహితు రాలికి అన్యాయం తలపెట్టిన రాజాతో మాధవి "ఒక ఆడపిల్ల మానప్రాణాలు దోచుకునేందుకు సిద్ధపడిన నువ్వు మెడికల్ విద్యార్థివా? ఎవరో ఆడవాళ్ళ సాయంతో ఆమెను న్యూడ్ చెయ్యడానికి ప్రయత్నిస్తావా? ఆమె ప్రయత్నం సఫలమై ఆత్మహత్య చేసుకునివుంటే ఒక నిండుజీవితం బలి కావడానికి నువ్వే కారకుడవయ్యేవాడివి. దుర్మార్గుడా? మనిషిగా పుట్టి పశువులా ప్రవర్తించడానికి నీకు సిగ్గులేదూ?....నిన్నెలా ఎదుర్కోవాలో నాకు తెలుసు"[1] అని మందలిస్తుంది. ర్యాగింగ్ కారణంగా ఆడపిల్లకు జరిగిన అన్యాయానికి తన అక్కసును వెళ్ళ గ్రక్కుతుంది. తన కక్ష తీర్చుకుంటుంది. ర్యాగింగ్‌లో జూనియర్ విద్యార్థులతో చెలగాటమాడుతున్న సీనియర్ విద్యార్థులకు మాధవి మాటలు ఒక గుణపాఠం దివాకర్ లాంటి విద్యార్థులకు ఒక హెచ్చరికగా అనిపిస్తుంది.

ఈ రచనలోనే సీనియర్ డాక్టరు, రచయిత్రి అయిన ప్రమీలాదేవి, ర్యాగింగ్‌పై తన అభిప్రాయాన్ని "జూనియర్స్ కాలేజిలో కొత్తగా చేరుతారు కాబట్టి

సీనియర్స్‌తో పరస్పర అవగాహనం కావడానికి వాళ్ళకి స్టడీస్‌లో కాని మిగతా ప్రక్రియల్లో గాని సీనియర్స్ కోఆపరేషన్ కావాలి కాబట్టి అవసరమని వాదిస్తారు కొందరు. నా దృష్టిలో ఇది పైశాచికమైన వినోదం పరస్పర అవగాహన కోసం ఇంత వికృతమైన చర్యలు చేయనక్కరలేదు. అది చాలా సునాయాసంగా సాధించ వచ్చు"[2] అని అంటుంది. ప్రమీల మానసిక పరిణతితో మాట్లాడటం రచయిత అభిప్రాయంగానే భావించవచ్చు.

## 3.2 ర్యాగింగ్‌పై ప్రముఖ రచయిత్రుల అభిప్రాయాలు :

డా॥ కె. వి. కృష్ణకుమారి—"ర్యాగింగ్ ప్రొఫెషనల్ స్టడీస్‌లో వున్నంత తీవ్రంగా మరే కాలేజిలోను, ఏ కోర్సులోను వుండవనుకుంటాను. ఎందుకంటే వైద్యశాస్త్రంలాగే వైద్యవిద్యకు కేటాయింపబడిన కాలపరిమితి కూడా చాలా సుదీర్ఘమైంది. ఈ సుదీర్ఘకాలంలో అటు ఆరు తరాలకి ఇటు ఆరు తరాలకి మధ్యన సన్నిహిత సంబంధాలను, సీనియర్స్ వినయవిధేయతలను వుంచేదే, పెంచేదే ఈ ర్యాగింగ్.. ..శ్రుతి మించిన ర్యాగింగ్ మానసిక దృక్పథంతో సత్ పరిణామాలనే అందిస్తుంది. మరపురాని మధురస్మృతులు మిగులుస్తుంది"[3] అని అంటున్నారు.

డా॥ పెళ్ళకూరి జయప్రద "తల్లినీ తండ్రినీ పెరిగిన వాతావరణాన్ని వదలి కొత్త ప్రపంచంలోకి వస్తున్న పసిపిల్లల్ని ఆదరించి, వాళ్ళభయాన్ని పోగొట్టాలి గాని ర్యాగింగ్ పేరిట భయం పోయి అందరిలో కలసిపోతారనే భావంతో అదే పద్ధతిని ఇంకా కొనసాగించడం మంచిది కాదనిపిస్తుంది. పైగా ర్యాగింగ్ బెదిరిపోయి మెడికల్ కళాశాల వదిలేసి తమ భవిష్యత్తును పాడుచేసుకున్నవాళ్లు ఎంతో మంది వున్నారు. ఆలోచించండి. ఇది యెంత అవాంఛనీయమైనదేనా?"[4] అని ప్రశ్నిస్తున్నారు.

పై ఇరువురి అభిప్రాయాల్లో భిన్నత్వం కనిపిస్తుంది. రచయిత వేణుగోపాలరావు మెడిసన్ చదువుకునే రోజుల్లో వారిరువురు సహవిద్యార్థులు గావడం విశేషం. ప్రస్తుతం వారిరువురు అటు ప్రవృత్తిలోను ఇటు సాహితీరంగంలోను పరిచయం వున్నవారే.

3.3 ప్రేమ - ఎడబాటు :

'ఊగవే ఉయ్యాల' నవలలో మాధవి కళ్యాణిని బ్లాక్‌మెయిల్ చేసింది దివాకర్ మనుషులని తెలుసుకుంటుంది. రాజా చేయని తప్పుకు శిక్ష అనుభవించా డని పశ్చాత్తాపం చెందుతుంది. రాజా తను చేయని తప్పుకు కళ్యాణి విషయంలో తన నిర్దోషిత్వాన్ని మాధవి ముందు ప్రకటించుకుంటాడు. రాజాలో మార్పు తీసుకు రావడానికి ఒక విధంగా మాధవి కారకురాలవుతుంది, రాజా మాధవితో తను ప్రేమిస్తున్న సంగతి తెలియజేస్తాడు.

మాధవి తన ప్రేమకు గుర్తుగా మూడు షరతులు పెడుతుంది. 1. క్రికెట్ 2. వీడియో గేమ్ 3. స్కూటర్ గేమ్, మొదటి షరతుగా దయాకర్ పాత కక్షతో రాజాను బంతితో గాయపరుస్తాడు. వీడియో గేమ్‌లో స్పృహ కోల్పోతాడు. స్కూటర్ ఆక్సిడెంట్ కారణంగా స్పృహ పూర్తిగా కోల్పోయిన రాజా కోమా లోకి వెళ్ళడంతో ఇంగ్లండు తీసుకెళుతారు. డా॥ రాడ్మిస్మిత్ రాజాకు న్యూరోసర్జరీ ఆపరేషన్ చేయగా మూడు సంవత్సరాల తరువాత రాజాకు తెలివి వస్తుంది. వీరు ప్రేమించుకున్నప్పటికీ విధివైపరీత్యం కారణంగా ఇరువురి ప్రేమ విఫల మౌతుంది. ప్రేమ ఎడబాటును కోరదు కాని ప్రేమ షరతులు పెట్టడంవల్ల కొందరి జీవితాలు అనర్థాలకు గురవుతాయి. డాక్టర్ నరేంద్ర త్యాగఫలితంగా, డాక్టర్ ప్రమీలాదేవి సాహిత్యంవల్ల మాధవి రాజాను తిరిగి కలుసుకుంటుంది. ఇరువురి జీవితాల్లో యెన్నో అవాంతరాలు వచ్చినప్పటికీ వారి ప్రేమ సఫలమౌతుంది.

'జాలిలేని జాబిలి'లో రాజ్యలక్ష్మి మధుబాబు ప్రేమను చూడవచ్చు. కళాశాల సాంస్కృతికోత్సవాల్లో నాటకంలో పాల్గొంటారు. రాజ్యలక్ష్మి అందానికి మోహితుడై మధు ఆమెను చుంబిస్తాడు. అందుకు రాజ్యలక్ష్మి చేయి చేసుకోగా వ్యధ చెందుతాడు. మధు తనలోని మూగ ఆవేదనను వ్యక్తం చేసుకుంటూ మనసులో "క్షణమొక వ్యామోహం తనది. ఈ ఆత్మవంచనతో ఆమె జీవితంలో జారిపడే సామర్థ్యం, తెగింపు తనకు లేవు. ఒక విధంగా తనింకా జీవితం ప్రాథమికదశలో వున్నాడు. ఒకవేళ ఆమెను ప్రేమించా ననుకుంటే పెళ్ళి చేసు కునే శక్తి తనకున్నదా?. . . . .తను రచయిత. లోకానికి యెలుగెత్తి చాటగలడు. ఇంట్లో తన మాట సాగదు. తన విద్య, అభివృద్ధి వీటన్నిటి ముందు యీ ప్రేమ

భస్మీభూతమై పోతుంది"[5] అని అనుకుంటాడు. ఇది మధుబాబు మానసిక ప్రవృత్తి. ఎదురైన సమస్యల తోరణానికి నివృత్తిగా తోస్తుంది.

మధు, రాజ్యలక్ష్మి ఇద్దరూ కృష్ణానది తీరాన కలుసుకుంటారు. తను ప్రేమించిన విషయాన్ని ఆమెకు చెప్పినప్పుడు తన గతాన్ని వివరిస్తుంది. 'తను కలుషితమైన దానిని, తన పిన్ని తమ్ముడికి కొన్ని పరిస్థితులలో తన శరీరాన్ని అర్పించుకున్నానని, తనను మరచిపొమ్మని' మధుని అర్థిస్తుంది. మధు ఆమె జీవితాన్ని అసహ్యించుకోడు. ఆమెపై అమిత ప్రేమ, జాలి నింపుకుని పెళ్ళి చేసుకుంటానని మాట ఇస్తాడు. రాజ్యలక్ష్మి తన జీవితాన్ని మధుకి పంచి ఇవ్వలేనన్న బాధతో ఆత్మహత్య చేసుకుంటుంది. ప్రేమించిన మనిషి మలినమైనా స్వీకరించే ఉన్నత భావాలు కలవాడు.

ఇందులోనే మధుబాబు పద్మజల అనుబంధం చాలా విచిత్రమైంది. మధు సాహిత్యంవల్ల ఉత్తరాలద్వారానే పరిచయం అయినవాళ్లు. పద్మజ వివాహిత. మన సమాజంలో పెళ్ళికాకముందు ప్రేమించే హక్కు స్త్రీలకుంది కాని పెళ్లయ్యాక కాదు. వివాహిత అయిన స్త్రీ శారీరకంగా, మానసికంగా కూడా పరాయి మగాణ్ణి ఆలోచించకూడదు. వీరిరువురి ప్రేమ ఓ మధురభావన, జీవితానికి అది ఒక ఆలంబన. ఆ విధమైన ప్రేమ ప్రతిక్షణం ఆమె జీవితానికి కొత్త అందాన్నిస్తుంది. ఆమెలో స్వార్థం లేదు. శారీరక కాంక్ష లేదు. ఏదో పొందాలన్న తపన లేదు. అసహజమైన విషాదం లేదు. అది ఒక మధురమైన అనుభూతి ఆ అనుభూతివల్ల యెవరికీ అపకారం లేదు. దానివల్ల ఎవరూ నష్టపోరు. మనిషి ప్రేమ పిపాసి. ప్రేమకు వయోభేదం లేదు. మధుని రాజ్యలక్ష్మి ప్రేమించింది. వివాహిత అయిన పద్మజ ఆరాధిస్తుంది. మధు మానసిక సంఘర్షణ గురై మనసులో "తనని అతీతంగా వూహించే ఆమె ఆరాధిస్తోంది. ఆమె ఆరాధించేది తనని కాదు. అసలా అతీతంగా ఊహిమ్మేద లేదు. తాను వొట్టి నిమిత్తమాత్రుడు. కలలను కలిగించటానికే మళ్ళీ పగలకొట్టడానికి జన్మించిన దౌర్భాగ్యుడు తన సాహిత్యాన్ని ప్రేమించడం లేదు. ఎందుకట్లా అయింది? యీ పరిస్థితి, తనకిక ఆత్మహత్య శరణ్యం యెన్నడూ అనుకోని సమస్య" ఇతని మానసిక సంఘర్షణ విభూత్న రీతిలో పయనించినట్లు మనకు తెలుస్తుంది.

మధుబాబు పద్మజతో తన స్వార్థాన్ని గురించి "ఓ యువతి తనకు పెళ్లయిన విషయం చెప్పకుండా దాచి, ఓ యువకుణ్ణి స్వప్నసీమలో విహరింపజేసి అతని వీణాతంత్రుల్ని మధురంగా మ్రోగించి, అతనే తన సర్వస్వం అన్న భ్రమ కలిగించిన స్థితిలో ఆ యువతిని పత్నిగా చేసుకునేందుకు అతను ఉబలాటపడితే అది స్వార్థమా? ఆమె జీవితాన్ని అశాంతిపాలు చేస్తున్నాననే భీతితో మౌనం వహిస్తే అది స్వార్థమా? ఒంటరితనంతో అల్లాడిపోతూ తోడుకోసం తపించిపోతూ నలిగి, నశించిపోయినా నా బ్రతుకు నీకెలా అర్థం అవుతుంది....నన్ను గురించి నువ్వు ఓ రూపాన్ని నిర్మించుకున్నావు. రూపంలేని నిన్ను ఆరాధించాను. నా చంచల ప్రవృత్తితో నీకో బాహ్యస్వరూపం వూహించి అది తలుచుకొని ఉవ్విళ్లూరటానికి నా అంతరాత్మ అంగీకరించలేదు. నువ్వు యీ రూపంలో కాదు, ఎలా వున్నా యిదే నిశ్చలచిత్తంతో నీ ముందు నిల్చుని వుండేదాన్ని"[7] అని అంటాడు. రెండవసారి కూడా తన జీవితం చిరిగిపోయినందుకు తనని తాను ప్రశ్నించుకుంటాడు. తన ఆశయాలన్నీ గాలిలో కలసిపోయినట్లు తలుస్తాడు.

మధు సాహిత్యంపై విపరీతమైన వ్యామోహాన్ని పెంచుకున్న ఇంధిర అతన్ని ప్రేమిస్తుంది. ఆమె వయసులోను, ఆలోచనలోను అందరికంటె కాస్త ఎదిగినట్లు కనిపిస్తుంది. జ్వరంతో వున్న మధుని చూసి ఇందిర కలత చెంది ఒక్కమారుగా అతనిపై ప్రేమ, కరుణ, ఆప్యాయత, అనురాగం, మమకారం వెల్లివిరుస్తుంది. ఇందిర తన ప్రియబాంధవి యెందుకు కాకూడదు, అని ఆలోచిస్తాడు మధు. ఇందిర తల్లిదండ్రులు తమ కులంకానివాడ్ని ప్రేమించి పెళ్ళి చేసుకోవడం తప్పని చెప్పగా ఆ విషయాన్ని మధుకి తెలియజేస్తూ నేను అస్వతంత్రురాలినని కన్నీరు కారుస్తుంది. ఇందిర జీవితానికొక బాట కల్పించుకోగలిగింది కాని మధు జీవితంలో మరొక తుఫాను సృష్టించింది. జీవనస్రవంతిలో మనిషి సాంఘిక పరిస్థితులకు బానిస. అందుకే ఇందిర వాళ్ళ తల్లిదండ్రుల్ని యెదిరించలేకపోతుంది.

మధు ముగ్గురి జీవితాల్లో ప్రవేశించి యెదురుదెబ్బలు తింటాడు. జీవితంలో ఓడిపోతాడు. అంతరాంతరాలలో ఏదో మరవరాని, మరచిపోలేని తియ్యని చేదైన బాధ. ఖేదపడిన మనస్కుడై ఇందిరతో "నువ్వు అసమర్థురాలివి. పిరికిదానివి.

చదివిన చదువును సద్వినియోగం చేసుకోలేని పరమమూర్ఖురాలివి. ఏదో ఒక రూపంలో మీ జీవితాలకు స్పష్టత, నిండుతనం ఏర్పడుతున్నాయి. సెటిల్ అయి పోతున్నారు. ఏమీ లేకుండా మిగిలిపోయేది నేనే. మీరు వెళ్ళిపోయారు. అంతా చీకటి తడుముకుంటూ నడుస్తాను. దారి సరిగా తెలియదు. అలాగే పడుతూ లేస్తూ పోతుంటాను ఒక్కడ్నే"[8] అని అంటాడు. ముగ్గుర్ని ప్రేమించి ఏ ఒక్కరూ గూడా దగ్గరకు తీసుకోలేదన్న బాధ, నిరాశ వ్యక్తమౌతుంది. చివరకు నిరాశావాదిగా మిగిలిపోతాడు.

'ప్రేమకాంతి'లో రఘు, రవి, వినీల ప్రేమచరిత్రే యీ రచన. రఘు కిషోర్ ఆసుపత్రిలో పేషెంటుగా వున్నప్పుడు డాక్టరుగా వున్న వినీల పరిచయం అవుతుంది. పై చదువుల కోసం రఘు ఆమెను ఆదుకుంటాడు, గుండెజబ్బు కారణంగా రఘుని వినీల ప్రేమిస్తుంది. "ఎప్పటినుంచో ఎన్ని సంవత్సరాల నుంచో మిమ్మల్ని పిచ్చిగా, గాఢంగా ప్రేమిస్తున్నాను. మిమ్మల్ని గొప్పగా అమాయకంగా ఆరాధిస్తున్నాను కాబట్టి మీరు నా సర్వస్వం అని భావిస్తోన్నా"[9] నంటుంది. అందుకు సమాధానంగా 'నేను రోగిష్టివాడిని. నన్ను చేసుకుంటే నీ జీవితం వట్టిపోతుంది. నిరర్థకమౌతుంది. ఒక స్త్రీకి తీరాల్సిన యే ఆశలూ తీరవు' అని చెప్పడంలో రఘు ఉన్నతభావాలు కలవాడుగా కనిపిస్తాడు. ఆధునిక సమాజానికి మేలుచేసి ప్రతిఫలం ఆశించటం మంచిది కాదని సందిగ్ధంగా రచయిత వుంచడం గమనార్హం.

రఘు వినీల రిజిష్టర్ పెళ్ళికోసం ఆఫీసుకెళ్ళి రిజిష్టర్ చేస్తారు. రఘుకి వున్న వ్యాధిని గుర్తించి దాని పరిశోధనలో మునుగుతుంది. చదువుకోసం హైదరాబాదు వెళ్ళిన వినీల హర్తాళ్ళల్లో గాయపడుతుంది. రవికిషోర్ కాపాడుతాడు. రఘునుంచి వచ్చిన ఉత్తరంలో 'మొదటనుంచి నా జీవితంలో పెనవేసుకున్నమనిషి వినీల ఈ ఉత్తరం అందేలోపుగా మాపెళ్ళి అయిపోయి వుంటుందని' అందులో వుంటుంది. నిజానికి ఆ ఉత్తరం వినత రాసి రఘు సంతకాన్ని ఫోర్జరీ చేస్తుంది. అంతవరకు స్నేహంగావున్న రవికిషోర్‌ని వినీల ప్రేమిస్తుంది. ఇరువురు పెళ్ళి చేసుకుంటారు. వినీల మనోధైర్యంతో నిలబడగలుగుతుంది. వినీలతో రఘు సాహచర్యంవల్ల కొత్త చిగుళ్ళు తొడిగింది కాని మొగ్గ పువ్వై వికసించకుండానే యదార్థస్థానంలోకి వెళ్ళిపోయింది.

రవిని వినీల పెళ్ళాడుతుంది. విశాఖపట్టణం చేరుకున్న వినీలకు రఘు, వినీల పెళ్ళి అబద్ధం అవుతుంది. వినత ఫోర్జరీచేసినట్లు కనుకొంది. వినీల సంప్రదాయానికి విరుద్ధంగా రఘుని పెళ్ళి చేసుకుంటుంది. రఘుతో సంసారంచేస్తుంది. రవి, రఘులను ఉద్దేశించి ఓ ఉత్తరం దార్వా తెలిపి నిద్రమాత్రలు వేసుకోవడం తెలుసుకున్న రఘు ఆసుపత్రికి తీసుకెళ్లి కాపాడుతాడు.

నాగరిక ప్రపంచంలో పురుషుడు యిద్దరి భార్యలతో సంసారం చేయవచ్చు. కాని ఒక స్త్రీ యిద్దరి భర్తలతో జీవించడం కష్టం. కాని రాజీపడే ఓర్పు, నేర్పు స్త్రీలలో వుంటుంది. అందువల్లనే ఈ సమస్యలకు తానే కారణమని జీవితాన్ని అంతం చేసుకోవడం తప్ప వేరే మార్గంలేదని మానసికంగా బాధపడుతుంది.

రవి కారు ఆక్సిడెంట్ వల్ల స్పృహ కోల్పోతాడు. ఆసుపత్రిలో చికిత్స పొందుతున్న రవి గత జీవితంలో జరిగిన విషయాలన్ని మరచిపోతాడు. రవి వినీల తన కొడుకుతో జీవిస్తారు. ఆ ముగ్గురి జీవితాల్లోన్ని ఒడుగుదుడుకుల్ని గురించి వేణుగోపాలరావు "ప్రేమ ఓ దుఃఖం, ఓ బాధ హింసించి సేదదీర్చే పిచ్చి వెలుగు, తమకు మాత్రమే అర్థమయి యితరులకు అగమ్య గోచరంగా వుండే ఓ తిక్క.. .....ప్రేమ పొందినా దాహంతీరని యెండమావి. ప్రేమ అందినా భ్రమగానే మిగిలే మధురస్వప్నం ప్రేమ నిరంతరం అస్థిరత సాధన. ప్రేమకాంతిని కోరుకుంటూ చేసే చీకటి తపస్సు, ప్రేమ పొదుపుగా వెదికితేనే గాని లభ్యంగాని రహస్య తపస్సు. ప్రేమ ఓ స్వర్గం, ఓ నరకం, ఓ ఉన్మాదం, ఓ భయంకరం. ప్రేమ ప్రతివ్యక్తి అనుభవించి తీరాల్సిన జీవిత సత్యం. ప్రేమ ప్రతిమనిషి తప్పించుకుని తీరాల్సిన కఠోరమైకం"[10] అని అంటున్నారు. వినీల జీవితానికి అన్వయించి రచయిత చెప్పిన ప్రేమకు నిర్వచనంగా వుంది.

'ప్రేమ నక్షత్రం'లో ఫణి, శైలజల ప్రేమ వివాహం దాపత్య విషయంలో నాటక మాడటం కారణంగా ఆందులో యెడబాటు యేర్పడుతుంది. బ్రతుకు తెరువుకోసం అబద్ధమాడిన వారి ప్రేమ చివరకు సఫలమైన జీవితం సాగుతుంది. ఎమ్మెస్సీ చదవడానికి విశాఖపట్టణం వెళుతున్న ఫణికి రైలులో శైలజ పరిచయం అవుతుంది. ఇద్దరూ అప్పుడప్పుడు కలసి మాట్లాడుకునేవారు. ఫణి పేదవాడు కావడం వల్ల రాత్రుల్లో రిక్షాలు లాగి, మూటలు మోస్తూ గడిపేవాడు,

ఫణిని ఆర్థికంగా ఆదుకుంటుంది శైలజ. ఆమె చేస్తున్న సహాయానికి ఫణి కళ్ళల్లో నీళ్లు నిలుస్తుంది. ఇద్దరి మధ్య వున్న సంబంధాన్ని గురించి మాట్లాడగా శైలజ కలుగచేసుకుని 'నీకు నాకు సంబంధం లేకపోవచ్చుగాని, నీ బీదరికానికి, నా బీదరికానికి సంబంధం వుంది. మగవాళ్ళు కంట నీరు పెట్టకూడదని' ఓదార్చు తుంది. శైలజలోని సంస్కారం మానవత్వం ఇక్కడ తేటతెల్లమవుతుంది.

ఫణి, శైలజలు రిజిస్టర్ పెళ్ళి చేసుకుంటారు. డాక్టర్ సంజీవరావు స్థాపించిన జనతా ఫార్మాస్యూటికల్స్ కంపెనీలో భార్యాభర్తలు ఇద్దరు పెళ్లికాలేదని చెప్పి ఉద్యోగంలో చేరిపోతారు. ఇరువురు ఒకేచోట ఉద్యోగం చేసినా దాంపత్యంలో ఎడబాటు నలుగుతుంది. కుటుంబ ఆర్థికపరిస్థితులు మాత్రం మెరుగుపడుతుంది. జీవనస్రవంతిలో ఉద్యోగాన్వేషణ సాహసకృత్యం కాబట్టి పెళ్లికాలేదని చెప్పి ఉద్యోగంలో చేరడం సంప్రదాయరీత్యా తప్పే కాని పరిస్థితులదృష్ట్యా అలా చేయడంలో తప్పులేదు. ఇది యీ నవలలో నవ్యత—సంజీవరావుకి ఫణి, శైలజలు భార్యాభర్తలు అని తెలుస్తుంది. కాని ఆల్కాహాలుకు విరుగుడు మందు కనిపెట్టిన ఫణిని అభినందిస్తూ భార్యాభర్తల జీవితంలో ఎడబాటును తొలగిస్తాడు. కంపెనీ నిబంధనల్ని సడలించి అందరికీ న్యాయం చేకూర్చుతాడు.

ఇందులోనే కల్నల్ సంజీవరావు చూడామణిల ప్రేమ పెళ్లి విషయం చూడవచ్చు. సంజీవరావు జీవితంలో మార్పు తీసుకురావడానికి చూడామణి ప్రయత్నిస్తుంది. మానవజీవితాలకు నిబంధనలు ముఖ్యమని, ప్రేమించడం మంచిదేగాని యుక్తాయుక్తజ్ఞానం వుండాలని పరిస్థితుల్నిబట్టి సంజీవరావు కంపెనీలో నిబంధనల్ని మార్చగలిగాడు. అందరి మన్ననల్ని పొందగలుగుతాడు. చూడామణిని పెళ్లి చేసుకుంటానని అందరి యెదుట తన నిర్ణయాన్ని ప్రకటిస్తాడు. ప్రణయానికి ప్రతీక ప్రేమ. ఆడది మార్పుకు ఆయువు. మోడువారిన సంజీవరావు జీవితంలో ప్రేమను చిగురించి తన జీవితానికి తోడు కావాలనుకుంటాడు. ప్రేమను విపరించడంలో రచయిత స్ఫూర్తిని, దీప్తిని పాఠకజనానికి తెలియజేశాడు. ఎన్ని మధుర క్షణాలు, ఎన్నియుగాలు, ఎన్ని యదార్థాలు ప్రేమ వాహినిలో వున్నాయో ప్రేమ మాధుర్యం అనుభవించినవారికే తెలుస్తుంది. ఇంతా మానసిక ఆనందాన్ని కలిగించేది ప్రేమ ఒక్కటేనని వివరిస్తుంది.

పసుపు కుంకుమలో చంద్రశేఖర్ ప్రయివేటు కంపెనీ మేనేజరు. మాలతి ఆ కంపెనీలో వుద్యోగం చేస్తుంటుంది. చంద్రశేఖర్ మాలతిని ప్రేమిస్తాడు. ఇద్దరు పెళ్ళి చేసుకోవాలనుకుంటారు. ఆ సందర్భంలోనే చంద్రశేఖర్ తల్లి మరణించడం వల్ల మానసికంగా కృంగడంతో గుండెపోటువస్తుంది. చంద్రశేఖర్ వ్యాధి గ్రస్తుడైనప్పటికీ మాలతిలో అతనిపై వున్న ఆరాధన భావంమారదు. ఆధునిక సమాజంలో చిన్నా భిన్నమైపోతున్న హైందవ సంస్కృతిని మాలతి మాట్లాడుతుంది.

మాలతి చంద్రశేఖర్‌ల జీవితాన్నిగురించి రచయిత "ఆగి ఆగి ప్రవహించే నది యే మలుపు దగ్గరకో లేక పల్లందగ్గరకో వచ్చేసరికి ఝరవేగం అందుకున్నట్లు ఒక్కొక్కసారి జీవితం ఓ వయసు వరకూ సాఫీగా సాగి, అక్కడ్నుంచి పరుగు ప్రారంభిస్తుంది. ఆ పరుగు సక్రమమైన మార్గంలోనైనా దారి తప్పుతూ వుంటుందా అంటే అది వేరే విషయం[11]" అని అంటున్నారు. ఇద్దరి జీవితంలో జరగబోయే ఒడుదుడుకు సంసారాన్ని తెలియచేస్తున్నాడు.

మాలతి చంద్రశేఖర్‌ల పెళ్ళిజరుగుతుంది. వారి తొలిరాత్రే చంద్రశేఖర్‌కు గుండెపోటు వస్తుంది. సమయానికి డాక్టరు దగ్గిరకు చేర్చిన మాలతితో డాక్టర్ దాంపత్య జీవితానికి దూరంగా వుండాలంటాడు. మాలతికి తను అన్యాయం చేసినట్లు బాధపడిన భర్తతో "ఆత్మవంచన చేసుకునే అలవాటు మొదట్నుంచీ లేదు. జీవితమన్నాక అనుకోని సంఘటనలు, అనేకం జరుగుతుంటాయి. నిలబడి వాటిని తట్టుకోవాల గాని కలవరపడి పారిపోకూడదు[12]" అని ఆత్మస్థైర్యంతో మాట్లాడుతుంది. సంసార సాగరాన్ని యీదగల మనోధైర్యంతో పాటు వాటిని తట్టుకోగల శక్తివుండాలి. అని చెప్పడం మంచి మనస్తత్వంగల స్త్రీ మూర్తిగా తెలుస్తుంది. ఇక్కడ రచయిత 'కొందర్ని కొందరు అదృష్టవంతుల్ని చేస్తారుకాని, విధి అదృశ్యం అనుభవించ నివ్వలేదు' అని మాలతి నుద్దేశించి అంటాడు.

కొందరి జీవితాలు మధ్యలోనే చిరిగిపోయి అంతటితో అర్థంలేకుండా ముగిసిపోతుంటాయి. జీవితాలు అనుభవాల పుట్టలు. బయటకు కనిపించేవి పది వంతులయితే లోపల జరిగేవి తొంభై వంతులు. చంద్రశేఖర్‌కు ఆపరేషన్ చేయడం

వల్ల మళ్ళీ మామూలు మనిషి అవుతాడు. తిరుగు ప్రయాణంలో చిన్ననాటి స్నేహితుడు శంకర్ తటస్థపడతాడు. శంకర్‌ని ఇంటికి ఆహ్వానిస్తాడు. కుచ్ఛిత బుద్ధిగలవాడుగా, స్నేహధర్మాన్ని పాటించని శంకర్ మాలతిని కాజేయాలని ఆమెను అడుగడుగునా వేధిస్తాడు, మాలతి తోక తొక్కిన పామువలె ప్రవర్తిస్తుంది. స్త్రీ మనస్తత్వాన్ని చక్కగా చిత్రీకరించాడు రచయిత.

మాలతి చంద్రశేఖర్ జీవితంలో శంకర్ ఎడబాటుకు కారకుడవుతాడు. ఇంటిలో మకాం వేసిన శంకర్ ఓరోజు రాత్రి ఆమె శీలాన్ని అపహరిస్తాడు. చీకటిలో తన భర్తే అనుకుంటుంది. నిజం తెలుసుకున్న మాలతి ఆగ్రహోదగ్రురాలవుతుంది. తనతో వచ్చేయమని ప్రాధేయపడతాడు. అందుకు కోపంతో నిలువెత్తునలేస్తూ స్త్రీపతనం నీకు ఆనందమా? పచ్చని సంసారాన్ని విచ్ఛిన్నం చెయ్యడానికా ? గృహాన్ని నరకంగా మార్చిన రాక్షసుడా ? ఇలాంటి మాటలతో యింటినుండి వెళ్ళిపొమ్మంటుంది. ఇరువురి సంభాషణల్ని విన్న చంద్రశేఖర్ ఇద్దరు బాగా నటిస్తున్నారని మొదట స్నేహధర్మాన్ని గురించి "ప్రపంచంలో అన్నిటికన్నా భయంకరమైన మృగమేదో తెలుసా? మనిషి పెంచి పెద్దచేసిన వాళ్ళని అనవసరంగా కాల్చుకుతినేవాడూ, నమ్మినవాళ్ళ గొంతుకోసే వాడూ, స్నేహాలని కూడా పాతరచెయ్యకుండా కార్చిచ్చు రేపేవాడు మనిషికాడు అనర్థాలకు అసహ్యంగా లొంగిపోయే వికృతమైన జంతువు"[13] అనంటాడు. మనిషి మనిషిగా చూడాలేకాని క్రూరమృగంలా వేటాడకూడదన్నది రచయిత ముఖ్యోద్దేశం. మానవ కనీసధర్మాన్ని వ్యక్తం చేస్తూ, మనిషిగా స్నేహితుల కర్తవ్యంగా మనకు గుర్తుచేస్తున్నారు. శంకర్ కారణంగా ఇరువురి జీవితంలో చిచ్చు రగులుతుంది. ఎడబాటు అవుతుంది. మాలతిని కూడా యింటినుండి వెళ్ళగొడుతూ మంగళసూత్రాన్ని తెంచేస్తాడు. మాలతి 'దారుణమైన ముగింపు వద్దని' ప్రాధేయపడినా శంకర్ వినిపించుకోడు.

మాలతి యింటినుండి వెళ్ళిపోయిన తరువాత చంద్రశేఖర్ ఆమె వస్తువులు వుండకూడదని తగలబెడుతాడు. చంద్రశేఖర్ మంటల్లో చిక్కుకుని అంధుడవుతాడు. ఇంటినుండి వెళ్ళిపోయిన మాలతి దుర్గ (పనిపిల్ల)గా తన భర్తకు సేవచేస్తుంది. శంకర్ మళ్ళీ ఆమెను వెంటాడుతాడు. డబ్బు ఇవ్వమని వేధిస్తాడు.

తన భర్తను చంపబోయిన శంకర్‌ను అడ్డుకుని శంకర్‌ను చావబాదుతుంది. తన ప్రాణాల్ని కాపాడినందుకు చంద్రశేఖర్ పశ్చాత్తాపంతో "నేనంతా విన్నాను మాలతీ! ఏం జరిగిందో తెలిసింది. మనిషి కొన్ని బలహీనతలకి బానిస. స్వార్థం అనేది యీ బలహీనతల్లో ఒకటి. దానికి నేను బానిసైపోయాను. అందుకే అసూయతో, ద్వేషంతో యిన్నాళ్లు దహించుకుపోయాను. జీవిత పరిణామాలలో ఒక భాగమైన తప్పుకు శాశ్వతమైన ప్రమాణాలు కల్పించి అర్థంలేని వికృతాలతో జీవితాలని నింపుకోవడం పరమమూర్ఖత్వమని గ్రహించాను. మనకి కావలసింది మనిషి. ప్రేమించి ఆత్మీయంగా దగ్గరకు తీసుకునేది మనిషి. ఆ అదృష్టం వర్తిస్తున్నప్పుడు కాదని ధిక్కరించేవాడు మూఢుడు...నీ విలువ నీలాంటి స్త్రీల విలువ అనంతమని గ్రహించాను. నీలాంటి వ్యక్తిలేని జీవితం నిస్సారమనీ చీకటి మయమనీ అర్థం చేసుకున్నాను. మాలతీ నువ్వు కావాలి"[14] అని తాను పశ్చాత్తాపంతో మాట్లాడుతాడు. భార్యాభర్తల మధ్య నడచిన ఎడబాటు అదృశ్యమవుతుంది.

## 3.4 ప్రేమ - మానసిక సంఘర్షణ :

'ఊగవే ఉయ్యాల' నవలలో డా॥ నరేంద్ర దగ్గర రాజా చికిత్స పొందుతాడు. రాజా మాధవి రూపంలో వున్న మాలతిని చూస్తాడు. మాధవి రాజాను గుర్తించి నర్స్‌గా సేవ చేస్తుంది. డాక్టరు, రచయిత్రి అయిన ప్రమీలాదేవి రచన సీరియల్‌గా పత్రికలో ప్రచురితమౌతుంది. ఆ రచన రాజా జీవితానికి దగ్గరగా వుంటుంది. రాజా ఆ రచనను చదవడంవల్ల మార్పు గమనిస్తుంది మాలతి. రాజా కోరిక మేరకు ప్రమీలాదేవిని పరిచయం చేస్తుంది. మాలతి సహాయంతో రాజా గత జీవితాన్ని ప్రమీలాదేవి యధాతధంగా ప్రచురిస్తుంది. తన ఆరోగ్యం దృష్ట్యా ప్రమీలాదేవి సీరియల్‌ని రాయలేకపోతుంది. మాలతి సీరియల్ రాసిపంపుతుంది. కథ పరోక్షంగా వుంటుంది. "ఒకప్రక్క డాక్టర్ల కృషి, ఇంకోవైపు అనురాధా సేవలు అతనికి మళ్ళీ జీవం పోశాయి. ..అతన్ని బ్రతికించుకోవడం కోసం ఆమె యిన్నాళ్ళుబ్రతికింది కానీ, స్వార్థం ఏమాత్రము లేదు. అతనికి తెలిస్తే? ఆమె రూపం చూసి భరించగలడా? అందుకని అతనికి శాశ్వతంగా దూరమైపోవడానికి నిర్ణయించుకుంది."[15] అని సీరియల్ పంపుతుంది. అది చదివిన రాజా మరచిపోవడానికి ద్రోహదపడుతుంది. సాహిత్యంద్వారా మనిషిలో మార్పు తీసుకురావచ్చునని

రచయిత ఉద్దేశం. ప్రమీలాదేవి కారణంగా రాజాలో పరివర్తన కలుగుతుంది తనను ప్రేమించిన రాజా జీవితంతో మార్పు రావాలని మాధవి ఆశించింది. తాను గుర్తించలేనంతగా మార్పు పొందటం కాంక్షించిన మాలతి (మాధవి) సహృదయురాలు.

'జాలిలేని జాబిలి'లో మధు, పద్మజలు యిరువురు ఒకరినొకరు చూడక పోయినా ఆరాధనా భావంతో ప్రేమించుకుంటారు. పద్మజ ప్రేమకు ప్రధాన కారణం మధుబాబు రచనల్లోని సృజనాత్మకితే. పద్మజ తనకు పెళ్లయిన విషయాన్ని తెలుపుతూ మధుకి ఉత్తరం రాస్తుంది. మధు మనసును చిత్రవధ చేస్తుంది. మానసిక సంఘర్షణకు గురై మనసులో "తనని అతీతంగా వూహించే ఆమె ఆరాధిస్తోంది. ఆమె ఆరాధించేది తనని కాదు. అసలా వ్యక్తి భూమ్మీద లేడు. తాను ఒట్టి నిమిత్తమాత్రుడు. కలలను కలిగించడానికే మళ్ళీ పగలకొట్టడానికి జన్మించిన దౌర్భాగ్యుడు. తన సాహిత్యాన్ని ప్రేమించడంలేదు. ఎందుకిట్లా అయింది. ఈ పరిస్థితి తనకిక ఆత్మహత్య శరణ్యం, ఎన్నడు అనుకోని సమస్య."[16] ఇలాంటి మానసిక వత్తిడికి తట్టుకోకపోతాడు.

కొందరి జీవితాలు ఒంటరితనంతో మొదలై ఒంటరితనంతోనే కొనసాగుతాయి. వినీల జీవితం రఘు సాహచర్యం వల్ల కొత్త చిగుళ్ళు తొడిగింది కాని మొగ్గ పువ్వులై వికసించకుండానే యదార్థ స్థానంలోకి వెళ్ళిపోయింది. రఘు సాహచర్యంవల్ల రవి వినీలను అపార్థం చేసుకుంటాడు. రవి కూడా మానసికంగా బాధపడుతూ త్రాగుడికి అలవాటు పడతాడు. అందరికీ కారకురాలు తానేనని డైరీలో యిలా రాసుకుంటుంది. "ఇద్దరి మొగుళ్ల పెళ్ళాన్ని నేను. చట్టబద్ధంగా యిద్దర్నీ పెళ్ళి చేసుకున్నాను. శారీరకంగా, మానసికంగా యిద్దర్నీ భర్తలుగా అంగీకరించిన దాన్ని. ఇద్దరితో కాపురం చేస్తున్నదాన్ని. ఈ సృష్టిలో నా లాంటి ప్రాణి ఇంకొకరున్నారో లేదో తెలియదు. ఈ రహస్యం కాపాడుకోవటానికి నే ననుభవిస్తున్న నరకం యింకొకరికి యెలా అర్థం అవుతుంది. చివరకు నా చరిత్ర యెలా ముగుస్తుంది. సుఖానికి నేనెలా నోచుకోలేదు. కాని పరిస్థితులు రాను రాను విషనాగుల్లా విజృంభిస్తూ కాటు వెయ్యటానికి మీదకు వురుకుతున్నాయి. చాలా భయంకర నిస్సహాయ స్థితిలో యిరుక్కుని వున్నాను, బయటకు రావటమెలాగా? నా వల్ల అవు

తుందా? నేనేమైనా సద్వారేప. కాని పిచ్చిదాన్ని మాత్రం కాకూడదు."[17] అని రాసుకుంటుంది. దాంపత్య జీవితాన్ని యెలా యెదుర్కోవాలో తెలియక గాలిలో చిక్కిన నావలాగా వినీల పయనిస్తోందన్న సత్యం ఆమె మానసిక వ్యథనుబట్టి తెలుస్తుంది.

## 3.5 ప్రేమ – త్యాగధనులు

త్యాగం చెయ్యడానికి మనిషికి వ్యక్తిత్వముండాలి. వ్యక్తిత్వంలేని మనిషి యే త్యాగం చేయలేడు. పరిస్థితులవల్ల అపోహలకు అనర్థాలకు లోనయిన డాక్టర్ నరేంద్ర త్యాగబుద్ధి 'ఊగవే ఉయ్యాల' నవలలో కనిపిస్తుంది. అశ్రుపూరిత హృదయంలో ఆకాంక్షించిన త్యాగ నిరతిగల మనిషిగా డా॥ నరేంద్రను చెప్పుకోవచ్చు. డాక్టరుగా నరేంద్ర తన వృత్తి ధర్మాన్ని నెరవేరుస్తూ యెదుటివారి బాగోగుల్ని చూడగలుగుతాడు. రాజా మాధవిల ప్రవర్తనల వల్ల తన కర్తవ్య నిర్వహణలో వాళ్ళను దగ్గరకు చేర్చాలనుకుంటాడు. రాజాగ ఉత్తరంలో "మాధురికి ఆపరేషన్ చేశాను. మాధవి మాధురిరూపంగా తయారయింది. ఆమెను శారీరకంగా పోగొట్టుకున్నా అప్పటికీ, ఇప్పటికీ, ఎప్పటికీ నాతోవున్నట్టు భావన. మాధవిని యెప్పుడు భార్యగా చూడలేదు. ఎంత సరిపెట్టుకుందామన్నా ఆ భావమే నాకు కలిగేది కాదు...... .మాధవి దగ్గరకు వెళ్ళగానే ఓ పవిత్రమూర్తిని స్పర్శించినట్టు, ఓ కూతుర్నో, చెల్లెల్నో తాకినట్టు అనుభూతి కలిగేది. అయితే ఆమెతో ఒకచోట మాధురిని దాచుకున్నాను. కుడిచెంపలో ...ఇంతలో మీరువచ్చారు. మీ సంఘర్షణను, మీరుపడే మానసిక హింసను గమనిస్తూవచ్చాను. ప్రమీలాదేవి సీరియల్ వల్ల కొన్ని సత్యాలు స్ఫురించాయి.. యీలోగా మీరిద్దరూ కలుసుకోవడం తటస్థించి పరిస్థితి అర్థంచేసుకున్నాక ఏదన్నా అఘాయిత్యం జరిగితే, అందుకే యీ ఉత్తరం రాస్తున్నాను. నారాక కన్నా యీ ఉత్తరం మీకు ముందుగా అందాలని నా ఆకాంక్ష"[18] అనిరాస్తాడు. డాక్టర్ నరేంద్ర త్యాగ ఫలితంగా, ప్రమీలాదేవి సాహిత్యం వల్ల మాధవి రాజాను తిరిగి కలుసుకుంటుంది. ఇరువురి జీవితాల్లో యెన్నో అవాంతరాలు వచ్చినప్పటికీ వారిప్రేమ సఫలమవుతుంది.

'జాలిలేని జాబిలి'లో మధుబాబుని ప్రేమించిన ముగ్గురిలో పద్మజలో నిజాయితీ, త్యాగం కనిపిస్తాయి. పద్మజ మధుబాబును ప్రేమించినా తన కర్తవ్యాన్ని

మరచిపోలేదు. మధు పరిస్థితిని అర్థంచేసుకున్న పద్మజ ఓదార్చుతుంది, దారిచూపే ప్రయత్నం చేస్తుంది. మధు మాటలకి చలించిన పద్మజ విస్తుపోయి తన నిర్ణయాన్ని "ఐతే తీసుకెళ్ళండి. మీ యిష్టం వచ్చినంత దూరం తీసుకెళ్ళండి. కాని వచ్చేటప్పుడు మాత్రం మీ రొక్కరే తిరిగిరావాలి. నన్ను అక్కడేపడేసి, పారవేసి మరియూ ప్రపంచం, ఇల్లు, సంసారం నన్ను తిరిగి స్వీకరించరుగా"[9] అని తన సంసారాన్ని గుర్తుచేస్తుంది. సమాజాన్ని అవగాహన చేసుకున్న స్త్రీ పద్మజ. ఆమె మానసిక అంతరాలనుంచి వెలువడ్డ మాటలు జీవిత అవగాహన వ్యక్తీకరణకు ప్రతీక. టాల్‌స్టాయ్ 'అన్నాకెరీనా'లా ఆత్మవంచన చేసుకోలేదు. తన భర్తతో ఆలోచనలలో పాలు పంచుకుంటుంది. మధు ప్రేమను హృదయాంతరాళాలలో దాసుకుంటుంది. ఆమెలో ఉదాత్తతే కాని వెలికితనం లేదు.

'ఊగవే ఉయ్యాల'లో డాక్టర్ నరేంద్ర భార్య మాధురి. నరేంద్ర ఆసుపత్రిలో కుదుటపడుతున్న మాధవిని మాధురి పరిచయం చేసుకుంటుంది. తను యెన్నోరోజులు బ్రతకనని తెలుసుకుంటుంది. మాధురి కోరికమేరకు ఆమె చర్మంతో నరేంద్ర మాధవి చెంపకు ప్లాస్టిక్ సర్జరీచేస్తాడు. మాధురి మరికొన్ని రోజులకు మరణిస్తుంది. మాధురి త్యాగానికి మాధవి అదే ఆసుపత్రిలో మాలతిగా పేరు మార్చుకుని నర్స్‌గా పనిచేస్తుంది. మాధురి కోరికమేరకు నరేంద్ర మాధవిని పెళ్ళి చేసుకుంటాడు. భార్య మరణించినా ఆమె అంతిమకోర్కె తీర్చాలన్న ఆశయ సిద్ధిగల వ్యక్తిగా నరేంద్ర చిరస్మరణీయుడు మాధురి త్యాగం చెప్పుకోదగ్గది.

'పసుపు కుంకుమ'లో చంద్రశేఖర్ అంధుడు కావడంతో గోపయ్య మనవరాలిగా మాలతి తిరిగి తన యింటిలోకి ప్రవేశిస్తుంది. గోపయ్య కోరికమేరకు ఆమె దుర్గగా, మూగదానిగా, పరిచారికగా వుంటుంది. అంధుడయిన తన భర్తను కంటికి రెప్పలా కాపాడుతుంది. ఆమెవల్ల తన జీవితంలో మార్పువచ్చిందని చంద్రశేఖర్ దుర్గను పెళ్ళి చేసుకుంటాడు. కాని తనభార్యనే పెళ్ళాడినట్లు అతనికి తెలియదు. మాలతి జీవితంలోకి ఆమె భర్త స్నేహితుడు శంకర్ మళ్ళీ ప్రవేశిస్తాడు. మాలతిని బ్లాక్‌మెయిల్‌చేస్తాడు. చంద్రశేఖర్‌కు కళ్ళు ఆపరేషన్ చేస్తానంటుంది. అందుకు మాలతి తన జీవితం తిరిగి నాశనం చెయ్యవద్దని డాక్టర్ని ప్రాధేయ పడుతుంది. ఇక్కడ మాలతిలో స్వార్థం కనిపిస్తుంది.

చంద్రశేఖర్ తన కళ్ళు ఆపరేషన్ గురించి గోపయ్య, మాలతిల మాటల్ని విని తన ఆశయ సౌధాన్ని చెరిపివేసిన వారిరువుర్నీ తిడతాడు. అందుకు తన త్యాగాన్ని గుర్తుచేస్తు మాలతి "ఒకరు అడిగారని కాదండి. ఇదంతా త్యాగమని కూడా నేననను పొరపాటు చేయటం మానవ సహజం, అలాంటి పొరపాటు నావల్ల జరిగింది. ఏదో పరిస్థితులకు లొంగిపోయి చేసినా, గార్హస్థ్య జీవితంలో భార్యకిచ్చే విలువలు యిస్తూనేవుంటారు. అది సంసారి జీవితంలోని స్థాయి అలా ఓ ఆడదాన్ని గురించి కూడా ఓ క్షణం ఆలోచించి చూడండి. అనుకోని పరిస్థితుల్లో జరిగిన పొరపాటు జీవితాంతం ఆమెకు శాపంగా పరిణమించాలా? మీరిది త్యాగం అని యెత్తిపొడుస్తున్నారు. గాని యిందులో నా స్వార్థం చాలా వుందండీ మీరంటే నాకు ప్రేమే. ఆ స్వార్థం చిరకాలం ఆరోగ్యంగా వుండాలన్నదే ఆ స్వార్థం. మిమ్మల్ని అనుక్షణం చూస్తూ మీతో బ్రతకాలన్నదే ఆ స్వార్థం. ఈ పరిస్థితుల్లో నేను మూగదానిలా మీ ముందు నిలబడితే అది నటనా? నేరమా?"[20] అని ప్రశ్నిస్తుంది. ఈ మాటల్లో స్వార్ధం, త్యాగం కనిపిస్తాయి.

### 3.6. ప్రేమ-మాంగల్యంపై అభిప్రాయాలు :

'పసుపు-కుంకుమ'లో మాలతి, భానుమతి ప్రాణస్నేహితురాండ్రు. భానుమతి అనాధశరణాలయంలో పెరిగి పెద్దదవుతుంది. ఏభై ఏళ్ళకు పైబడ్డ గోవిందరావు శీలాన్ని అపహరించినా ఆ తరువాత పెళ్ళి చేసుకుంటాడు. భానుమతిని ఒంటరిగా వదలి విదేశాలకు వెళ్ళిపోతాడు. భర్త తన దగ్గర లేకపోవడంవల్ల మంగళ సూత్రాన్ని తీసివేస్తుంది. స్నేహితురాలు మాలతి మన సంప్రదాయాన్ని గుర్తు చేస్తుంది. అందు భానుమతి మాలతితో "దాని అవసరం తీరిపోయింది గనుక ఈ సత్యం గుర్తించలేకపోతే యీ దేశంలో సగంమంది మెళ్లోనుంచి ఇవి జారిపోతూ వుండేవి. కొన్ని వస్తువులకు అవసరాన్నిబట్టి ఇవ్వబడుతుంది. జీవితమంతా ఒకళ్ళ కొకళ్లు అనుమానించుకుంటూ, తిట్టుకుంటూ, రహస్యాలు దాచుకుంటూ, దారుణంగా మోసం చేసుకుంటూ ఆత్మవంచనతో సంవత్సరాల తరబడి పిశాచి ప్రవృత్తితో బ్రతికితే పర్వాలేదు. కాని ఆ నిజాన్ని బయటకు చాటితే పిచాచత్వం"[21] అని అంటుంది. పైమాటలు భానుమతి జీవితం ఎటునైనా మలచుకోవడానికి హక్కు వున్నట్లు మాట్లాడుతుంది. సమాజంలో పరిస్థితుల్నిబట్టి జీవించాలన్నది ఆమె ఆలోచనగా తెలుస్తుంది. భానుమతి మాటలకు ఖిన్నురాలైన మాలతి మగాడు కట్టిన

తాళిని పవిత్రంగా భావించాలని, ఆరాధనాభావం కలిగివుండాలని చెప్తుంది. తన భవిష్యత్తును నిర్ణయించుకుంటూ మాలతి "పరిస్థితులవల్ల పవిత్రతకు దూరం కావలసివస్తుందనటం ఎస్కేపిజం. మనిషిలో చిత్తశుద్ధి వున్నప్పుడు పరిస్థితులూ, ఎటువంటి ఆకర్షణలూ ఏమీ చెయ్యలేవు. నేను దేవుణ్ణి నమ్ముతాను. ఏ వ్యక్తికయినా మనసివ్వటం జరిగితే ఎన్ని ఒడుదుడుకులు వచ్చినా, అవాంతరాలు వచ్చినా ఎదుర్కొని ఆ వ్యక్తిలోని జీవితాంతం నీడలా, నిజంలా బ్రతుకుతా"[22] నంటుంది. ఇక్కడ మాలతి తన వ్యక్తిత్వాన్ని ప్రదర్శించుకుంటుంది. మాలతి జీవితంలో జరగబోవు ఒడుదుడుకుల్ని రచయిత ముందుగానే ఆమెనోట చెప్పించడంలో భర్తపైవున్న గౌరవభావం వ్యక్తమవుతుంది. ఇద్దరూ ప్రాణస్నేహితులు అయినప్పటికీ మాంగల్యంపై వారికి భిన్నాభిప్రాయాలున్నాయి.

## సూచికలు

| నెం. | రచయిత | నవల పేరు | పుట |
|---|---|---|---|
| 1. | వేణుగోపాలరావు కొమ్మూరి | 'ఊగవే ఉయ్యాల' | 47 |
| 2. | ,, | ,, | 32 |
| 3. | ,, | ,, | 238 |
| 4. | ,, | ,, | 242 |
| 5. | ,, | 'జాలిలేని జాబిలి' | 63 |
| 6. | ,, | ,, | 124 |
| 7. | ,, | ,, | 195 |
| 8. | ,, | ,, | 178 |
| 9. | ,, | 'ప్రేమకాంతి' | 54 |
| 10. | ,, | ,, | 292 |
| 11. | ,, | 'పసుపు-కుంకుమ' | 54 |
| 12. | ,, | ,, | 68 |
| 13. | ,, | ,, | 105 |
| 14. | ,, | ,, | 171 |

| నెం. | రచయిత | నవల పేరు | పుట |
|---|---|---|---|
| 15. | వేణుగోపాలరావు కొమ్మూరి | 'ఊగవే ఉయ్యాల' | 189 |
| 16. | ,, | 'జాలిలేని జాబిలి' | 124 |
| 17. | ,, | 'ప్రేమకాంతి' | 182 |
| 18. | ,, | 'ఊగవే ఉయ్యాల' | 227 |
| 19. | ,, | 'జాలిలేని జాబిలి' | 199 |
| 20. | ,, | 'పసుపు-కుంకుమ' | 148 |
| 21. | ,, | ,, | 39 |
| 22. | ,, | ,, | 41 |

— o —

# మనస్తత్వచిత్రణ - 5

## 1. మానవ మనస్తత్వం–స్వరూప స్వభావాలు

మనో విజ్ఞాన శాస్త్రం మానవుడి ప్రవర్తనను గురించి తెలిపే శాస్త్రం మానవ ప్రవర్తనను ఆధారం చేసుకుని రచింపబడిన నవలలు మనోవైజ్ఞానిక నవలలు అని చెప్పుకోవచ్చు. మానవుని మనస్తత్వానికి సంబంధించిన పలు విషయాలకు విశ్లేషణాత్మకంగా, కూలంకషంగా సమీక్షించే శాస్త్రమే మనో వైజ్ఞానిక శాస్త్రం. ఇంకో విధంగా చెప్పాలంటే వివిధ తరహాల వ్యక్తులు తమ చుట్టూవున్న పరిస్థితుల ప్రభావానికి యెలా బదులు పలుకుతారో చెప్పే శాస్త్రాన్నే 'మనో విజ్ఞానశాస్త్రం' అంటారు.

మన చుట్టూవున్న సమాజంలోని మనుషులంతా ఒకే మనస్తత్వాన్ని కలిగి వుండరు. వాళ్ళ ప్రవృత్తి భిన్నంగా వుంటుంది. కొంతమంది మనస్తత్వ శాస్త్ర వేత్తలు వ్యక్తుల బాహ్య ప్రవర్తనను పరిశీలిస్తే, మరికొందరు అంతస్సంఘర్షణను పరిశీలిస్తారు. మనిషిని సమగ్రంగా అర్థం చేసుకోవాలంటే ఇటువంటి ప్రయత్నం జరగవలసిందే. మనిషిలోని చేతనను, అచేతనను పరిశీలించినట్లయితే అతణ్ని సమగ్రంగా అర్థంచేసుకోవచ్చు. మనో విజ్ఞాన శాస్త్రజ్ఞులు యిలాంటి విధానా లన్నిటిని అవలంబించి మనిషి వ్యక్తిత్వాన్ని సమగ్రంగా తెలుసుకోవడానికి ప్రయత్నిస్తున్నారు.

మనస్తత్వ శాస్త్రంలో అనేక సిద్ధాంత దృక్పథాలు వున్నాయి. వాటిలో ముఖ్యంగా Structuralism, Behaviourism, Gestalt Psycology, Psyco analysis పేర్కొనదగినవి. వీటిలో 20వ శతాబ్దంలో ప్రచారంలోకి వచ్చిన 'సైకో యెనాలసిస్' అత్యంత ముఖ్యమైంది. మానసిక వ్యాధిని కుదర్చ డానికి అవలంబించే పద్ధతినీ, యిందుకు గాను సమాచారాన్ని సేకరించడాన్ని 'సైకో యెనాలసిస్' అంటారు. ఈ విధానానికి ఆద్యుడు మనస్తత్వ శాస్త్రవేత్త సిగ్మండ్ ఫ్రాయిడ్. అతని మనస్తత్వ సిద్ధాంతాలు మనిషి యెరుగని, మనిషిలోని

మరో మనిషిని మనముందు వుంచాయి. ఎన్నో మానసిక రుగ్మతలకు మూల కారణాలు తెలిసి ఎందరో మానసికరోగుల బ్రతుకుల్లో కాంతిరేఖలు వికసించాయి. సాహిత్య పరంగా చూసినా మనస్తత్వపరంగా చూసినా యీ మనో విశ్లేషణ సిద్ధాంతం యొక్క ప్రాముఖ్యత సాటిలేనిది.

మొదటి ప్రపంచ యుద్ధానంతర కాలంలో ప్రపంచమంతటా బాగా ప్రచారంలోకి వచ్చిన ఫ్రాయిడ్, ఆడ్లర్, యూంగ్ యిత్యాదుల సిద్ధాంతాల్ని తెలుగు నవలాకారులు కూడా అవగతం చేసుకోవడం ప్రారంభించారు.

ఫ్రాయిడ్ సిద్ధాంతం ప్రకారం 'సైకో ఎనాలసిస్'ను నాలుగు రకాలుగా విభజించినారు.

1. అచేతన మనస్తత్వ స్థితి అనేది ఒకటివుందని గ్రహించడం
2. అణచివేత, ప్రతిఘటన, సిద్ధాంతాల ప్రాధాన్యతను గుర్తించడం
3. లైంగిక ప్రవృత్తి ప్రాముఖ్యతను అంగీకరించడం
4. 'ఈడిపస్ కాంప్లెక్స్'ను గుర్తించగలగడం.

వీటిపైననే ఈ సిద్ధాంతం అంతటా ఆధారపడివుంటుందని ఫ్రాయిడ్ Collected Papers of Sigmund Freud Vol V Page 122లో తెలియజేశాడు.

ఫ్రాయిడ్ శారీరక కారణాలు లేని రుగ్మతలకు కనిపించని గాయాలు కారణం కావచ్చునని భావించాడు. వాటికోసం అన్వేషణ సాగించాడు. శైశవం లోనూ, బాల్యంలోను ప్రతిఒక్కరూ అనేక ప్రభావాలకు గురవుతారు. అయితే పెరిగిన తరువాత వారికవి గుర్తుండవు. ఆకలి, నిద్రవంటి ఇతర జీవలక్షణాలలాగే లైంగికత మనిషి పుట్టుకనుంచి వుండి ఎన్నో సంక్లిష్టమార్పులకు లోనవుతూ యౌవ్వనం వచ్చేసరికి ఒకరూపం సంతరించుకుంటుంది. అంతర్లీనంగా పరిణామం చెందే ఈ జీవశక్తిని ఫ్రాయిడ్ 'లిబిడో' అన్నాడు. మనస్సు విప్పి బాధలను చెప్పుకోవడంవలన రోగం తగ్గడాన్ని ఫ్రాయిడ్ గమనించాడు. ఇదే నియమాన్ని రోగుల మీద ప్రయోగించినప్పుడు మంచి ఫలితాలు వచ్చాయి. దీనిని ఫ్రాయిడ్ 'స్వేచ్ఛాభాషణం' (Free Association) అన్నాడు.

ఫ్రాయిడ్ పరిశోధనలో మరో అద్భుతం స్వప్న విశ్లేషణం. కలలు కనని మనుషులుండరు. అర్థంలేదనుకుంటున్న కలలకు ఫ్రాయిడ్ అర్థం చెప్పాడు. మనిషి అంతఃచేతనలో అణచబడిన ఆలోచనలు మారురూపాలు పొంది కలలుగా దర్శనమిస్తాయి. తీరని కోరికలను కలలు తీరుస్తాయని ఆయన సూత్రీకరించారు. మానసిక రుగ్మతలను గుర్తించి చికిత్సచేస్తే వ్యక్తి ఆరోగ్యమే కాకుండా సమాజం కూడా ఫలప్రదంగా వుంటుంది.

మనసు భాషకు భాష్యం చెప్పిన మనోవైజ్ఞానికుడు ఫ్రాయిడ్. మనసు మాట్లాడే భాషకు ఎవరికీ అర్థం తెలియదని లోకం భావిస్తున్న రోజులలో ఫ్రాయిడ్ అనే మనోవైజ్ఞానికుడు మనస్సు మర్మాన్ని విప్పిచెప్పి లోకాన్ని ఆశ్చర్యపరిచాడు. మనిషి ప్రవర్తనకు, చేష్టలకు స్పష్టమైన అర్థం వుంటుందనీ, మనస్సును మనో విజ్ఞానశాస్త్ర ఆధారంగా అంచనా కట్టవచ్చుననీ అవసరమైతే దానిని మార్చవచ్చుననీ ఫ్రాయిడ్ తన పరిశోధన ద్వారా రుజువుచేశాడు. దీనితో ప్రపంచ వ్యాప్తంగా మనసుపట్ల అప్పటివరకు వున్న వూహాగానాలు పటాపంచలైపోయాయి.

మనిషి మనస్సును నీటిలో మునిగిన మంచుగడ్డతో పోలిస్తే పైకి కనిపించే నాలుగవవంతు భాగాన్ని మనకు తెలిసిన ప్రవర్తన చేతన (conscious) గాను, నీటిలో మునిగిన మిగిలిన మూడువంతుల భాగాన్ని మనకు తెలియని మానసికస్థితి అచేతనంగా పేర్కొనవచ్చు. ఈ అచేతన (unconscious) మనిషిని నడి పిస్తుంది. ఇది గతజీవితం తాలూకు అనుభవాల మిశ్రమ మానసికస్థితి. కారణం తెలియనంత మాత్రాన వున్న బాధ అబద్ధమైపోదు. ఫ్రాయిడ్‌ను యిదే ప్రశ్న వేధించేది. 'కారణం తెలియనంత మాత్రాన దానికి కారణం లేదనుకోవడం అవివేకం' అన్న చార్‌కోట్ మాటలు ఫ్రాయిడ్ పరిశోధనలకు ప్రేరణ అయ్యాయి.

"వివిధ తరహా వ్యక్తులు తమ చుట్టూవున్న పరిస్థితుల ప్రభావానికి యెలా బదులు పలుకుతారో చెప్పే శాస్త్రాన్నే మనోవిజ్ఞాన శాస్త్రం" అనవచ్చునని అంటు న్నారు గార్డ్‌నర్ మర్ఫీ.

"మనో విజ్ఞానశాస్త్రం మానవుడి ప్రవర్తనను గురించి తెలిపే శాస్త్రం. మానవ ప్రవర్తనను అర్థం చేసుకోవడానికి, దాన్ని గురించిన విషయాలను ముందుగా వూహించడానికి అవసరమైతే దాన్ని మార్చడానికి కూడా ఈ శాస్త్రం ప్రయత్నిస్తుంది" అంటున్నారు ఎస్. స్ట్రాన్స్‌ఫెల్డ్ సెర్‌గెంట్.

ఆడ్లర్ సిద్ధాంతం వ్యక్తుల మధ్య మనస్తత్వాలలో వుండే భేదాలను తెలియ జేస్తుంది. వ్యక్తికీ, వ్యక్తికీ మధ్య యీ విధమైన భేదాలు వుండడానికి కారణం చిన్నతనంలో వాళ్ళు పుట్టిపెరిగిన వాతావరణంలో, భేదాలు వుండటమే అంటు న్నాడు ఆడ్లర్. అందువల్ల యీ సిద్ధాంతాన్ని వైయక్తిక మనస్తత్వం '(Individual Psychology)' అని వవ్యహరించడం జరిగింది.

ఆడ్లర్ సిద్ధాంతం ప్రకారం ప్రతి వ్యక్తీ 'ఆధిక్యత' కోసం ప్రాకులాడు తుంటాడు. మానసిక రుగ్మతలు ఏర్పడటానికి ఆధిక్యత ప్రధానమైన కారణం. అటువంటి ఆధిక్యత లభించనివాడు మనసు 'ఆత్మన్యూనతా'లో కుమిలిపోతుంది. ఈ న్యూనతను ఆధిక్యతగా మార్చుకోవడం కోసం వ్యక్తి అనేక మార్గాలు వెదుకు తాడు అవి కూడా విఫలం అయిననాడు అతనికి మిగిలేది మానసిక రుగ్మతే.

ప్రతి వ్యక్తికీ అనేక సమస్యలుంటాయి. అనేక సందర్భాలలో వ్యక్తులు తాము యితరులకన్నా తక్కువ వారమేనన్న ఆత్మన్యూనతా భావానికి (Inferiority Complex)కు లోనవుతుంటారు. వ్యక్తిలోని సమస్యలిన్నిటిని ఆడ్లర్ మూడు రకాలుగా విభజించాడు. వృత్తికి సంబంధించినది; సాంఘిక, లైంగికపరమైనవి.

**ఆత్మన్యూన్యతా లక్షణం :**

ఆత్మన్యూనతా భావానికి గురి అయిన వ్యక్తి చాలా ఆందోళనకు లోనవు తాడు. ప్రపంచంపట్ల క్రోధాన్ని పెంచుకుంటాడు. అనుమానం అసూయ పోటీని తట్టుకోలేకపోవడం, విమర్శలపట్ల వుద్రిక్తత చూపడం, పరాజయాన్ని చాలా తీవ్రంగా తీసుకోవడం, ఇవన్నీ ఆత్మన్యూనతా లక్షణాలు.

'ఆధిక్యత' కోసం ప్రాకులాడే వ్యక్తి తనలోని ఆత్మన్యూనతను గ్రహించి దానిని సరిదిద్దుకుని నిజమైన 'ఆధిక్యత'గా మలుచుకోగలిగినప్పుడే అతనికి సమగ్ర మైన వ్యక్తిత్వం లభిస్తుంది.

వ్యక్తి సమగ్ర వ్యక్తిత్వం కలిగివుండాలంటే ముందు తాను యితరుల కన్నా అధికుడనే ఆత్మ ఆధిక్యతా భ్రాంతిని గాని, యితరులకన్నా అల్పుడనే ఆత్మన్యూనతా భ్రాంతిని గాని వదులుకోవలసిన అవసరం గురించి అడ్లర్ సిద్ధాంతం తెలియజేస్తుంది.

మనిషి పుట్టిన కొన్ని సంవత్సరాల నుండి మరణించేవరకూ వివిధ దశల్లో వివిధ రకాల మానసిక సంఘర్షణకు గురవుతూ వుంటాడు. వాటిలో మంచీ చెడూ రెండూ వుంటాయి. వాటిమధ్య నిత్య పోరాటం జరుగుతుంటుంది. ప్రతి రచయిత పాఠకుడికి తను ఏ మార్గంలో చూపించాలో నిశ్చయం చేసుకుంటాడు. రచనలో జీవితంపై ఒక దృక్పథాన్ని కలిగిస్తాడు. రచనా విధానంలో రచయిత అనుస రించిన శైలి, సంక్షిప్త వాక్యవిన్యాసం ప్రధానోద్దేశాన్ని స్పష్టం చేస్తాయి.

మానవుని గుణాల్లో ధైర్యగుణం ఉత్తమోత్తమం. ధైర్యం లేకపోతే మానవునికి అన్నీ సమస్యలే. సుఖశాంతులు దూరమవుతాయి. అందువల్లనే అతడిలో మనోక్లేశం ఏర్పడుతుంది. ఈ ధైర్యం అనే గుణం లేకపోయినట్లయితే మనిషిలో మిగతా సద్గుణాలేమీ వుండవన్నది నిర్వివాదాంశం. శామ్యూల్ జాన్సన్— 'పిరికివారెవరూ మంచివారు కాజాలరు. మంచికి నిలబడలేరు. ఇందుకు యెంతో గ్యారంటీ వుంది. మంచిగా వుండాలంటే గుండెనిబ్బరం చాలా వుండాలంటాడు'.

వ్యక్తి బాహ్య ప్రపంచంలో యెవరితో ఘర్షణపడకుండా సమాధానం పడటంతోనే జీవిత సత్యంవుంది. ఈ జీవిత సత్యాన్ని ఆచరణలో కలిగి వుండా లంటే వ్యక్తికి ధైర్యగుణం అత్యావశ్యకం. ధైర్యగుణం అలవడాలంటే వ్యక్తికి గుండెనిబ్బరం వుండాలి. వైయుక్తిక మానసిక బలహీనతలు (ఆత్మన్యూనతా భావం) వున్నప్పుడు వ్యక్తి మానసిక బలహీనతలను పోగొట్టుకోవాలి. దీనికి దోహదంగా వ్యక్తి జీవితంలో కొన్ని పరిస్థితులు పరిణామం చెందుతుంటాయి.

భావి జీవితంలో తీవ్రమైన బలహీనమైన మానసిక క్లిష్టత యెదురై చిన్నప్పుడు మనస్సుపై బలమైన ముద్రవేసిన సంఘటన స్ఫురణకు వచ్చిదాని స్వరూపాన్ని స్పష్టంగా అవగాహన చేసుకోవడం వల్ల బాల్యదశలో యేర్పడిన ఆత్మన్యూనతా భావ గ్రంధి బయటపడే అవకాశం వుంటుందని అడ్లర్ సూచన సారాంశం.

"The Inferiority Complex appears before a problem for which an individual is not properly adopted or equipped and express conviction that he is unable to solve it" (Adlers Definition of inferiority complex 'what life should mean to you', P. 52).

ఆత్మన్యూనతా భావ గ్రంథికి లోనైన వ్యక్తి సాధారణంగా పిరికివాడై వుంటాడు. ఒక సమస్యను ఎదుర్కొనేటప్పుడు భయపడటం, కోపగించుకోవడం, చికాకుపడటం, ఇతరుల మీదికి బాధ్యత నెట్టడం, తన్నుతాను వంచించుకోవడం, ప్రస్తుతం చేయాల్సిన పనులు వెనుకకు నెట్టడం, పని బాధ్యతల నుండి తప్పించుకోవడం, వచ్చిన నష్టాల్ని ఇతరులపైకి నెట్టడం మొదలైనవి ఆత్మన్యూనతా భావ గ్రంథి లక్షణాలు.

"The real problem will be solved or excluded. The individual will try to respect his field of action and will be more occupied in avoiding defeat than in preesing forward to success He will give that picture of hesitating of being a standstill or even of retreatins before his difficulties. Individuals feel life is full of dangers and I must avoid encountering them ' ('Feeling of inferiority complex' by Adler).

'వ్యక్తిత్వంలోనే ఇమిడి వుంది విధివ్రాత' (Charecter is destiny) అనే సూత్రాన్ని షేక్స్పియర్ తమ పాత్రలకు అన్వయిస్తాడు. అందుకు భిన్నంగా థామస్ హార్డీ నవలలో ఘటనదే పైచేయిగా వుంటుంది. 'అది వ్యక్తిని బొమ్మకు మల్లే ఆడిస్తూ వ్యక్తి సంకల్పం ఏమైనాసరే దాన్ని వమ్ముచేస్తూ వుంటుంది'. ఇది థామస్ హార్డీ చేసే జీవిత చిత్రణ.

ఒక్కొక్క మనిషిలో వ్యక్తిత్వం ఒక్కొక్క రీతిగా వుంటుంది. ఈ తేడాలే ఒక్కొక్క వ్యక్తి ఒక్కొక్క తరహా వ్యక్తిత్వాన్ని ప్రదర్శిస్తుంది. మధురాంతకం రాజారాం 'త్రిశంకుడి స్వర్గం' నవలకి ముందుమాట రాస్తూ "మనిషిలో స్వార్థం, త్యాగం, అమాయకత్వం, లోభత్వం, మోసం, ఔదార్యం, సాహసం, పిరికితనం, జ్ఞానం, అజ్ఞానం మొదలుగాగల సమస్తగుణాలను తీసుకుని, ఒక్కొక్క గుణాన్ని ఒక్కొక్క నిష్పత్తిలో కలసి తయారుచేస్తే వుత్పన్నమయ్యే సజీవ శిల్పం మానవుడు"[1] అని అంటారు.

మనిషి వ్యక్తిత్వంలోని తేడాను గురించి జి. ఆల్‌పోర్ట్ "Personality is the dynamic organisation within the individual of those psycological systems that determine his characteristic behaviour on through" అంటున్నారు.

మనిషి వ్యక్తిత్వాన్ని గురించి ఆర్. యస్. సుదర్శనం గారు—"వ్యక్తిత్వంలో మనిషికీ మనిషికీ వుండే వైవిధ్యంలాగే ఒక మనిషి జీవితం గుబాళించే విలువలు కూడా సమ్మిశ్రితంగా వుండి ఒక ప్రత్యేకమైన Pattern యేర్పరుస్తాయి. అ జీవితాన్ని పరామర్శిస్తే గాని తెలియదు. అలా పరామర్శించడమే నవల సాధించే లక్ష్యం. పాత్రలు, కథా వేరువేరుగా లేవనీ, వ్యక్తిత్వాలూ, జీవితాలూ, భిన్నంకావనీ, జీవితం, అర్థాన్ని పరమార్థాన్ని సృష్టిస్తుందిగాని, అవర్మాలు జీవితాన్ని సృష్టించవని"[2] అంటారు.

మనస్తత్వ సిద్ధాంతాల్ని ఆధారం చేసుకోకుండా తెలుగు సాహిత్యంలో యెన్నో నవలలు వెలువడ్డాయి. అంటే పూర్తిగా కాకుండా మనస్తత్వాన్ని గురించి విశ్లేషణలు అక్కడక్కడా కనిపిస్తాయి. కందుకూరి వీరేశలింగం పంతులుగారి 'రాజశేఖర చరిత్ర'; అడవి బాపిరాజు 'నారాయణరావు'; 'తుఫాను'; ఉన్నవ 'మాలపల్లి'; శ్రీపాద 'ఆత్మబలి'; శారద 'మంచీ-చెడూ'; జి. వి. కృష్ణారావు 'కీలుబొమ్మలు'; గోపీచంద్ 'మెరుపుల మరకలు', 'గడియ పడని తలుపులు'; విశ్వనాథ 'ఏకవీర'; 'తెరచిరాజు' 'చెలియలికట్ట'; చలం 'అమీనా', 'జీవితాదర్శం', 'మైదానం', 'దైవమిచ్చిన భార్య'; కొడవటిగంటి కుటుంబరావు 'అనుభవం'; లత 'ప్రేమరాహిత్యంలో స్త్రీ' మొదలగు నవలల్ని చెప్పుకోవచ్చు.

ఫ్రాయిడ్, ఆడ్లర్, యూంగ్ మొదలగువారు ప్రతిపాదించిన మనోవిశ్లేషణ సిద్ధాంతాల్ని ఆధారం చేసుకుని తెలుగు సాహిత్యంలో యెన్నో నవలలు వెలువడ్డాయి. బుచ్చిబాబు 'చివరకు మిగిలేది' త్రిపురనేని గోపీచంద్ 'అసమర్థుని జీవయాత్ర', రావిశాస్త్రి 'అల్పజీవి', ఆర్. యస్. సుదర్శనం 'సంసార వృక్షం', 'మళ్ళీ వసంతం', కొమ్మూరి వేణుగోపాలరావు 'వ్యక్తిత్వం లేని మనిషి' నవీన్ 'అంపశయ్య', వినుగొండ నాగరాజు 'ఊబిలో దున్న' మొదలగు నవలల్ని చెప్పుకోవచ్చు. యన్. ఆర్. నంది 'దృష్టి', పోతుకూచి సాంబశివరావు 'ఏడు రోజుల మజిలీ', వాసిరెడ్డి సీతాదేవి 'మట్టి మనిషి', 'ఉరిత్రాడు', మధురాంతకం రాజారాం 'త్రిశంకుడి స్వర్గం' యండమూరి వీరేంద్రనాథ్ 'ఋషి' కొమ్మూరి వేణుగోపాలరావు 'నివేదిత', 'ఒకే పాటకు రెండు రాగాలు'. 'ఈ దేశంలో ఒక భాగ మిది'. చివుకుల పురుషోత్తం 'ఏది పాపం', శ్రీదేవి 'కాలాతీత వ్యక్తులు'

రంగనాయకమ్మ 'బలిపీఠం', 'మేక మేడలు', పరిమళా సోమేశ్వర్ 'చేదు నిజాలు', 'అహం – అనురాగం', మాలతీ చందూర్ 'ఏది గమ్యం ఏది మార్గం', తమిరిశ జానకి 'అందానికి సమాధి' ఆనందరామ 'ఏది సత్యం ఏదీ సత్యం' కొలిపాక 'రమామణి', 'వెన్నెలలో పిల్లనగ్రోవి', మొదలగు నవలల్లో పూర్తిగా కాక పోయినా మనస్తత్వ విశ్లేషణకు సంబంధించిన పలు అంశాలు అక్కడక్కడా కనిపిస్తాయి.

మనోవిశ్లేషణ సిద్ధాంతాన్ని ఆధారం చేసుకొని వేణుగోపాలరావు రచించిన 'వ్యక్తిత్వం లేని మనిషి', 'నివేదిత', 'ఒకే ఫ్లాటకు రెండు భాగాలు' నవలల్ని ఈ అధ్యాయంలో పరిశీలించడం జరిగింది.

## 2. మనస్తత్వ కథాసన్నివేశాలు

### 2.1. వ్యక్తిత్వంలేని మనిషి :

శ్రీదేవి, భానుమతి అక్కాచెల్లెళ్లు. శ్రీదేవి శీలాన్ని దీక్షిత్ అపహరిస్తాడు. ఇంటినుండి గెంటివేయబడ్డ శ్రీదేవిని భానుమూర్తి పెళ్ళి చేసుకుంటాడు. వీళ్ళకు జగతి, మృత్యుంజయరావులు కలుగుతారు. మృత్యుంజయరావు పుట్టుకతో నల్లగా, వికారంగా వుంటాడు. వాని ఆకారాన్ని చూసి స్నేహం చేసేవాళ్లు కనబడరు. తనను యెవరైనా గేలిచేస్తే యెదిరించడానికి ప్రయత్నిస్తే 'పోరా ముక్కు వంకరోడా! బక్కవెధవా! నల్లకోతి' అని రకరకాలుగా గేలిచేసేవాళ్ళు. అందువల్ల తనను తాను న్యూనతపరచుకునేవాడు. కానీ మృత్యుంజయరావు మాత్రం ఎవర్నీ ఏమీ అనేవాడు కాదు.

జగతి, శ్రీధర్‌ను ప్రేమిస్తుంది. శ్రీధర్ జగతిని దూరంగా తీసుకెళ్ళి తన అవసరం తీరిపోయాక పెళ్ళికి తిరస్కరిస్తాడు. జగతి తిరుగు ప్రయాణంలో కాకినాడలో గుమాస్తా ఉద్యోగం చేస్తున్న తన తమ్ముణ్ణి ఆశ్రయం కోరుతుంది. మృత్యుంజయరావు తన అక్కకు జరిగిన అన్యాయానికి జాలిపడడం తప్ప యేమీ చేయలేకపోతాడు.

మృత్యుంజయరావు ఉద్యోగంలో చేరిన తరువాత ఆ వాతావరణానికి తగ్గట్టుగా మంచి స్నేహితుల్ని సంపాదించుకోలేకపోతాడు, ఆఫీసులోవున్న

మాలతితో మాత్రం ధైర్యంచేసి మాట్లాడుతాడు. హోటలుకెళ్ళి తినడానికి ఏమి చెప్పాలో కూడా సంశయించేవాడు. తన ఆఫీసులోని వాళ్ళు నాటక ప్రదర్శనలో మృత్యుంజయరావుని ఓ పాత్ర వేయమని కోరగా గిజగిజలాడిపోతాడు. వేశ్య అయిన మంజువాణి దగ్గరకు వెళ్ళివచ్చిన తరువాత ఇంకెప్పుడూ వ్యభిచార గృహాలకు వెళ్ళకూడదనుకుంటాడు.

జగతి, చిలకమ్మతోపాటు విద్యాధరస్వాముల ఉపన్యాసాల్ని వినడానికి రోజూ వెళుతుంది. అలా వెళ్ళడంవల్ల జగతిలో మార్పు వస్తుంది. జగతి శుచితో అన్ని ఆచారాన్ని పాటిస్తుంది. తన అక్కమాదిరిగానే తనుకూడా ఆచారాల్ని పాటిస్తాడు మృత్యుంజయరావు. ఆ సమయంలో తనన్నెవరైనా చూస్తారేమోనని అనుమానపడి న్యూనతకు గురి అవుతాడు. జగతి తన జీవితానికి సంబంధించిన విషయాల్ని, విషాదాల్ని డైరీలో రాసుకుంటుంది. తన అక్క డైరీ జీవితాన్ని చదివి మృత్యుంజయరావు బాధపడేవాడు.

జగతి అందచందాలకు ఆకర్షితుడైన విద్యాధరస్వామి అందరిచేత అవమానం పాలౌతాడు. జగతి తనకు తానే ఆత్మవిమర్శ చేసుకుంటుంది. జగతికి ఆశ్రమంలో చోటులేకపోతుంది. జగతి పశ్చాత్తాపంతో తిరిగి విద్యాధరస్వాముల్ని చేరుకుంటుంది. అప్పటినుండి యిద్దరిలో పవిత్రత తప్ప మరోభావం కలుగదు. విద్యాధరస్వామి శిష్యుడైన మార్కండేయశాస్త్రి జగతి శీలాన్ని అపహరించాలనుకుంటాడు. జగతి, విద్యాధరస్వామి ఒకే గదిలో వున్నది చూస్తాడు. వాళ్ళిద్దరికి అక్రమసంబంధం వుందని ఆ వూరి ప్రజలకు చూపించి వాళ్ళను రాళ్ళతో గాయపరుచేటట్టు చేస్తాడు. ఆ తరువాత ఇరువురు మరో ఆశ్రమంలో చేరిపోతారు.

చిలకమ్మ భర్త మరణించగా మృత్యుంజయరావు దగ్గరుండి కర్మకాండలు, జరిపిస్తాడు. తను చనిపోతే కూడా యీ విధంగానే మనుషులు పోగవుతారని మనసులో అనుకుంటాడు. మృత్యుంజయరావు తల్లికి జబ్బుచేయగా యింటికి వెళ్ళి, ఆమెకు సేవలు చేస్తాడు. తన తల్లికి శుశ్రూష చేస్తున్నందుకు సంతోషపడిపోతాడు. కాని శ్రీదేవి కొన్ని రోజుల్లోనే మరణిస్తుంది.

మృత్యుంజయరావుకి ఒంటరితనం భరించలేక పెళ్ళి చేసుకోవాలన్న తలంపుతో కృష్ణశాస్త్రి సాయంతో జగన్నాథరావు ఇంటికి వెళతారు. అంతకుముందే

మాలతితో తను ప్రేమించిన సంగతి చెప్పగా మృత్యుంజయరావుని తిరస్కరిస్తుంది. జగన్నాథరావు కూతురు లోపలినుంచే 'కోతిమొకమోడు' అన్న మాటలు వినబడగా పరాభవాన్ని చవిచూసి తిరిగి వచ్చేస్తాడు.

మాలతి, శేఖరంల పెళ్లికి మాలతి తండ్రి పశుపతి తిరస్కరిస్తాడు. అందుకు కారణం కులాంతర వివాహం కావడం. అందువల్ల పశుపతి తన కూతురు మాలతిని మృత్యుంజయరావుకిచ్చి పెళ్ళి చేస్తాడు. మృత్యుంజయరావు మాలతి, శేఖరంల అంతరంగిక సంబంధాన్ని అడగాలనివున్నప్పటికీ అడగలేకపోతాడు. 'నన్ను ప్రేమిస్తున్నావా?' అని కూడా అడగాలనుకుంటాడు. మాలతి 'నెల తప్పడంతో' తనకు యే రోగం లేదుకదా, అని పుట్టబోయే పిల్లవాణ్ణి గురించి ఆలోచిస్తాడు.

మాలతి ఆరోగ్యం క్షీణించి 'టాక్సీమియా ఆఫ్ ప్రెగ్నెన్సీ' వల్ల ఫిట్స్ వస్తుంది. మాలతి ఫిట్స్‌తో బాధపడుతుంటే 'నన్ను ప్రేమించానని' ఒక్కమాట చెప్పు అని మృత్యుంజయరావు మాలతిని ప్రాధేయపడతాడు. జగతి చెప్పకనే చనిపోతుంది.

మృత్యుంజయరావు పదేళ్ళ తరువాత అదే ఆఫీసులో ఉ[illegible]. తన జీవితాన్ని గురించి యెవరూ యేమీ అడిగేవారుకారు. అందువల్ల తన జీవితంలో అనుభవించని, చవిచూడని యెన్నో సంఘటల్ని కల్పించుకుని డైరీలో రాసు కుంటాడు. మృత్యుంజయరావు కోరిక యీ రూపంలో తీరుతుంది. అతను మనో నేత్రంలో అపురూప లావణ్యవతి అయిన 'అరుణ'ను సృష్టించుకుని అందరితో ఆమెతో తనకున్న సంబంధాన్ని చెప్పుకుని మురిసిపోతాడు. మృత్యుంజయరావుకు ఆ ఉత్సాహంవల్ల ప్రతి రక్తపుబిందువులో మార్పు వచ్చి ఉరకలు వేస్తుంది. ఒక రోజు వున్నట్టుండి మృత్యుంజయరావుకి పెరాలసిస్ స్ట్రోక్ వచ్చి కాళ్ళు చేతులు పడిపోవడంతో. దిక్కులేనివాడవుతాడు. ఇరుగుపొరుగువాళ్ళు ఆసుపత్రిలో చేరుస్తారు. తన అరుణను కలవరిస్తాడు. మృత్యుంజయరావుకి మృత్యువు దగ్గరకు వస్తున్నదని చూసి భయపడతాడు. అయినా మృత్యువుపాలపడక తప్పలేదు.

## 2.2. నివేదిత :

పైరు పచ్చలతో కలకలలాడుతుంది ఆనందపురం. ఆ ఆనందపురంలోని గోవిందాచార్యుల ఒక్కగానొక్క కూతురు నివేదిత. గోవిందాచార్యుల వంశంవారు తరతరాలుగా వేణుగోపాలస్వామి దేవాలయానికి అర్చకులు. నివేదిత తండ్రితోపాటు రామాయణ, భారత, భాగవతాల్ని అభ్యసిస్తుంది. వేదిత బాల్యస్నేహితులు శేషసాయి, కళ్యాణమూర్తి. ఇరువురు ఆమెను ప్రేమిస్తారు. వేదిత కళ్యాణ మూర్తిని మాత్రం ప్రేమిస్తుంది. వేదిత తండ్రి తన కులస్థుడుకాని కళ్యాణ్‌కు యివ్వకుండా తన బంధువుల్లో యిచ్చి పెళ్ళిచేస్తాడు. పెళ్ళి అయిన కొద్దిరోజులకే వేదిత వైధవ్యం పొంది పుట్టినింటికి వచ్చేస్తుంది. తన కూతురికి జరిగిన అన్యాయానికి గోవిందాచార్యులు చలించిపోతాడు. వేదిత తండ్రికి దేవాలయంలో చేదోడు వాదోడుగా వుంటుంది.

శేషసాయికి సీతతో పెళ్ళి జరుగుతుంది. కళ్యాణమూర్తి విదేశాలకు వెళ్ళి పోతాడు. ఆనందపురానికి విచ్చేసిన వేదమాత వల్ల వేదిత ఆధ్యాత్మిక చింతనలో మౌనిలా తయారవుతుంది. వేదితను ఆ వూరి ప్రజలు 'అమ్మా' అని పిలుస్తారు. ఆ వూరిలో వేదిత ఓ 'జ్యోతి'లా వెలుగుతుంది.

శేషసాయికి వేదితమీద మనసుపడుతుంది. శాయి మాటప్రకారం గంగరాజు వేదిత దగ్గరకు వెళ్ళగా ఆమెను చూస్తూనే 'అమ్మా' అన్న భావం కలుగుతుంది. వేదిత నిద్రిస్తున్న సమయంలో గంగరాజు ఆమెను తీసుకువచ్చి శేషసాయికి అప్పగిస్తాడు. శాయికి ఆమెను తాకకముందే కాళ్ళు చేతులు అదరడం, గుండెనొప్పి కలుగడంవల్ల తన ప్రయత్నాన్ని విరమించుకుంటాడు, గంగరాజు పాముకాటు వల్ల ప్రాయశ్చిత్తంతో మరణిస్తాడు. శాయి తల్లి, భార్యకూడా మంచానపడి కొంత కాలానికి మరణిస్తారు.

కళ్యాణమూర్తి చాలా కాలం తర్వాత ఆనందపురానికి తిరిగి వస్తాడు. వేదితకు జరిగిన అన్యాయానికి బాధపడతాడు. తనతో వచ్చేయమంటాడు. అందుకు వేదిత నిరాకరిస్తుంది. కళ్యాణ్ వెళ్లిపోతూ వేదితకు ఓ ఉత్తరం రాసి బండివాడి దగ్గర యిచ్చి వెళతాడు. ఆ ఉత్తరాన్ని చూసిన పిదప కళ్యాణ్‌ను చేరుకోవాలని గాలివానను లెక్కచేయక అనేక ఒడుదుడుకులను ఓర్చి వేదిత బొంబాయి చేరు

కుంటుంది. కొన్ని గంటల ముందే కళ్యాణ్ అమెరికా వెళ్ళిపోయినట్టు డ్రైవర్ ద్వారా వేదిత తెలుసుకుంటుంది.

శేషసాయి మిత్రుడయిన సక్సేనా వేదితను గుర్తుపట్టి ఇంటికి తీసుకెళతాడు. సాయి వ్యాపార నిమిత్తం అక్కడే వుండటంవల్ల వేదితను కలుసుకుంటాడు. వేదిత మనసు చలించి అదో లోకంలో వుంటుంది. వేదిత బొంబాయి జీవితంలో శేషసాయితో కలిసి విచ్చలవిడిగా తిరుగుతూ అన్ని ప్రసారాలకు బానిసవుతుంది. శీలం మాత్రం పోగొట్టుకోదు. ఎప్పటినుంచో వున్న కోరికను సాయి ఆ రూపంలో ఆమెను అనుభవించాలనుకుంటాడు. వేదితను పొందాలని దగ్గరకు వెళ్ళిన సాయికి దురదృష్టవశాత్తు గుండెనొప్పి వచ్చి విరుచుకుపడిపోతాడు. శేషసాయి తనకు ముద్దివ్వమని వేదితను ప్రాధేయపడగా అతని పరిస్థితిని చూసి ఒప్పుకుంటుంది. వేదిత సాయిని ముద్దుపెట్టుకునే సమయంలో 'భగవాన్' అని ప్రాణాలు విడుస్తాడు.

వేదిత బొంబాయి జీవితానికి స్వస్తిచెప్పి తన సొమ్ముల్ని త్రిమూర్తుల కిచ్చి సక్సేనాకు కృతజ్ఞతలు చెప్పి ఆనందపురం చేరుకోవాలని పిచ్చిదానిలా తిరుగుతుంది. వేదిత పిచ్చిదనుకుని రాళ్ళతో బాధిస్తారు. ఓ కుర్రాడు వేదితను ఆదుకొని 'అమ్మా' అని పిలుస్తాడు. వేదితను ఆ కుర్రాడు యింటికి తీసుకెళ్ళడం వల్ల అతనికి పిల్లనివ్వడానికి నిరాకరిస్తారు. పైగా వారిద్దరిని అనుమానిస్తారు. వేదిత తనవల్ల ఆ కుర్రాడికి అన్యాయం జరగకూడదని అక్కడి నుండి కూడా బయటపడుతుంది.

వేదిత రైలు ప్రయాణంలో తన వూరు చేరుకోవాలని ప్రయాణిస్తుంటుంది. 'తను జీవితంలో అన్నీ పోగొట్టుకున్నా'నని మానసికంగా వ్యథ చెందిన వేదిత ఆత్మహత్య ప్రయత్నం చేయబోగా, కళ్యాణమూర్తి కాపాడుతాడు. వేదిత అతనికి జరిగినదంతా చెప్తుంది. కళ్యాణమూర్తి తనకు పెళ్ళి నిశ్చయమైనప్పటికి వేదితను పెళ్ళి చేసుకుంటానంటాడు. అందుకు ఆమె నిరాకరిస్తుంది.

వేదిత ఆనందపురం చేరుకుంటుంది. కరువు కాటకాలతో అలమటించి ఆ వూరి ప్రజలు దేశాంతరం వెళ్ళిపోయినట్టు తెలుస్తుంది. వేదిత వేణుగోపాలుని సన్నిధి చేరుకుంటుంది. దేవాలయాన్ని శుభ్రంచేసి వేదిత స్వామి పాదాల చెంత

సుఖనిద్రపోతుంది. వేదిత మరణంవల్ల ప్రకృతి కరుణించి వర్షం వస్తుంది. వేదిత ఆ వూరిలో వున్నప్పుడు ఏ విధంగా వుండేదో అదే విధంగా ఆమె మరణించిన తరువాత పచ్చని పంటపొలాలతో కలకలలాడుతుంది.

వేదిత దేవుని పాదాలచెంత ప్రాణాలు విడుస్తుంది. కాబట్టి ఆ వూరి ప్రజలకు 'నివేదిత' అవుతుంది.

## 2.3. 'ఒకే పాటకు రెండు రాగాలు'

శివరాం బి.ఏ. పూర్తి అయిన తరువాత కుటుంబ పరిస్థితుల దృష్ట్యా తండ్రి ప్రోద్బలంచే ఉద్యోగంకోసం విజయవాడ వెళతాడు. శివరాం తన తండ్రి స్నేహితుడయిన రమాపతిరావును కలుసుకుంటాడు. ఆయన కూతురు కమల పరిచయం అవుతుంది. శివరాంకు ఆ కుటుంబం మీద మంచి అభిప్రాయం ఏర్పడుతుంది. శివరాం ఇంగ్లీషు సినిమాకు వెళతాడు. అది 'సెక్సువల్ పర్వర్షన్' సినిమా అని అతడికి తెలియదు. కమల ఆమె స్నేహితురాలు కళ్యాణి ఆ సినిమాకు రావడంలో శివరాం నివ్వెరపోతాడు.

శివరాం ఆశావాది కాదు, పుస్తకాలు చదవాలన్నా, స్నేహితులతో కలిసి తిరగాలన్నా, చివరకు భోజనం దగ్గర కూడా యెప్పుడూ లేచిపోదామా? అని అనుకునేవాడు. ఒక విధంగా ఆత్మన్యూనత కారణంగా శివరాం స్నేహితుల్ని సంపాదించుకోలేక పోతాడు. ఇతరులకు విసుగు కలిగిస్తాడు. సున్నిత మనస్కుడు.

శివరాం ఉద్యోగం చేయడం యిష్టంలేక ఎం.ఎ.లో చేరతాడు. శివరాం కమలను ప్రేమించిన విషయాన్ని ఉత్తరం ద్వారా తెలియపరుస్తాడు. కమల శివరాంను ప్రేమించిన విషయం కళ్యాణికి చెప్తుంది. కమల, కళ్యాణిలు తమ అనుభూతుల్ని పదిలంగా దాచుకుంటారు. కళ్యాణి ప్రోత్సాహంవల్లనే శివరాంను కమల పెళ్ళాడుతుంది. కమల, శివరాం హనీమూన్‌కై మైసూరు బయలుదేరుతారు. కోరిక చంపుకోలేని శివరాం కమలను ముద్దుపెట్టుకుంటాడు. అందుకు 'ఇదేనా పెళ్ళి' అని కమల చీదరించుకుని ఏడుస్తుంది. శివరాం ఆమెను పొందటంలో విఫలమౌతాడు. కమల 'నేను పనికిరాను' మీరు ఆశిస్తున్న లాంటి

దాంపత్య జీవితానికి పనికిరానంటుంది. ఇంటికి వచ్చిన తరువాత కమలను కళ్యాణి ముద్దు పెట్టుకుంటుంది. శివరాం వాళ్ళిద్దర్ని అసూయగా చూస్తాడు.

శివరాం కమల వేరు కాపురం పెట్టగా, వీళ్ళతోపాటే కళ్యాణి కూడా వుంటుంది. కళ్యాణి జీవితాన్ని గురించి శివరాం అడగాలనుకున్నా, అడగలేక పోతాడు. శివరాం కమలను పొందాలనుకున్నప్పుడల్లా, ఏదో ఒక కారణం చెప్తే స్తుంది. 'మీకు నేను సన్నిహితురాలిగానే పనికివస్తాను గానీ, పరిపూర్ణమైన భార్యగా పనికిరానంటుంది'. మానసికంగా నలుగుతున్న శివరాం కమలను చేయి చేసుకుంటాడు. మరొకరోజు ఇంటికెళ్ళగా కమల, కళ్యాణి ఒకే మంచంపై భార్యా భర్తల్లాగా పడుకొనివుంటారు. శివరాంకు వారిద్దరి విషయం అర్థమౌతుంది. భార్యా భర్తల మధ్య అగాధం మరింత విశాలమవుతుంది. మరొక్కసారి శివరాం మంచి మాటల్తో సమీపిస్తాడు. కమల చీదరించుకుంటూ 'ఒక్క అంగుళం ముందుకు వేశా వంటే దీన్ని త్రెంచేస్తా' నంటుంది. అందుకు శివరాం ఓర్పు వహిస్తూ ఆగ మంటాడు.

శివరాం జరిగిందంతా తన మామకు వివరిస్తాడు. రమాపతిరావు కూడా ఏమీ చేయలేకపోతాడు. శివరాం, కమలల దాంపత్య చరిత్ర చాలామంది నోళ్ళలో నలుగుతుంది. తన కొడుకు పరిస్థితిని చూసిన శివరాం తల్లిదండ్రులు చింతిస్తారు కమల శివరాంను బొమ్మలా ఆడిస్తుంది. కమల తన తమ్ముడి పెళ్ళికి శివరాం ను రమ్మని అవమానిస్తుంది. అక్కడే వున్న కళ్యాణి కమలను శివరాంతో కలిసి కాపురం చేయమంటుంది. శివరాం స్నేహితులు వీళ్ల దాంపత్యం గురించి హీనంగా మాట్లాడుకుంటారు.

శివరాం కళ్యాణి దగ్గరకెళ్ళి 'నా కమలను నాకు దక్కేటట్టు చూడు' అనీ ఆమెను ఆడిపోసుకుంటాడు. 'నీ స్వార్థం కోసం కమలని నాకు దక్కకుండా చేశావు. మీ యిద్దరికీ ఒకరినొకరు తప్ప మరో వ్యక్తి ప్రమేయం లేదు' అని చెప్పి వచ్చేస్తాడు. శివరాం తన భార్య దగ్గరకెళ్ళి తనింటికి రమ్మని ప్రాధేయపడతాడు. కమల 'భార్యాభర్తలమన్న సంగతి యెప్పుడో మరచిపోయా' నంటుంది. కమల తన భర్తను చేయిచేసుకోవడానికి చేయి పైకెత్తుంది. ఆ లోపుగా రమాపతిరావు

వచ్చి వారిస్తాడు. కమల తమ్ముడు మోహన్ శివరాంను వీధిలోకి గెంటివేస్తాడు. అతని బ్రతుకు వీధిపాలవుతుంది.

శివరాం వ్యసనపరుడై త్రాగుడికి అలవాటుపడతాడు. మానసికంగా నలుగుతాడు. శివరాం కమలను పొందాలన్న ఆశ అడిఆశవుతుంది. శివరాం ఓ రౌడీని ప్రోత్సహించి తన భార్య శీలాన్ని చెరచమని డబ్బు యిచ్చి పంపుతాడు.

కమల కళ్యాణి యింటికి వెళుతుంది. కళ్యాణి లేకపోవడంతో ఓ చీటీని చూస్తుంది. అందులో 'హోమోసెక్స్ అని పేరుపెడితే యిద్దరం వులికిపడతాం. నీ వైముఖ్యం యిప్పటికీ సైకలాజికల్ అనే నా ఉద్దేశం. నీ భవిష్యత్తు వసంతంలా విరబూయాలనే నా ఆకాంక్ష. నే తిరిగివచ్చేలోపల పిల్లపాపలతో వుంటావని ఆశిస్తానని' వుంటుంది. ఉత్తరం చదివిన కమల పశ్చాత్తాపం చెందుతుంది.

నూకాలమ్మ గుడికి వెళ్ళిన కమలను శివరాం మనిషి బలవంతం చేస్తాడు. శివరాంకు తాగిన మత్తు దిగేలోపుగా తాను పంపిన మనిషి రాకపోవడంతో కమలను చేరుకుంటాడు. వాడి బారినుండి కమలను తప్పిస్తాడు. శివరాం పశ్చాత్తాపంతో తనదే తప్పని చెప్పబోగా కమల కూడా పశ్చాత్తాపంతో మన్నించమని కాళ్ళమీద పడుతుంది. ఇరువురి మధ్య వున్న యెడబాటు అదృశ్యమౌతుంది.

కళ్యాణి నాలుగేళ్ల తరువాత తిరిగిరాగా కమల యిద్దరి పిల్లలతో, తన భర్తతో కలకల లాడుతుంటుంది. కళ్యానికి ఆనందాశ్రువులు మాత్రం మిగులుతాయి.

## 3. ఆత్మన్యూనతా భావం :

ఒక వ్యక్తి తన సుఖదుఃఖాలకు యెంతవరకు బాధ్యుడు అనే ప్రశ్న తీవ్రమైన జిజ్ఞాసకు దారితీస్తుంది. చిన్నతనంలో యేమీ యెరుగని వయసులో ఒక భయానక సంఘటన మనసుపై ముద్ర వేస్తుంది. ఆ కారణంగా ఆ వ్యక్తి చైతన్యం ముడుచుకు పోతుంది. దాని ఫలితంగా పిరికితనం అలవాటైతే తర్వాతి జీవితంలో కష్టసుఖాలకు వ్యక్తిగా అతనెంతవరకు బాధ్యుడు? ఘటన ద్వారానే అతనికి విముక్తి

లభించాలి. కొమ్మూరి వేణుగోపాలరావుగారి 'వ్యక్తిత్వం లేని మనిషి' నవల్లో మృత్యుంజయరావు ఆత్మన్యూనతా భావ గ్రంధికి లోనై తన జీవితాన్ని ఏ విధంగానూ మలుచుకోలేక పోతాడు.

ఆత్మన్యూనతా భావానికి గురి అయినవాళ్ళు నిరాశానిస్పృహలకు గురి కావడం సర్వసాధారణంగా జరుగుతుంది. ఇలాంటివారు తమలో యేదో వ్యక్తిగత లోపం వున్నట్టూ, అది బలహీనత అయినట్టూ వూహించుకుని న్యూనత భావాన్ని పెంచుకుంటారు. న్యూనత అనేది సమాజం తమను చిన్నచూపు చూస్తున్నదనే భయం నుంచి పుట్టే ఆత్మవిమర్శ. అర్థంలేని వూహలతో నలిగిపోయే వీరి నడత చాలా చిత్రంగా వుంటుంది. ప్రతి చిన్నదానికీ బాధపడిపోవటం, ప్రతిదానిమీద అనుమానం, అసూయ మొదలైన గుణలు పెంపొందుతాయి.

'వ్యక్తిత్వం లేని మనిషి' నవల్లో మృత్యుంజయరావు అధీర నాయకుడు. కొన్ని విషయాల్లో మానవుడు అల్పసంతోషి; కొన్నిటిలో నిరాశాపరుడు. మరి కొన్నిటిలో పూర్తిగా అసంతృప్తుడు. ఇన్నిటి సమ్మేళనం కాకపోతే అతను వెకిలిగా, వెర్రిగా తయారవుతాడు. మృత్యుంజయరావు ప్రతి చిన్న విషయానికీ ప్రాధాన్యత యిచ్చి ఆలోచించటంలో అగ్రగణ్యుడు. ఈ విధంగా ఆలోచించ గలగడం అతని తెలివితేటలకు నిదర్శనమని ఎవరూ పొరపడకూడదు. తెలివైన వాళ్ళు పనికిమాలిన విషయాల్ని గురించి ఆలోచించక, వాటి జోలికిపోరు. మృత్యుంజయరావు వంటి వ్యక్తులు చెత్త విషయాల్ని గురించి ఆలోచించడం జరుగుతుంది.

మృత్యుంజయరావు అక్క అయిన జగతి భక్తితో సూర్య నమస్కారాలు చేస్తూ శుచిగా, దైవభక్తితో వుంటుంది. ఆమె చిత్తశుద్ధికి ఏకాగ్రతకు మృత్యుంజయరావు విస్మయ చిత్తుడవుతూ మనసులో...."మంచిపని అయినా పెద్దవాళ్ళ చేతనే నిర్వర్తించబడుతుంది. నాలాంటి పిరికివాళ్ళు యేపని చేయటానికైనా తగరు" అని ఆక్రోశిస్తాడు. జగతి పెద్దల మాటలు వినకుండా ప్రేమించినవాడితో వెళ్ళిపోయి తన జీవితాన్ని నాశనం చేసుకొందని"[3] అతని అంతరంగంలోనిమాటలు. పశ్చాత్తాపానికి మించిన ప్రాయశ్చిత్తం లేదని మృత్యుంజయరావుకి తెలియక పోవచ్చు.

మృత్యుంజయరావు దగ్గరకు జగతి రావడంతో అతనిలో ఓ వొరవడి యేర్పడుతుంది. సార్థకత లభిస్తుంది. ఆమె వెళ్ళిపోవడంతో ఇప్పుడా నూతన అనుభూతులు అన్నీ అంతరించి యెప్పటి జడపదార్థంలా మిగిలిపోతాడు. 'భగవంతుడా నన్నెందుకు పుట్టించావు' అని ప్రశ్న వేసుకుంటాడు. ఒక్కోసారి మృత్యుంజయరావుకి చచ్చిపోవా లనిపిస్తుంది. కానీ చావంటేభయం. వల్లమాలిన అసహ్యం. చిలకమ్మ మామయ్యను స్మశాన వాటికలో తగులబెడుతుంటే 'నన్నూ యిలాగే కాలుస్తారు. నా శవం చుట్టూ కనీసం కొంతమంది మనుషులు వొగవుతారు' అని అతను అనుకోవడంలో జీవిత సత్యాన్ని మనకు స్ఫురింప జేస్తుంది.

మృత్యుంజయరావు తల్లి శ్రీదేవి కేన్సర్‌తో బాధపడుతుంది. ఆమెను చేరుకుని శుశ్రూషచేస్తాడు. జీవచ్ఛవంలా అస్థిపంజరంలా మంచానపడివున్న తన తల్లిని చూసి యేడుస్తాడు. మనసులో "నేను మహా పాపిని. తల్లిని యీ స్థితిలో వుంచి అక్కడ ఏకాంతంగా బ్రతుకుతున్న నా పాపానికి నిష్కృతిలేదు. నేనూ యిలాగే కుళ్ళి కుళ్ళి ఛస్తాను"[4] అని అతని అంతరంగం ఘూర్ణిల్లుతుంది. పశ్చాత్తాపంతో తన తల్లికి శుశ్రూష చేసినందుకు మరోప్రక్క ఆనందం తృప్తి మనశ్శాంతి లభిస్తుంది. 'పుట్టిన యిన్నాళ్ళకు నేను చేస్తున్నా మంచిపని యిదే' అని పదేపదే అనుకుంటాడు.

మృత్యుంజయరావు తల్లి మరణంతో అతనిలో ఆవరించి యున్న విరక్తి నుండి కోలుకోలేక పోతాడు. లోపలినుంచి వస్తున్న నైజగుణం అతనిని చిత్రవధ చేస్తుంది. అందువల్ల 'తను వెంటనే చచ్చిపోయి మరోజన్మ అందంగా, ప్రకాశవంతుడిగా, గొప్పవాడిగా పుట్టి అందర్నీ ఓడించాలను'కుంటాడు. ఈ విషయంలో మాత్రం మృత్యుంజయరావు సర్వజ్ఞుడు కావాలనీ కోరుకుంటాడు. ఇక్కడ అతనిలో కాస్త మార్పును గమనించవచ్చు.

మృత్యుంజయరావుకి ఒంటరితనం భరించలేక ప్రేమించిన మాలతీ తిరస్కరించడంతో పెళ్ళి చేసుకోవాలను కుంటాడు. కానీ తనకు పిల్ల నేవరిస్తారన్నది అతని మీమాంస. మనసులో 'నా మొహం నాకు పెళ్ళేమిటి?' అనుకుంటాడు. మృత్యుంజయరావు క్రిష్ణశర్మ ద్వారా ఓ యింటికి పెళ్ళికూతుర్ని చూడటానికి వెళతాడు. ఇతను అనుకున్న దానికి తగ్గట్టుగానే పెళ్ళికూతురు లోపల్నుంచి 'ఈ

కోతి మొహంవాడు తప్ప యింకెవరూ దొరకలా యింకెప్పుడూ యిలాంటి చచ్చు మొహాల్ని తీసుకువస్తే ఊరుకోను' అన్నటువంటి మాటల్ని వింటాడు. మృత్యుం జయరావు గతాన్ని గుర్తుకు తెచ్చుకుని 'నన్నెవరూ ప్రేమించరు. నన్నెవరూ అభిమానించరు. నేనెవ్వరికీ అక్కర్లేదు' అని కుమిలి కుమిలి యేడుస్తాడు.

మృత్యుంజయరావు తనకు పెళ్ళి జరగదని బాధపడుతూ యేడుస్తున్న సమయంలో మాలతి 'నేనున్నాను' అని అంటుంది. మాలతి మొదటినుంచి అతని రూపాన్ని గురించిగాని, అతని వైఖరి గురించిగాని యెప్పుడూ హేళన చేయలేదు. మాలతిని తన కులస్థుడుగాని శేఖరంకు యివ్వడానికి ఆమె తండ్రి నిరాకరించడం వల్ల మాలతికి మృత్యుంజయరావుతో పెళ్ళి జరుగుతుంది. 'మాలతీ నువ్వు నన్ను ప్రేమిస్తున్నావు అదే తనకు భిక్ష' అని మనసులో మాత్రం అనుకో గలుగుతాడు.

మృత్యుంజయరావుకి, మాలతికి పెళ్ళి జరిగినప్పటికి మాలతి శేఖరంల అంతరంగిక సంబంధాన్ని గురించి ఆలోచిస్తాడు. అడగాలనుకుంటాడు. అడగ లేక పోతాడు. మాలతి నెల తప్పినప్పుడు తనకు యే రోగం లేదనుకుంటాడు. తనకు పుట్టబోయే పిల్లవాణ్ణి గురించి చచ్చు కలలు కంటాడు. మాలతి ఆరోగ్యం రోజు రోజుకు క్షీణిస్తుంది. డాక్టర్లు 'టాక్సీమియా ఆఫ్ ప్రెగ్నెన్సీ' అని తేలుస్తారు. దానికి తోడు ఫిట్స్ కూడా వస్తుంది. మాలతి ఆ రోగంతో బాధపడు తున్నప్పటికీ మృత్యుంజయరావు మనసులో వున్న ఒక్క కోరికగా 'నన్ను ప్రేమించానని ఒక్క మాట చెప్పు మాలతీ' అని అడుగుతాడు. మాలతి ఫిట్స్ బాధతో మరణిస్తుంది.

## 4. మానసిక ప్రవృత్తి :

వ్యక్తిత్వం లేని మనిషిలో మృత్యుంజయరావు మానసిక ఆందోళనపరుడు ధైర్యంలేని అనాచరణీయ ఆలోచనా మనస్కుడు, చిన్నతనం నుండి అతనిపై జరిగిన ప్రభావాల ఫలితంగా అలా తయారయ్యాడని చెప్పాలి. ఎప్పుడూ తనను యితరులతో పోల్చుకుని బాధపడే వ్యక్తి. మనిషి సహజంగా యెవరి వ్యక్తిత్వం వారిది అని జీవనయానం సాగించాలి. కాని ప్రతి చిన్న సమస్యను గూరి

అధికంగా ఆలోచించడం, గోరంతలు కొండంతలు చేసుకుని మానసిక క్షోభ చెందటం జరుగుతుంటుంది. తనలోని ఆలోచనలు ఆచరణలో పెట్టలేని అసమర్థులకు ప్రతీక మృత్యుంజయరావు.

మృత్యుంజయరావు పాత్రను డాక్టర్ కొమ్మూరి వేణుగోపాలరావు గారు ఒక నమూనాగా తీసుకొని చిత్రించారు. ఇలాంటి మనుషులు నేటి సమాజంలో వున్నారని తెలియజేస్తున్నారు. దీన్నిబట్టి పరిశీలిస్తే కొమ్మూరి రచనా రీతి సమాజానికి అతి దగ్గరగా వుందని చెప్పవచ్చు. క్రాపు దగ్గరనుండి టైలరింగ్ వరకు మృత్యుంజయరావు స్వతహాగా నిర్ణయం తీసుకోకపోవడం అతనిపై పనిచేసిన పద్ధతులు మనుషుల ప్రభావమే తార్కాణం. ఒక మనిషిపై సమాజ ప్రభావం తప్పకుండా వుంటుందనడానికి మృత్యుంజయరావు ఒక ఉదాహరణంగా మనం చెప్పుకోవచ్చు.

ఒకరి మనస్తత్వానికి సరిపడినా, సరిపడక పోయినా తనను ఆవరించి యున్నటువంటి వాతావరణం మంచి స్నేహితుల్ని యెన్నుకోవడానికి ప్రయత్నిస్తాడు మనిషి. కానీ అందుకు విరుద్ధ స్వభావి మృత్యుంజయరావు, సంభాషణలు సంక్షోభంతో కూడిన సంఘటనలూ, అతని హృదయ క్షేత్రంలో ఎంత దృఢంగా ముద్ర వేసుకుపోతాయంటే, అవి బహుశా అతని జీవితకాలంలో యెప్పటికీ చెరిగిపోవు.

మృత్యుంజయరావుని వున్నట్టుండి నిలబెట్టి 'నువ్వెవరివయ్యా? ఎందుకు బ్రతుకుతున్నావు?' అని యెవరైనా ప్రశ్నిస్తే, వుబ్బితబ్బిబ్బై గడగడ వణికిపోయే స్వభావం కలవాడు. అద్దంముందు గంటల కొద్దీ నిలబడి తనలోని అవలక్షణాలను అవలోకిస్తూ వుండేవాడు. తనలోని లోపాల్ని ప్రజలు అలా బహిరంగ పరచి యెత్తిపొడుస్తూ వుంటే అతను వుడుకెత్తి పోయేవాడు. ఏమి చేయలేక కృంగిపోయేవాడు. ఈ ప్రపంచంలో తనకు బ్రతకడానికి అర్హత లేదనుకునేవాడు.

మృత్యుంజయరావు అక్క జగతి. జగతి ప్రేమించిన వాడితో వంచింపబడటం వల్ల తన తమ్ముడి ఆశ్రయం చేరుకుంటుంది. జగతి నిద్రిస్తున్నప్పుడు చూస్తాడు మృత్యుంజయరావు. మనసులో......"నాగమల్లి పూవులా యెంత

ప్రశాంతంగా వుంది ఆమె ముఖం. ఇంత గత చరిత్ర పెట్టుకుని యెంత ప్రశాంతంగా యెట్లా నిద్రిస్తోంది, తనెప్పుడూ అంత నిశ్చితంగా వుండలేదు. నిరంతరం చలిస్తూ యాతనగా, గందరగోళంగా వుంటుంది తన మనసు. రాత్రి కమ్మగా యెప్పుడూ నిద్రపోలేదు. కళ్ళు మూసుకుంటే చాలు చచ్చు కలలు, మెలకువగా వుంటే భయాలు భ్రాంతులు'' అని అనుకుంటాడు. తన అక్క అంత చరిత్ర పెట్టుకుని యెంత ప్రశాంతంగా నిద్రపోతోంది. తనకు మాత్రం యే చరిత్ర లేకుండానే యెందుకు యీ మానసిక క్షోభకు గురికావలసి వస్తుందోనని అతని మనోవేదన.

మృత్యుంజయరావులో ఓ వింత ప్రవృత్తిని కూడా చూస్తాం. అతడు నిద్రపోకముందు గడియవేసి లైటు ఆర్పివేసివచ్చి పడుకుంటాడు. కాని పడుకున్న తరువాత గడియవేశానా అని అనుమానంతో మళ్ళీ గడియను చూసి సంతృప్తిపడి వచ్చి పడుకుంటాడు. తను చేసిన పనిని కూడా సరిగా చేశానా లేదా అన్న అనుమానం కలుగుతుంది. సినిమాకు వెళ్ళాలన్నా యే సినిమాకు వెళ్ళాన్న మీమాంసలో పడతాడు.

మృత్యుంజయరావుకి అద్దం ప్రియ మిత్రుడు. మరికొన్ని సమయాల్లో అద్దం అతనికి భయంకర శత్రువు. అద్దంలో చూసుకుంటూ తనని తాను అసహ్యించుకుంటాడు, ఒక్కోసారి తనని తాను ప్రేమించుకుంటాడు. నిద్రించాలంటే చికాకు. జనానికి అతీతంగా వున్న వాళ్ళంటే పడిఛస్తాడు. ఒంటరిగా నడుస్తుంటే చిత్రమైన వూహాలు కలుగుతాయి. 'నేను బాగా నడుస్తున్నానా! చేతులు లయబద్ధంగా వూగుతున్నాయా లేదా? కాళ్ళు యెలా నడుస్తున్నాయ? కొందరు నడకని బట్టి మనిషి ఔచిత్యాన్ని నిర్ణయిస్తారట. తన నడకలో లోపాన్ని ఇట్టి ప్రదర్శించేస్తోందా?' అని యిలా అనుకుంటాడు.

ఒకసారి కుర్రాళ్లు ఆడుకుంటున్న గోలీకాయలు మృత్యుంజయరావు కాలి కింద పడగా తూలి పడబోతాడు. అందుకు ఆ కుర్రాళ్లు నవ్వడంతో మృత్యుంజయరావుకి కోపం వస్తుంది. అయినప్పటికీ తన కోపం యెవరూ లెక్కచేయరని తెలిసి చిరునవ్వు నవ్వి వెళ్ళిపోతాడు. ఆ తుంటరిపిల్లవాళ్ళు మృత్యుంజయరావుని

కొక్కిరాయి, పహిల్వాన్, లొట్టిపిట్ట, బ్యాటీకింగ్ అని గేలిచేస్తారు. ఆ మాటలకు అతని కాళ్ళు తడబడి, ముచ్చెమటలు పడుతుంది. అతని అవస్థ చూసి ఓ యింటి గుమ్మంలోని యిద్దరు స్త్రీలు నవ్వుతారు. మృత్యుంజయరావుకు ఆక్రోశం వస్తుంది. ఇదంతా తను లెక్క చేయనట్టు కనిపించాలనుకుంటాడు. అతని అభిమానం యెదురుతిరుగుతుంది." నాన్‌సెన్స్ ఐ డోంట్ కేర్. పాదాలు వణక్కండి, వణక్కండి, వినలేదు అవి. ఓ నా బలమైనా గుండెకాయా! నెమ్మదిగా కొట్టుకో మరేమీ ఫర్వాలేదు. వినిపిస్తేనా దానికి? ఓ వేగం అందు కుంది. కనీసం మనసా! అదరకు"[6] అని అనుకుంటూ తనలోని అపయవాల్ని కూడా అదుపుచేయాలను కుంటాడు పాపం మృత్యుంజయరావు.

మృత్యుంజయరావు యింట్లో అద్దెకుంటున్న చిలకమ్మ, ఆమె భర్త రామేశ్వరం వెళతారు. వాళ్ళింటికి ఓ పడుచుపిల్ల వర్షంలో తడుచుకుంటూ వస్తుంది. మృత్యుంజయరావు ఆమె ఆకారాన్ని తడిసే దుస్తుల్లోంచి స్పష్టంగా చూస్తాడు. ఆమెను చూస్తూనే 'మీకేం భయంలేదు నేనున్నాను' అని చెప్పాలనుకుంటాడు. మనసులో అలా చెప్పాలని వున్నప్పటికీ చెప్పలేకపోతాడు. మనసు స్థిరం చేసుకుని ఆపుచేయాలనుకుని చివరకు తప్పుల తడికగా మృత్యుంజయరావు చెప్పిన సారాంశం యిది. "చాలా చీకటైపోయింది. వర్షం ఇప్పుడిప్పుడే తగ్గే సూచనలు లేవు. మీరసలే తడిసిపోయివున్నారు. రాత్రిళ్లు కాకినాడ రోడ్లు నిర్మానుష్యంగా వుంటాయి. అసలు మీరు స్టేషన్ నుండి యిక్కడకు రావటమే ప్రమాదం. రౌడీలు జాస్తిగా వుంటారు. ఎంతటి ఘోరమైన పని చేయడానికి వెనుకాడని దుర్మార్గులు. మీరు వాగురించి సంకోచించవలసిన పనిలేదు. (నీ మొహం, నీ గురించి భయపడే దెవ్రా మృత్యుంజయరావూ) మీరు గదిలో విశ్రాంతి తీసుకోవచ్చు. నేనీ వసారాలో గడిపేస్తాను. నిజంగా మీకొచ్చిన భయమేంలేదు"[7] (అలా అంటుంటే నాకు తృప్తిగా వుంటుంది). ఇక్కడ అసమర్థుడయిన మృత్యుంజయరావులో నిజాయితీ కనిపిస్తుంది. ఆడది కనిపిస్తే చాలు ఈలలు వేసే ఈ కాలం కుర్రాళ్ళు చాలామంది వున్నారు. కాని మృత్యుంజయరావు దగ్గర అటువంటి భయంలేదు. ఇక్కడ రచయిత ఆ స్త్రీ అంతరంగాన్ని కూడా వర్ణించారు. ఆమె మృత్యుంజయ రావునూ చూస్తూనే నీకు భయపడేదెవ్రా అని అనుకుంటుంది. రచయిత స్త్రీ మనస్సును లోతుగా పరిశీలించి చెప్పినట్టు తెలుస్తుంది.

మృత్యుంజయరావు మాటలకు ఆమె సంఘంలోని పెద్దమనుషులు, రౌడీలను గురించి చెప్తుంది. 'రౌడీలు' అన్న పదం తన కోసమే వాడిందన్న అతనికి గుచ్చుకుంటుంది. ఆ సన్నివేశం మృత్యుంజయరావుకి యెంతో మధురమైన అనుభూతి నిస్తుంది. మనసులో ఆ సమయంలో శేఖరం అయితే యేం చేసివుండేవాడోనని ఆలోచిస్తాడు. వాడికి చేతనయింది తనకు చేతకాలేదని అతని హృదయ ఆవేదన. తను వ్యూహాలోకంలో ప్రేక్షకుడిగా వుండిపోతూ వీటికి నేను అతీతుణ్ణి అనుకుంటాడు.

మృత్యుంజయరావు మనసులో అతీతుడు అనుకున్నందుకు అతని మనసు మళ్ళీ వెనుతిరుగుతుంది. గదిలోని గోడమీద వ్యక్తి బయటకు దూసుకువచ్చి "అతీతుడివా నువ్వు? నాయనా, ఏదీ నీ మొహం, ఆ పాడు మొహానికి తోడు యింత దురంకారమా? ఓరి చవటా! నిముషాలను చండాలంగా ఖర్చుపెట్టే అప్రయోజకపు వెధవ్వి. నవ్వాల్సిన సమయంలో నవ్వాలని కూడా తెలీని వెంగళాయివి. ఏడవాల్సిన సమయంలో యేడవాలనీ కూడా తెలీని బడుద్ధాయివి. ఆత్మ వంచన చేసుకోక పడుకోరా సన్యాసీ. పడుకుని కుళ్ళు కలలు కను"[8] అని వెక్కిరించి టిక్కిరిటిక్కిరి చేసి వెళ్ళిపోతాడు. ఇలాంటి భ్రాంతిని పొందుతాడు మృత్యుంజయరావు. మనిషి అసమర్థుడైనప్పుడు తనను తాను యెలా తిట్టుకుంటాడో పై మాటలు సాక్ష్యం. నిజంగానే మృత్యుంజయరావు కాసేపు తిట్టుకుంటాడు. తిమురుకున్నాడు. పడుకుని పాపిష్టి నిద్రపోతాను. చచ్చు కలలు కంటానని పడుకుంటాడు ఇక్కడ మృత్యుంజయరావు గోడమీదున్న బొమ్మల్ని చూసి కూడా జడుసుకుంటూ, భ్రాంతి కలిగించుకునే వ్యక్తిగా మనకు తెలుస్తుంది.

## 5. అంతరంగ ఆవేదన :

'వ్యక్తిత్వం లేని మనిషి'లో మృత్యుంజయరావు దగ్గరకు ఓ ఆడపిల్ల వచ్చినందుకు నిజం, అబద్ధాల మధ్య తికమక పడతాడు. సంజీవ దగ్గరకెళ్ళి "అందమైన యువతి, విద్యావతి రాత్రి నా గదికి వచ్చింది" అని చెప్తాడు. మృత్యుంజయరావు యేమీ చేసివుండడని తెలుసుకొని సంజీవరావు ముఖం చిట్లించి "ఛీ నువ్వింత దద్దమ్మవనుకోలేదోయి. అలాంటి అవకాశం దొరికితే యెవరన్నా విడిచిపెడతారా? యెందుకూ నీ యవ్వనం కాల్చనా? నేనైతే ఆ స్థితిలో ఏం చేసేవాడినో తెలుసునా?

ఆమెను నా స్వంతం చేసుకునేవాడిని"[9] అంటాడు. సంజీవరావు అమ్మాయిల విషయంలో అవకాశవాదిగా మనకు తెలుస్తుంది. ఇక్కడ మానవ నైజగుణాన్ని సంజీవరావులో చూడవచ్చు. మృత్యుంజయరావు ఆ మాటలకు మనసులో అయిందేదో అయిపోయింది. ఈసారి జాగ్రత్తపడాలనుకుంటాడు. సంజీవరావుకి ఎందుకు చెప్పానని లోలోపల సంఘర్షణకు గురి అవుతాడు.

మృత్యుంజయరావు సంజీవరావు దగ్గర తిట్లు తిన్నందుకు సోమయాజులు దగ్గరకెళ్ళి అబద్ధాన్ని నిజం చేయాలనుకుంటూ "చలిగాలి, వర్షం, ఒళ్లు తెల్లని శరీరం' అని చెప్తాడు. సోమయాజులు నివ్వెరపోయి "ఈ పని యింకోరూ యింకోరూ చేశారంటే నేను బాధపడేవాడ్ని కాదు. సంజీవరావు వున్నాడనుకో అతను చేస్తే ఆశ్చర్యపడను. కాని నువ్వు బుద్ధిమంతుడివనుకున్నాను. పైకొస్తావనుకున్నాను. ఇదేమిటి? యిలా చేశావు? నా అంచనాలన్నీ తలకిందులు చేశావు. మనిషికి శీలం ప్రధానం. శీలం లేనివాడు మనిషే కాడు. ఇప్పుడా అమ్మాయిని పాడుచేశావా? కర్మగాలి ఆ పిల్లకు నెల తప్పితే ఏమవుతుంది? నువ్వు చేసిన పని చాలా తప్పోయి. ఆ అమ్మాయి ఎక్కడుందో వెదుకు. పెళ్ళి చేసుకో పుట్టినందుకు ఓ మంచిపని చెయ్యి"[10] అంటాడు. సోమయాజులు లాంటివాళ్ళు మృత్యుంజయరావుని మంచివాళ్ళుగా గుర్తించి హితబోధ చేస్తున్నారు. సంజీవరావు లాంటి వాళ్ళు అతన్ని చెడుత్రోవ త్రొక్కమంటున్నారు. మృత్యుంజయరావు మనసులో 'బుద్ధి గడ్డితిని యీయనతో సొరకాయ కోతలు కోశాను. నిజం చెబుతామని పించింది కాని నమ్మడు' అని తెలుసుకుని వెళ్ళిపోతాడు.

మృత్యుంజయరావు వేశ్య అయిన మంజులత దగ్గరకు వెళ్ళాలని వుబలాట పడతాడు. అతని అంతర్గత సంఘర్షణ యిలా వుంది..."తనంటే జాలివేసింది. తనంటే అసహ్యమేసింది. తన మంచాలన్నీ, దుప్పటినీ, అక్కడున్న ప్రతి వస్తువునూ చీదరించుకున్నాడు. అతన్నేదో దహిస్తోందా రోజు. ఇంద్రియాలన్నీ ఏకమై అతన్ని చిత్తుచేశాయి. వర్షంలో తడుస్తూ తన యింటికి వచ్చిన స్త్రీని తలచుకున్నాడు. తర్వాత సినిమాహాల్లో కలిసిన మంజులత అతని దృష్టిపథంలో ప్రవేశించింది. పిచ్చెక్కిస్తోంది. ఆమెను రకరకాలుగా వూహించుకుంటున్నాడు. మంచం మీద పడుకోబెట్టి గట్టిగా కౌగలించుకుంటున్నాను.......నరాలు తోడేస్తున్నాయి. గిచ్చుకున్నాడు. జుట్టు పీక్కున్నాడు. కాళ్ల మంచానికేసి బాదుకున్నాడు

పిచ్చివాడిలా అటూ ఇటూ దొర్లాడు. బలవంతంగా నిద్రపోదామని ప్రయత్నించాడు. ఆనాడు సంపూర్ణ వ్యక్తిత్వంతో సెక్స్‌బాధ ననుభవిస్తున్నాడు".[11] వేశ్యాలోలుడు కావాలని ఉబలాటపడ్డ మృత్యుంజయరావు చివరకు మంజులతతో అతని కోరిక తీరుతుంది. అతని జీవితంలో మొదటి మధుర క్షణాల మకరందంలో అశనిపాతంలా మంజులత నోటివెంట శేఖరం అనే మాట అపశ్రుతిలా వెలువడుతుంది. మృత్యుంజయరావు ఆ సమయంలో శవంగా మారాడు. అతని కోపం, ఉక్రోషం, ఏడుపూవస్తుంది. శేఖరంను తిట్టుకుంటాడు. అతనికి నిరాశే మిగులుతుంది. మంజులత నగ్నశరీరాన్ని చూసిన తరువాత మృత్యుంజయరావుకి అసహ్యమేస్తుంది. తనమీద యీ ప్రపంచం మీద అసహ్యం వేస్తుంది. 'భగవంతుడా! ఇంకెప్పుడూ వ్యభిచారం చెయ్యను నన్ను క్షమించు' అని కళ్ళనీళ్లు పెట్టుకుని వెళ్ళిపోతాడు. రచయిత వేదనను గుర్తుచేస్తున్నాడు. జీవన భృతికోసం మంజులత వేశ్యగా మారిందని చెప్పుకోవచ్చు.

'నివేదిత'లో శేషశాయికి విశ్వసపాత్రుడు గంగరాజు. అందువల్ల వేదితను తన దగ్గరకు తీసుకురమ్మంటాడు. వేదిత పేరువిన్న గంగరాజు వెర్రి కేకవేస్తాడు. తృటికాలంలో అతని ముఖం రక్తంలేకుండా పోతుంది. శరీరంలోని ప్రాణుకును పోగొట్టడానికి శాయశక్తులా ప్రయత్నిస్తాడు. 'అమ్మా' అని ఆరాధనా భావంతో చూసిన రోజులు గుర్తుకు తెచ్చుకుంటాడు. అతని మూగ ఆవేదనలో దేవతగా, అనురాగ మూర్తిగా వేదితను చూడ గలుగుతాడు. గంగరాజు మనసులో శేషశాయిలో మార్పును తీసుకురావాలని మనసులో 'అమ్మా జోలికి నువ్వుపోకు' అని హెచ్చరించాలను కుంటాడు. గంగరాజు కిరాతకుడుగా మారినా అయిష్టంగానే వేదితను యెత్తుకువచ్చి శేషశాయికి అప్పగిస్తాడు. వేదిత శీలాన్ని దోచుకోవాలన్న పట్టుదలతో వేదిత దగ్గరకు చేరినప్పుడు జీవిత సత్యాన్ని చెప్తుంది. కామంతో కళ్లు మూసుకుపోయిన శేషశాయి మొండిపట్టుదలతో వేదితను తాకగా ఆ సమయంలో వేదిత పెట్టిన వెర్రికేకకు అతను తృళ్ళిపడతాడు. శేషశాయి చేతికి ఆమె స్పర్శ విచిత్రంగా వుంటుంది. ఆ స్పర్శకు నిర్వచనం చెప్పుకోలేక పోతాడు. భయం కలుగుతుంది. గుండెలో యెదోనొప్పి కనిపించినట్టు భరించలేక కిందపడిపోతాడు. ఈ లోపుగా పాము కాటుచే ప్రాయశ్చిత్తంతో శేషశాయిని చేరుకుంటాడు. తన పాపానికి ప్రాయశ్చిత్తం లేదని గంగరాజు ప్రాణాలు విడుస్తాడు.

కొంతమంది మనుషులు యిష్టం లేదనుకుంటూనే విధికి తలొగ్గినట్లు కొన్ని పనులు చేస్తుంటారు. అతిచిన్న విషయం దగ్గర నుంచి ఎంతో పెద్దదైన జీవిత సమస్యకూ వారిని సందిగ్ధం విడచిపెట్టదు, వెంటాడుతూనే వుంటుంది.

ప్రేమించి పెళ్ళి చేసుకున్న వాళ్ళ చరిత్ర ఒకేవిధంగా వుండదు. ప్రేమించుకోకుండా పెళ్ళి చేసుకున్న వారిలో యెన్ని రకాల మనస్తత్వాలున్నాయో, ప్రేమించుకుని పెళ్ళి చేసుకున్న వారిలో కూడా అదే విధంగా వుంటుంది. తేడా అంతా బయటపడటం, గుంభనంగా వుంచడంలోనే వుంది.

కొమ్మూరి వారి 'ఒకే పాటకు రెండు రాగాలు' నవలలో శివరాం కథానాయకుడు. బి.ఏ. చదువుతుంటాడు. మొదటి నుంచి విసుగు మనిషి. ప్రతిపనీ విసుగనిపిస్తుంది. 'వ్యక్తిత్వం లేని మనిషి' నవల్లో మృత్యుంజయరావు పాత్రవలె యీ నవల్లో శివరాం మంచి స్నేహితుల్ని సంపాదించుకోలేకపోతాడు. ఉద్యోగం ఇప్పించమని ఒకర్ని అడగాలన్నా కూడా విసుగనిపించేది. కాని ఆశావాది మాత్రం కాదు. అవకాశవాది అంతకుముందే కాదు. ఉద్యోగ విషయంగా తన తండ్రిద్వారా పరిచయమయిన రమాపతిరావు కూతురైన కమలను ప్రేమిస్తాడు.

శివరాం 'సెక్సువల్ పర్వర్షన్' సినిమా అని తెలియకుండా వెళతాడు. ఆ సినిమాకు కమల, ఆమె స్నేహితురాలు కళ్యాణి రావడంవల్ల తృళ్ళిపడి వింతగా చూస్తాడు. అతనిలో ఆలోచనలు చెలరేగుతాయి. కాని అంతలోనే మాయమౌతాయి. శివరాం కు ఉద్యోగం చేయాలన్న ఆలోచన వచ్చినప్పుడు ఆ తర్జనభర్జనలో పీల్చి పిప్పి అయినట్టు అయిపోతాడు. ఉద్యోగానికి స్వస్తిచెప్పి విశాఖలో ఎం.ఏ. చదువుతూ కమలకు అప్పుడప్పుడు ఉత్తరాలు రాస్తాడు. ఉత్తరాల ద్వారానే ఒకరి భావాలను మరొకరు యెన్నో రూపాల్లో చిత్రించుకుంటారు. ప్రేమ విషయంలో ప్రతివారికి వెర్రిగా కనబడేది అయినప్పటికీ మహత్తర సత్యం యిది ఒక్కటే. జీవితంలో ఒకసారి అనుభవించకపోతే ఇందులోని తీవ్రత మనిషికి అర్థంకాదు. శివరాం 'సెన్స్ ఆఫ్ హ్యూమర్'ను యెక్కువ చేసుకోవాలని ఉబలాటపడేవాడు. సంచల స్వభావిగా మనకు కనిపిస్తాడు.

ఇందులోనే శివరాం, రమాపతిరావు దగ్గరకెళ్ళి నాకమలను నాకు దక్కేటట్లు చూడమని కోరుతాడు. కమలను కలుసుకొని యింటికి రమ్మని పిలుస్తాడు. అల్లుడి బాగుకోసం రమాపతిరావు తన కూతుర్ని దండించి పంపించివుంటే యెంతో

బాగుండేది. కమల తన భర్తతో విడాకులు పుచ్చుకుంటానంటుంది. శివరాం క్రోధంతో ఆ కళ్యాణి, నువ్వు ఒకరంటే ఒకరు పడిచస్తారని కమలాకరంతో నీకు పెళ్ళికాకముంది అక్రమసంబంధం వున్నట్లు చెప్తాడు.

కోపం పట్టలేని కమల తన భర్తపై చేయి చేసుకోవడానికి చేయి పైకెత్తుతుంది. ఆ సమయంలో ఉమాపతిరావు అడ్డుపడతాడు. కమల తమ్ముడు మోహన్ శివరాంను అవమానపరుస్తాడు. అందుకు రెచ్చిపోయిన శివరాం మరొక్కసారి 'మీరంతా రౌడీలు, మీది రౌడీల కుటుంబం. లేచిపోయేవాళ్ల కుటుంబం' అని నోటికి వచ్చినట్టు దుయ్యబడతాడు. మోహన్ శివరాంను చేయి చేసుకుని బయటకు గెంటేస్తాడు. శివరాం పరువు వీధిపాలౌతుంది. అక్కడ జరుగుతున్న వినోదాన్ని తిలకిస్తూ యెవరికి వారుగా వ్యాఖ్యానాలు చేసుకుంటారు.

శివరాం అత్తగారింటివద్ద పొందిన అవమానంవల్ల అతనిలో మానసికక్షోభ పరవళ్ళు త్రొక్కుతుంది. తనను చేసిన అవమానానికి చాలా వ్యధ చెందుతాడు. వ్యసనపరుడై త్రాగుడికి బానిస అవుతాడు. తన గదిలో ఒక్కడే వుంటూ భార్యను యిలా కలవరిస్తాడు. "కమలా! నీకు నా జీవితాన్నే అర్పించాను. ప్రతిఫలంగా ఏమిచ్చావో తెలుసా? దారుణమైన క్షోభ. కనీ వినీ ఎరుగని అవమానం. నిన్ను ఏ భర్తా ఏ భార్యను ప్రేమించనంత గాఢంగా ప్రేమించాను. ఒక్కసారి తనివితీరా పొందాలని అహోరాత్రులు పరితపించాను, అలమటించాను. నువ్వు మహాక్రూరు రాలివి. ఆ అనుభవం నాకు ఇవ్వలేకపోయావు. నేనిప్పుడు అంతకన్నా క్రూరుణ్ణి. ఇప్పుడు నా భవిష్యత్తు గురించి భయంలేదు. నువ్వు అణువు అణువునా బాధ పడేటట్లు చేస్తాను. నీ రక్తమంతా విషపూరితం చేస్తాను. నీ శరీరం దారుణమైన శిక్షకు గురయ్యేటట్లు చేస్తాను".[12] శివరాంకి త్రాగుడికి అలవాటుపడ్డ తరువాతనే ఎక్కడలేని ధైర్యం వస్తుంది. పైగా తన భార్యపై కక్ష తీర్చుకోవడంకోసం 'గురువులు' అనే రౌడీవెధవతో తన భార్య శీలాన్ని అపహరించమని పంపిస్తాడు.

'నివేదిత'లో శేషశాయి భార్య సీత వేదిత దగ్గరకు తన ఆరాధనా భావాన్ని తెలియజేస్తుంది. వేదిత అంతరంగలోని ఆవేదనను ఆత్మ పరిశోధనను సీతతో "నాకు నేనే శత్రువు. నేను యీ భూమ్మీద సమస్త జీవరాసుల్ని ప్రేమిస్తాను. కాని నన్ను ప్రేమించుకోలేక పోతున్నాను. నేను మానవ మాత్రురాలినే అని నా శరీరం, నా రక్తం గుర్తుచేస్తూంది........నా దుర్గుణాలన్నీ సమ్మేళనమై, ఒక

సంపూర్ణమై నూతన వేదితగా పెరిగినప్పుడు ఆమె నా శత్రువుగా పరిగణిస్తున్నాను"[13] అని అంటుంది. వేదిత తనకుతానే శత్రువు అన్నట్లు మాట్లాడటంలో తన అందానికి యెంత మానసిక వ్యధ అనుభవిస్తుందో తెలుస్తుంది. వేదిత మనసులో గూడుకట్టుకున్న కళ్యాణమూర్తి తిరిగి ఆ ఊరు చేరుతాడు. వేదిత సంతస పడుతుంది. కళ్యాణపై వున్న మనసు లోనుకావడంవల్ల ఆమె అంతరాత్మ "చూడు నువ్వెవరివో మరచిపోయావా? నీలో మార్పువచ్చింది. ఆ మార్పు యిప్పుడే కాదు. ఏనాడయినా శేషశాయి నిన్ను ఆక్రమించడానికి తలపెట్టి నిన్ను నానా అనుభవాలకు గురిచేశాడో అప్పట్నుంచి నీలో మార్పు ప్రారంభమైంది. రాను రాను నీవు బలహీనురాలువి అయిపోతున్నావు గాని ముందుకు పురోగించడం లేదు.... . నీ గాంభీర్యం యేమైంది? నీ మానసిక బలం యేమయింది? కాల్పనిక జగత్తులోని ఆకర్షణలకు అంతతొందరగా లోనవుతున్నావే? ఇవాళ కల్యాణమూర్తి వచ్చాడు. అతనికి అనేకచోట్ల దొరికిపోయావు. ఇదేనా నీ సాధన యిదేనా నీ జీవిత పరమావధి"[14] అని బోధించడంలో వేదిత ఆత్మక్షోభ, మానసిక సంఘర్షణ, భావిజీవితాన్ని గుర్తుచేయడం జరుగుతుంది. మనసు చలించడంలో వేదిత అంతరాత్మ అలా బోధిస్తుంది. వేదితను కళ్యాణమూర్తి ప్రేమించిన సంగతి గుర్తుచేస్తూ తనతో వచ్చేయమంటాడు. ఈ పద్మవ్యూహం నుండి బయటపడమన్నందుకు వేదిత తన పాలరాతి వంటి రూపాన్ని చూసుకుని ఆత్మ విమర్శచేసుకుంటుంది.

వేదిత, కళ్యాణమూర్తుల మధ్య Ego, Super Ego ల మధ్య దారుణమైన సంఘర్షణ ప్రారంభమౌతుంది. దారుణమైన Ego anxiety కి గురయిన వేదిత 'మానసిక వ్యధను భరించలేక ఆత్మహత్యాప్రయత్నం కూడా చేయాలనుకుంటుంది. వేదితలో చెలరేగుతున్న మానసిక సంఘర్షణలను చిత్రించడానికి వేణుగోపాలరావు ఎన్నో దర్శనేంద్రియ సంబంధమైన భ్రమను, శ్రవణేంద్రియ సంబంధమైన స్వరముల భ్రమను నవల్లో చోటు కల్పిస్తారు. వేదిత అంతరంగంలో "నిజమే నేను అందంగా వున్నాను. భర్తృగాలికుండవలసిన రూపం నాకులేదు. అందుకే ఇంత దారుణమైన ప్రలోభానికి యితరులను గురిచేస్తున్నాను. ఈ నేరం మున్మాటికీ నాదే. నేను అందవికారంగా వుంటే నాకిన్ని యిడుములు వుండేవి కావు. ఈ రూపం ఏ సుమంగళికో లభించినా బాగుండేది"[15] అని ఏడుస్తుంది. తనను చూసి తను ఆత్మవిమర్శ చేసుకోవడంవల్ల తోటలోని మొక్కలు, పూవులు పరిహరిస్తున్నట్లు అనుభూతి పొందుతుంది. అనుక్షణం ఖిన్నురాలవుతూ మానసిక సంఘర్షణకు

గురి అవుతుంది. కళ్యాణ్ ఉత్తరం చూసేలోపుగా యెన్నడూ లేని భయోద్వేగం ఆమెను ఆవహిస్తుంది. కొత్త కొత్త ఆలోచనలతో ఏదోబలం వున్నట్టు ఉండేది. వేదితతో వేణుగోపాలుడు 'తనను విడిచి యెక్కడికి వెళుతున్నావు' అన్నట్టుగా భ్రాంతి కలుగుతుంది. గుడిలో కృష్ణుని విగ్రహం పగిలిపోవడంలో 'నాకు దేవుడు లేడు పాత వేదిత చనిపోయింది. నేను మరో వేదితను' అనుకుంటుంది. వేదిత మనసు చంపుకోలేక కళ్యాణి విదేశాలకు వెళ్తుంటే కలుసుకోవడం కోసం బొంబాయి చేరుకుంటుంది. అప్పటికే కళ్యాణ్ దేశంవిడిచి వెళ్ళిపోవడం వల్ల వేదితలో Ego failure అవుతుంది.

## 6. భక్తి – ఆధ్యాత్మికత :

'వ్యక్తిత్వం లేని మనిషి'లో ప్రత్యేకంగా చెప్పుకోదగ్గ పాత్ర జగతి. జగతిని ప్రేమించినవాడు దూరంగా తీసుకెళ్ళి తన అవసరం తీరిపోయాక తిరస్కరిస్తాడు. శీలాన్ని పోగొట్టుకున్న జగతి తన తమ్ముణ్ణి ఆశ్రయిస్తుంది. జగతి, చిలకమ్మ ప్రోత్సాహంతో విద్యాధరస్వాముల ఉపన్యాసాల్ని వింటుంది. మొదట విద్యాధర స్వామిపై చెడు అభిప్రాయం వున్నప్పటికీ జగతిలో మానసిక మార్పు వస్తుంది. జగతి రోజూ సూర్యోదయానికి ముందుగానే స్నానం చేసి, ధవళవస్త్రం ధరించి మధుర గంభీరమైన కంఠంతో మంత్రాలు చదువుతుంది. సూర్యనమస్కారాలు చేస్తుంది. జగతి దివిపై వెలసిన దివ్యాంగనలా వుంటుంది.

విద్యాధరస్వామి అందాన్ని, ఆయన ముఖంలో వెల్లివిరుస్తున్న వర్చస్సు పచ్చని పసిమి, విశాల నేత్రాల్ని చూసిన జగతి మనసు చలిస్తుంది. తనలో లీన మవ్వాలనుకుంటుంది. అతని సౌందర్యాన్ని ఆకర్షించిన జగతి అతనిని కోరుకోవాలనే తపన కలుగుతుంది. జగతి డైరీలో ఇలా రాసుకుంటుంది. "ఈయన్ని చూస్తుంటే నాకు చాలా విచిత్రభావాలు కలుగుతున్నాయి. ఎందుకీ బ్రహ్మచారి జీవితాన్ని యిలా వృధా చేసుకుంటున్నాడు? అపిస్తుంది. మళ్ళీ వృధా చేసుకోవటం మంటే యేమిటన్న ప్రశ్న. నీలా విచ్చలవిడిగా తిరిగి బరితెగించలేదనా? నాలో అనుభవాలనే గుండు సూదులను శరీరం అంతా గుచ్చుకోలేదనా? అయినా అంతరాత్మ ఒప్పుకోవటం లేదు. ఆత్మవిమర్శ చేసుకో బుద్ధికావటం లేదు. వీటన్నిటినీ మించి నా దుర్బుద్ధులు. మనసులోని నిశ్చింతనూ, నిజాయితీని నాలా శంకించే

ప్రాణి వుండదు. మనిషిలోని దౌర్బల్యమే సృష్టిలోకెల్ల శక్తివంతమైనదని ఓ నమ్మిక. ...ప్రకృతి శక్తులను వాటి విజృంభణను మానసిక క్షేత్రంనుండి పూర్తిగా తుడిచివేయ గలిగిన వజ్రహృదయుడా? కఠోర నిష్టాపరుడా? అందుకే ఆయనంటే అసూయగావుంది. ఆయన్ని సాధించుదామని వుంది. ఆయన్ని జయిద్దామని వుంది"[16] అని రాసుకుంటుంది. జగతి విద్యాధర స్వామినిచూసి అసూయపడి సాధించుకోవాలనే కుచ్ఛితబుద్ధి యీమెలో కనిపిస్తుంది. ఇంద్రియాల్ని జయించిన కఠోర దీక్షాతత్పరుడు, విజ్ఞాన దురంధరుడు తనచేత పరాజితుడు కావాలని కలలు కంటుంది. ఆమె కలలు కలలుగానే మిగిలిపోతుంది. విద్యాధర స్వామి పరాజయాన్ని కోరిన జగతి పాపం అంటే ఏమిటని ప్రశ్నిస్తుంది. అందుకు విద్యాధరస్వామి ..."మంచికి ఒక రూపం లేనట్టే, పాపానికి ఒక రూపం లేదు. పాపం మానవ మనుగడలో అంతర్లీనమై వున్న అస్తిపంజరం. మనస్సుకు వెయ్యి పొరలు వున్నాయనుకుంటే, అన్నికన్నా అట్టడుగునవున్న వెయ్యోపొర పాపం. మిగతా పొరలు చిరిగినట్టుగా అది చిరగదు. పాపంలో పుణ్యం ఒక అంతర్భాగం కాదు కానీ, పుణ్యంలో పాపం ఒక అంతర్భాగం. పుణ్యం అనుకుని ప్రయత్నించి చేస్తాం. చేస్తున్నప్పుడు బాధకలిగించేది, దాని స్మృతికూడా పీల్చి పిప్పిచేసేది పాపం. సాంఘిక ధర్మాలకు వ్యతిరేకంగా, తాత్కాలికంగా తృప్తికోసం ఇంద్రియ నిగ్రహం లేకుండా ప్రవర్తించడం పాపంలో ఒక భాగం"[17] అని అంటాడు. ఇక్కడ రచయిత వేణుగోపాలరావు ఆధ్యాత్మిక విషయాల్లో కూడా అందెవేసిన చేయిగా మనకు తెలుస్తుంది.

జగతి విద్యాధరస్వామి మాటలకు తనలో పశ్చాత్తాపం చెందుతుంది. స్వామితో చేసిన పాపం చెరిగిపోతుందా అని ప్రశ్నించగా అందుకు విద్యాధర స్వామి...."మన హిందూ మత సూత్రంలోని మూలం యిదే. చేసిన పాపం యెప్పుడూ చెరగదు. కానీ పాపంచేసిన వ్యక్తికూడా నిండు హృదయంతో పశ్చాత్తాప హృదయుడైతే భగవంతుడు అతన్ని ఆదరించి ఓదార్చుతాడు. అతనికి శాంతి కలిగిస్తాడు. కాని చేసిన పాపానికి శిక్ష యేదోరూపంలో అనుభవించడం జరుగుతుంది. విదేశ మతాలలో దేవుడు పాపాన్ని కడిగివేస్తాడని ప్రజలు నమ్ముతారు. నా దృష్టిలో అది అసంభవం"[18] అని అంటాడు. చేసిన పాపం చెరిగిపోదని రచిత అభిప్రాయంగా తెలుస్తుంది. పశ్చాత్తాపానికి మించిన ప్రాయశ్చిత్తం

లేదంటాడు, కాని పాపం విషయంలో మాత్రం అది మినహాయింపుగా రచయిత మాటల్లో మనకు ద్యోతకమౌతుంది. హిందూమతంలోని మూలసూత్రాన్ని కూడా తెలియజేస్తున్నారు. ప్రశాంత చిత్తంతో మాట్లాడిన మనిషి యితడేనా అని ఆశ్చర్యపడుతుంది. జగతి తనకు తానుగా పశ్చాత్తాపం చెందుతుంది. అప్పటి నుండి విద్యాధరస్వామిని ఆరాధిస్తుంది. అందులో కల్మషం లేదు. ఆమెలో స్వచ్ఛమైన తెలుపు మాత్రమేవుంది.

ఆశ్రమంలోవున్న మార్కండేయ శాస్త్రి జగతి శీలాన్ని అపహరించాలను కుంటాడు. జగతి వాణ్ణి చావబాదుతుంది. విద్యాధరస్వామి జగతిని కాపాడతాడు. ఇరువురిపై కక్ష తీర్చుకోవాలని మార్కండేయ శాస్త్రి కక్షపూనతాడు.

మార్కండేయ శాస్త్రి కుటిల బుద్ధిని పటాపంచలు చేయాలని విద్యాధర స్వామి జగతితో తన ఆత్మస్థైర్యాన్ని మనోనిబ్బరాన్ని తెలుపుతాడు. "నువ్వు నా జీవితంలో దెయ్యంలా ప్రవేశించావు. నీ స్పర్శ తగిల్తేనే నాలో అగ్ని చెలరేగేది. కాని యిప్పుడు యిదిలేదు. నన్ను నేను సాధించాను. జయించాను. నా రక్తాన్ని నేనే కాచి వడబోసుకున్నాను. రాజగతీ! ఈ సత్యం రుజువు కానీ! నన్ను నిరూపించనీ! అల్పత్వాన్నుండి ఔన్నత్యానికి వెళ్ళావని తెలుసుకోవడానికి మరో మార్గం లేదు. నువ్వు పునీతురాలివి. నేను పునీతుణ్ని. భయమెందుకు"[9] అని జగతిని తాకుతాడు, ఇరువురిలోనూ ఒక రక్తపు బిందువు పోటూ కూడా పెరుగదు. ఆ ఇరువురిలో నరాల స్పందన కలుగదు. కండరాల కలయిక లేదు. ఏ అసహ్యమూ లేదు. ఏ సహజ ప్రకృతి మహిమ కనిపించదు. విపరీతంలోని అల్పపు పొర కూడా వారిరువురిలో వుండదు. ప్రపంచానికీ, ఐహిక వాంఛలకు దూరంగా వున్నట్టు తెలుస్తుంది, ఏకాగ్రత, మనోనిగ్రత చోటుచేసుకున్నాయి.

విద్యాధరస్వామి జగతి పాదాల చెంత మోకరిల్లి, 'నీవు నా తల్లివి. సహోదరివి. నా జ్ఞాన నేత్రానివి. నా హృదయ జ్వాలకు వుపశమనం కలిగించిన దేవతవు. ఆదిశక్తివి. కరుణాకిరణానివి' అని అంటూ యేడుస్తాడు. జగతి విద్యాధర స్వాములవారు ఒకే గదిలోవున్నది చూసి ఊరి ప్రజల్ని కొందర్ని తీసుకువచ్చి వాళ్ళను గాయపరుస్తాడు. విద్యాధరస్వామి శృంగేరి చేరుకుంటారు. జగతి మరికొంత కాలానికి విద్యాధరస్వామిని చేరుకుని శృంగేరి జగద్గురు

స్వామిని దర్శించడంతో జగతి పాపాలన్నీ తొలగిపోతాయి. జగతి భగవత్ చింతనతోనే కాలం గడుపుతుంది. జీవిత గమనంలో మానసిక ప్రవృత్తుల్లో జగతికి మృత్యుంజయరావుకు పోలికలేదు. జగతికి అనేకులతో సంబంధంవుంది. నలుగురితో సులువుగా కలిసిపోయే మనస్తత్వం. మనస్తత్వ పరిభాషలో చెప్పాలంటే ఆమె Extrovert. అటువంటి జగతి విద్యాధరస్వాముల సాంగత్య కారణంగా ఐహిక చింతననుండి బయటపడుతుంది. Introvert గా మారిపోతుంది. మనస్తత్వశాస్త్రవేత్త యూంగ్ చెప్పినట్లు జీవితంలో ఒక దశతర్వాత ఎలా మారుతారో జగతి జీవితాన్ని ఓ ఉదాహరణంగా చెప్పుకోవచ్చు.

మృత్యుంజయరావులోని ఆత్మన్యూనతా భావాన్ని తొలగించగల శక్తి, అవకాశం జగతికి వున్నట్టు మరెవ్వరికీ వుండదు. ఆ అవకాశాన్ని సద్వినియోగం చేయడానికి జగతి ప్రయత్నించలేదు. తన తమ్ముణ్ణి గురించి ఆలోచించే ఓపిక, ఆప్యాయత జగతిలో లేవు. మృత్యుంజయరావు మాత్రం తన అక్క జగతికి, భార్య మాలతికి అవసరాలను తీర్చే వ్యక్తిగా మాత్రమే మిగిలిపోతాడు. దీనివల్లనే మృత్యుంజయరావు 'చవటను, మొద్దును, అసమర్థపు ముండాకొడుకును' అని తనని తాను తిట్టుకుంటాడు. ఈ నవలపై కోడూరి శ్రీరామమూర్తిగారు "నవల మొదటి నుండి చివరి వరకు మృత్యుంజయరావు ఏడుపు ఒకేలాగా వుంటుంది. అందుచేతనే రావిశాస్త్రి అల్పజీవిలోని సుబ్బయ్యకున్న అదృష్టం 'వ్యక్తిత్వం లేని మనిషి'లో మృత్యుంజయరావుకి లేదని చెప్పవచ్చు"[20] అని అంటారు.

1971 వ సంవత్సరంలో ఈ నవల రెండవ ముద్రణ పొందినప్పుడు ప్రకాశకులు పరిచయ వాక్యాలు రాస్తూ "ఈ నవల చదువుతున్నప్పుడు ఏదో ఒకటి రెండు నవలలు ధోరణికి దగ్గరగా కనిపించినవని ఒకరిద్దరు అన్నారు. కాని పైన చెప్పినట్టు ఒకవేళ వున్నా, తన యితివృత్తాన్ని వెలువరించడానికి రచయిత ఎన్నుకునే ధోరణి సామ్యమేకానీ, పాత్రలు, సన్నివేశాలూ, పాత్రీకరణల్లో సామ్యం వుండటానికి వీలుండదు. ఒక గమ్యాన్ని చేరడానికి ఇద్దరూ ఒకే మార్గాన బయలు దేరుతున్నారు. కాని చేరేది యిద్దరూ వేర్వేరు వ్యక్తులు వారి నడకలు, నడతలు వేర్వేరు"[21] అంటున్నారు. పైమాటలు అక్షరాల నిజం అంటున్నారు శ్రీ కోడూరి శ్రీరామమూర్తిగారు తన 'తెలుగు నవలా సాహిత్యంలో మనోవిశ్లేషణ' అను విమర్శ గ్రంథంలో. 'వ్యక్తిత్వం లేని మనిషి' నవలకు పరిచయవాక్యాలు రాస్తూ,

ఇటువంటి నవలల వల్ల ప్రయోజనం ఏమిటి? ఎందుకు రాయాలి? అన్న ప్రశ్నించు కుంటే "జీవితాన్ని జీవన యోగ్యంగా, మనస్సును మానససరోవరంగా మార్చేవి ఈ రచనలే, అవి మనల్ని మేలుకొల్పుతాయి, మన చుట్టూ వున్న ప్రపంచాన్ని కొత్తగా మెత్తగా చూపుతాయి. అందులో ఎందరో మృత్యుంజయరావులు కని పిస్తారు. వాళ్ళలోని అమాయకమయిన మంచితనం, అసంగతమయిన భయాందోళ నలు, సంకోచం ఇవన్నీ కనిపిస్తాయి. వాళ్ళను మీరు జాలిపడతారు, ఒక్కక్షణం ఆలోచిస్తారు మీ హృదయం ఆర్ద్రమవుతుంది"[22] అంటున్నారు.

'నివేదిత' నవల్లో వేదిత కథానాయిక. వేదితను ఈ నవల్లో ఒక సైకిక్ కేస్‌గా చెప్పుకోవచ్చు. అందుక్కారణం ఆమె యొక యోగి. ఆనందపుర వేణు గోపాలస్వామికి తన జీవితాన్ని అంకితం చేసుకున్న పవిత్రమూర్తి. ఆ వేదిత చివర్లో నివేదితగా మారుతుంది.

గోవిందాచార్యుల వంశీయులు ఆనందపుర గ్రామంలోని వేణుగోపాలస్వామి దేవాలయానికి అర్చకులు. గోవిందాచార్యులు ఒక్కగానొక్క కూతురు వేదిత. వేదితను ప్రేమించిన కళ్యాణమూర్తికిచ్చి పెళ్ళి చేయకుండా దూరపు బంధువుకిచ్చి పెళ్ళి చేస్తారు. విధివైపరీత్యంవల్ల వేదిత వైధవ్యం పొంది పుట్టినిల్లు చేరు కుంటుంది. వేదిత తండ్రికి తోడుగా స్వామి కైంకర్యంలో పాల్గొంటుంది. ఓ పరిచారికగా వేణుగోపాలుడికి సేవకై అంకితమవుతుంది. ఆ ఊరి ప్రజలు వేదితను 'అమ్మ'గా భగవదంశంగా భావిస్తారు. వేదిత సర్వప్రపంచాన్ని ప్రేమిస్తుంది. మానవత్వంలో దైవత్వాన్ని దర్శించగల జ్ఞాననేత్రం ఆమెలో వుంది. దైవారాధ నలో ఏకాగ్రత సాధిస్తుంది.

వేదిత తన వైధవ్యాన్ని తలచుకొని భగవంతుని ముందు ఏడుస్తుంది ఆమె ఏడుపే ఆ ఊరి ప్రజలకు మరింత ఆత్మవిశ్వాసం, విశాలత్వం ప్రసాధిస్తుంది భగవంతుడి ముందు వేదిత 'నాలో శాంతిమంటలు లేవు. నీ పిల్లనగ్రోవితో నా జీవితరాగాన్ని ఆలాపించు' అని వేడుకుంటుంది. వేదిత చిన్ననాటి స్నేహితులు కళ్యాణమూర్తి, శేషసాయిలు. వేదిత కళ్యాణమూర్తిని మాత్రం ప్రేమిస్తుంది వేదిత తండ్రి గోవిందాచార్యులు వాళ్ళ ప్రేమను నిరాకరిస్తారు. వేదితను దూరపు బంధువుకు ఇచ్చి పెళ్ళిచేస్తాడు. వేదిత మాంగల్యాన్ని పోగొట్టుకుని అనతికాలం లోనే తండ్రిని చేరుకుంటుంది. వేణుగోపాల స్వామి సన్నిధిలో వున్న వేదితను

ఆ ఊరి ప్రజలు 'అమ్మ' అని కొలుస్తారు. శేషసాయి మాత్రం ఆ దృష్టితో చూడలేకపోతాడు. ఆమెను తన సొంతం చేసుకోవాలనుకుంటాడు. శేషసాయి వేదితతో—"నీ తండ్రి స్వార్థంకోసం ఆయన మూఢనమ్మకాల కోసం నిన్ను నీకు అర్థం కాకుండాచేసి ఒదిలిపెట్టాడు . . నిన్ను నీవు అనుక్షణం ఆత్మవంచన చేసుకుంటూ, నీకే తెలియకుండా, ఆదర్శ శిఖరం మీద అయోమయంగా కూర్చొని పూనకం వచ్చినట్టు వూగుతున్నావు. నీకో దేవుడు దొరికాడు . ఈ దగాపడిన మనస్సుతో బావుకునేది యేమిటి? నీ సహజ జీవితాన్ని వదులుకొని నువ్వు సాధించేది సున్నా. నీ యోగసాధన, నీ ఆరాటమూ రానురాను నీలో సంక్షోభాన్ని, కలవరపాటును అధికం చేస్తాయి కాని, సుఖశాంతులు ప్రసాదించలేవు"[23] అని అంటాడు. నాస్తికుడయిన శేషసాయి నిశ్చలంగా వున్న కొలనులో రాయిని విసిరినట్టు ఆమె జీవితంలోని అగాధాల్ని గుర్తుచేసినవాడవుతాడు. సభ్యత, సంస్కారం గల స్త్రీతో ప్రవర్తించవలసిన తీరు అతనిలోలేదు. పైగా కామంతో కళ్ళు మూసుకుపోయివున్న అతని తీరును వేదిత ఖండిస్తుంది. శేషసాయి జీవిత సూత్రాల్ని తిప్పికొడుతుంది. చిన్నవయస్సులో వైధవ్యం పొందిన స్త్రీకి చేయూత నివ్వడం మన సాంఘిక ధర్మం. అయినప్పటికి దేవుని కైంకర్యం కోసం తన జీవితాన్ని అర్పణ చేస్తున్న స్త్రీని అలా భావించకూడదన్న ఉద్దేశం రచయితలో కనిపిస్తుంది

## 7 దాంపత్యంలో నిరాశ నిస్పృహలు :

'ఒకే పాటకు రెండు రాగాలు'లో శివరాం, కమలలు పెళ్ళి అయిన తరువాత హనీమూన్ ఏర్పాటుచేస్తాడు రమాపతిరావు. శివరాంకు మనసులో ఈమె నా భార్య అన్న భావం రాగానే ఓ విధమైన గర్వం ఆవహిస్తుంది. 'నే నెంత గొప్ప పని చేశాను' అని అనుకుంటాడు. కమల స్పర్శ శివరాంలో చైతన్యాన్ని రగిలిస్తుంది. నరాలు మధుర శ్రుతులతో వేడి సంగీతం పాడటంవల్ల కమలను చుంబిస్తాడు. శివరాం మనసులో 'నా జీవితంలో ఇది అద్భుతమైన రోజు' అనుకుని మరొక్కసారి కమలను దగ్గరకు తీసుకుంటాడు. అందుకు కమల 'ఇదేనా పెళ్ళి .......ఇదేనా పెళ్ళి ఛీ ఛీ' అంటుంది. ఆ మాటతో శివరాం మానసిక వ్యథ చెందుతాడు. ఓ బట్టల దుకాణంలో వ్రేలాడిన ఓ అందమైన చీరను ముట్టుకున్నట్లు, పసిపాపను యెత్తుకున్నట్టు' అనుభూతి కలుగుతుంది. శివరాం తనలో యెక్కువతో

లోపం వుందనుకుంటాడు. ఆ సమయంలో తన వ్యక్తిత్వాన్ని పెంచుకోవాలని కుతూహలపడినప్పటికీ, వివశుడై పోతాడు.

సహజమైన ఆవేశానికీ, ఉన్మాదానికీ, పెల్లుబికే భయానికీ అలాంటి క్షణాలలో తెలియదు. అలాంటి పరిస్థితిలో వుంటున్నాడు శివరాం. దాంపత్యసుఖాన్ని నిరాకరించిన కమలతో శివరాం ధైర్యం తెచ్చుకుని "కమలా! నువ్వు నా ప్రాణానివి. నాలోని రక్తానివి. నా వూపిరివి. ఇంతటి ఏకాంతంలో మనిద్దరి మధ్య యేర్పడిన యీ పెద్ద చీలిక నా గుండెల్ని చీల్చివేస్తుంది. నిన్ను చూస్తుంటే భయం వేస్తుంది. ఆ భయాన్ని పోగొట్టు. ఈ దూరాన్ని తరిమెయ్యి. గంభీరంగా వుండకు. అతీతంగా కనిపించకు, మామూలు మనిషిలా, మామూలు మనిషికి లభించిన గొప్ప భార్యలా నీ భార్యాత్వంతో, నీ యవ్వనంతో నన్ను మురిపించు ............నన్ను ప్రపంచాన్ని మరచిపోనియ్యి"[24] అని ప్రాధేయపడతాడు. మనసులో నేను మూర్ఖంగా ప్రవర్తిస్తున్నానా? కొంతకాలానికి సర్దుబాటు అయిపోతుందిలే అని తనని తాను శిక్షించుకుంటాడు. అధైర్యస్థుడు కాబట్టి యితనిలో పిరికితనం ఓ మోస్తరుగా కనిపిస్తుంది. శివరాం కమల చూస్తుంటే ఓ కొత్త మనిషిని చూస్తున్నట్టుగాను, ఇష్టంలేని వారెవరో అయిష్టంగా పరిచయం చేసిన అపరిచితలా గోచరిస్తుంది.

శివరాం ప్రయత్నానికి కమల దూరంగా జరిగిపోతూ 'నన్ను చంపకండి బాబు. పెళ్ళి అయ్యాక నిజ స్వరూపం తెలుసుకున్నాను. నేను పనికి రాను' అని-అంటుంది. పైగా "మీరు ఆశిస్తున్న లాంటి దాంపత్య జీవితానికి నేను పనికిరాను. ఈ విషయం గురించి అనుభవంలోకి వచ్చేవరకు నాకు తెలిసిరాలేదు. అలాంటిది తలచుకుంటేనే అసహ్యమేస్తుంది. భయం వేస్తుంది. నేను మరచిపోదామనుకుంటున్నది మీరు గుర్తు చేసినప్పుడల్లా నేను భరించలేక ఉక్కిరిబిక్కిరి అయిపోతున్నాను. నాలో ప్రతి అణువు యీ సత్యాన్ని మళ్ళీ మళ్ళీ చెబుతుంది. ఇంతకన్నా నేను విడమర్చి చెప్పలేను"[25] అని అంటుంది కమల. కమల కళ్యాణి ద్వారా పొందుతున్న సంతృప్తి భర్త అయిన శివరాంతో ఆ సుఖాన్ని పొందలేకపోతుంది. కమల, కళ్యాణి లెస్బియానిజంవల్ల శివరాం తన దాంపత్య జీవితంలో మోసపోతాడు. శివరాం అదృష్టవశాత్తు యే సమస్యనైనా మౌనంగా స్వీకరించి తనలో తాను కుమిలిపోవటం అతనికి చేతనవుతుంది. ఆ మనోహర రాత్రుల-

మానసిక సంఘర్షణకు గురై బాధను అనుభవిస్తాడు. కమల మాత్రం మానసిక సంఘర్షణను ప్రతిక్షణం ఎదుర్కొంటుంది. తనెప్పుడూ కళ్యాణి గురించి ఆలోచిస్తుందే కాని తన భర్తను గురించి ఆలోచించదు. హనీమూన్ నుంచి తిరిగి వచ్చిన ఆ నూతన దంపతులు తల్లిదండ్రుల దగ్గర నాటకంలో పాత్రల్లా నటిస్తారు. శివరాం అడుగడుక్కీ యిటువంటి యిడుములు పడవలసిందేనా అనుకుంటూ తన వ్యధను యెవ్వరికీ చెప్పుకోలేకపోతాడు. కమలను కళ్యాణి ముద్దుపెట్టుకుంటుంటే శివరాం వాళ్ళను అసూయగా చూస్తాడు. శివరాం, కమల వేరుకాపురం పెట్టుకోగా కళ్యాణి కూడా వాళ్లతో పాటే వుంటుంది.

శివరాం కమలతో రాజీపడటం యెలాగా అని ఆలోచిస్తాడు. దాంపత్యంలో నిరాశచెంది వ్యసనపరుడై నిద్రమాత్రలు కూడా మింగుతాడు. ఆమె జీవితాన్ని తెలుసుకోవాలన్న కోరిక, వుబలాటం వున్నప్పటికీ అడగలేకపోతాడు. రోజులు గడుస్తున్నకొద్దీ అస్వాభావికమే స్వాభావికమై భరించటం దుస్సాధ్యమై పోతుంది. అసహ్యమైన ఒంటరితనాన్ని అనుభవిస్తాడు. అసంతృప్తి పడగలు విప్పుతాయి. రాజీపడటం యెలాగా అని సందిగ్ధావస్థలో పడిపోతాడు. ఒకసారి శివరాం తను అయిష్టంగా అడిగినప్పుడు కమల 'మీకు నేను స్నేహితురాలిగా పనికివస్తాను గాని పరిపూర్ణమైన భార్యగా పనికిరానం'టుంది. శివరాం తన తల్లిదండ్రుల్ని మంచి తనాన్ని పోగొట్టుకున్నాను, చివరకు నువ్వు నాకు ప్రసాదించిన వరం యిదేనా అంటాడు. శివరాంలో అసంతృప్తిని, మానసికంగా బాధపడుతున్న తన భర్తను చూసిన కమల "సానుభూతి చూపించడం కన్నా సహాయపడే స్థితిలో లేను. ...... మీ సుఖంకోసం యే ఆడదానితో తిరిగినా నాకు కోపం లేదు. మీకు అడ్డు రాను. చట్టబద్ధంగా మనం దూరమైపోవడానికైనా సరే. కాని నా జోలికి మాత్రం రావద్దు"[25] అని అంటుంది. కమల తన భర్తకు దాంపత్యంలో సుఖాన్ని యివ్వలేక పోవడానికి కారణం కళ్యాణి అడ్డు వుండటమేనని తెలుస్తుంది. శివరాం కోపంలో కమలను చేయిచేసుకోవడంవల్ల ఆమె పుట్టింటికి వెళ్ళిపోతుంది. కమల వెళ్ళిపోయిన తరువాత ఇలాంటి ఏకాంతమే కావాలనుకుంటాడు. శివరాం బలవంతంపై తన భార్యను తీసుకువస్తాడు. మనిషికి తీరని కసి వున్నట్టయితే యెంత అసహ్యంగానైనా తయారుచేస్తుంది. కమలను ఏ విధంగానైనా రెచ్చగొట్టాలనుకుంటాడు. ఆ రోజు రాత్రి శివరాం ఇంటికి ఆలస్యంగా రాగా, కమల,

కళ్యాణి మంచంపై కౌగలించుకుని భార్యాభర్తల్లాగా పడుకుని వుంటే అతనికి పరిస్థితి అర్థమవుతుంది. అది మనసులో పెట్టుకొని కమల వినేటట్టు కళ్యాణితో 'ఎడ్యుకేషన్ ఆడదానికి పెట్టిన భిక్ష యిది. కమల చదువుకోకపోయివుంటే యీ Ego ఆమెకు వుండేది కాదు. ఆమె చదువే ఆమెను పాడుచేసింది' అంటాడు. చదువువల్ల స్త్రీలు చెడిపోతున్నారు అని శివరాం అనడం చాలా తప్పు. చదువువల్ల చెడిపోరు కాని, మానసిక బంధాలవల్లనే అటువంటి పరిస్థితులు ఏర్పడతాయని గ్రహించవచ్చు.

శివరాం, కమలల దాంపత్యంలో ఇద్దరి మధ్యా అగాధం మరింత పెరుగుతుంది. శివరాం మాటలతో పెంచుతుంటాడు. కమల మనసులో పెంచుతుంటుంది శివరాం ఆమెను తిడుతూనే చూడాలనుకునేవాడు. కమల మాటలతో హింసిస్తూనే మనసులో మమకారం పెంచుకుంటుంది. కమలతో కడు దీనంగా "ఒక్కసారి నా కోరిక తీర్చు, ఆ తర్వాత అసహ్యించుకో' అని మనసులో వున్న భావాన్ని తెలియజేస్తాడు. శివరాం మరింత దగ్గరవుతాడు. కమల భయపడి 'ఆగు ఒక్క అంగుళం ముందుకు వేశావంటే దీన్ని తెంపేస్తాను' అని అంటుంది. శివరాం కోపంతో 'ఆగవే రాక్షసీ! ఇందులో కూడా ఆడదాని వనిపించుకున్నావు' అని అరుస్తాడు కమల అనుభూతి మరోవిధంగా వున్నప్పుడు, ఆమె భర్త అయిన శివరాం మానసిక సంఘర్షణను అర్థం చేసుకోలేక పోతుంది. వీళ్ళ దాంపత్యం యెలా పయనిస్తుందో మనం తెలుసుకోవచ్చు.

కమల, శివరాం ల దాంపత్య యెంతోమంది నోళ్లలో నిర్దయగా నలుగుతుంది. ప్రతివాళ్లూ యీ విషయాన్ని రహస్యంగా మాట్లాడుకుంటారు. మన సంఘ పరిస్థితి యీ విషయంలో తెలిసిందే. తన కొడుకు కాపురం గురించి శివరాం తల్లి దండ్రులు బాధపడతారు. తనకొడుకు నలుగురి ముందు అవమానం భరిస్తుంటే చూడలేక కన్నీళ్ళు పెట్టుకుంటారు.

శివరాం మళ్ళీ వెళ్ళి కమలను ఇంటికి రమ్మని బ్రతిమాలుతాడు. అంద కమల "రక్తమాంసాలు లేని ఒట్టి యంత్రాన్ని నేను. నన్ను తీసుకువెళ్ళి యేదో బావుకుందామని యెందుకారాటపడతావు. బోలెడు జీవితం అనుభవించాల్సినవాడివి ఇంకెవర్నయినా పెళ్లి చేసుకో. సుఖపడు. నీ శ్రేయోభిలాషిగా నేనిచ్చే సలహా యిదే"[26] నంటుంది. కమల వుచిత సలహాలకు శివరాం కోపంతో ఆ ఇంటిలోని

ప్రతివ్యక్తికీ అది పోసుకుంటాడు. 'తిరుగుబోతులు, త్రాగుబోతులు, మూర్ఛల రోగులు' అని వాళ్ళ అవలక్షణాల్ని యెత్తి చూపుతాడు.

## 8. మృత్యుచ్ఛాయలు :

'వ్యక్తిత్వం లేని మనిషి'లో పదేళ్ళ తరువాత ఆఫీసరవుతాడు. అతన్ని గురించి యెవరూ యేమీ అనుకోరు. మృత్యుంజయరావుని యెవరూ చెడ్డవాడని అనరు. అతడూ ఊహా జగత్తులో 'అరుణ' పాత్రను సృష్టించుకొని డైరీలో పేజీలకు పేజీలు రాసుకుని తృప్తి పడతాడు. అందరికీ తనకు అరుణకు వున్నటు వంటి సంబంధాన్ని తెలియజేస్తాడు. అరుణను గురించి డైరీలో యెన్నో సంఘటనలు, యెన్నో సన్నివేశాలు చిత్రితమౌతాయి. అన్నీ కల్పనలు, కల్పితాలు, వూహలు, వింత అనుభూతులు అని యెవరూ గుర్తించరు. ప్రజలు అన్నింటిని నమ్ముతారు. మృత్యుంజయరావులో ప్రతి రక్తపు బిందువులోనూ మార్పువస్తుంది. కొందరికి తన జీవితంలో లేనిపోనివి సృష్టించుకుని చెప్పుకోవటం అలవాటు పడతాడు. అందువల్లనే మృత్యుంజయరావులో క్రమంగా ఆ భ్రాంతి స్థిరంగా మారి సత్యంగా రూపొందుతుంది. దీనివల్ల అతని ఆరోగ్యం క్షీణిస్తుంది. అరుణకు ఉత్తరాలు రాయడం పోస్ట్ చేయడం ప్రారంభిస్తాడు. ఆత్మన్యూనత ఫలితంగా మృత్యుంజయరావులో వచ్చిన 'న్యూరోసిస్' చివరకు పెరాలసిస్ వ్యాధిగా పరిణమిస్తుంది. మృత్యుంజయరావు ఊహా జగత్తులోని అరుణను సృష్టించుకోవడం వల్ల అతనిలో ప్రతి రక్తపు బొట్టులో మార్పు వస్తుంది. దీనికి కారణం అతని మానసిక దుర్బలతలే కారణం ఉన్నట్టుండి ఒకరోజు మృత్యుంజయరావుకి 'పెరాలసిస్ స్ట్రోక్' అటాక్ కావడంవల్ల కాళ్ళు చేతులు కదల్చడానికి వీలులేకపోతుంది. అతడు దిక్కులేనివాడవుతాడు. తను ఊహించుకున్న అరుణను కలవరిస్తాడు. అతని మెదడు పూర్తి 'ఎన్సెఫలోమలేషియా'తో శిథిలమైపోయిందని డాక్టర్లు తేలుస్తారు. అతని మెదడు పాడవుతుంది. ఆసుపత్రిలో చేర్చబడిన మృత్యుంజయరావు తను చచ్చిపోతున్నానని తెలుసుకుని "నేను చచ్చిపోతున్నానా? నాకు చావంటే భయం. నన్ను చావనివ్వకండి. నాకేం కనబడటం లేదు. ఊపిరాడటం లేదు. ఏమిటో అయిపోతున్నాను. నన్ను గట్టిగా పట్టుకోండి"[27] అని ఏడుస్తాడు. మృత్యుంజయరావుకి తెలివిరాదు. మాట పడిపోతుంది. మృత్యువంటే భయపడే అతను మృత్యువువాత పడకతప్పలేదు.

'నివేదిత'లో వేదితను పొందటం ఆనందపురంలో వీలుకాకపోయినప్పటికీ తన కోరిక ఇప్పుడైనా తీరుతుందేమోనని అనుకుంటాడు. నిశ్చల మనస్సుతో ముగ్ధమోహన అయిన వేదిత పరుపుమీద పడుకుని వుంటుంది. పైట స్థానభ్రంశం పొందివుండటంవల్ల శేషసాయిలో కోరిక అధికమౌతుంది. పట్టువలతో ముందుకు వెళ్ళి వేదిత పాదాల్ని చుంబిస్తాడు శేషసాయి. పెదవులు కాలిపోయినట్టు భ్రాంతి కలుగుతుంది. విద్యుద్ఘాతం తగిలినట్టు వెనక్కి వచ్చేస్తాడు. శేషశాయికి ఆనందపురం గుర్తుకు వస్తుంది. మనసులో ఆమెను జయించి తీరుతాను అని ముందుకు వెళ్ళినప్పటికి అంతరాత్మ 'ఆమెను ఈ దశకు తీసుకువచ్చింది నువ్వే, ఆమె వినాశనానికి మార్గదర్శకుడయినావు' అని బోధిస్తుంది. ఆ సమయంలో గంగరాజు తన భార్య, తన తల్లి గుర్తుకు వస్తారు.

వేదితను శేషశాయి తాకగానే శరీరమంతా నొప్పి వ్యాపించడంతో వ్యాకుల చిత్తంతో నిలబడిపోతాడు. పౌరుషంతో తన బాధను భరిస్తూ మరింత దగ్గరవుతాడు. బాధతో వెర్రికేక వేసి వెనక్కి తూలిపడిపోతాడు. గుండెపోటు ఎక్కువవుతుంది. విద్యుత్‌తరంగాలు శేషశాయిని విషనాగుల్లాగా కాట్లు వేస్తున్నాయి. మళ్ళీ పైకి లేచిన శేషశాయి రాక్షసబలంతో వేదిత భుజాల్ని పట్టుకుంటాడు. భయంకరమైన బాధతో 'అమ్మా' అన్న కేకవేసి గుండెపట్టుకుని విరుచుకు పడిపోతాడు. అప్పటికి పశ్చాత్తాపపడడు. ఓడిపోయాను అన్న అసంతృప్తి మాత్రం వుంది.

శేషశాయి గుండెనొప్పితో బాధపడుతుంటే వేదిత దగ్గరకు వెళుతుంది. వేదితతో శాయి "వేదితా! నీకోసం నిన్ను ఆఘ్రాణించాలని వెలలతరబడి తపస్సు చేసి నా జీవితాన్ని ధారపోశాను. శక్తి వుడిగిపోయింది.... కాని యీ దుర్భర అశాంతి అంతకంటె నలిపేస్తున్నది. వేదితా ఒక్కసారి నన్ను నీ తియ్యని పెదవులతో చుంబించు"[26] అని ప్రాధేయపడతాడు. వేదిత శాయి చివరికోరిక తీర్చాలన్న తలంపుతో అతన్ని చుంబించడానికి ముందుకు వెళుతుంది. ఆమెను ఇనుప గొలుసులు లాగినట్టు, వెయ్యికంఠాలు చెవిలో ఘోషపెడతాయి. వేదితపెదవులు శేషశాయిని కలుసుకోబోయే సమయంలో 'భగవాన్' అన్న శబ్దం అతని నోటి వెంట వెలువడి ప్రాణాలు విడుస్తాడు.

## 9. హితబోధ :

'ఒకే పాటకు రెండు రాగాలు'లో శివరాం, కమలల దాంపత్యంలో చిచ్చు రగలడానికి కళ్యాణే కారణం. వాళ్ళ సంసారం నడివీధిపాలు కావడం సహించలేక పోతుంది. అందుకే ఒకనాడు కళ్యాణి కమలతో 'ఉన్మాదంతో, అవివేకంతో జీవితాన్ని కాల్చుకోవద్దు. నీ కంటే వ్యక్తిత్వం గలవాళ్ళు యెంతో మంది హాయిగా కాపురం చేసుకుంటున్నారు. కళ్ళు మూసుకో. అదే అలవాటు అయిపోతుందని' హితవచనాలు పలుకుతుంది. కళ్యాణిలో యిటువంటి మాటలు రావడం హర్షించతగ్గ విషయమే. చివరకు కళ్యాణి కమల దాంపత్యంలో తనే చిచ్చుపెట్టినట్లు పశ్చాత్తాపం చెందుతుంది. శివరాం మాటలు గుర్తుకు వస్తుంది. ఆ భార్యాభర్తల్ని విడగొట్టకూడదన్న నెపంతో ఉత్తరం రాస్తుంది. కళ్యాణి మనసులో తనేమి అయినా ఫరవాలేదనుకుని, ఎక్కడికో వెళ్ళిపోతుంది. ఈ లోపుగా కమల, కళ్యాణి యింటికి వచ్చి ఉత్తరాన్ని చూస్తుంది. అందులో "మనిద్దరి మధ్య కటువైనదీ, విపరీతమైనది యేదో జరగక తప్పనిసరి. కర్తవ్యం మాత్రం లోపించి లోతుల్ని పెళ్ళగించుకుని బయటకు వచ్చి కళ్ళ ముందు నిల్చుంది... .నీ భర్తపట్ల వైముఖ్యం కలగడానికి కారణం మనిద్దరికీ ఒకరిపట్ల ఒకరికి గల అవినాభావ సంబంధమేనని నమ్మ బుద్ధేస్తుంది నాకు. దీనికి హోమో సెక్స్ అనే పేరుపెడితే యిద్దరం ఉలిక్కిపడతాం. జడుసుకుంటాం. నేరమంతా యితరులపైనే ఆపాదిస్తాం. ఇది భయంకర నిజమని యిప్పుడనిపిస్తోంది కమలా! అందుకే నేను నీకు దగ్గరగా వుండకుండా పోవటంకన్నా వేరే మార్గం లేదని నిశ్చయించుకున్నాను. నీ వైముఖ్యం యిప్పటికి సైకలాజికల్ అనే నా ఉద్దేశం. అది కుదర్చడానికి వీలులేని రుగ్మతగా నేను భావించటం లేదు. నువ్వు సుఖపడాలి. నువ్వు రాయిలా జీవించకూడదు. నువ్వు అందరికన్నా యెక్కువగా సుఖ పడాలి మనం వ్యక్తిత్వం అనుకునేది మన వునికిని మధురం చేయాలి గాని ప్రపంచానికి దూరంగా చేసి, సినిక్‌లుగా తయారుచెయ్యకూడదు. శివరాం హీనుడేమి కాదు. నీ కంటిపాపలను కొంచెం మరమత్తు చేసుకుని చూడు... ...నా హితవును పాటిస్తావు. నేను వచ్చేలోపల పిల్లలతో కలకలలాడుతుండాలి. నా ఆశల్ని వమ్ముచేయవు కదూ"[47] అని అంటుంది. ఇక్కడ యిద్దరి మధ్య వున్న విషయాన్ని కళ్యాణి బయటపెడుతుంది.

'నివేదిత'లో శేషశాయి స్నేహితుడు సక్సేనా. వేదితపై వున్న కోరికను ఆమె జీవితాన్ని తెలియజేస్తాడు. శేషశాయిలో సక్సేనా 'ఈ మానసిక పరిణామాలు అంత ప్రమాదమైనవి కాదు కానీ, జీవితంలో స్థిరపడవలసిన ఈ వయస్సులో మహా ప్రమాదాన్ని చేకూర్చుతాయి' అని హెచ్చరిస్తాడు. వేదితను చూసిన సక్సేనాకు ఆమెపై ఆరాధనా భావం కలుగుతుంది. శేషశాయితో "ఈ దేవతా మూర్తినా నీవు కామించావు, ఈ అడుగు మానవినా నీ కౌగిలిలో బంధించావు, నీ పాపానికి నిష్కృతి లేదు. ఆమెను చూసీ చూడగానే ఆమె పాదాలపైన పడి 'అమ్మా' అని ఆర్తనాదం చేయాలనిపించిందే. నీలో మానవత్వం నశించి పోయింది. ఆమె జోలికి పోకు. స్నేహితుడిగా నిన్నేమీ కోరను. ఈ కోరిక మన్నించు"[29] అని ప్రాధేయపడతాడు. సక్సేనాకు వేదితను చూస్తూనే 'అమ్మా' అని పిలవాలనిపించిందని అనడంలో వేదిత ఏకాగ్రత తెలుస్తుంది.

శేషశాయి భార్య సీత. తన భర్త వేదితను గూర్చి మానసికంగా నలుగుతుండేది తెలుసుకుంటుంది. దాన్ని రూపుమాపటం తన ప్రయత్నంగా భావిస్తుంది. వేదితను గుర్తుచేస్తూ "మీరు పాపం చేస్తున్నారండీ, వేదిత గుణాన్ని మీరెరుగరు. పిన్నలు, పెద్దలు పవిత్రభావంతో తలుస్తుంటారు. ఆమె ఎంత నిష్కల్మష హృదయో అంత దైవభక్తురాలు. ఎంత పునీతురాలో అంత నిష్పాపంటిది. పాపపు టాలోచనలు మానేయండి. ఆమె శ్రేయస్సు కోరినవారికి ఆమె ప్రశాంతసాగరం. కీడు తలపెట్టినవారికి ఆమె బడబాగ్ని. ఇంద్రియాలను జయించిన అతీతురాలామె ఆమె జోలికి పోయారంటే మీకు, నాకు, మన కుటుంబానికి వినాశం తప్పదు కాని యిది మాత్రం వద్దండీ. ఈ అన్యాయం మాత్రం చేయవద్దండీ"[30] అని సీత తన భర్తను వేడుకొంటుంది. వేదితపై సీతకున్న అభిప్రాయం యిందులో వ్యక్తం. తన భర్త చెడుదారిలో వెళుతుంటే భార్యగా తన బాధ్యతను గుర్తు చేయడం జరిగింది. సీతకు వేదితపై యెంత ఆరాధనా భావం వుందో కూడా తెలుస్తుంది.



## 10. పశ్చాత్తాపం :

ఒకే పాటకు రెండు రాగాలు'లో కళ్యాణి పశ్చాత్తాపంతో దూరంగా వెళ్ళిపోతుంది. భార్యాభర్తలయిన శివరాం కమలల దాంపత్యంలో చిగురు

టాకులు తొడగటానికి అవకాశం ఏర్పడింది. కళ్యాణి ఉత్తరాన్ని చదివిన కమలకి నిజం తెలుస్తుంది. పశ్చాత్తాపం చెందుతుంది. మనసులో "నువ్వు ప్రాధేయపడినప్పుడు వినలేదు. అందుకే నాకీ శిక్ష. నేను అహంకారిని, మూర్ఖురాలిని. ఈ సమస్యను అర్థం చేసుకునే బెడదనుండి తప్పించావు. నువ్వే పరిష్కరించావు. ఇహ నేను కళ్ళు మూసుకుని నడవవచ్చు. దారి బాగుందో లేదో చూసుకోవాల్సిన పనిలేదు. నాతో నిమిత్తంలేదు నీకు. కానియ్యి, భరిస్తాను, సహిస్తాను. అదేగా అందరికీ కావల్సింది. అలాగే కళ్యాణీ! నీ కోరిక తీరుస్తాను. కాదనటంలేదు. అలాగే"[31] అని అనుకుంటుంది. కళ్యాణి ఉత్తరంవల్ల కమల తన తప్పును తాను తెలుసుకుంటుంది. కమల నూకాలమ్మ గుడిదగ్గర వస్తుండగా శివరాం పంపిన 'గురువులు' కమలను బలవంతం చేయబోతాడు.

శివరాం త్రాగినమైకంలో గురువుల్ని ప్రోత్సహించి తన భార్య శీలాన్ని అపహరించమని పంపుతాడు. శివరాంకు మత్తు దిగేకొద్దీ కమల తన భార్య అని తెలుసుకుని పశ్చాత్తాపం చెందుతాడు. కమలను ప్రేమించి పెళ్ళిచేసుకున్నాడు తను. శివరాం సుఖపడలేకపోతాడు. అందుకు కారణం వ్యక్తిగతలోపలే కారణం. మానవ మానసిక బలహీనతలవల్ల ఒకరినొకరు హింసించుకున్నారు. ఇప్పుడు కమల కళ్యాణి ఉత్తరంవల్ల పశ్చాత్తాపపడింది. తన భార్యను పరాయివాడికి అప్పజెప్పానని శివరాం బాధపడుతూ, పశ్చాత్తాపపడతాడు. పరోక్షమైన ఆ తృప్తివెనుక యెంత పశుత్వం, రాక్షసత్వం అణగివుందో తెలుసుకోలేకపోతాడు. అతనికి అంతరాత్మ "నీకు సిగ్గులేదు. ఆఖరికి కసితీర్చుకోవటం కూడా నీకు స్వయంగా చేతగాక, ఇంకొకరిని పురమాయించావు. దానివల్ల ఆమె భంగపడుతుందిగాని, నీకు ఒరిగే దేమిటి?"[32] అని హెచ్చరిస్తుంది.

శివరాం. కమలకు జరగబోయే అన్యాయాన్ని తలచుకుని తనలో గొణుక్కుంటూ క్రుంగిపోతాడు. మత్తు దిగేలోపుగా "అంతటి కమలని ...స్వచ్ఛమైన కమలని, పెంకిపువ్వులాంటి కమలని, అందాల కమలని, సుకుమారమైన కమలని, అభంశుభం[1] తెలియని కమలని, ఏమాత్రం అసహ్యాన్ని భరించలేని లేత కమలని.. ."[33] అని ఆ తరువాత మాట్లాడలేకపోతాడు. శివరాం కమల దగ్గర కెళ్ళగా, 'గురువులు' కామానికి బలయిపోతున్న తన భార్యను కాపాడుకుంటాడు. గురువులను నాలుగు చితకబాది తన భార్యతో యింటికి తిరిగివస్తాడు.

శివరాం, కమలలు ఒకరినొకరు అర్థం చేసుకుంటూ జరిగింది ఇద్దరం మరచిపోదామని అనుకుంటారు. ఇద్దరూ ఒకరిని గురించి మరొకరు పశ్చాత్తాపం చెందినట్లు ప్రకటించుకుంటారు. కమల, కళ్యాణీల అనుకూల దాంపత్యం కళకళలాడుతుంది.

## సూచికలు

| నెం. | రచయిత | నవల పేరు | పుట |
|---|---|---|---|
| 1. | రాజారాం మధురాంతకం | 'త్రిశంకుడి స్వర్గం' | 2 |
| 2. | సుదర్శనం ఆర్. యస్. | 'సమాజము-సాహిత్యము' | 111 |
| 3. | వేణుగోపాలరావు కొమ్మూరి | 'వ్యక్తిత్వం లేని మనిషి' | 108 |
| 4. | ,, | ,, | 168 |
| 5. | ,, | ,, | 67 |
| 6. | ,, | ,, | 74 |
| 7. | ,, | ,, | 76 |
| 8. | ,, | ,, | 80 |
| 9. | ,, | ,, | 83 |
| 10. | ,, | ,, | 84 |
| 11. | ,, | ,, | 89 |
| 12. | ,, | 'ఒకేపాటకు రెండు రాగాలు' | 72 |
| 13. | ,, | 'నివేదిత' | 71 |
| 14. | ,, | ,, | 101 |
| 15. | ,, | ,, | 117 |
| 16. | ,, | 'వ్యక్తిత్వంలేని మనిషి' | 128 |
| 17. | ,, | ,, | 134 |
| 18. | ,, | ,, | 135 |
| 19. | ,, | ,, | 198 |
| 20. | శ్రీరామమూర్తి కోడూరి | 'తెలుగు నవలా సాహిత్యంలో మనోవిశ్లేషణ' | 198 |

| నెం. | రచయిత | నవల పేరు | పుట |
|---|---|---|---|
| 21. | నవోదయా పబ్లికేషన్స్ | 'వ్యక్తిత్వంలేని మనిషి' | 5 |
| 22. | వెణుగోపాలరావు కొమ్మూరి | ,, | 9 |
| 23. | ,, | 'నివేదిత' | 42 |
| 24. | ,, | 'ఒకేపాటకు రెండు రాగాలు' | 74 |
| 25. | ,, | ,, | 79 |
| 26. | ,, | ,, | 143 |
| 27. | ,, | 'వ్యక్తిత్వంలేని మనిషి' | 205 |
| 28. | ,, | 'నివేదిత' | 200 |
| 29. | ,, | ,, | 54 |
| 30. | ,, | ,, | 63 |
| 31. | ,, | 'ఒకేపాటకు రెండు రాగాలు' | 194 |
| 32. | ,, | ,, | 200 |
| 33. | ,, | ,, | 201 |

— o —

# పాత్రచిత్రణ - 6

"జీవితమంటే సుఖదుఃఖాల కలయిక. ఒక మనిషి జీవితంలో అవి యెలా సంప్రాప్తిస్తున్నాయో ఆయా సందర్భాల్లో ఆ మనిషి యెలా ప్రవర్తిస్తున్నాడో అనే యీ రెండు విషయాల్ని బట్టి మనిషిలో వైశిష్ట్యం గోచరమౌతుంది. జీవితాన్ని కథగా మలిచే ప్రక్రియమైన నవలలో అలా నిరూపింపబడే వ్యక్తి వైశిష్ట్యాన్ని పాత్ర చిత్రణ"[1] అంటారు.

## పాత్ర నిర్మాణ శిల్పం

నవలల్లో ఇతివృత్తానికి, సన్నివేశ చిత్రణకు యెంత ప్రాధాన్యం వుందో పాత్ర చిత్రణకూ అంతే ప్రాముఖ్యం వుంది. పాత్ర చిత్రణ నవలకు జీవం లాంటిది. నవలలోని కథకు మానవ జీవితం ఆధారం. పాత్రల స్వభావాన్ని బట్టే కథ నడుస్తుంది. సన్నివేశ కల్పన జరుగుతుంది. నవలలోని కొత్త రూపాన్ని, సార్థకతను చేకూర్చేది పాత్రలే.

ఇతివృత్తం నవలకు అస్థిపంజరాలైతే పాత్రలు జీవం లాంటివి. కొన్ని ప్రధానాంశాల్ని కొంతమంది వ్యక్తులద్వారా సాధించటం నవల ప్రధాన లక్ష్యం. నవలలో పాత్ర చిత్రణకు యెక్కువ ప్రాముఖ్యం వుంది. పాత్రల్ని సజీవంగా చిత్రించినపుడే అవి పాఠకుల హృదయాల్లో చిరస్థాయిగా నిలిచిపోతాయి. నిత్యం సమాజంలో తారసపడే అతి సామాన్యమైన పాత్రలు సజీవంగా చిత్రింపబడాలి. పాత్రల సమగ్రరూపాన్ని, రచయిత పాఠకుల ముందుచుతాడు.

నవలల్లోని పాత్రలకు పరిసరవ్యక్తుల వాస్తవ జీవితం ఆధారమయినా రచయిత ఆయా స్వభావాలకనుగుణంగా తన కల్పనా సామర్థ్యాన్ని జోడిస్తాడు. కొన్ని వేళల్లో వారి గుణగణాలను యథాతథంగాకూడా వివరించడం జరుగుతుంది. రచయిత కల్పించిన పాత్రలు అతని అభిరుచికి ముఖ్య ఆధారం.

రచయితకు తన రచనలోని పాత్రలపట్ల సంపూర్ణ అవగాహన వుండాలి. నవలతో సంపూర్ణతను చేకూర్చడానికి రచయిత అనేక పాత్రల్ని సృష్టించవలసి

వుంటుంది. ఇందులో ముఖ్యంగా సమాజంలోని భిన్న ప్రవృత్తులు, విశిష్టవ్యక్తిత్వాలు కల్గిన పాత్రలను చెప్పవచ్చు. సజీవపాత్రల్ని విశ్లేషణాత్మక పద్ధతిలో వివరిస్తాడు. మానసిక పద్ధతులతో విశ్లేషించడం ద్వారా పాత్ర పోషణచేస్తాడు. పాత్రల సజీవ వర్ణనలవల్లనే ఆయా పాత్రలలో పాఠకునికి మానసిక సంబంధం ఏర్పడుతుంది. సాధారణంగా పాత్రల స్వభావాన్ని రచయిత తన మాటల్లో వివరిస్తాడు. ఆ పాత్రల రాగద్వేషాలు, భావోద్వేగాలు మొదలైన వాటికి సహేతుకమైన వ్యాఖ్యానం చేస్తాడు. కొన్నిసార్లు తాను తటస్థుడిగా వుంటూ పాత్రల చేతనే నవలను నడిపిస్తాడు. వాస్తవిక నవలల్లోని ప్రతి పాత్రలోనూ మంచి చెడ్డలు వుంటాయి. కాల్పనిక నవలల్లోని పాత్రల్ని రచయితే నిర్ణయిస్తాడు.

సాంఘిక నవలా రచనలో రచయితకు స్వాతంత్ర్యం యెక్కువ. వాస్తవ జీవితమే కాకుండా వూహాలోకంలో కూడా విహరించగలడు. సమకాలీన జీవితాన్ని వ్యక్తులను తన నవలల్లో ప్రతిబింబింప చేయడానికి అతనికి యెక్కువ అవకాశం వుంటుంది.

ప్రతి రచయితకూ యిష్టమైన కొన్ని పాత్రలుంటాయి. అటువంటి పాత్ర చిత్రీకరణ పట్ల ప్రత్యేక శ్రద్ధతీసుకుంటాడు. తన భావాల్ని ఆ పాత్రలకు ఆరోపిస్తాడు. ఆ పాత్రలనే రచయిత తన భావ వ్యక్తీకరణకు సాధనాలుగా గ్రహిస్తాడు. ప్రపంచానికి భయపడి గుండెపొరల్లో అణచిపెట్టుకున్న కోర్కెలను ఆయా పాత్రల పరంగా బహిర్గతం చెయ్యడానికి ప్రయత్నిస్తాడు. రచయిత స్వయంగా పాత్రల చేష్టలను, భావాలను వ్యక్తపరుస్తూ చివరికి తానే ఆపాత్రల గుణాల్ని నిర్ణయిస్తాడు. మనో విశ్లేషణ, ప్రతీకాత్మక చైతన్య స్రవంతి పద్ధతుల్లో కూడా పాత్ర పోషణలో గమనింపదగినవి. పాత్రల స్వగతాలలో కూడా పాత్ర పోషణ జరుగుతుంది.

కొమ్మూరి వేణుగోపాలరావుగారి నవలలన్నిటిలోనూ ఆదర్శ పాత్రల చిత్రణకే ప్రాముఖ్యం. పాత్రల సమగ్ర స్వరూపాన్ని, గుణాల్ని వర్ణించి పాఠకుల ముందుంచడం వారి ప్రత్యేకత. ఆ పాత్రల వ్యక్తిత్వానికి అనువుగా సంఘటనల్ని జోడించడం మరో విశేషం.వారు సృష్టించిన పాత్రలు చాలావరకు సకల సద్గుణోపేతులు. వాటిలో ముఖ్యంగా వృత్తికి సంబంధించిన పాత్రలు, కుటుంబ జీవితానికి సంబంధించిన పాత్రలు, ప్రేమైక పాత్రలు, వైవాహిక జీవితంలో యెదుర్కొన్న

పాత్రలు, మనో విశ్లేషణకు సంబంధించిన పాత్రలు, సందేశాత్మక పాత్రలు, సాహిత్యానికి సంబంధించిన పాత్రలు, దుష్ట స్వభావంగల పాత్రలుగాను విభజించడం జరిగింది. వీరు సృష్టించిన పాత్రలు పాఠకుల హృదయాల్లో లీనమై ఊహాలోకంలో తేలియాడుతారు. వేణుగోపాలరావుగారి రచనా విధానంలో వైవిధ్యం చూపినట్టుగానే పాత్ర పోషణలో కూడా వైవిధ్యాన్ని చూపిస్తారు. పాత్ర సృష్టిలోగాని, పాత్ర పోషణలోగాని ఆ పాత్రల వున్నత వ్యక్తిత్వాన్ని దర్శింపజేసి వాటిని మార్గదర్శకులుగా తీర్చదిద్దగలిగారు. పైన వివరించిన పాత్రలను గురించి వివరించడమే యీ అధ్యాయ ప్రధానోద్దేశం.

## 1. వైద్యవృత్తి సంబంధాలు

మనిషి యే పనిచేస్తున్నా తనని గురించి తను చెప్పుకోవడం అనేది అనాదిగా వస్తున్న ఆచారం. శ్రుతిమించి చెప్పుకున్నట్లయితే అది స్వోత్కర్ష అని చెప్పవచ్చు. ఏ వ్యక్తి అయితే తను చేసే పనిలో తన అభిరుచిని తన వ్యక్తిత్వాన్ని గూర్చి చెప్పుకుంటాడో దానిని డా॥ సి. నారాయణరెడ్డిగారు 'ఆత్మాభిరుచి' (సబ్జెక్టివ్ ఎలిమెంట్) అన్నారు. కొమ్మూరి వారిలోకూడా ఆత్మాభిరుచి వుందనడానికి వారి వైద్యవృత్తి నవలలు, అందులోని పాత్రల చిత్రణ నిదర్శనం. కొమ్మూరి వారు తన వృత్తిలో యెదురయ్యే ఆనందాన్ని, అనుభూతిని కష్ట సుఖాలను సమస్యలను యథాతథంగా నవల్లో చొప్పించారు. వైద్యవృత్తి నవలల్ని పరిశీలించి నట్లయితే స్వీయ జీవిత చరిత్రనిపిస్తుంది. తన అనుభవాన్ని నవల్లో చొప్పించి పాఠక లోకానికి అందించినప్పటికి అది స్వోత్కర్షలా అనుపించదు. అందువల్లనే వారి నవలలు ఒక స్థాయిలో వుండాయనే చెప్పుకోవచ్చు.

### డాక్టర్ మధు :

'హౌస్ సర్జన్' నవల్లో మధు ప్రధాన పాత్ర. వేణుగోపాలరావుగారి ఆత్మకథ యిది. హౌస్ సర్జన్‌గా చేస్తున్న రోజుల్లో తన వృత్తిలో వచ్చిన సాధక బాధకాల్ని మరియు వైద్యవృత్తిలోని తృష్ణను మధు పాత్రద్వారా మన[illegible] జేశారు. వైద్యవృత్తిలోని ఆదర్శాల్నికూడా మధు పాత్రలో [illegible] మధు వైద్యవృత్తిని ప్రాణప్రదంగా భావించుకున్న యువకుడు [illegible] సే

చెయ్యాలన్న తపన యితనిలో చోటుచేసుకుంది. యువకుడు, సౌందర్య రాధకుడు అయిన మధు తన వృత్తి విధి నిర్వహణలో తనకున్న బలహీనత వల్ల క్రిందికి లాగే కొన్ని సన్నివేశాలను యెదుర్కొంటాడు. నిగ్రహం, మనోస్థైర్యంతో కాలు జారకుండా జాగ్రత్తపడతాడు. అందుకు గల కారణం కొన్ని ఆశయాలతో వైద్య విద్యను అభ్యసించిన వ్యక్తి. మెడిసిన్ అంటే అతనికి అంతులేని తృష్ణ. వైద్య వృత్తి ఓ మహాసముద్రమనుకుంటాడు. మెడిసిన్ మధుకి ఆశాజ్యోతి అవుతుంది. వైద్యవృత్తి చాలా పవిత్రమైనదని అతని విశ్వాసం. దాని పరమావధ్యం మానవ సేవ. డాక్టరుగా మధు అనుభూతులు, మమతలు, మమకారాలు చోటివ్వకుండా త్రికరణ శుద్ధిగా వైద్యం చేయడమే తన ధర్మంగా భావిస్తాడు.

మధు హౌస్ సర్జన్‌గా రాత్రి డ్యూటీలో వున్నప్పుడు జరిగిన ఒక్క సంఘటనలోనే అతని మానవత్వాన్ని అంచనావేయవచ్చు. మధుతోపాటు మృదుల కూడా అదే వృత్తిని స్వీకరిస్తుంది. పైగా మృదుల మధుని ప్రేమిస్తుంది. గొప్పింటి పిల్ల. మృదుల డ్యూటీ రూములో పశ్చారుగని నిద్రావస్థలో వుంటుంది. ఆమె పైట స్థాన భ్రంశం చెందివుంటుంది. అది చూసిన మధుకి నిషా కలిగించే కావ్యకన్యలా కనబడుతుంది. ఆ స్థితిలో మృదులను వదలి వెళ్ళడం మధుకి భావ్యం కాదనిపిస్తుంది. ఆమె పైట యథాస్థానంలో కప్పి వెళతాడు. ఆ సమ యంలో తనను చూసినట్టయితే ఆమె అపార్థం చేసుకుని వుండేదనుకుంటాడు. ఆమెను గౌరవనీయ స్థితిలో వుంచివెళ్ళడం తన కర్తవ్యంగా భావిస్తాడు. సభ్య మానవుడిగా తనకుతోచిన కర్తవ్యాన్ని నెరవేర్చి అక్కడనుండి వెళ్ళిపోవడం వల్ల మధులోని నిజాయితీ, ఆత్మనిగ్రహం మనం అంచనా వేయవచ్చు. మరొక సన్ని వేశంలో నర్సుగా పనిచేస్తున్న నళిని మధు దగ్గరకువచ్చి సాహసించి అతన్ని చుంబిస్తుంది. అతనితో సంగమాన్ని కాంక్షిస్తుంది. ఈ ఘట్టం పరాకాష్ఠ చేరబోతున్నదని గ్రహించి అతను కాఠిన్యం వహిస్తాడు. ఏది జరగబోతుందో అది జరగకుండా చూసి ఆమె బలహీనతను, వ్యక్తిగత వ్యామోహాలు అణచిపెట్టుమని చెప్పి జీవితానికి ఒక ఒరవడిని దిద్దుకోమంటాడు.

మధు ఎందరో రోగులకు సేవ చేస్తాడు. అసమర్థులయిన డాక్టర్ల కళ్ళు తెరిపిస్తాడు. నిజాయితీపరులైన డాక్టర్లు ఎదుర్కొనే యిబ్బందుల్ని చూసి జాలి

పడతాడు. ప్రజలకు ప్రభుత్వ ఆసుపత్రులంటే మంచి అభిప్రాయాన్నే తెలియజేస్తాడు. రోగుల దీనగాథల్ని విన్న మధు మొదట చలించిపోయినప్పటికీ తరువాత గుండె దిటువుచేసుకుంటాడు. నర్సుల ప్రవర్తనల్ని చూసి జాలిపడటంతో పాటు వాళ్ళకు హితోపదేశాన్ని కూడా అందిస్తాడు. మధు చివర డాక్టర్లు, నర్సులు హాస్పిటల్స్ గురించి మనుషులకు చెడ్డ అభిప్రాయం కలుగకుండా తన వృత్తికి న్యాయం చేయమంటాడు.

డాక్టర్ నరేష్ :

వైద్యవృత్తిని స్వీకరించిన మరో పాత్ర డాక్టర్ నరేష్. "డాక్టరుగారి భార్య" నవల్లో నరేష్ తన వృత్తిలో యెదుర్కొనే యిబ్బందుల్ని సంఘటనల్ని ప్రధానంగా పేర్కొనడం జరిగింది. నరేష్ ఎం.బి.బి.యస్. పూర్తి అయిన తరువాత ప్రయివేట్ ప్రాక్టీస్ పెడతాడు. నరేష్ తన వృత్తిపట్ల నిరాశను వ్యక్తం చేసినప్పుడల్లా అతని భార్య 'సహజ' ప్రోత్సాహం లభిస్తుంది. నరేష్ చాలా సున్నిత మనస్తత్వం గలవాడు. 'జీవితంలో నిద్రాప్రియులూ, భోజనప్రియులు, అర్థంలేని వ్యాపకాలకు కాలం వృథా చేసేవాళ్ళు యెప్పటికీ పూర్తిగా పైకి రాలన్న' సత్యాన్ని గ్రహిస్తాడు. ప్రజల్లో ఒక స్థానాన్ని కల్పించుకోవాలంటే కొన్ని జటిలమైన కేసుల్ని టేకప్ చేయాలనుకుంటాడు. పిల్లల వైద్యంలో నరేష్‌కి బాగా అచ్చి వస్తుంది. నరేష్ తన భార్య మాటల్నిబట్టి సమర్థత కంటే ఓర్పే మంచి పేరు తెచ్చిపెడుతుందనుకుంటాడు. ఎంతకాలమైనా డాక్టరు వృత్తి రిటైర్మెంట్ లేదనుకుంటాడు. రకరకాల కేసుల్ని టేకప్ చేసి మంచి డాక్టరుగా పేరు తెచ్చుకుంటాడు. డాక్టరుగా యెదురయ్యే సంఘటనల్ని, సమస్యల్ని అవలీలగా పరిష్కారం చేసుకుంటూ వెళ్ళిపోతాడు. కాని కొన్ని సమయాల్లో నరేష్ నిరాశ చెందుతాడు. సహజతో 'అన్ని రకాల మనస్తత్వాలకు, ఇన్ని పరీక్షలకు తట్టుకోలేకపోతున్నాను. ఎక్కడికైనా వెళ్ళి బ్రతుకుదాం' అని అనడంలో నరేష్ మానసికంగా నలుగుతున్నది యిక్కడ వ్యక్తమౌతుంది.

నరేష్ జాండీస్‌వల్ల తను లేవలేని పరిస్థితిలో వుంటాడు. అప్పుడు ఒకే పిల్లవాడ్ని చూడలేకపోతాడు. ఆ పిల్లవాడు మరణంవల్ల డాక్టరు నిర్లక్ష్యమని కోర్టులో నరేష్‌పై క్రిమినల్ కేసుకై దావా వేస్తారు. నరేష్ తనకున్న ప్రాక్టీస్‌వల్ల

ఆలస్యంగా వెళ్ళినందుకు మేజిస్ట్రేట్ మందలిస్తాడు. అందుకు శిక్ష విధించమని కోరుకుంటాడు. ఒకసారి మేజిస్ట్రేటు కారు ఆక్సిడెంట్‌లో చిక్కుకోగా నరేష్ దగ్గరుండి కాపాడి తన రక్తాన్ని యిస్తాడు. నరేష్ తన కర్తవ్యాన్ని నెరవేర్చు తాడు. నరేష్‌కు మేజిస్ట్రేట్ కొడుకని తెలియదు. నరేష్‌పై కేసుపెట్టిన వ్యక్తి నరేష్ మానవతామూర్తి అని తెలుసుకుని తన కేసును ఉపసంహరించుకుంటాడు. నరేష్‌కు మొదటి నుంచి ఆత్మీయంగా చూసుకొన్నవాళ్ళు జయచంద్ర దంపతులు. జయచంద్ర భార్య దమయంతి కుక్కకాటువల్ల మరణిస్తుంది. జయచంద్ర జాండీస్‌వల్ల మరణిస్తాడు. వీళ్ళిరువురిని బ్రతికించడానికి నరేష్ తన శాయశక్తులా కృషి చేస్తాడు. జయచంద్ర తన యావదాస్తిని ఆసుపత్రి నిర్మాణం కోసం, అందులో నరేష్‌కు సర్వ అధికారాలున్నట్లు వీలునామా రాస్తాడు. నరేష్ 'జయ చంద్ర మెమోరియల్' ఆసుపత్రి నిర్మాణం చేపట్టి అందులో సామాన్యుడికి సయితం అందుబాటులో వుండేటట్లు ట్రీట్‌మెంట్ చేస్తాడు.

## డాక్టర్ సంజీవరావు :

'ప్రేమ నక్షత్రం' నవలలో ప్రధాన పాత్ర సంజీవరావు. సంజీవరావు జనతా ఫార్మాస్యూటికల్ కంపెనీ స్థాపించి పదిమందికి ఉద్యోగాలిప్పిస్తాడు. కంపెనీ నిబంధన ప్రకారం బ్రహ్మచారులకే ఆ కంపెనీలో ఉద్యోగం వస్తుంది. పేదలయెడ సానుభూతిపరుడు. మెడిటేషన్‌పై నమ్మకం వున్న వ్యక్తి. త్రాగుడికి విరుగుడు కనిపెట్టాలన్నది అతని ఆశయం. మందుల తయారీలో పరిశోధన సాధించాలన్నది అతని ధ్యేయం. లాభాలు చేసుకుని లక్షలు సంపాదించడం అతని అభిమతం కాదు. శక్తివంతంగా పనిచేసే మందులు తక్కువ ధరలకు అందివ్వాలన్నది సంజీవరావు ఆరాటం. సామాజిక దృక్పంతో ఆలోచించిన సంజీవరావులో యెంత మానవత వుందో తెలుస్తుంది. వేణుగోపాలరావు వైద్యుడు కావడంవల్ల విశాలంగా ఆలోచించే మనస్తత్వం యిక్కడ చోటు చేసుకుంది. పేదప్రజలపై రచయితలకున్న విశాలదృక్పథం కనిపిస్తుంది. సంజీవరావు మెడిటేషన్‌పై తనకున్న నమ్మకాన్ని యిలా తెలియజేస్తున్నారు. 'మెడిటేషన్ అనేది మానసికవికాసానికి, పరిపక్వతకు, దృఢత్వానికీ, ఆరో గ్యానికీ, ఆయువుపట్టుకీ, మనిషి అభ్యున్నతికి అది దోహదకారి అవుతుందని

నమ్మినవాడు మనసును ఏకాగ్రతను విడిచిపెట్టకుండా బంధించాలని ఒకరంటారు. వాళ్ళ సిద్ధాంతం ప్రకారం ఇష్టదేవత నామం తప్పులేదు. ఆలోచనకు తావుండదు. ఇంకొకరు మనసును ఆధీనంలో వుంచుకొనేందుకు ప్రయత్నించకుండా ఆలోచన్లను అరికట్టకుండా స్వేచ్ఛగా వొదిలేస్తే భావాతీతస్థితి ఏదో ఓ దశకు వస్తుంది. అదే సరియైన పద్ధతి".[2] ఈ రకమైన ధ్యానంలో నమ్మకం కుదిరింది. ఏదయినా సాధించాలంటే ఆలోచనా ధ్యానం వుండాలన్నది రచయిత సంజీవరావు పాత్ర ద్వారా స్పష్టపరిచారు. మెడిటేషన్‌లో పరాకాష్ఠ చేరుకోగలిగితే ఆత్మచైతన్యం కలుగుతుందని కూడా చెప్తున్నారు.

బ్రతుకుతెరువుకోసం ఫణి శైలజలు భార్యాభర్తలన్న విషయం తెలియ పరచకుండా దాచిపెట్టి కంపెనీలో ఉద్యోగం చేరుతారు. ఈ విషయం సంజీవరావుకు తరువాత తెలుస్తుంది. ఇంకా కొందరి ప్రేమలు బయట పడుతుంది. ప్రేమ వ్యవహారాలవల్ల మందుల కంపెనీ కుంటుపడుతుంది. తన ఆశయాల గాలిమేడల్ని నిర్దాక్షిణ్యంగా కూలిపోయిందని సంజీవరావు, సహచరిణి చూడామణికి చెప్తాడు. నీతి, నిజాయితీ కల్పించకపోయానని వాపోతాడు. జీవితంలో దారుణంగా ఓటమి చెందానంటాడు. కాని ఫణి మత్తుమందుకు విరుగుడు కనిపెట్టడంవల్ల సంజీవరావు ఆశయం ఫలిస్తుంది. సంజీవరావు కంపెనీ నిబంధనల్ని మార్చి పెళ్ళి అయిన వాళ్ళకు ఉద్యోగాలు కల్పిస్తాడు. సమాజంలో కొందరు వ్యక్తుల జీవనస్రవంతిని, ప్రణయ జీవితాన్ని, నిరుద్యోగ సమస్యలను మనకు అద్దంపట్టిచూపిస్తూ మార్పును ఆశిస్తున్నారు రచయిత.

## 2. కుటుంబ జీవిత సంబంధాలు

మధ్య తరగతి కుటుంబంలోని పాత్రలు ముఖ్యంగా ఆర్థికపరమైన ఒడుదుడుకులను ఎదుర్కొంటాయి. ఇటువంటి పాత్రలు బాధ్యతల్ని నిర్వహించడం లోనూ, భవిష్యత్తుకోసం ఎంతకాలమైనా ఎదురుచూడగల నేర్పు, ఓర్పు వున్న వాళ్ళుగా కనిపించాలి. తల్లిలేని పిల్లలకు తల్లిగా వుండటంకూడా జరుగుతుంది. కుటుంబ బాధ్యతల్ని నిర్వహిస్తూ ఎటువంటి పరిస్థితులనైనా ఎదుర్కొనే ధైర్యం వుండాలి. జీవితాన్ని బాధలతో, వ్యధలతో నిరాశ నిట్టూర్పులతో సంతృప్తిపడి గడిచిన జీవితం నెమరువేసేవాళ్ళను గురించి కూడా యీ పాత్రల్లో చర్చించడానికి అవకాశం వుంది.

**నారాయణ :**

'పెంకుటిల్లు' నవలలో చిదంబరం పెద్దకొడుకు నారాయణ. చిదంబరం పేకాట వ్యసనపరుడు. పెద్దకొడుకు నారాయణ ఆ ఇంటి బరువు బాధ్యతల్ని చూసుకుంటాడు. నారాయణ బి.ఏ. వరకు చదివివుంటాడు. ఒకరికింద ఉద్యోగం చేయడం అనేది అతనికి గిట్టనిపని. అందువల్ల సాహిత్యాన్ని నమ్ముకుని దానివల్ల వచ్చిన పారితోషికంతో కుటుంబాన్ని పోషిస్తాడు. పట్టణంలో చదువుతున్న తన తమ్ముడు ప్రకాశంను కూడా ఆదుకుంటాడు. ఒక్కొక్కసారి తాను ఇబ్బందుల్లో పడేవాడు. తన తండ్రి ఇంటి పరిస్థితుల్ని పట్టించుకోకుండా బాధ్యతారహితంగా వ్యవహరిస్తున్నప్పటికీ, ఏమీ మాట్లాడలేకపోతాడు. విధివైపరీత్యంవల్ల తమ్ముడు వాసు కారుప్రమాదంలో కాలు పోగొట్టుకుంటాడు. నాన్నమ్మ పెరాలసిస్‌వల్ల మంచం పట్టడంవంటి సంఘటనలు జరిగిన తరువాత అతని హృదయం ద్రవిస్తుంది. నాన్నమ్మ కోరిక ప్రకారం పెళ్ళి చేసుకోమని తల్లి శారదాంబ నారాయణను కోరుతుంది అందుకు 'నన్ను సగం సగం కాకుండా పూర్తిగా అర్థం చేసుకో అమ్మా' అని అంటాడు. తన తల్లితో తమ కుటుంబ పరిస్థితుల్ని, సంఘంలో తమకున్న పరువుప్రతిష్టల్ని, పలుకుబడిని గుర్తు చేస్తాడు. తన తండ్రి వల్ల తమ కుటుంబ పరిస్థితి కుంటుపడిందని అతని అంతరార్థం. పెద్దల కోరిక ప్రకారం పెళ్ళి చేసుకుంటే కుటుంబ పరిస్థితి కాస్త కుదుటపడవచ్చునని వాళ్ళ వుద్దేశాన్ని గ్రహిస్తాడు. నారాయణకు బ్యాంక్‌లో ఉద్యోగం వచ్చినప్పటికీ ఒకరికి యిద్దరు అవిటివాళ్ళు కావడంతో కుటుంబ ఆర్థిక పరిస్థితి మరింత సంకటంగా తయారవుతుంది.

నారాయణ తన నానమ్మ కోరిక మేరకు చెల్లెలి ప్రోత్సాహంతో సుగుణను పెళ్ళి చేసుకుంటాడు. ఇంటి ఖర్చులు భరించలేని నారాయణ వున్నపొలంలో కొంత అమ్మేస్తాడు. పూర్వీకులు కట్టివుంచిన లంకంత యింటిని సగం అద్దెకిస్తాడు. తన తమ్ముడి దగ్గరకు వెళ్ళిన నారాయణ వాని పరిస్థితుల్ని, ప్రేమ వ్యవహారాల్ని కనుగొంటాడు. ఇంటిలో ఎవరికీ చెప్పకుండా ఒక్క రాధకు మాత్రం అక్కడి పరిస్థితిని వివరిస్తాడు. నారాయణ తన భార్య కోరిక మేరకు మామగారింటికి వెళ్తాడు. సుగుణ తండ్రి గోవిందరావు వీళ్ళను వేరే కాపురం పెట్టించాలనుకుని మాట్లాడు

కాడు. అందుకు నారాయణ తన మామకు తగినవిధంగా బుద్ధి చెప్తాడు. నారాయణ అక్క అన్నపూర్ణ ప్రసవవేదనతో మరణించగా తన బావ పరిస్థితిని చూడలేక పోతాడు. నారాయణ చెల్లెలు రాధ. శ్రీపతి కుటిలబుద్ధితో రాధ శీలాన్ని అపహరించిన విషయం నారాయణకు తెలుస్తుంది. తన చెల్లెలికి జరిగిన అన్యాయానికి కుమిలిపోతాడు. తను యెవరితోను చెప్పుకోక ఆ యింటి గౌరవాన్ని కాపాడుతాడు. నారాయణ తన ప్రోత్సాహంతోనే దాప ముకుందరావుతో రాధ పెళ్ళి జరిపిస్తాడు. ప్రకాశం ఇంటి పరిస్థితుల్ని తెలుసుకుని పట్నం నుంచి ఇంటికి వచ్చిన నారాయణ తమ్ముణ్ణి అభినందించి చేరదీస్తాడు.

కొమ్మూరి వేణుగోపాలరావు నారాయణ పాత్ర చిత్రీకరణలో కీలకమైన పాత్ర వహిస్తాడు. ప్రతి సంఘటనలోను, సన్నివేశంలోను అతని ప్రవర్తనలోను హద్దు మీరకుండా చాకచక్యంగా చిత్రించగలిగారు. సున్నితమనస్కుడైన నారాయణ లోక సందేశాన్ని తన చెల్లెలికి, బోధించడంలో కృతకత్యులయ్యారు. తండ్రి వ్యసనపరుడైనప్పుడు పెద్దకొడుకుగా నారాయణ చొరవతీసుకుని మాట్లాడి వున్నట్లయితే యీ పాత్ర మరింత రక్తికట్టుందేది. తండ్రి చెడుదారిలో నడుస్తుంటే 'ఇది మంచిది కాదు' అని చెప్పడం తప్పులాదు. బాధ్యతను గుర్తు చేసినట్లవుతుంది. అది రచయిత మరిచినట్టు మనం భావించవచ్చు. మొత్తంమీద వేణుగోపాలరావుగారి 'పెంకుటిల్లు' నవల అంటేనే అందులో కనిపించే ప్రధాన పాత్ర నారాయణ.

చిదంబరం :

ఈ నవల్లోని మరోపాత్ర చిదంబరం. కుటుంబ యజమాని అయినప్పటికీ పేకాట వ్యసనపరుడు కావడంవల్ల ఆ యింటి పరిస్థితి కుంటుపడుతుంది. మనిషి దేనికో ఒక దానికి బానిస అయినట్టు చిదంబరం పేకాట వ్యసనపరుడవుతాడు. తనకున్న ఆరుగురు పిల్లలతో కుటుంబం యెలా గడుస్తుందన్న ఆలోచన యితనికిరాదు. ఇంటి విషయాల్ని పట్టించుకోడు. పిల్లల పెళ్ళి విషయాల్ని ప్రస్తావించిన భార్య శారదాంబతో 'అలాగే చూద్దాం. చేద్దాం' అని తల ఆడించేవాడు. చిదంబరం తన తమ్ముడి ఆస్తి విషయంలో మోసం చేశాడని అందరితో చెప్పుకొంటాడు. ఇటువంటి వ్యసనపరుల దగ్గర ఎలా కలసివుంటారన్నది చిదంబరం గ్రహించలేక

పోతాడు. మానవునిలో మార్పు సహజం. మరి చిదంబరంలో కూడా మార్పు వస్తుంది. చిదంబరం తల్లికి పెరాలసిస్ వచ్చి మంచం పట్టినప్పుడు, చిన్నకొడుకు వాసుకి కారుప్రమాదంలో కాలు పోయినప్పుడు, దాంతో హృదయం చలించిన చిదంబరానికి వాళ్ళకేదో సహాయం చేయాలనుకుంటాడు. పెద్దకొడుకు నారాయణ పెళ్ళివిషయం వచ్చేసరికి పూర్తిగా మారిపోతాడు. చిదంబరం నేరుగా కొడుకును పెళ్ళిచేసుకోమని చెప్పలేకపోయినప్పటికీ, తన భార్యద్వారా, కూతురు ద్వారా ఒప్పించడానికి ప్రయత్నిస్తాడు. అతని ఆశ ఫలిస్తుంది. తన పిల్లలముందు గొప్పలు చెప్పుకుంటాడు. కొడుకు పెళ్ళి తన బాధ్యతగా గుర్తించిన చిదంబరం పరంధామయ్య దగ్గర అప్పుచేస్తాడు. తన కూతుర్ని చిదంబరం కొడుక్కి తీసుకో లేదన్న క్రోధంతో గంగాధరం పరంధామయ్యను పురికొల్పుతాడు. అది తెలుసుకుని చిదంబరం గంగాధరంను చావబాదుతాడు. అందువల్ల చిదంబరంకు మూడేళ్ళు జైలుశిక్ష పడుతుంది. మూడేళ్ల తరువాత తిరిగి వస్తాడు. మనిషి ఏ విధమైన మానసిక బలహీనతలకు లొంగిపోతాడో అన్న సత్యాన్ని రచయిత చిదంబరం పాత్రద్వారా చిత్రీకరించారు.

రాధ :

ఈ నవల్లో మరో మంచి పాత్ర రాధ. చిదంబరం శారదాంబల రెండో కూతురు రాధ. రాధ తన అన్న నారాయణలాగా ఆ కుటుంబ జీవనంలో పాలుపంచుకుంటుంది. తన ఇంటి పరిస్థితుల్ని, ఆర్థికపరిస్థితుల్ని అర్థం చేసుకునేది. తల్లికి చేదోడువాదోడుగా వుంటుంది. పట్నంలో చదువుతున్న తన అన్న ప్రకాశం పరిస్థితిని, ఆర్థిక పరిస్థితుల్ని అర్థం చేసుకునేది. తన అన్నతో చర్చించి చిన్నన్నకు కొద్దో గొప్పో పంపే ఏర్పాట్లన్ని తనే చూచుకుంటుంది. తన బాధల్ని గుండెల్లో నింపుకుని ఆత్మస్థైర్యం కలిగివుంటుంది, విధిలేని పరిస్థితుల్లో ప్రకాశంకు డబ్బు పంపాలని తన స్నేహితురాలయిన ప్రమీలను అర్థిస్తుంది. ఆమె ఆదుకుంటుంది. రాధకు వయసు వచ్చినప్పటికి తన పెళ్ళి గురించిన ఆలోచన రాదు. రాధను ఆనంతరావు ప్రేమిస్తాడు. అది తెలుసుకున్న రాధ తనను ఎవరు చూస్తున్నారో పట్టించుకోని రాధ అప్పటి నుంచి ఎంతోమంది చూస్తున్నట్టుగా బాధపడేది. మాసి వున్న తన బట్టల్ని చూసి పరితపిస్తున్నట్టు దుఃఖిస్తుంది. అందుకు తమ పేదరికమే కారణమనుకుంటుంది. ప్రేమ విషయంలో 'వయసు' కారణం అని తెలుసు

కుంటుంది. తమ్ముడు వాసు కారుప్రమాదంలో కాలు పోగొట్టుకున్నప్పుడు ప్రమీలను అర్థించి వాడి ఆపరేషన్ ఖర్చులకుగాను ఆదుకుంటుంది. వాసు ఇంటిపట్టున వున్నప్పుడు వాడి హృదయవిదారకమైన వేదాంతధోరణి మాటలు రాధ హృదయం ద్రవిస్తుంది. విస్తుపోయిన రాధ వాసుకి వూరట కలిగేటట్టు మాట్లాడుతుంది. నాన్నమ్మ కోరికమేరకు రాధ తన అన్న నారాయణను పెళ్ళికి సమ్మతింపచేస్తుంది.

ఇంటికి పెద్దకోడలుగా వచ్చిన సుగుణతో రాధ తమ ఇంటి పరిస్థితుల్ని దాచకుండా చెప్తుంది. ప్రమీల భర్త శ్రీపతి రాధ శీలాన్ని అపహరించాలను కుంటాడు. రాధ వాడికి సరియైన సమాధానం చెప్పివస్తుంది. తన అక్క అన్నపూర్ణ పిల్లవాడ్ని ప్రసవించి మరణించడంతో రాధ మనసు కలచివేసినట్టవు తుంది. తన బావ పరిస్థితిని చూసి హృదయం తరుక్కుపోయే విధంగా దుఃఖి స్తుంది. రాధ తన బావపై మమకారం యేర్పరచుకుంటుంది. రాధ తనను ప్రేమి స్తున్న ఆనందరావుని మందలిస్తుంది. తన తండ్రి చిదంబరం జైలుకు వెళ్ళడం, పట్నంలో చదువుకుంటున్న ప్రకాశం శకుంతలను ప్రేమించి కులాంతర వివాహం చేసుకున్న విషయం తెలిసినప్పటికీ ఎవరితోను చెప్పుకోదు. కుటుంబ గౌరవాన్ని కాపాడుకుంటూ వస్తుంది.

శ్రీపతి కుటిలబుద్ధితో రాధను తన ఇంటికి రప్పించి ఆమె శీలాన్ని అపహ రిస్తాడు. రాధ ఆత్మహత్యా ప్రయత్నం చేసుకోబోగా ఆనందరావు కాపాడి పెళ్ళి చేసుకుంటానంటాడు. కానీ రాధ మౌనం వహిస్తుంది. రాధ తన బావ ముకుంద రావుకు మనసులో స్థానమిస్తుంది. రాధ తన శీలాన్ని కోల్పోయిందని తెలుసుకున్న నారాయణ గోప్యంగా వుంచుతాడు. నారాయణ ప్రోత్సాహంతో ముకుందరావు, రాధ ల పెళ్ళి జరుగుతుంది. చుక్కాని లేని నావలాగా వున్న ఆ పెంకుటిల్లును నారాయణ, రాధ ఇరువురూ సంసారమనే సముద్రాన్ని యీది గట్టుకు యీడుస్తారు. రాధ పాత్రలో త్యాగమయిగా మనకు దర్శనమిస్తుంది. అడుగడుగునా ఇంటి సమస్యలు తలెత్తినప్పుడు అన్నకు తోడుగా రాధ ఎలా గట్టుకు చేర్చగలిగిందో ఇందులో విదితమౌతుంది.

**రంగారావు :**

ఇంటికి యజమానిగా వున్నవాడు యింటిలో అందరి బాగోగుల్ని సమంగా చూడాలి. సంఘంలో తన ఇంటికి ఓ గుర్తింపు వచ్చేటట్టు చూసుకోవాలి. అందు

కోసమే రచయిత కుటుంబ యజమానిగా 'ఈ దేశంలో ఒక భాగమిది' నవల్లో రంగారావు పాత్రను సృష్టించారు. రంగారావు ఉమ్మడి కుటుంబ యజమాని. వృత్తిరీత్యా వైద్యుడు. అతని భార్య శారదమ్మ. వీరికి నలుగురు సంతానం. చిన్నప్పటినుండి పైకి వచ్చానన్న తృప్తి ధీమా, గర్వం వుండేవి. బంధువులతో సైతం నిర్మొహమాటంగా మాట్లాడేవాడు. ఇంటిలో జరిగే ప్రతి చిన్న విషయాన్ని కనిపెట్టి చూస్తుంటాడు. తన సొంత కారును సైతం తమ పిల్లల్ని యెవర్నీ తాకనిచ్చేవాడు కాదు. ఇటువంటి తండ్రులు సంఘంలో అరుదుగానే కనిపిస్తారు. తమ పిల్లల్ని పైకి తీసుకురావాలన్న ధ్యేయంతోనే పలు రంగాల్లో వారికి తర్ఫీదు ఇస్తాడు. పెద్దకొడుకు కుమార్‌ను మాత్రం డాక్టర్ని చదివించి తనతోపాటే ప్రాక్టీస్ చేసేట్టు చేస్తాడు. రంగారావు తన వైద్యవృత్తిలో ఏకాగ్రతతోపాటు మరో సుఖం గురించి ఆలోచించేవాడు కాడు. ఆయన పడ్డ పాట్లు, చేసిన కృషి మరొక వ్యక్తికి కుదరని పని. తన పిల్లల్ని గురించి నలుగురితో గొప్పలు చెప్పుకుంటాడు. తండ్రిగా తృప్తినిచ్చే కోరిక అదే. ఇంటిలోని కోడళ్ళ అలకల్ను, సాధింపులను, మనస్పర్థలను బాగా గమనిస్తాడు. ఉమ్మడి కుటుంబాల్లోని మాధుర్యాన్ని చవిచూడాలని కలలు కంటాడు. కాని కోడళ్ళవల్లనే ఉమ్మడి కుటుంబాలు విడిపోతున్నాయని గ్రహిస్తాడు.

రోజు రోజుకూ కోడళ్ళ మనస్పర్థలు, సాధింపులు యెక్కువవుతాయి. ఈ పరిస్థితులు రంగారావు మనసును కదిల్చివేస్తుంది. ఇంటిలోనివారందర్నీ సమావేశ పరుస్తాడు. రంగారావు తన కొడుకులు, కోడళ్ళ నుద్దేశించి మూడు కుటుంబాలుగా విడిపోతున్నామని చెప్పి, అందుకు తగ్గ కారణాల్ని బయటపెడతాడు. "స్థూలంగా చూస్తే మనకేదీ తక్కువ వున్నట్టు అనిపించదు. ప్రతి పురుషుడికీ, స్త్రీకీ హోదాలు మనసుపడే సౌకర్యాలున్నాయి.... .నా మాట నెగ్గాలనే పట్టుదలతో ప్రతిదీ పట్టించుకోవాలన్న వుత్సాహం వుండడం వుండవచ్చు.... ..నేను ప్రతి విషయంలోనూ కల్పించుకోవడానికి అనేక కారణాలున్నాయి. మీకు అవసరంగా కనిపించేది నాకు అనవసరంగా కనిపిస్తుంది. అందుకే కలుగజేసుకోవడం. మీరంతా సున్నితమైనవాళ్ళు. కష్టం వస్తే ఓర్చుకోలేరు. .. .. మీ స్వార్థానికి అడ్డుపడి మిమ్మల్ని బానిసగా చూసే మొగుళ్ళంటే మీరు విజృంభించినా అర్థం వుంది. గృహాన్ని స్వర్గంగా మార్చుకొనే అన్ని సౌకర్యాలున్నాయి. వాటినన్నిటిని మించిన పెంకితనం మంకుతనం పుష్కలంగా వున్నాయి........ఒక కప్పుకింద పదిమంది

జీవించడానికి సమకట్టినప్పుడు స్వపరభేదం మనసుల్లోకి రానివ్వకూడదు. నువ్విలా అన్నావు, అలా అన్నావు అని అనుక్షణం అనుకుంటూ ఒక చూడకింప జీవించటం అసాధ్యం—అసహ్యం. అందుకే మనం మూడు కుటుంబాలుగా విడిపోతున్నాం"[8] అని అంటాడు. రంగారావు మాటలకు యెదురుచెప్పక మూడు కుటుంబాలుగా విడిపోతారు. ఉమ్మడికుటుంబాలు విడిపోవడానికి ఆడవాళ్లే కారణమని రంగారావు పాత్ర ద్వారా రచయిత స్పష్టం చేశారు. రంగారావు పాత్రలో వేణుగోపాలరావు స్పష్టంగా కనిపిస్తారు. ఉమ్మడికుటుంబాలు విడిపోయి అన్యోన్యంగా వుండాలన్నది రచయిత అభిప్రాయమైనట్లు మనకు స్ఫురిస్తుంది.

## రాఘవరావు :

కొమ్మూరి వేణుగోపాలరావు పాత్ర సృష్టిలో రాఘవరావు పాత్ర మరువరానిది. 'సూర్యుడు దిగిపోయాడు' నవల్లో రాఘవరావు ఆఫీసులో గుమాస్తా ఉద్యోగి. తన జీవితాంతం కుటుంబపోషణకుగాను అంకితం చేసుకున్నవాడు. దిగాపడ్డ తండ్రి పాత్రలో రాఘవరావు మనకు దర్శనమిస్తాడు. తన పిల్లల భవిష్యత్తు కోసం అనుక్షణం ఇబ్బందుల్ని ఎదుర్కొంటాడు. చిన్నప్పటినుండీ ఒడుదుడుకులకు లోనై జీవితంలో గుమాస్తా ఉద్యోగాన్ని మాత్రం సంపాదించగలిగాడు. రాఘవరావు భార్య లక్ష్మి. మిత సంతానాన్ని లెక్కలోకి తీసుకోకుండా అమిత సంతానంతో యెన్నో యిబ్బందులకు గురి అవుతాడు. వాళ్ళకు చిన్న దెబ్బ తగిలినప్పటికీ ఆఫీసుకు శెలవుపెట్టి వాళ్లదగ్గరే కూర్చొనేవాడు. పిల్లల్ని పెద్ద చేయాలి, వాళ్లకు ఏ లోటూ రానీయకుండా చూసుకోవాలన్నది రాఘవరావు తపన. ఆఫీసుకు యెక్కువగా శెలవు పెట్టడంవల్ల అతనికి ప్రమోషన్ కూడా రాదు. పిల్లల్ని క్రమశిక్షణతో పెంచలేక పోవడంతో చెడు వ్యసనాలకు బానిసలౌతారు. ఎన్ని సమస్యల్ని యెదుర్కొన్నప్పటికీ భార్యా, పిల్లలు, బంధాల్ని గురించే ఆలోచిస్తాడు.

రాఘవరావు కొడుకు మోహన్ కిరస్తానీ అమ్మాయిని పెళ్ళి చేసుకుంటాడు. కూతురు విమల ముస్లింవాడిని ప్రేమించి, కాలుజారిందని తెలుస్తుంది. పెద్దకొడుకు గోజుకో ఉద్యోగం చేయడం జరుగుతుంది. రెండోకొడుకు ఇంజనీరింగ్ ఉద్యోగం చేస్తున్నప్పటికి తల్లిదండ్రుల్ని పోషించలేకపోవడం రాఘవరావు మనసు మరింత కలత చెందుతుంది. తమ బాధల్ని, పరిస్థితుల్ని,

పిల్లల అలక్ష్యాన్ని గూర్చి స్నేహితుడయిన అనంతమూర్తితో చెప్పుకుంటాడు. జీవితమంతా యింటికోసం, పిల్లలకోసం వాళ్ళ చదువుకోసం శ్రమపడి అలసిపోతాడు. రాఘవరావు భార్య లక్ష్మికి కేన్సర్ రావడంవల్ల హైదరాబాదులో చేర్పిస్తాడు. అప్పులభారం మరింత ఎక్కువ అవుతుంది. ఉన్నటువంటి యింటిని కూడా అమ్మివేస్తాడు. భార్యను దక్కించుకోవాలనుకుంటాడు. కానీ లక్ష్మి మరణిస్తుంది. ఇన్ని ఒడుదుడుకుల జీవితాన్ని తట్టుకోలేకపోతాడు రాఘవరావు. తన భార్య కేన్సర్‌తో బాధపడుతుంటే చూడటానికి కూడా పిల్లలు రాలేకపోవడంతో రాఘవరావు మరింత క్రుంగిపోతాడు.

రాఘవరావు తన పిల్లల భవిష్యత్తుకోసం కష్టపడి వాళ్ళకు సేవలు చేసినా అతనికి చివరకు మిగిలింది నిరాశా, నిస్పృహలే. నిలువ నీడకూడా లేకుండా పోతుంది. దగాపడ్డ తండ్రి అయ్యాడు. రాఘవరావు తను బాధ్యతాయుతంగాను, క్రమశిక్షణతోను పిల్లల్ని పెంచివున్నట్లయితే అన్ని ఒడుదుడుకులు ఎదుర్కొనే వాడుకాదు. తాను రిటైర్ కాబోతున్నాడు. విశ్రాంతి తీసుకొనే రోజులు దగ్గరకు వస్తున్నాయి. రాఘవరావు ఏదో వాంఛిస్తున్నాడు. కానీ పిల్లలనుంచి విధేయత, మెప్పుకోలు, ఆదరింపు, సేవలు, సుఖాలు యింకా ఏవేవో కోరుకుంటాడు, కాని అంతా నీటిబుడగలాగా కరిగిపోతాయి. అతని జీవితం ఆశ అడియాశ అవుతుంది. పిల్లలచేత దగాపడ్డ తండ్రి అవుతాడు. ఏ తండ్రికీ రాఘవరావులాంటి పరిస్థితి రాకూడదన్న అభిప్రాయాన్ని దృష్టిలో వుంచుకొని వేణుగోపాలరావుగారు యీ పాత్రను సృష్టించి జీవం పోశారు. రాఘవరావులాంటి తండ్రులు మన సమాజంలో ఎందరో వున్నారని చెప్పటానికి యీ పాత్ర చాలు.

**సత్యమూర్తి :**

'విషవలయం' నవల్లో బలరామయ్య పెంపుడుకొడుకు సత్యమూర్తి. విశాఖపట్నంలో బి.ఏ. చదువుతుంటాడు. స్వేచ్ఛాజీవి. దేన్ని గురించి నిర్దుష్టమైన అభిప్రాయం లేనివాడు. ఎప్పుడూ ఎవరో ఒకరి నీడ అతనిమీద పడుతుండాలి. సత్యమూర్తి తోటివిద్యార్థి అయిన ప్రసాద్ కష్టాల్ని తలచుకొని జాలిపడతాడు. బలరామయ్య పెరాలసిస్‌వల్ల మంచం పట్టడంవల్ల సత్యమూర్తి యిల్లు చేరుకుంటాడు. పెంపుడు కొడుకువని చెప్పి బలరామయ్య యావదాస్తిని తన భార్యపేర సగం, సత్యమూర్తిపేర సగం రాస్తాడు. తన ఆస్తిని కాపాడమని సత్యమూర్తితో

చెప్పి బలరామయ్య మరణిస్తాడు. కుటుంబ భారమంతా సత్యమూర్తిపై పడుతుంది. బలరామయ్య మరణంతో అతని భార్య రాధమ్మ తమ్ముడు వీరభద్రం, సత్యమూర్తి తరపున అతని తండ్రి ఆ యింటిని ఆశ్రయిస్తారు. దుష్టశక్తులు ప్రవేశించడంతో అనుకోకుండా చెలరేగిన కలతలవల్ల గృహ వాతావరణం అల్లకల్లోలమౌతుంది. ఆస్తి అనే విషవలయంలో చిక్కుకున్న సత్యమూర్తి ఉక్కిరిబిక్కిరి అవుతాడు. తమకు రావలసిన డబ్బుకోసం సత్యమూర్తి యెన్నో సందర్భాలలో హృదయం లేకుండా ప్రవర్తిస్తాడు. రాధమ్మకు, సత్యమూర్తికి ఆస్తి తగాదాల్ని సృష్టించినందు వల్లనే సత్యమూర్తి కోర్టుపక్షి అవుతాడు. వీరభద్రం ఎత్తుగడవల్లనే ఇలా జరుగు తోందని తెలుసుకుంటాడు. కాని ఎదిరించలేడు. సత్యమూర్తి చెల్లెలు విజయ. ఆమె, వీరభద్రం దుబారాగా ఖర్చుచేయడం సత్యమూర్తి చూడలేకపోతాడు. అందువల్ల ఆమె ఆస్తిని ఆమెకు దక్కేటట్టు చూడాలనుకుంటాడు. విజయ తన తల్లికి రాస్తున్న ఉత్తరాన్ని వీరభద్రం గూడుపుఠాన్ని చేస్తున్నట్టు అనుమానించి కనుక్కుంటాడు.

సత్యమూర్తి తన చెల్లెలు విజయను తీసుకురావడం కోసం హైదరాబాదు వెళతాడు. సత్యమూర్తి ఆమె హృదయవిదారకమైన జీవితాన్ని చూసి చలించి పోతాడు. ఇంటి దగ్గర విషయాలన్నింటిని చెప్తాడు. కాని విజయ సత్యమూర్తిని అపార్థం చేసుకుంటుంది. అందుకు సత్యమూర్తి "ఇన్ని సందేహాలు మనసులో పెట్టుకుని రానక్కరలేదు విజయా! మనిద్దరికి రక్తసంబంధం వున్నా, లేకపోయినా చాలాకాలం ఒక యింట్లో మెలగటంచేత సోదరివన్న అభిమానం ఏర్పడింది. నువ్విప్పుడున్న స్థితిని కళ్ళారా చూశాను. దిక్కుమాలినదానివై పోతావన్న ఆరాటంతో తీసుకువెళదామని తాపత్రయపడ్డాను"[4] అని అంటాడు. సత్యమూర్తి విజయకు న్యాయం చేకూర్చాలన్న పట్టుదలతో యింటికి తీసుకువస్తాడు. వీరభద్రం విజయకు కొంత డబ్బుయిచ్చి పంపివేస్తామని సత్యమూర్తితో లాలూచిపడతాడు. అయితే సత్యమూర్తి ఆ మాటల్ని తిరస్కరిస్తాడు. విజయ భర్త టి.బి. పేషంట్ కావడంవల్ల ఆసుపత్రి ఖర్చులన్నీ భరిస్తాడు. చివరకు వీరభద్రం దొంగతనం చేస్తూండగా సత్యమూర్తిచేత పట్టుబడతాడు. ఆసుపత్రి చేరిన సత్యమూర్తిని చూడటానికి తను ప్రేమించిన ఉష, సుధలు వస్తారు. సుధ కోరికమేరకు సత్యమూర్తి ఉషను పెళ్ళి చేసుకుంటాడు. సత్యమూర్తి తన చెల్లెలి ఆస్తిని అప్పచెబుతాడు.

మరొక్కసారి యీ విషవలయంలో చిక్కుకోకూడదనుకుని తన యావదాస్తిని ధర్మసంస్థలకు రాసిఇచ్చి ఉషతో విశాఖపట్నం వెళతాడు. సత్యమూర్తిలో దాతృత్వ గుణం చోటుచేసుకోవడం ఇక్కడ గమనింపతగ్గ విషయం. రచయిత సత్యమూర్తి పాత్రకు పూర్తి న్యాయం చేకూర్చారనే చెప్పవచ్చు. అడుగడుగునా తాను నలిగి పోతూ తన బాధను యెవరితోనూ చెప్పుకోలేని సత్యమూర్తి చివరకు బ్రతుకుమీద విరక్తిపుట్టి తన ఆస్తినంతా త్యాగం చేస్తాడు.

**లలితమ్మ :**

'మేడలో నీడలు' నవల్లో లలితమ్మ ఆదర్శగృహిణి. విశ్వనాథరావు భార్య లలితమ్మ. పేదకుటుంబం నుండి వచ్చినందువల్ల భర్తతో అన్యోన్యంగా కాపురం చేస్తుంది, తన భర్తకు కనకవల్లికి అక్రమసంబంధం వున్నప్పటికీ యెవరితోనూ చెప్పుకోదు. తన పుట్టింటికి సహాయం చేయాలనుకుంటుంది. కానీ తన భర్త అడుగుజాడల్లో నడుస్తుంది.

రామం భార్య మనోరమ; ఇల్లువదలి వెళ్ళిపోయినప్పుడు నలుగురూ నానా విధాలుగా అనుకుంటారు. లలితమ్మకు ఆ మాటలు విడ్డూరంగా కనిపిస్తుంది, కానీ కోడలిపై మంచి అభిప్రాయమే వుంటుంది. రెండో కొడుకు సుందరం వేరే కాపురం పెట్టడంవల్ల మరింత బాధపడుతుంది. లలితమ్మ పెద్దకూతురు సుభద్ర. ఆమె ఇద్దరు పిల్లలు మశూచితో మరణించినప్పుడు లలితమ్మ మరింత కృంగు తుంది. రెండో కూతురు ఆశ. ఆమె కట్నం ఎక్కువ తీసుకురాలేదని భర్త హింసించి పుట్టింటికి పంపివేయడంతో లలితమ్మ మాతృహృదయం విలవిలలాడు తుంది. మనోరమ పశ్చాత్తాపంతో తిరిగి భర్తను చేరుకోగా రామం తిరస్క రిస్తాడు. లలితమ్మ కోడల్ని మన్నించమని ప్రాధేయపడుతుంది. తల్లి మాటల్ని పెడచెవి పెట్టినందువల్ల లలితమ్మ మనసులో భర్తతో యాంత్రికజీవితం గడపడం వల్లనూ, మనస్తాపం తీర్చలేని పిల్లలూ, మనశ్శాంతి ఇవ్వని పిల్లలూ యిదంతా తలచుకొని భరించలేని అశక్తతకు లోనౌతుంది. ఆత్మహత్యే శరణ్యమని ఆత్మ హత్యాప్రయత్నం చేసుకోపోగా, మనోరమ కాపాడుతుంది. బరువు, బాధ్యత, కరుణ, విశాలత్వం, ఓర్పు, దైన్యం అన్నీ మూర్తీభవించిన ఆదర్శమూర్తిగా మనకు లలితమ్మ దర్శనమిస్తుంది. తన కుటుంబంలో యెన్ని గొడవలు

వచ్చినా ఎవరితోనూ చెప్పుకోదు. రచయిత లలితమ్మను ఆదర్శగృహిణిగా తీర్చిదిద్దారు.

**రంగాజమ్మ :**

'భారతి' నవల్లో రంగాజమ్మ పాత్ర కీలకమైంది. సాధారణంగా అత్తలు యింటికి వచ్చిన కోడళ్ళను కూతుళ్ళలాగానే చూసుకోవాలి. కానీ కట్నం ఎక్కువ తీసుకురాలేదనో, తన మాట వినడంలేదనో మాటిమాటికి కోడల్ని హింసిస్తూ వుంటారు. అలాంటికోవకు చెందని మహిళ రంగాజమ్మ. రంగాజమ్మ భర్త మాటలను జవదాటని ఆదర్శమహిళ. ఆమె కోడలుగా భారతి ఆ యింటిలో ప్రవేశిస్తుంది. రంగాజమ్మ యింటిలోని మెలుకువలు, జాగ్రత్తలు గురించి కోడలికి వివరిస్తుంది. భారతికి కుష్ఠువున్నది తెలిసి కూడా రంగాజమ్మ అసహ్యించుకోక సానుభూతి వ్యక్తం చేస్తుంది. తన కోడల్ని ఇంటినుండి వెళ్ళగొడుతున్న భర్తతో మన్నించమని ప్రాధేయపడుతుంది. గంగాధరం పెడచెవిపెట్టడంతో యెప్పుడూ యెదిరించని రంగాజమ్మ భర్తకు ఎదురుతిరుగుతుంది. భర్తచేత దెబ్బలు తింటుంది. ఇంటిగుట్టును బయటికి పొక్కనీయకుండా కాపాడటానికే ప్రయత్నిస్తుంది. కానీ ఆమె ప్రయత్నం విఫలమవుతుంది.

భారతిచేత కోర్టులో తప్పుడు సాక్ష్యం చెప్పించి విడాకులు ఇప్పించినప్పుడు రంగాజమ్మ కడుపుకోతతో రోదిస్తుంది. 'భారతి ఒక్క నిజం చెప్పివుంటే అంతా బూడిదలో పోసిన పన్నీరయ్యేది' అనుకుంటుంది. తన కోడల్ని తననుండి దూరం చేసినందుకు ఆమె అనుభవించిన మానసికక్షోభ భరింపరానిది. తండ్రి కారణంగా భార్యను, కొడుకు దూరం చేసుకున్నాడనుకుని కుమిలిపోతుంది. గంగాధరం తన కొడుక్కి రెండో పెళ్ళి చేసినప్పటికీ పిల్లలు పుట్టకపోవడంతో రంగాజమ్మ దుఃఖిస్తుంది. రంగాజమ్మ తన కొడుకు జీవితం యిలా అయిందనే మానసిక వ్యధకు గురై మరణిస్తుంది. చాందసపు భర్తతో కాపురం చేస్తుంది. రంగాజమ్మ పాత్రలో సహనం, ఓర్పు, జాలి మనకు కనిపిస్తుంది.

## 3. వైవాహిక జీవిత సంబంధాలు :

మానవుని జీవితంలో నాలుగు దశలున్నాయి. అందులో యౌవనదశ ప్రధానమయింది. యౌవనంలో వ్యక్తి ఒక యింటివాడు కాగానే అతనిలో తన

భార్య తన పిల్లలనే స్వార్థభావన, చింతన కలిగివుండటం సహజం. అలాగే వివాహ పూర్వ జీవితానికి వివాహానంతర జీవితానికి తేడాలుంటాయి. కట్టుబాట్లు నియమాలు, సంప్రదాయాలు పాటించడం వివాహానంతర జీవితంలో తప్పవు. అంతే కాకుండా కుటుంబ నిర్వహణలోని ఆటుపోట్లు వాటి పరిణామాలు సహజం. కాని వాటిలో స్త్రీ పాత్రకు ప్రముఖస్థానం తప్పక వుంటుంది.

**మనోరమ :**

'మేడలో సీతలు' నవల్లో ప్రధాన పాత్ర మనోరమ. ఆమె రామం భార్య. ఇంటి పెద్దకోడలు. కళాశాల జీవితంలో రామంను ప్రేమించి పెళ్ళి చేసుకుంది. మనోరమ కళాపిపాసి. సౌందర్యోపాసి, స్వేచ్ఛాప్రియ. అత్తమామల్ని గౌరవిస్తుంది, కాని ఆమెకు యింటి వాతావరణం యిరుకనిపిస్తుంది. ఇదికాదు జీవితం వేరేదో వున్నదని జీవితంలో నూతనత్వం కోసం ప్రయత్నిస్తుంది. నటనంటే చెవికోసుకుంటుంది. భర్తను మనస్ఫూర్తిగా ప్రేమిస్తుంది. నటించడంలో నా జీవితం సార్థకమౌతుంది. తిరిగి నటిస్తానని పట్టుబడుతుంది. 'మనిషి తన స్నేహితురాలితో హర్షించేది ప్రేయసితో హర్షించేది యింటి ఇల్లాలితో హర్షించలేడు' అదే విధంగా రామం మనోరమ కోరికను మన్నించడు. అభిరుచుల్ని అణచుకొని వాస్తవిక జగత్తులో జీవించడానికి రాజీపడాలంటాడు. మనోరమ భర్తతో మనస్పర్థలు తెచ్చుకొని దెబ్బలు కూడా తింటుంది. మనోరమ యింటిలో పనిచేస్తున్న వయసు కుర్రాణ్ణి తీసుకుని వెళ్ళిపోతుంది. ఇరుగుపొరుగువాళ్ళు మనోరమను గురించి ఎన్నోవిధాలుగా అనుకుంటారు. ఆ కుటుంబానికి మనోరమ తలవంపు తెస్తుంది. పట్నం చేరుకున్న మనోరమకు స్నేహితురాలు లీల తటస్థపడుతుంది. మనోరమ స్వేచ్ఛాప్రియత్వాన్ని గ్రహించిన లీల ఆమెకు హితోపదేశం చేస్తుంది. కానీ మనోరమ జీవితంలో యేదో సాధించాలని పాటలు పాడుతుంది. మనోరమ సహజంగా చొరవగలదే, సౌందర్యవతి కావడంవల్ల అనేకమంది స్నేహితుల్ని సంపాదించుకోగలిగింది. సినిమా నటిగా కూడా రాణించాలనుకుంది. కొత్తశకం ప్రారంభమైనట్టు పగటి కలలు కంది. లోకంలోని దుష్టశక్తులను తట్టుకోలేక పోతుంది. ఓ లక్షాధికారి ఆమె శీలాన్ని అపహరించడానికి దూరంగా తీసుకెళ్ళగా తప్పించుకు వచ్చేస్తుంది. మనోరమ క్రోధావమానాలతో దహించుకుపోతుంది. ఈ మనుషులు, ప్రాపంచిక స్వార్థపరుల, అసత్యవాదుల, అవినీతిపరులలోకం అనుకుంటుంది.

ఆమెకు చేదునిజం యీనాటికి తెలియపస్తుంది. మనోరమ తన 'ఆశయం, స్వేచ్ఛా ప్రియత్వపుమూట ఖజాన పెట్టుకొని ఎక్కడికి వెళ్ళినా అదే సమస్య' ఎదురవు తుంది. ఆమె ఆకర్షణశక్తి ఇప్పుడు శత్రువుగా పరిణమిస్తుంది. ఆమెను దయ్యమై నాగదంష్ట్రమై వేధించసాగింది.

మనోరమ ఆత్మ విమర్శ చేసుకుంటుంది. స్వేచ్ఛ, వాస్తవిక ప్రపంచం, స్వార్థానికిగల స్థానాన్ని ఆలోచిస్తుంది. తన కళాపిపాస. తపన, తృష్ణను తలచు కొని దుఃఖిస్తుంది. ఒంటరితనంతో ఎన్ని కష్టాలు కొనితెచ్చుపెట్టుకుందో మనోరమ పాత్ర ద్వారా తెలుస్తుంది.

మనోరమ పశ్చాత్తాపంతో భర్తను చేరుకుంటుంది. రామం మనోరమ కోరికను తిరస్కరిస్తాడు. పంటవాడితో లేచిపోయినందుకు మనోరమను రామం అనుమానిస్తాడు. అప్పుడు మనోరమ భర్తతో "నేను కళంకిని కాను. ఎలాంటి నిందయినా వెయ్యండిగాని, నా శీలాన్ని మాత్రం శంకించకండి. ఎంతోమంది నన్ను పాడుచెయ్యాలని చూశారు. నేను వెళ్ళిన ఉద్దేశం అదికాదు. ఈ శరీరం మలినపడలేదు. నామాట నమ్మండి"[5] అని ప్రాధేయపడుతుంది. తన జీవిత అంధకార బంధురాన్ని, దురాశను, పేరాశను చెప్తుంది. మీ భార్యగా, గృహిణిగా, తిరిగి జీవించాలంటుంది. 'ఈ పొంగి పొర్లే ప్రేమని ఉద్రేకవాహిని నాలో యిముడ్చుకోలేను నాకు మీరు కావాలి' అని పిచ్చిదానిలా రోదిస్తుంది. కోడలి దుస్థితి చూసిన లలితమ్మ కొడుకుతో మన్నించమంటుంది. తల్లిమాటల్ని కూడా తిరస్కరించినందుపల్ల మనోరమ మానసికవ్యథతో స్పృహతప్పి పడిపోతుంది. లలితమ్మ కోడల్ని కాపాడుతుంది. 'వారికి నేనింక పనికిరాను. నేను చచ్చిపోతాను' అని ఏడుస్తుంది. అత్తమామలు కలుగచేసుకోవడంతో రామం మనోరమకు స్థాన మిస్తాడు. ఇల్లు వదలి వెళ్ళిపోయిన స్త్రీలకు రచయిత చేస్తున్న హెచ్చరిక ఇక్కడ ప్రధానాంశం.

**కమల :**

'ఒకే పాటకు రెండు రాగాలు' నవల్లో కమల ఒక ప్రత్యేక తరహా పాత్రలో కనిపిస్తుంది. ప్రతి నవల్లోని వైవిధ్యం చూపినట్లే పాత్రల చిత్రీకరణలో కూడా వేణుగోపాలరావుగారు వైవిధ్యం చూపించారు. లెస్బియన్‌కు అలవాటుపడ్డ

పాత్ర కమల. ఇందులో వాస్తవం యెంతో వుంది. విచిత్ర మనస్తత్వం గల పాత్ర. ఉద్యోగ నిర్వహణ కోసం తన యింటికి వచ్చిన శివరాంను కమల ప్రేమిస్తుంది. తల్లిదండ్రులు అయిష్టత తెలిపినప్పటికీ శివరాంను పెళ్ళి చేసుకుంటుంది. హనీమూన్ వెళ్ళిన శివరాం కమలను ముద్దుపెట్టుకుంటాడు. అందుకు కమల 'ఇదేనా పెళ్ళి ఛీఛీ పెళ్ళయ్యాక నా నిజస్వరూపం తెలుసుకున్నాను, నేను పనికి రాను' అని యిలా మాట్లాడుతుంది. కమల తన భర్తతో సంగమానికి సమ్మతించదు. అందుకు కారణం తన స్నేహితురాలైన కళ్యాణే కారకురాలు. కమల, కళ్యాణితో లెస్బియన్‌కు అలవాటుపడటంవల్ల కమల తన భర్తతో కాపురం చేయలేక పోతుంది. శివరాం, కమల వేరే కాపురం పెట్టగా కళ్యాణి కూడా వారితోపాటే మరో గదిని అద్దెకు తీసుకుంటుంది. కమల, కళ్యాణిలు దంపతుల్లాగా పడుకొని వుండటం శివరాంకు వాళ్ళ పరిస్థితి యేమిటో అర్థమవుతుంది. భార్యాభర్తల్లో మనస్పర్థలు యెక్కువవుతాయి. శివరాం తన భార్యతో మంచితనంగానే కాపురం చేయమంటాడు. తన కోర్కెవల్ల శివరాం మరింత దగ్గర కాగా, కమల మంగళ సూత్రాన్ని తెంచేస్తానని బెదిరిస్తుంది. కమల పుట్టింటికి వెళ్ళి తన భర్తకు విడాకు లిస్తానంటుంది. కమల, శివరాం ల దాంపత్య చరిత్ర యెంతోమంది నోళ్ళలో నిర్దయగా నలుగుతుంది. శివరాం పట్టువదలని విక్రమార్కుడిలా కమల దగ్గరకు వెళ్ళి యింటికి రమ్మని బ్రతిమాలుతాడు. అందుకు కమల "రక్తమాంసాలు లేని ఒట్టి యంత్రాన్ని నేను. నన్ను తీసుకెళ్ళి యేదో బావుకుందామని యెందుకు ఆరాట పడతావు. బోలెడు జీవితాన్ని అనుభవించాల్సినవాడివి. ఇంకెవర్నయినా పెళ్ళి చేసుకుని సుఖపడు. నీ శ్రేయోభిలాషిగానే నేనిచ్చే సలహా యిదే"[6] అని అంటుంది.

కళ్యాణి, కమలను భర్తతో కాపురం చేయమంటుంది. ఆమె మాటను కూడా పట్టించుకోదు. శివరాం కమలదగ్గరకు మళ్ళీ వచ్చి ప్రాధేయపడతాడు. కోపంతో కోర్టుకెక్కి అల్లరి చేస్తానంటాడు. ఆవేశంతో కమల తన భర్తను చంపడానికి ముందుకు వస్తూ 'యూ ఫూల్' అని రెండు చేతులు దగ్గరకు చేరుస్తూ పైకెత్తగా ఉమాపతిరావు అడ్డుపడతాడు. కమల తమ్ముడు మోహన్ శివరాంను అవమానించి గెంటివేస్తాడు. కమలవల్ల శివరాంను నడివీధిపాలై అందరిచేత అవమానింపబడతాడు. కమల. శివరాం ల మధ్య తానుండకూడదనుకొంటుంది కళ్యాణి. అంచేత కమలకు ఓ ఉత్తరం రాసి దూరంగా వెళ్ళిపోతుంది. కమల

చేసిన పరాభవంవల్ల శివరాం త్రాగుడికి అలవాటుపడతాడు. కళ్యాణి ఉత్తరంవల్ల కమల పశ్చాత్తాపం చెందుతుంది. కమల చేసిన అవమానానికి శివరాం ప్రతీకారంగా ఆమెను చెరచమని ఒక గూండాని పురికొల్పుతాడు. మత్తుదిగిన శివరాం తన భార్యకు అన్యాయం జరుగకూడదనుకుని తన భార్యను రక్షిస్తాడు. ఇరువురూ పశ్చాత్తాపంతో ఒకటవుతారు. కమల, కళ్యాణితో వున్న సంబంధంవల్లనే తన భర్తను మానసిక హింసకు గురి చేస్తుంది. కమల ఫ్రిజిడిటీగా తయారవుతుంది. చివరకు కళ్యాణి వల్లనే వాళ్ళ కుటుంబం ఒకటవుతుంది. కమల, కళ్యాణిలాంటి పాత్రలు వాస్తవిక జగత్తులో వుండడంతో వీరిని రచయిత సృష్టించాడు.

**భారతి :**

'భారతి' నవల్లో భారతి ప్రధానపాత్ర. కుష్టువ్యాధికి గురియైన భారతి తన జీవితంలో ఎటువంటి అవమానాలకు గురి అవుతుందో యీ పాత్ర ద్వారా రచయిత చూపించారు. కుష్ఠువ్యాధి మనం భయపడేంతటి భయంకరమైన వ్యాధి కాదని భారతి పాత్ర ద్వారా వేణుగోపాలరావు నిరూపించి యున్నారు. మానవ దృక్పథంతోను, మనోవైజ్ఞానికంగాను భారతి పాత్రను పాఠకులు కలకాలం గుర్తుండేటట్లు చేయగలిగారు. గౌరీపతి కూతురు భారతి. పెళ్ళికాక ముందే ఆమెకు 'కుష్ఠు' వున్నట్టు డాక్టర్ గోవిందరావు నిర్ధారిస్తాడు. భారతి అందాన్ని చూసిన సారథి ఆమెను ప్రేమిస్తాడు. సారథి పెళ్ళికి సమ్మతించిన విషయం భారతికి తెలుస్తుంది. భారతి తన తండ్రితో పెళ్ళి సమ్మతిని ప్రకటిస్తూ తనకున్న వ్యాధిని గుర్తుచేస్తుంది. గౌరీపతి మాటలకు భారతి ఎదురుచెప్పలేక పోతుంది. సారథి భారతిల పెళ్ళి జరిగిపోతుతుంది. భారతి మెట్టినిల్లు చేరుకుంటుంది. భారతి మామ గంగాధరం. గంగాధరం స్నేహితుడు గోవిందరావు. గోవిందరావు భారతికివున్న కుష్ఠును బయటపెడతాడు. భారతిని మామ అయిన గంగాధరం అవమానించి పుట్టింటికి పంపిస్తాడు. అక్కడున్న రెండు రోజుల్లో భారతి అత్త రంగాజమ్మ కోడల్ని కన్నకూతురులాగే చూసుకుంటుంది. కోడల్ని మన్నించమని భర్తతో ప్రాధేయపడుతుంది. భారతి రంగాజమ్మకో 'నేను పాపిష్టిదాన్ని, జబ్బు పాపిష్టిది కాదత్తయ్యా' అని విలపిస్తుంది.

భారతి గంగాధరం ఆజ్ఞప్రకారం పుట్టినిల్లు చేరుతుంది. కొళ్ళకు పారాణి ఆరని తన కూతుర్ని చూసిన గౌరీపతి గుండెపోటుతో మరణిస్తాడు. గంగాధరం

తన కొడుక్కి విడాకులిప్పించమని భారతి దగ్గరకు వస్తాడు. భారతి తన మామతో మీవాడికి అడ్డురానని హామీ యిస్తుంది. కోర్టులు అనవసరమంటుంది. భారతి మనసులో కోర్టుకెక్కి కుటుంబాన్ని అప్రతిష్టపాలు చేయకూడదనుకుంటుంది. గంగాధరం మాటను మన్నించి భారతి కోర్టులో అపనిందలకు గురిఅవుతుంది. వారిచే వంచింపబడుతుంది. తనను కీలుబొమ్మనుచేసి ఆడిస్తున్నప్పటికి భారతికి అసహ్యం కలుగకుండా సహనం వహిస్తుంది. వాళ్ళను చూసి జాలిపడుతుంది. మామ మాటల్ని మన్నిస్తుంది. భారతి కోర్టుద్వారా విడాకులు తీసుకున్నప్పటికీ మంగళసూత్రం మాత్రం మెడలోనే దాచుకుంటుంది.

మల్లిక ప్రోత్సాహంతో భారతి, డాక్టర్ సాగర్ దగ్గరకు వెళ్ళగా కష్టు నయమవుతుంది. భారతి వూహాప్రపంచంలో విహరించాలనుకుంటుంది. మల్లిక గతజీవితాన్ని గుర్తుచేయగా మానసికంగా అతని భార్యగానే వుంటాను, అతని స్మృతి యీ జీవితంలోంచి చెరిగిపోదంటుంది. భారతికి మళ్ళీ చదవాలనిపిస్తుంది. నర్సరీ ట్రెయినింగ్ పూర్తి చేస్తుంది. భారతిలోని జీవితంలో మార్పుల్ని గురించి రచయిత "జీవితంలో మార్పు జరిగాక, ఆ కొత్త అధ్యాయంలో లీనంకాగలిగితే గతంలోని కష్టాన్ని చాలా సులభంగా దాటిపోగలిగే శక్తి వస్తుంది మానవునికి. ఈ మార్పే తన జీవితానికి నిర్దేశమైన పథకం అని కూడా నమ్మటం జరుగుతుంది. ప్రస్తుతం అలాంటి పరిస్థితిలో వుంది భారతి"[7] అంటున్నారు. భారతి నర్సరీ ట్రెయినింగ్ పూర్తి అయిన తరువాత తను కుష్ఠురోగులకే సేవ చెయ్యాలని నర్సుగా తన కోరిక ప్రకారం కలికిరి ఆసుపత్రికి వెళుతుంది.

కలికిరి ఆసుపత్రిలో డాక్టర్ గోవిందరావుని చూసి ఆశ్చర్యపడుతుంది. అతని అవినీతిని, అరాచకాన్ని బయటపెట్టి మాట్లాడుతుంది. గోవిందరావు భారతి గతాన్ని గుర్తుచేస్తాడు. ఇతనివల్లే తన జీవితం నాశనమయ్యిందనుకుంటుంది. భారతి కుష్ఠురోగులకు మానవతా దృక్పథంతోనే సేవలు చేస్తుంది. వాళ్ళను ముట్టుకోవడానికి ఏనాడు సంకోచించలేదు. భారతి అందాన్ని చూసి ఆమె శీలాన్ని అపహరించాలనుకుంటాడు గోవిందరావు. భారతి కత్తి చూపేలోపుగా గోవిందరావు తనకున్న దయాబీస్‌వల్ల భయపడతాడు. లక్ష్మిని బలవంతం చేయబోయిన గోవిందరావుకు ఇనుపముక్క తగిలి ధనుర్వాతంతో మరణిస్తాడు. గోవిందరావు స్థానంలోనే డాక్టర్ సాగర్ రావడంతో ఆసుపత్రి బాగుపడుతుంది. సారథి రెండో భార్య

కుంతల భారతి దగ్గరకు వచ్చి పుత్రభిక్ష పెట్టమని తన భర్తను కాపాడమని అర్థిస్తుంది, కుంతల మాటను మన్నించి భారతి సారథి దగ్గరకు వెళుతుంది. భారతి భర్తతో తన పరిశుద్ధమైన ఆత్మను గురించి చెప్తూ "నా శరీరం రోగంతో, అసహ్యమైన మచ్చలతో విధి చిన్నచూపు చూసినపుడు తెగతెంపులు చేసుకున్నప్పుడు, నర్స్‌గా వృత్తిని స్వీకరించినపుడు, రోగుల మధ్య నిర్విరామంగా తిరిగినపుడు పరిశుద్ధమైన ఆత్మే నాలో వుందని"[8] చెప్తుంది. సారథి, భారతితో సంగమాన్ని కోరగా "మీరు దూరంగా వున్నన్నాళ్ళు మీరు నావారనిపించింది, ఇప్పుడు మీలో నాకేం ప్రత్యేకత కనిపించలేదు. ఓ పరాయిపురుషుణ్ణి చూస్తే యెలా వుంటుందో మిమ్మల్ని చూసినా అలానే వుంది. నాలో ఏ స్పందన అనుభూతి కలగడంలేదు. మీతో కలిసి జీవనయాత్ర సాగించడం అసంభవమన్న విషయాన్ని గుర్తించా"[9] నంటుంది. భారతి తను దాచిన మంగళసూత్రాన్ని గురించి గౌరవాన్ని చెప్తుంది. తన జీవితం మరోదారిని మలచుకోవడానికి స్వేచ్ఛగా వుండటానికి మంగళసూత్రాన్ని తీసివేస్తుంది. కలికిరి కుష్ఠువ్యాధి పీడితుడయిన సాగర్‌ను తీసుకొని డాక్టర్ పాల్‌బ్రాండ్ దగ్గరికెళుతుంది. భారతిలో యెన్ని ఒడుదుడుకులు వచ్చినప్పటికీ దివ్వెలా వెలుగుతున్న సత్యమే ఆమెను ముందుకు నడిపిస్తుంది.

**సహజ :**

'డాక్టర్‌గారి భార్య' నవల్లో సహజ కీలకపాత్రధారి. డాక్టర్ నరేష్ భార్య. ప్రతిపురుషుడి వెనుక స్త్రీ హస్తం వున్నట్లే ఇందులో డాక్టర్ నరేష్‌కు వైద్యవృత్తిలో ప్రోత్సహాన్నిచ్చి ముందుకు నడిపిస్తుంది. నరేష్ వృత్తిలో వున్నప్పుడు అతన్ని క్రుంగదీసే అపజయాల్లో ఆమె శ్రేయోభిలాషిలా, భార్యగా, భాగస్వామిగా అతని వ్యక్తిత్వాన్ని నిలబెట్టి అపూర్వమైన డాక్టరుగా యెలా మలచుకోగలిగిందో ఒక స్త్రీగా మనకు సహజ యిందులో సహజంగా దర్శనమిస్తుంది. సహజ తన భర్తకు జీవితాంతం తోడుగా, నీడగా వుండాలన్నదే ఆమె అభిమతం. తనని తాను బయటపెట్టుకోవడం మొదట్నుంచీ ఆమెకు అలవాటులేదు. పేషంట్స్ ఆలస్యంగా వచ్చినప్పటికీ మనమే ముందుండాలి. మనం పుట్టి పెరిగిన వాతావరణానికీ, మనస్తత్వాలకు, ఎపాయింట్‌మెంట్ కుదరదు. బాధ కలిగినా, డాక్టరే భరించాలని ఓర్పు చెప్తుంది. భర్త సాధకబాధకాల్ని అర్థం చేసుకునే గృహిణిగా వుంటూ, ఓ ఉదాత్తమైన డాక్టరుగా రూపొందించాలనే కోర్కె ఆమెలో బలంగా వుంటుంది,

వృత్తిలో మనోనిబ్బరం ప్రదర్శించాలంటుంది. తన భర్త ఎంత రాత్రికి వచ్చినా ఏనాడు ఆమె ముఖంలో చిరునవ్వు చెరగకుండా వుంటుంది. ఆమెలో ఆదర్శ వ్యక్తిత్వం కనబడుతుంది. ఒక డాక్టరుగా పేషంట్‌కు ప్రాణం పొయ్యడానికి తన శక్తినంతా ధారపొయ్యాలికాని తాను మాత్రం పెన్సన్‌లోనైనా ప్రశాంతతను పోగొట్టుకోకూడదంటుంది. డాక్టరు అనేవాళ్లు నిగ్రహం పాటించాలన్నది 'సహజ అభిప్రాయం'.

ఓ ముసలావిడ బస్సుకింద పడటంతో ప్రాణాపాయస్థితిలో నరేష్ దగ్గరకు తీసుకువస్తారు. ఆ సమయంలో నరేష్ స్నానం చేస్తున్నందువల్ల సహజ వాళ్ళతో వేరే యేర్పాటు చేసుకోమంటుంది. సహజ మనసులో 'ఈ మనిషిని ఒక మంచి డాక్టరుగా రూపొందించాలని' అహర్నిశలూ శ్రమింపజేస్తుంటే మనకి విశ్రాంతి లేకుండా చేస్తోంది' అని కళ్ళల్లో నీళ్ళు పెట్టుకుంటుంది. మానసికంగా వ్యథ చెందుతున్న నరేష్‌తో సహజ 'మీరు డాక్టరు. అవివేకంతో రోగికానీ. రోగి తాలూకువాళ్లుగానీ అన్నమాటలు క్షమించే స్థితికి యెదగాలంటుంది. పట్టణంలో కర్ఫ్యూ అమలులో వుండగా సహజకు డెలివరీ పెయిన్స్ రాగా నరేష్ ఆ పనిని నిర్వర్తిస్తాడు. అందుకు సహజ 'నేను ఒక డాక్టరుభార్య అయినందుకు గర్విస్తున్నా' నంటుంది. సహజ కొన్ని సమయాల్లో కఠినంగా మారుతుంది కూడా. తన భర్తకు జాండీస్‌వల్ల లేవలేని స్థితిలో వున్నప్పుడు వచ్చిన సీరియస్ కేసును తిరస్కరించి పంపేస్తుంది. ఇక్కడ అతని భార్యగా, తన ధర్మాన్ని నిర్వర్తించుకుంటుంది. సహజ తిరస్కరించిపంపిన పిల్లవాడు మరణించడంతో సహజ నరేష్‌లు కోర్టు కెక్కవలసి వస్తుంది.

సహజ తన భర్త తరపున కోర్టుకు సాక్షిగా వెళుతుంది. తన భర్తను అవకతవక ప్రశ్నలతో వేధించడం చూడలేకపోతుంది. సహజను క్రాస్‌ఎగ్జామ్ చేయగా వృత్తిధర్మంకోసం, సుఖాన్ని. ఆరోగ్యాన్ని, సర్వస్వాన్నీ త్యాగం చేస్తున్న ఓ ఉత్తముడ్ని గురించి వివరిస్తుంది. కోర్టులో జరిగే అవకతవకలు. కాలయాపన చేస్తూ వృథాపరిచే లాయర్లపై విరుచుకుపడి మాట్లాడుతుంది. సహజ కోర్టులో మాట్లాడిన మాటలవల్ల పత్రికావిలేఖరులు గోష్టి కార్యక్రమం ఏర్పాటుచేస్తారు. డాక్టరు వృత్తినిగురించి. సమాజాన్ని గురించి, స్త్రీ సమాన్ని దోచుకోవడం గురించి. ప్రస్తుత వైద్యవిజ్ఞానం గురించి విలేఖరులు అడిగిన ప్రశ్నలకు సమాధానమిస్తుంది.

సహజ ఏదో తపన, ఆశయసాధన, సజీవత్వం వున్నట్టు తెలుస్తుంది. సహజ గోష్టి కార్యక్రమాన్ని పత్రికల్లో ప్రచురించగా కేసు పెట్టిన వ్యక్తి కేసును ఉపసంహరించుకుంటాడు. జయచంద్ర నరేష్ పైవున్న మమకారంతో చనిపోతూ యావదాస్తిని నరేష్ పేరున రాసివెళ్ళగా జయచంద్ర మెమోరియల్ ఆసుపత్రి నిర్మాణం జరుగుతుంది. ఆసుపత్రి ప్రారంభోత్సవంలో నరేష్ భార్య ప్రోత్సాహాన్ని గురించి మాట్లాడటం సముచితంగా వుంది.

**హారతి :**

ఆంధ్ర పాఠకుల హృదయాలకు హారతి పట్టిన కొమ్మూరివారి మరో మణిపూస 'హారతి' నవల. ఇందులోని ఇతివృత్తం ప్రధానపాత్ర అయిన హారతి చుట్టూ తిరుగుతుంది. హారతికి పెళ్ళయిన మరుసటిరోజే రైలులో ప్రయాణిస్తుండగా, ప్రమాదానికి గురై ఆమె భర్త మరణిస్తాడు. కాళ్ళకు పారాణి ఆరణి హారతి వైధవ్యం పొందుతుంది.

ఆదిశేషయ్య, శ్రీధర్ తండ్రీ కొడుకులు. వీళ్ళ భార్యలు కూడా అదే రైలులో ప్రమాదంలో మరణిస్తారు. టాంక్‌బండ్‌పైన ఆదిశేషయ్యకు హారతి పరిచయమౌతుంది. హారతిని ఇంటికి రమ్మని ఆదరిస్తాడు. హారతి యింటిలో పరిచారికగా వుంటుంది. శ్రీధర్ ఒక్కగానొక్క కొడుకు చిట్టిబాబుకు తల్లిలేనిలోటు తీరుస్తుంది. ఆ తండ్రీకొడుకుల జీవితంలో వెలుగనిపిస్తుంది హారతి. తన గతాన్ని ఎవరితోనూ చెప్పుకోదు. భార్యలు పోయిన వ్యథతోవున్న తండ్రీకొడుకుల వ్యసనాన్ని మంచి మాటలతో మాన్పిస్తుంది. పక్కింటి పిల్లవాడు చెరువులో మునిగి మరణించడంతో ఆ నింద చిట్టిబాబుపై పడుతుంది. ఆ కన్నతల్లి చిట్టిని నానామాటలు అంటుంది. హారతి మధ్యలో కలుగజేసుకొని మాట్లాడుతుంది. అందుకు ఆమె త్రాగుబోతుల కొంప, దొంగలకొంప అని నిందిస్తుంది. పైగా హారతిని గురించి వ్యంగ్యంగా మాట్లాడుతుంది.

ఆదిశేషయ్య, హారతిని తన కొడుకుకిచ్చి పెళ్ళి చేయాలనుకుంటాడు. అదేమోస్తరుగా శ్రీధర్ కూడా తన తండ్రితో ఆమెను చూసుకోవాలనుకుంటాడు. ఈ అభిప్రాయాల్నే తమతమ మనసులోవున్న మాటల్ని బయటపెడతారు. ఆ మాటల్ని హారతి వింటుంది, తండ్రీకొడుకులకు తన గతాన్ని చెప్పి వెళ్ళిపోవడానికి ప్రయత్నిస్తుంది. చిట్టిబాబు హారతి కాళ్ళకు బంధంవేయగా, ఆ ఇంటిలోనే

వుండిపోతుంది. హారతి శ్రీధర్‌కు చెందినట్టే మనం భావించుకోవాలి. వ్యసనపరుడైన తండ్రీకొడుకుల బాధ్యతల్ని గుర్తుచేస్తుంది. తాను హారతికర్పూరంలా హరించుకుపోతున్నా, ఉన్నంతకాలం పవిత్రమైన వెలుగును వెదజల్లుతుంది. ఈ లోకంలో కాళ్ళకు పారాణి ఆరకముందే వైధవ్యం పొందిన స్త్రీకి శోకంకంటె మించిన శోకం వుందా? ఆ శోకాన్ని ఎవరికీ తెలియకుండా తనలోనే యిముడ్చుకుంటుంది. తను హారతిలా హరించుకుపోతున్నా జ్యోతిలా ఆ యింటికి వెలుగును నింపిన అఖండజ్యోతి హారతి. సాహితీ భారతికి వేణుగోపాలరావుగారు సాదరంగా సమర్పిస్తూ తెలుగు ప్రజల హృదయాలలో వెలిగించిన కర్పూరహారతి ఈ హారతి.

## నివేదిత :

'నివేదిత' నవలలో కీలకమైన పాత్ర వేదిత. నవల యితివృత్తమంతా ఈమె చుట్టూరానే పరిభ్రమిస్తుంది. ఈ నవలకి మూలాధారం ఈమె అని చెప్పుకోవచ్చు. శేషశాయి, కళ్యాణమూర్తి ఇరువురు వేదితను ప్రేమిస్తారు. వేదిత మాత్రం కళ్యాణమూర్తితోనే కళ్యాణాన్ని కాంక్షిస్తుంది. వర్ణాంతరం మధ్య అగాధం, వాళ్ళ వైవాహిక విషయంలో కూడా పూడ్చలేని అగాధం సృష్టిస్తుంది. పర్యవసానంగా వేదిత మరొకరిని వివాహమాడుతుంది. వేదిత విధివైపరీత్యంవల్ల వైధవ్యానికి గురై స్వగ్రామం తిరిగి చేరుకుంటుంది. విదేశాలకు వెళ్ళిన కళ్యాణమూర్తి మళ్ళీ రావడం వేదితతో కళ్యాణానికి సిద్ధం కావడం జరుగుతుంది. అయినా వినీల ప్రాచీన సంప్రదాయానికి కట్టుబడిన మనస్తత్వంగలది కావడంవల్ల పరిస్థితులతో రాజీపడదు. కళ్యాణమూర్తి మళ్ళీ తిరుగుప్రయాణమవుతాడు. అతని భగ్నహృదయానికి కారకురాలు తానే అని కరిగిపోయిన వేదిత అతన్ని వెంబడించే ప్రయత్నం చేస్తుంది. అయినా ప్రయోజనం వుండదు. బొంబాయిలో శేషశాయి మిత్రుడు సక్సేనాద్వారా మళ్ళీ అతని దగ్గరకు చేరుతుంది. మనసు విరిగిన వేదిత అదోలోకంలో వుంటుంది.

వేదిత మధువుతోపాటు రకరకాల అలవాట్లకు బానిస అవుతుంది. శేషశాయి గతంలోలాగే ఆమెను అనుభవించడానికి ప్రయత్నిస్తాడు. కాని విఫలుడవుతాడు. ఆమెను తాకబోయే సమయంలో గుండెపోటు రావడం పరిపాటి అవుతుంది. శాయి కోరిక మేరకు వేదిత అతన్ని ముద్దుపెట్టుకోబోగా భగవంతుని స్మరిస్తూ మరణిస్తాడు.

వేదిత స్వగ్రామానికి బయలుదేరుతుంది. మార్గమధ్యంలో తానసిల్లి ఆశ్రయమిచ్చిన ఓ అబ్బాయి తనవల్ల ఇబ్బందికి గురిఅయ్యాడని తెలుసుకుంటుంది. స్వగ్రామానికి రైలులో బయలుదేరుతుంది. మనసు చలించిన వేదిత ఆత్మహత్యా ప్రయత్నం చేయబోగా, కళ్యాణమూర్తి కాపాడతాడు. కళ్యాణమూర్తి తనకు పెళ్ళి నిశ్చయమైనప్పటికీ వేదితను పెళ్ళి చేసుకుంటానంటాడు. అందుకు వేదిత తన గతాన్ని చెప్పి పెళ్ళికి తిరస్కరిస్తుంది. వేదిత తన వూరు చేరుకుంటుంది. తానెవరో తెలియనీయక ఆ ఊరు విశేషాల్ని కనుక్కొంటుంది. కరువు కాటకాలవల్ల ప్రజలు ఆ ఊరు వదలి వెళ్ళిపోయినట్టు కనుగొంటుంది. వేదిత యీ ఊరువదలి వెళ్ళిపోయాక వూరికి కళంకం పుట్టిందని చెప్తుంది. వేదిత ఆలయప్రాంగణం చేరి వేణుగోపాలునికి తన జీవితాన్ని నివేదిస్తుంది. తన ప్రాణాల్ని ఆ స్వామి సేవలో అంకితం చేస్తుంది. వేదిత నివేదితగా మారుతుంది.

వేదిత అచేతనంలోని భావాలు క్షాళితం అయిపోయినాయి. కాని చివరకు వచ్చేసరికి 'చైతన్య'మే లోపిస్తుంది. ఏది ఏమయితేనేం ఆ గ్రామంలోని వారికి వరదల్లో కొట్టుకుపోయిందనుకున్న 'అమ్మ' మళ్ళీ దొరికింది. ఆస్తికవాదులకు అంతకన్నా అదృష్టం ఏముంది. ఈ నవలలోని కథానాయిక అయిన వేదిత ఒక సైకిక్ కేస్‌గా చెప్పుకోవచ్చు. ఊరిలో ఉన్నప్పుడు వేదిత స్వామి కైంకర్యంలో సేవలు చేస్తుంది. అందరిచేతా 'అమ్మ' అని పిలువబడుతుంది. బొంబాయి చేరిన వేదిత సినిమాలో నటించేటప్పుడు దేవాలయం సీన్లో నటించడానికి ఇష్టపడేదికాదు. ఆమెలోని గిల్టీకాన్షస్‌నెస్‌కు ప్రతిబింబాలే అందుకు కారణం. వేదిత ఇన్నివిధాల పతనమైనా ఆమె శీలం మాత్రం చెక్కుచెదరకుండా వుంటుంది. భగవంతునికి ఆమె జీవితం అంకితం కావడంవల్లనేమో ఆమెను కోరికతో ఎవరూ సమీపించినా 'విద్యుత్‌ఘాతం' తిన్నట్లుగా అయిపోయేవారు. ఆమెను పాడుచెయ్యడం యెవరి తరమూకాలేదు. చివరకు వేదిత తన తప్పుల్ని వేణుగోపాలుని సన్నిధిలో నివేదించి నివేదిత అవుతుంది.

**శారద :**

'శారద' నవల్లో శారద ప్రధాన పాత్రధారి. మనసా, వాచా తనని ప్రేమించిన ప్రసాద్‌ను కాదని, జీవితాన్ని నరకప్రాయం చేసుకున్న దీనురాలిగాను,

తల్లిదండ్రుల మాటల్ని కాదనలేక కులాంతర వివాహానికి విముఖత చూపుతుంది. రోగిష్టివాడని తెలియక శారద గోవిందరావును పెళ్ళాడుతుంది. సంసారజీవితంలో సుఖసంతోషాలను పొందలేకపోతుంది. అందువల్ల ఆమె జీవితం దగాపడుతుంది. గోవిందరావుకు కొందరు డాక్టర్లు ప్లోరసీ అని మరికొందరు నరాలబలహీనత అని తేలుస్తారు. శారద చాలా నిగూఢమనస్తత్వంగల మనిషి. పుట్టెడు దుఃఖాన్ని దాచు కుని కూడా చిన్న నిట్టూర్పయినా విడవదు. భర్తను వదలి వెళ్ళిపోతుందని చాలా మంది అనుకుంటారు. కాని ధైర్యంతో ముందుకు వెళుతుంది. ఇటు మెట్టినింటికి అటు పుట్టినింటికి తలవంపు తీసుకురాదు. శారద భర్తను జాగ్రత్తగా చూసు కుంటుంది. భర్త రోగిష్టివాడవడంవల్ల బాగా చిక్కిపోయి తను కూడా తైలసంస్కారం లేని కురులతో దీనస్థితిలో వుంటుంది.

శారద తన భర్తకు మద్రాసులో ఆపరేషన్ ఏర్పాటు చేస్తుంది. ఆపరేషన్ జరుగుతున్నంతసేపు శారద తన తమ్ముడయిన రవి ఒడిలో పడుకునివున్న శారద హృదయాన్ని గురించి రచయిత—“శారద హృదిలో ఎట్టి భావతరంగాలు చెలరేగు తున్నాయో, అతను ఎరుగడు. నూతన భావోద్వేగంతో స్పందించిన అతని దుర్బల శరీరం. ఈ రక్తబంధువు యొక్క అత్యంత ప్రీతిపాత్రమైన స్పర్శతో ఒకింత శాంతిపడుతోంది. ఆమెపట్ల శ్రద్ధాసక్తులతో, వాత్సల్యంతో, మమతతో హృదయ క్షేత్రంలో ఏమూలో ఉదయించిన సౌఖ్యగరిమ క్రమక్రమంగా పరాకోటినందు కుంది”[10] అంటున్నారు. ఇక్కడ వేణుగోపాలరావు స్త్రీ అంతరాత్మలోని ఆవేదనని తెలియజేస్తున్నారు. తను ఎంత బాధపడుతున్నప్పటికి శారద బయటికి పొక్కనీయకుండా మనోనిబ్బరం పాటించే స్త్రీమూర్తి. శారద తమ్ముడు రవి రాగిణిని ప్రేమిస్తాడు. రాగిణితో రవి నిన్ను స్వీకరించేటట్టు చేస్తానని చెప్తుంది. శారద తన భర్తను తలచుకొని మనసులో ‘స్త్రీలు అనేక సందర్భాలలో ఏడుస్తారు. కాని తనలాంటి స్త్రీలను తలచుకొని బాధపడతారు. శారద తనలో తానే ఏహ్య భావాన్ని ప్రకటించుకుంటూ తమ్ముడ్ని తలచుకొని ఒకరిని శాసించే హక్కు తనకు లేదనికూడా అనుకుంటుంది. రవి మరో జీవితంలో ప్రవేశించాలంటే భయంగా వుందని అంటాడు. అందుకు శారద ‘నువ్వు శాశ్వతమైనదని దేన్ని గురించి భ్రమచెందబోకు. అది ఒక మంటల వలయం’ అంటుంది. ఇక్కడ తన జీవితం కూడా అలా కాగిపోతుందనే భావన శారదలో ప్రస్ఫుటంగా మనకు కనిపిస్తుంది.

శారద పరాయి మగాడితో మాట్లాడినందువల్ల ఆమెను అనుమానించి ఇంటినుండి వెళ్ళగొడుతాడు గోవిందరావు. అతని ఆరోగ్యం రోజురోజుకూ క్షీణిస్తుంది. శారద తన పవిత్రతను కాపాడుకువస్తున్నప్పటికి భర్తచేత అవమానింపబడటంవల్ల అతని దగ్గర వుండకుండా ఎక్కడికో ప్రయాణం కడుతుంది. మనసులో తన భర్త రోగిష్టిమనిషి. దుర్బలుడు అనుకుంది. ఇక్కడ శారద మానసిక బలహీనతను గుర్తించవచ్చు. శారద రైలుప్రయాణం చేస్తుండగా మొదట ప్రేమించిన ప్రసాద్ తటస్థపడతాడు. ప్రసాద్ తన జీవితంలోని ఆవేదనను విన్నవిస్తాడు. 'ఇన్ని సంవత్సరాలు సంసారం చేసి ఏం సాధించావు?' అని చెప్తాడు. అందుకు శారద 'నువ్వు నన్ను ఈ స్థితికి తీసుకువచ్చింది అయినా నిన్ను క్షమించా'నంటుంది. ప్రేమను గురించి మాట్లాడిన ప్రసాద్‌తో ప్రేమను గురించి బోధిస్తుంది. ప్రసాద్ గూండాగా మారడంవల్ల పోలీసులకు పట్టుబడతాడు. శారదను రవి యింటికి రమ్మంటాడు. కాని శారద తిరస్కరించి గమ్యంలేని బాటసారి అవుతుంది. శారద తన తల్లిదండ్రుల కులాల సంప్రదాయాల్ని పాటించి జీవితాన్ని నరకప్రాయం చేసుకుంది. సంప్రదాయాలకు ప్రస్తుత సమాజం దూరంగా వుండాలన్నదే వేణుగోపాలరావుగారి అభిప్రాయంగా తెలుస్తుంది. అందు వల్లనే శారదపాత్ర సృష్టి, వైవాహిక జీవితంలో శారద ఏ సుఖాన్ని నోచుకోక బాటసారి అవుతుంది. రవి హృదయంలో చిన్నక్క (శారద) శాశ్వత స్థానాన్ని సంపాదించుకుంటుంది.

## 4. మనస్తత్వ సంబంధాలు :

మానవులందరూ ఒకటే అయినా ప్రవృత్తులు వేరుగా వుంటాయి. నిరాశ, నిస్పృహ, వైరాగ్యం, ధైర్యం, స్థైర్యం, జాగృతి మొదలైన ప్రవృత్తులు ఒకే మనసులో పుట్టుకొస్తాయి. పుట్టుక, పరిసరాలు మానవుని మనసుపై వివిధ ప్రభావాన్ని నెరపుతాయి. వివిధ దృక్కోణాల నుంచి తార్కికపరిశీలన చేసిన, పరిశోధించిన నవలా రచయితల్లో ఆంధ్రావనిలో వేణుగోపాలరావుగారు ఒకరు. వైవిధ్యవిలసితమైన మనస్తత్వాల్ని ప్రదర్శించిన కొన్ని పాత్రల్ని పరిశీలించటం జరిగింది.

**మృత్యుంజయరావు :**

'వ్యక్తిత్వం లేని మనిషి' నవలలో కథానాయకుడు మృత్యుంజయరావు. శారీరకంగా బలహీనుడు. కురూపి. పిరికివాడు. ఏ విషయంలోను తానుగా నిర్ణయం తీసుకోలేడు. అల్పసంతోషి. కొన్ని సందర్భాల్లో నిరాశాపరుడు. మరికొన్ని సందర్భాల్లో పూర్తిగా అసంతృప్తుడు. ఇన్నిటి సమ్మేళనం మృత్యుంజయరావు. ప్రపంచానికి ప్రతి చిన్నవిషయానికి ప్రాధాన్యం యిచ్చి ఆలోచించేవాళ్ళలో అగ్రగణ్యుడు. తల్లిదండ్రులు తప్ప ప్రతి ఒక్కరు అతన్ని వెటకారం చేసేవారు. ఈ ప్రపంచంలో బ్రతకడానికి అర్హత లేదనుకునేవాడు. ఖామ్మెదున్న ప్రతిమనిషి దుర్మార్గుడిలా కనిపించేవాడు. ఇన్నిటికి కారణం అతను కురూపి కావడం, చూడటానికి వికారంగా కనిపించడంవల్లనే. మృత్యుంజయరావు 'తలపని' చేసుకోవడానికి సెలూన్‌కి వెళ్ళడం నుండి, టైలర్ దగ్గర వరకు తను ఏమీ చెప్పలేక పోతాడు. బలవంతుల్ని ఆత్మస్థైర్యం వున్నవాళ్ళను చూసి తనతో పోల్చుకుంటూ ఆత్మన్యూనతాభావంతో క్రుంగిపోతుంటాడు. కానీ కాస్త జ్ఞానం వచ్చినప్పటి నుండి అలవాటు చేసుకుంటాడు. ప్రతి అల్పవిషయం పెద్దదిగా మరింతపెద్దదిగా అతన్ని వెక్కిరిస్తున్నట్టు గోచరిస్తూవుండేది. ఈ ప్రపంచంలో బ్రతకటానికి తనకు అర్హత లేదనుకుని కళ్ళల్లో నీళ్ళు తిరిగేవి.

మృత్యుంజయరావు ప్రలోభంలో 'నేనూ అందగాడ్నే' అనుకొంటాడు. ఒకోక్క సమయంలో 'తను చక్రవర్తి' అనుకుంటాడు. ఆలోచనలతో అందమైన కట్టడాలు కట్టుకొంటూ చివరకు నిట్టూర్పు విడుస్తాడు. మృత్యుంజయరావుని కుర్రాళ్ల ఆట పట్టిస్తారు. ఆ సమయంలో రావు ధైర్యంచేసి 'మీకేమైనా పిచ్చెక్కిందా?' అని అడిగినప్పటికీ ఆ అరుపు కీచుగా పిల్లి కూతలా గాద్గదికంగా ధ్వనిస్తుంది. మృత్యుంజయరావు ధైర్యంచేసి సాధించిన ఘనకార్యమల్లా ఒకటే. వేశ్య అయిన మంజులత దగ్గరికు వెళ్ళడం. మనసులో 'ఈ అమ్మాయి చాలా మంచిది. డబ్బిస్తే మాత్రం ఎవరికి పట్టింది. ఇంత ఆదరణ చేయడానికి' అని అనుకుంటాడు. మృత్యుంజయరావు అక్క జగతి. ఆమె విద్యాధరస్వామి దగ్గరకు వెళ్ళి శుచియై, స్నాతయై ఏకాగ్రతలో వుంటుంది. మనసులో 'మంచి పని అయినా చెడ్డవాళ్ళచేతనే నిర్వర్తించబడుతుంది. నాలాంటి పిరికివాళ్ళు ఏ పని చేయటానికైనా తగదు. తగరు' అనుకుంటాడు. మృత్యుంజయరావు తల్లి శ్రీదేవి. కేన్సర్‌వల్ల బాధపడు

తుంటే తను చేస్తున్న గుమాస్తా ఉద్యోగానికి శెలవుపెట్టి తన తల్లికి సేవచేస్తాడు అతనికి మనసులో, ఎంతో ఆనందం, తృప్తి, మనశ్శాంతి కనిపిస్తుంది. పుట్టిన యిన్నాళ్ళకు 'నేను చేస్తున్న మంచి పని యిదే' అనుకుంటాడు. మృత్యుంజయరావు తన ఆఫీసులో పని చేస్తున్న మాలతిని ధైర్యంచేసి ప్రేమిస్తాడు. ఆమె ఆ ఉద్దేశంతో చూడలేదంటుంది. మృత్యుంజయరావు స్నేహితుడయిన శేఖరంను ప్రేమిస్తుంది. కులాంతర వివాహానికి తండ్రి సమ్మతించకపోవడంతో మృత్యుంజయరావును పెళ్ళాడుతుంది. శేఖరం, మాలతిల అంతరంగ సంబంధం గురించి ఎన్నోసార్లు అడగాలనుకుంటాడు. కాని మాలతి అంటే అతనికి మంచి అభిప్రాయమే వుంటుంది.

మాలతికి నెల తప్పుతుంది. అలా జరిగినందుకు మృత్యుంజయరావు తనకు ఏ రోగం లేదనుకుంటాడు. గాని పుట్టబోయే బిడ్డను గురించి ఆలోచిస్తాడు. మాలతి ఆరోగ్యం క్షీణిస్తుంది. డాక్టర్లు 'టాక్సిమియా ఆఫ్ ప్రెగ్నెన్సీ' అంటారు. దానికి తోడు ఫిట్స్ కూడా వస్తాయి. మృత్యువుతో పోరాడుతున్న మాలతి తన అనుమానాన్ని నివృత్తి చేసుకోవడానికి ప్రయత్నించినతీరు అతనిలోని న్యూనతను తెలుపుతుంది. "మాలతీ నువ్వు నన్నెప్పుడు ప్రేమించలేదా? ఒక పురుషుణ్ణి ప్రేమించినట్టు స్పందించే మనస్సులో ప్రేమించలేదా? మాలతీ! నిజం చెప్పు పోనీ అబద్ధం చెప్పు. ప్రేమించానని అను మాలతీ"11 అంటూ ఆక్రోశిస్తాడు. మాలతి ఏమీ చెప్పకనే మరణిస్తుంది. మృత్యుంజయరావులో తీరని 'ప్రేమదాహం' పెరిగిపోతుంది. మృత్యుంజయరావు తన ఊహలో 'అరుణ'ను సృష్టించుకుని తనకు ఆమెకువున్న సంబంధాన్ని కట్టుకథలతో అందరికీ చెప్పి సంతోషిస్తాడు. ఆవిధంగా తృప్తిపడతాడు. మృత్యుంజయరావుకి వున్నట్టుండి పెరాలసిస్ స్ట్రోక్ వచ్చి కాళ్ళు చేతులు పడిపోతాయి. డాక్టర్లు 'బ్రెయిన్ హెమిప్లీజియా' అంటారు. మృత్యువంటే భయపడే మృత్యుంజయరావు మృత్యువువాత పడకతప్పలేదు. ఆత్మన్యూనతాభ్రాంతి యెంత ప్రమాదకరమైనదో, దానికి గురయినవాళ్ళు తమ జీవితాలను తామే యెలా కాల్చుకుంటారో యెంతటి దయనీయస్థితికి దిగజారిపోతారో హృదయాలకు హత్తుకునే రీతిలో వేణుగోపాలరావుగారు ఈ పాత్రని చిత్రీకరించారు.

**కుమార్ :**

'ఈ దేశంలో భాగమిది' నవలలో రంగారావు పెద్దకొడుకు కుమార్. కుమార్ తన తండ్రితోపాటు డాక్టర్ వృత్తిని స్వీకరిస్తాడు. ఈ నవల పూర్తిగా సమాజంలోని బలహీనతను, పరిస్థితుల ప్రభావంవల్ల సంభవిస్తున్న మార్పులను తెలుపుతుంది. సామాజికంగా వుండటంవల్ల ఆ హానికి మధ్య జరిగే సంఘర్షణను చూపుతుంది ఇందులోని పాత్రలు. అధికృతాభావం, న్యూనతాభావాల మధ్య సంఘర్షణ మనకు దర్శనమిస్తుంది. అధికృతాభావానికి రంగారావును న్యూనతా భావాలమధ్య నలిగే కుమార్‌ను చెప్పుకోవచ్చు. కుమార్ తండ్రిని గౌరవిస్తాడు. తండ్రి కోసం శ్రమిస్తాడు. తన తండ్రి మాట ధిక్కరించటం ద్రోహం అనే భావం కుమార్ చేతనలో నిలిచిపోయింది. జీవితంలో పెద్దపెద్ద విషయాలలో మనిషి అనుకున్నది జరుగుతూ ముందుకు పోగలుగుతుంటాడు. కానీ సాధారణమనిపించే అతిస్వల్పవిషయాలలో అడుగడుక్కీ పరాజయం పొందుతాడు. దారుణ హింసకు గురవుతుంటాడు. అలాంటి కోవకు చెందినవాడు కుమార్. కుమార్‌లో ఓ చిత్రమైన గుణంవుంది. నలుగురిలో వుంటే ఒంటరితనం కోరుకుంటాడు కానీ, ఒంటరిగా వుంటే దాన్ని అభిలషించలేకపోతాడు.

కుమార్ మొదట్నుంచీ ఒంటరిగా పడుకొనే అలవాటు. తన ప్రక్కలో ఎవరయినా పడుకుంటే మహాచిరాకు పడతాడు. కాని తనకు నచ్చని విషయాలు చెప్పటానికి మొహమాటపడతాడు. 'నువ్వు విడిగా పడుకో' అని భార్యతో చెప్పటానికి కూడా సంకోచిస్తాడు. తండ్రి సుపీరియారిటీని తలచుకొని 'ఈ దేశంలో కొడుకులవల్ల తండ్రులుపడే యిబ్బందులకంటె తండ్రులవల్ల కొడుకులు నలగటం చాలా యెక్కువ'నుకుంటాను. కుమార్ తన తండ్రి ప్రక్కన కూర్చుంటే చిన్నపిల్లవాడిలాగ ఆత్మన్యూనతకు గురిఅయ్యేవాడు. స్వేచ్ఛగా మాట్లాడలేని స్థితిలో కారులో కూర్చోవడం కుమార్ చాలా యిబ్బందిగా వుండేవాడు. తన తండ్రి ప్రవర్తనలవల్ల 'ఈ కారు తండ్రిది తనది-కాదు'. ఇటువంటి ఆలోచనలు అతనిలో చోటు చేసుకుంటాయి. కుమార్ కారు డ్రైవర్‌ని చూస్తుంటే తన తండ్రి తరువాత యజమాని ఇతనే అన్న భావం కలుగుతూ వుండేది. తండ్రి మాటలకు నిర్లక్ష్యం ప్రదర్శించకుండా తలవూపడమో, ఊఁ, చిరునవ్వు నవ్వడమో చేస్తుండాలి. ఇలాంటివి అతని లేతహృదయంలో ఎన్నో సంఘర్షణలు చెలరేగుతాయి. తన తండ్రి

తను అభివృద్ధి కాంక్షించవచ్చు కానీ తనలోని ఆధిక్యతకు తిలోదకాలు యివ్వలేక పోవడం కుమార్ మనసు బాధపడుతుంది. తండ్రీకొడుకులు ఒకే రంగంలో ఎదురెదురుగా తారసపడినప్పుడు జీవితపోరాటంలో, విధిచేతిలో పరాజయం పొందటం ఆయన భరించలేకపోయివుంటాడన్న సత్యాన్ని గ్రహిస్తాడు. ఒకే వృత్తిలో ఇద్దరు వ్యక్తులు నిరంతరం ఒకరికొకరు కనబడుతూ వున్నట్లయితే అనుకూలతకన్నా వ్యతిరేకత ఎక్కువని కూడా గ్రహిస్తాడు. కుమార్ తన తండ్రితో మీరెప్పుడు రిటైరవుతారు?' అని అడగాలనుకుంటాడు. కాని అడగలేకపోతాడు. కుమార్‌కు వివాహం కూడా అతనికి యిష్టమో అయిష్టమో తెలుసుకోకుండా పెళ్ళి జరిపిస్తాడు.

కుమార్ తండ్రితో అప్పుడప్పుడూ బాహాటంగానే మాట్లాడుతుంటాడు. రంగారావు త్వరగా తెమలమన్నందుకు నేనంతటికంటె ముందుగా తెమల్లేనండి అంటాడు. కుమార్ ఆసుపత్రి నుండి యింటికి వస్తే ప్రశాంత వాతావరణాన్ని చూసేవాడుకాడు. సున్నిత మనస్తత్వానికి తోడుగా యెదురుదెబ్బలే తగులుతున్నాయి. అతడు భావుకుడు. ఆ భావుకత్వాన్ని నిర్దాక్షిణ్యంగా ముక్కలుముక్కలుగా విరిచేస్తున్నాయి. 'ఇంటిలో అందరూ ఇరవైనాలుగు గంటలూ ఒకరికెదురుగా ఒకరు వుండటంవల్ల ఒకరి లోపాలు, అలవాట్లు, ప్రవర్తనలు కనబడుతుంటే మనస్పర్థలతో, పరాకష్ట చేరుకోవడంవల్ల ఉమ్మడి కుటుంబాలు విడిపోతున్నా'యనుకుంటాడు. మునుపటి స్త్రీలో వున్న సహనం ప్రస్తుతం లేదంటాడు. చివరకు తోడికోడళ్ళ మనస్పర్థలవల్ల రంగారావు మూడు కుటుంబాలుగా విభజిస్తాడు. చివరకు కుమార్ తన అహాన్ని తృప్తిపరచి ఆధిక్యతను ఏర్పరచుకుంటాడు.

**చక్రపాణి :**

'గోరింటాకు' నవల్లో చక్రపాణి ప్రధానపాత్ర. బి.ఏ. చదువుతుంటాడు. చిన్నప్పటినుండి జీవితం అంటే భయపడేవాడు. శ్మశానవాటికలన్నా, చావు అన్నా భయపడేవాడు. అర్భకుడు, అమాయకుడు కావడంవల్ల యిటువంటి భయాలకు నలుగుతుండేవాడు. తన తల్లిదండ్రుల్ని గురించి తలచుకుంటూ 'మా అమ్మ చనిపోయాక నాన్నగారు మళ్ళీ పెళ్ళి చేసుకుంటారు. అప్పుడు సవతి తల్లికి నాకు పడుతుందా? నేను గుండు చేయించుకోవాలా? చేసుకుంటే అద్దంలో నా మొఖం యెలాగ వుంటుంది?' అనే దరిద్రపు వూహల్లో మునిగిపోయేవాడు.

చక్రపాణికి అనేక పనులు చేయాలని అతని మనసు పువ్విళ్లూరుతుండేవి. కానీ యెప్పుడూ అనుకోవడంతోనే సరిబుచ్చుతూ వుండేవాడు. 'దేవుడు నన్ను యింత పిరికివాణ్ణి యెందుకు చేశాడని' ప్రశ్నించుకుంటాడు. తన స్నేహితుడయిన రాజారావు దృఢత్వాన్ని చూసి 'చిరునవ్వు నవ్వగలిగే ధైర్యశాలి' అనుకుంటాడు. చక్రపాణి అనుభూతి. కన్నీళ్ళలో సొగసు, ఆనందం, ఆరాటంలో మనోజ్ఞత, ఒంటరితనంమీద ఇచ్ఛ, భయం, భ్రాంతి, భీతి వుండేవి. చక్రపాణికి యెప్పుడూ యెవరో ఒకరి ప్రభావం తనమీద నిరవధికంగా ప్రసరిస్తూ వుండాలి. కాని విషాదం అంటే మక్కువ. అతీతమైన మనస్తత్వం కలవాడు. మనశ్శాంతి లేకుండా వుండటంవల్ల నిశ్శబ్దంగా ఏడుస్తాడు. చక్రపాణి మోహన్ అనే కుర్రాడు పరిచయం చేసుకుంటాడు. మోహన్ తన అసమర్థతలను తెలుపుతూ చక్రపాణికి పరిస్థితి అర్థమౌతుంది. 'పితృవాత్సల్యం యిసుమంతైనా లేదు. నన్ను ఓ విచిత్రమైన పరిస్థితుల్లో పడేశావు. రేపటి నుండి నిన్ను చూస్తే భయంవేసేట్టు చెయ్యడోయ్' అని అంటాడు.

చక్రపాణి ప్రభావతిని ప్రేమిస్తాడు. ఇరువురు కొండపరిచరాల్ని చూడటానికి వెళ్ళగా ప్రభావతి జలధార నుండి పడిపోతుంది. ప్రభావతిని దగ్గరకు తీసుకుని ఆమె పాదాన్ని తన చేతిలోకి తీసుకుంటాడు. కాళ్ళ ఎర్రగా పండిన గోరింటాకును, విశాలదృష్టితో తనివితీరా చూస్తాడు. ప్రభావతితో అవినాభావ సంబంధం తెలుపుతూ తన అసమర్థతను కూడా చెప్పుకుంటాడు. "ప్రభా! నాకు చాలా భయంగా వుంది. చచ్చిపోయి నన్ను నేను చూసుకోవాలని వుంది. నాకు నేను ఎందుకు అర్థంకాను. నన్నుపోనీ యితరులు యెందుకు అర్థం చేసుకోరు. నేను నీకు మంచివాడుగా కనిపించడానికి కారణం వేరు నేను యింతవరకు ఏ ఆడదానిముందు ఏడవలేదు. నీ చేతుల్తో నా ముఖాన్ని కప్పుకుని ఏడవనీ ప్రపంచంలో నాకంటే దుఃఖమయుడెవ్వడూ లేడు. అసలు దుఃఖం అనుభవించడం కంటె యెవరికీ చేతకాదు .. . చచ్చిపోదామని ప్రయత్నించా కొద్దిగా విషం తాగి చిరిమించాను. పంచం పడకు నీటిలో మునిగి వెనక్కి తిరిగి వచ్చేశాను........ చచ్చిపోతే నాకు నేను కనబడనుగా"[12] అని తన పిరికితనాన్ని, న్యూనతను తెలియజేసుకుంటాడు. స్త్రీముందు తన అసమర్థత తెలియజేస్తే చులకన అయిపోతామన్న ధ్యాస చక్రపాణికి కలుగకపోవడం ఆశ్చర్యకరమైన విషయం.

అలాగే మరొకసారి ప్రభావతి చేతిలోని గోరింటాకును చూపి భయకంపితు డవుతాడు.

చక్రపాణి ప్రభావతిని ప్రేమించినప్పటికీ ఆమె పాండురోగంతో బాధ పడడం చూస్తాడు. ప్రభావతి తనను పెళ్ళి చేసుకోమని చక్రపాణిని అర్థిస్తుంది. ఆ సమయంలో చక్రపాణిని యెవరో అజ్ఞాతవ్యక్తి కొరడాతో ఛళ్‌మని చరచి నట్టయింది. "నేను తగను" అనేస్తాడు. ఆమెనుండి దూరం అవుతాడు. చక్రపాణి మరో స్త్రీ అయిన మాలతిని ప్రేమిస్తాడు. ఆమెకు పెళ్ళయిపోయిందని తెలుసు కుంటాడు. మాలతి అధ్యాయంలోనూ, ప్రభావతి ప్రకరణంలోనూ ఈ రెండింటి మధ్యవున్న దూరం అస్పష్ట, అస్వస్థ జీవితంగా అతనికి పరిణమిస్తోంది. చివరకు చక్రపాణి ధైర్యంచేసి బెంగాలీ అమ్మాయిని పెళ్ళి చేసుకుంటాడు. చక్రపాణి పాత్రలో రచయిత మొదటి చాలా అసమర్థుడిలా చిత్రించినా చివర ప్రేమ, పెళ్ళి వరకు చక్రపాణిని తీసుకువస్తారు.

**విశ్వనాథరావు :**

'ఆత్మజ్యోతి' నవల్లో కథానాయకుడు. ధనవంతుడై మాధవరావు ఏకైక పుత్రుడు. ఎం.బి.బి.యస్. చదువుతుంటాడు. సున్నిత మనస్తత్వం కలవాడు. బలహీనుడు. తనకన్నా తక్కువ స్థాయిలో వున్నవారిని చూస్తే జాలి, దయ కలిగేది. శివనాథరావులో ఆత్మన్యూనతాగూడా చోటు చేసుకుంటుంది. ప్రపంచ మంతా తనను చూసి పరిహసిస్తున్నట్లు తలచుకుని తాను ఒక్కడే దద్దమ్మనని అనుకుంటాడు. ప్రతి విషయంమీద విరక్తిపుడుతుంది. ఒక్కసారిగా వైరాగ్యం మీద ఆసక్తి జనిస్తుంది. ఎందుకీ స్నేహాలు. ప్రపంచంలో మానవుడికి పరిపూర్ణ మైన ఆనందం కలిగించేదిలేదు. సుఖంకోసం ప్రాకులాడుట అసహ్యం. ఒకరిపై మరొకరు రాగద్వేషాలు పెంచుకోవటం అర్థంలేని ఆకర్షణ, ఆవేశం, కోపం-శాంతం, పుణ్యం-పాపం, స్వార్థం-త్యాగం, సుఖం-దుఃఖం, గర్వం-నిగర్వం, ఇవన్నీ కూడాను మేధావులు ఒకదానికి మరొకదానికి కావలసినంత దూరం సృష్టించి వ్యతిరేకమైన అర్థాలను ధ్వనింపచేస్తారని అంటాడు.

'పురుషుడు తనని తాను మోసం చేసుకుంటూ బ్రతుకుతాడు. పురుషుడు చేసే మొదటి తెలివితక్కువ పని అదే. మానవుడి నైతిక ప్రవర్తనకు ఓ నిర్దిష్ట

మైన నిర్వచనం ఎవరైనా కల్పించుకుంటే అతనికంటే శుంఠ ఎక్కడా వుండబోడు. నేను ఫలానా మనస్తత్వం గల మనిషిని' అని ధైర్యంగా నిలబడి తన ఆత్మవిశ్వాసం వెల్లడి చేసుకుంటే అతనే యీనాడు దిట్ట—పీటన్నింటికి శివనాథరావు ఒప్పుకుంటాడు. శివనాథరావు మేనమామ కూతురయిన సరోజనిని ప్రేమిస్తాడు. అందుకు తన తండ్రి రెండవ భార్య అయిన సావిత్రి సమ్మతించదు. శివనాథరావు సరోజని ముద్దుపెట్టుకోపోగా సిగ్గుపడి వెళ్ళిపోతుంది. అందుకు కూడా తను తప్పుచేశానని బాధపడతాడు. మానసికమైన ఒత్తిడికి లొంగిన శివనాథరావు సరోజతో "నేనంటే నీకు ఇష్టంవుంది. ఒక్కసారి నా హృదయంలో పూజిస్తున్నావని........దూరంగా వుంటే బాగా వుంటుంది........సంతోషం కంటె విషాదాన్ని ఎదురు చూస్తాను. తీరా ఆ విషాదం అనుభవించక దుఃఖం భరించలేక ఏడుస్తాడు. ఒక్కోసారి జీవితమంటే విరక్తి పుడుతుంది. మేడమీద నుంచి దూకి చచ్చిపోవాలనిపిస్తుంది. ఒక్కోసారి యీ మనుష్యుల్లో నాకంటే సమర్థుడు లేడని ఉబ్బిపొంగిపోతాను. నన్ను చూస్తే నాకే అసూయగా వుంటుంది. చిత్రలేఖనం. సంగీతం, అభ్యసించింది నేను గొప్పవాడ్ని అవుదామనికాదు. మనశ్శాంతి లభిస్తుందని నేను వ్యక్తం చేసుకోలేని బాధ ఎవరైనా నాకు నచ్చిన మనిషి హృదయంతో ప్రక్కన కూర్చుని ఊ కొడుతూ ఆలకించాలనీ చివరకు నా కన్నీరు తుడవాలని నా కోరిక. ఒంటరిగా వున్నప్పుడు ఈ ఆవేదన దుస్సహంగా వుంటుంది. జీవితాంతం నీడలా నన్నొక వ్యక్తి వెన్నంటి ప్రతి పనిలోను చేయూత నివ్వంచే ఏదో అగాధంలో పడిపోతానేమో"[13] అని అంటాడు. శివనాథరావు మాటల్లో ఆత్మన్యూనతా, ఒంటరితనంలో భయం, ప్రేమించే విషయంలో వెనుకంజ, తన్నెప్పుడు మరొకరు అంటిపెట్టుకుని వుండటం అనే మొదలగు విషయాలు అధీరనాయక లక్షణాలుగా తెలుస్తుంది. ఆత్మన్యూనత చోటుచేసుకుంది.

విశ్వనాథరావు ఎం.బి.బి.యస్. చదువుతుంటాడు. గొప్ప కళాకారుడు. కళాహృదయం కలవాడు. ఇన్ని ప్రత్యేకతలుండి కూడా సుఖాన్ని పొందలేకపోతాడు. ప్రాణస్నేహితులయెడ ప్రేమాభిమానాలు కలిగివుంటాడు. కళాకారుల జీవితాన్ని గురించి రచయిత "కళాకారుల జీవితాలు విచిత్రమైనవి. ప్రపంచం ఎంత గర్వంగా వాళ్ళను తారాపథానికెత్తేస్తుందో అంత త్వరగా మరచిపోతుంది. ఓ కీర్తిపరుని యొక్క యితరుల ఆరాధనలో కొంచెం అసూయగా కూడా మిశ్రితమై

వుంటుంది. ఈ అసూయే వాళ్ళచేత త్వరగా విస్మరించబడేటట్లు చేస్తుందని"[11] అంటున్నారు. శివనాథరావు తండ్రి కోరికమేరకు సరోజిని పెళ్ళి చేసుకోమంటాడు. మాధవరావు తన రెండో భార్య అయిన సావిత్రిచేత ఆ పెళ్ళికి వప్పిస్తాడు. మాధవరావు తన కొడుకుని చూసుకోవలసిన బాధ్యత నీపై పడిందని కూడా సావిత్రితో చెప్తాడు. సావిత్రి తను ఇన్ని రోజులు మూర్ఖంగా ప్రవర్తించినందుకు పశ్చాత్తాపం చెందుతుంది. శివనాథరావు, సరోజల పెళ్ళి జరిపిస్తుంది. శివనాథరావు అటువంటి మనస్తత్వానికి గురికావడం అతని పిన్ని సావిత్రి కారకురాలౌతుంది. చివర అతనిలోని దాగివున్న పిరికితనం మాయమవుతుంది.

సుధాకర్ :

మనస్తత్వ చిత్రీకరణ పాత్రల్లో స్వేచ్ఛా ప్రవృత్తి గల పాత్రలు కూడా చోటుచేసుకుంటాయి. 'ఈ దేశంలో ఒక భాగమిది' నవలలో రంగారావు కొడుకు సుధాకర్. కళాశాలలో బి.ఎ. చదువుతుంటాడు. సుధాకర్ చిన్నతనంలో నుండీ విచిత్రమైన అలవాట్లకు లోనౌతాడు. తన జేబులో డబ్బు వున్నా లేకపోయినా ఒకే మాదిరిగా రోజులు వెళ్ళదీయగలడు. మెత్తటి పరుపుమీద ఎంత సుఖంగా పడు కుంటాడో, కటిక నేలపై కూడా అంతే సుఖంగా పడుకోగలడు. వేడినీళ్ళతో యెంత హాయిగా స్నానం చేయగలడో, చన్నీళ్ళతో కూడా అంత హాయిగా చేయ గలడు. తనకు యిష్టమైన పంటకాలున్నప్పుడు యెంత తృప్తిగా భోజనం చేయ గలడో, ఏ మాత్రం యిష్టంలేని ఆధరువుల చేసినప్పుడు కూడా అంతే తృప్తిగా భోజనం చేయగలడు. కుటుంబంలో తండ్రితో నలగటం యిష్టంలేక అటువంటి అలవాట్లకు లోనౌతాడు. ఇవన్నీ కూడా సుధాకర్ చిన్నప్పటి నుండి చేసుకున్న సాధనమనే చెప్పాలి. సుధాకర్ ఇంటిలోని తోడికోడళ్ళ మనస్పర్థలు మొదలగు విషయాల్ని గమనిస్తుంటాడు. కానీ యెవరికి సలహాలు చెప్పడు. అటువంటివి అతని మనసుకు విరుద్ధం. తన అన్నలు మాదిరిగా తండ్రి ముందు పదిసార్లు రిహార్సల్స్‌చేసి నిలబడలేకపోతాడు. ఒకచోట నిలబడి మాట్లాడటం, ఆలోచించటం అతని స్వభావానికి విరుద్ధం.

సుధాకర్‌ను రాధ అనే అమ్మాయి ప్రేమిస్తుందీ. పెళ్ళిని కూడా సరే నంటుంది. సుధాకర్ ఇంటి పరిస్థితుల్ని అర్థం చేసుకున్నటువంటివాడై రాధతో

'నేను బంధాలకు, బంధనాలకు, బాంధవ్యాలకు ఇమడని వ్యక్తిని. ప్రేమలకు, పెళ్ళిళ్ళకు వెయ్యి మైళ్ళ దూరంలో వుంటానని చెప్తూ—"చిన్నప్పటి నుంచీ నా మనసులో ఒకరకం భావాలు పెరుగుతూ వచ్చాయి. నాది కొంచెం స్వేచ్ఛా ప్రవృత్తి. మంచి గాని చెడుగాని ఒక పని చేయాలని అనుకున్నప్పుడు దాని కెవ రైనా అడ్డు చెబితే ఆ వ్యక్తి తల్లిగానీ, తండ్రిగానీ నేను భరించలేను నాలో డిసిప్లిన్ తక్కువయివుండవచ్చు. అలా ప్రవర్తించటం లోపం కావచ్చు. తప్పు కూడా కావచ్చు. కాని అది నా నైజగుణం. నా నైజగుణాన్ని అనుక్షణం చంపు కుంటూ బ్రతకటం నాకు చేతకాదు"[12] అని అంటాడు. ఈ మాటల్నిబట్టి అతని మనస్తత్వ మెలాంటిదో అంచనా వేయవచ్చు.

మనసులోని ప్రతి ఆలోచనను, కలిగే ప్రతిభావాన్ని బయట పెట్టుకోవ డానికి ఇష్టంలేని మనిషి సుధాకర్. అందువల్లనే మానసికంగా ఇంట్లోవాళ్ళకు దూర మవుతాడు. తల్లిదండ్రుల్ని బిడ్డల్ని సమానంగా ప్రేమించడం లేదంటాడు. ఇంటి వాతావరణం నసగా వుంటే అతని తత్వానికి సరిపడేది కాదు. రంగారావులాంటి తండ్రులే అందరి ఇండ్లలో వుండకపోవచ్చు. ఇంటికి వచ్చిన భార్యపట్ల ప్రేమను ప్రదర్శిస్తే తల్లి అబ్బాయి మారిపోయాడని శోకాలు తీస్తారు. అందువల్ల ఒకరికి సంజాయిషి యిచ్చుకోవలసిన పరిస్థితి అతనికి ఎదురాకుగా, ముళ్ళమీద నిలుచు కున్నట్లుగా వుంటుంది. మానవుడు అనేక బలహీనతలకి లొంగిపోతుంటాడు. వాటిని మరుగునపరచి అబద్ధం చెప్పలేనంటాడు. అలా నలుగుతూ, మరుగుతూ, రాజీపడటం చేతకాక, హింసించుకోవడమే అవుతుంది. కాని సమస్యకు పరిష్కారం దొరకదంటాడు సుధాకర్. మనిషి అబద్ధాలతో వంచనలతో బ్రతకడం తనకు యిష్టంలేకున్నా అనుక్షణం యుద్ధం చేసుకుంటూ చుట్టూ గీతలు గీసుకుని అదే స్వర్గమనుకుంటూ బ్రతకాలంటాడు. చివరగా తాను పలానావారి కొడుకుగా కూడా తన వునికిని గుర్తింప చేసుకునేందుకు ఇష్టపడడు. సుధాకర్ అటువంటి మనస్తత్వం కలిగివుండడానికి అతని కుటుంబంలోని వ్యక్తులే కారణం. ముఖ్యంగా తండ్రి, ఆ తరువాత తోడికోడళ్ళు. రంగారావులాంటి అధికృతను ప్రదర్శిస్తే సున్నిత మనస్తత్వం, స్వేచ్ఛా ప్రవృత్తి గలిగిన సుధాకర్‌లాంటివాళ్ళ గతేమిటో తెలుసుకోమంటున్నారు వేణుగోపాలరావు.

## 5. సాహిత్య సంబంధాలు :

వేణుగోపాలరావు సాహిత్య పిపాస కలవారు కనుకనే నవలా రచయిత కాగలిగారు. వివిధ రకాల మనస్తత్వాల్ని వారి వైఖరుల్ని పరిశీలించిన వేణు గోపాలరావు సాహిత్యానికి సంబంధించిన పాత్రల్ని కూడా సృష్టించారు. వివిధ సాహిత్యవేత్తల అభిప్రాయాలనే కాకుండా రచయిత అభిప్రాయాల్ని ఆయా పాత్రల ద్వారా వ్యక్తీకరించారు.

**ఉమాపతి :**

'జాబిలేని జాబిలి' నవలలో ఉమాపతి పేరు ప్రఖ్యాతులున్న రచయిత. తన రచనల ద్వారా సమాజానికి యేదో సందేశాన్ని ఇవ్వాలన్న ఆశయం కనిపిస్తుంది. తన రచనలవల్ల మరో రచయిత ప్రభావితుడు కావడానికి కారకుడవుతాడు. రచయితగా పేరున్న ఉమాపతిని అప్పుడప్పుడే రచయితగా వెలుగు చూస్తున్న మధుబాబు కలుసుకుంటాడు. ఉమాపతి రచయిత కర్తవ్యాన్ని మధుబాబుతో "ప్రపంచానికి మనం ఎలుగెత్తి చెప్పవల్సికున్నది లేనినాడు కాయితాన్ని ఖరాబు చేయటం శుష్కదండగ. ఏదో దుగ్ధ, తీరని తపన మనసులో జనించి, ఆ పాతాన్ని తీర్చుకోవటానికి కలం పడితేనే అతడు నిజమైన రచయిత. ఆ ఆశయం లేనివాడంటూ యెవడూ వుండడు. ఐతే కొందరికి నిర్దుష్టమైన గమ్యం లేకుండా యెవడూ ఉత్తమ రచయిత కాలేడని తెలుస్తుంది. ఉమాపతి తన రచయిత అయిన శరత్ చంద్రుణ్ణి గురించి మధుబాబుకు చెప్తూ "శరత్ వ్రాసే ప్రతి ఆలోచననూ ఈ సమాజంలో కఠిన నియమాలకు మూర్ఖపు దురాచారాలకు బలైపోతున్న అభాగ్యుల ఆక్రందన పౌరుషంగా వినిపిస్తుంది. ఆ నిర్భాగ్యుల్ని వివిధ కోణాలలో చిత్రించాడు. ఈ సమాజాన్నే ఒక విలన్‌గా తీసుకున్నాడు.......అందుచేత యెంత ఆర్భాటం చేసినా శరత్ హృదయాలను ఆకర్షించినట్లు ఆకర్షించలేకపోయారు. మనకు సమాజంపట్ల వున్న కసిని వికృతంగా తీర్చుకోకూడదు. మన సాహిత్యాన్ని వెయ్యిమంది దుర్భాషలాడితే—వాళ్ళెవరూ చేరుకోలేని ఉన్నత శిఖరాలను చేరుకున్నాననుకోవడం ప్రగల్భం"[17] అని అంటాడు. శరత్ రచనల్లోని మాధుర్యాన్ని మనకు కళ్లకు కన్పించేటట్టు చెప్పాడు. ఉమాపతి ఆశయం అదే అయినప్పటికీ పరోక్షంగా రచయిత శరత్ అభిమాని,

ఉమాపతి తన రచనల్లోని శైలిని గురించి చెప్తూ 'మనిషి నిజమైన వ్యక్తిత్వం ప్రత్యేకమైన శైలిని సృష్టిస్తుందని' అంటాడు. రచయిత అనేవాడు యితర రచయితల గురించి మరచిపోయిన తననే కళ్లముందు వుంచుకుంటే మంచి శైలి అమరుతుందని అంటాడు. అజ్ఞాతంగావున్న చాలామంది రచయితల్ని పైకి తీసుకురావాలన్నది. ఉమాపతి ఆశయంగా యిక్కడ తెలుస్తుంది. ప్రస్తుతం యెవర్ని కదిపినా, సెక్స్, ప్రేమ, స్త్రీ వీటినిగురించి రచనలు చేస్తున్నారు. వీటిలో ఆర్భాటం, నిజముండదు. నిజాయితీ కన్నా శిల్పం యెక్కువ అంటాడు. అట్టహాసం, ఆడంబరం, పాండిత్య ప్రదర్శ వుండకూడదంటాడు. వంకరటింకర డైలాగులు. జీవితంలో సెక్స్ సమస్య అనుకోవటం తన రచనల్లో వుండదంటాడు. కుటుంబ జీవితాల్ని యధాతథంగా చిత్రించడమే తన ఆశయమని తెలియజేస్తాడు. ఆత్మవిశ్వాసంతో చెప్పిన ఉమాపతి మాటల్లో వేణుగోపాలరావు అభిప్రాయాన్ని క్షుణ్ణంగా చూడగలుగుతాం. తన రచనా విధానానికి ఓ చక్కని దారి ఏర్పరచుకున్నట్టు కూడా ఇక్కడ విదితమౌతుంది. ఉమాపతి ప్రతిమాటా ఆలోచనను రేకెత్తించేవిధంగా వుంటుంది. ఉమాపతి అభిప్రాయాల్ని విన్న మధుబాబు తన రచనా వ్యాసంగానికి ఒక నడవడి పెట్టినట్టవుతుంది.

మధుబాబు

ఈ నవల్లోనే ముఖ్యమైన మరో రచయిత పాత్ర మధుబాబు. తన రచనా విధానానికీ ఓ ఒరవడి దిద్దినవాడు ఉమాపతి అయితే తన రచనంతోనే తను ఏకీభవించినవాడు మధుబాబు. తను రాసిన ప్రతి రచన గురించి ఓ ప్రయోజనాన్ని పొందే సత్తా, చేవ మధులో కలుగుతుంది. చక్కని సైరాంజీ ద్యోతకమయ్యేటట్టు రచనలు చేయగలుగుతాడు. అతనికి అలా చెప్పగలగటం సాధన మీద అబ్బిందనే చెప్పాలి.

మధుబాబు ఏం రాసినా, ఏం చెప్పినా పరిపూర్ణమైన విశ్వాసంతో చెప్పగల నేర్పు అబ్బుతుంది. మధు తన రచనా వ్యాసంగానికి శ్రీకారం చుట్టింది తన అక్కకొడుకు చనిపోవడమే కారణం అంటాడు. మధు తన ఆశయాన్ని గురించి చెప్తూ "నన్ను బాధించే వేధించే సమస్యలు అనేకం కనిపిస్తున్నాయి. రోజు రోజుకు నాలో కొత్తదనం ఫీలవుతున్నాను. ఈ నూతనత్వం ఆగిపోయే వరకు

నాకు నేను స్పష్టంగా అర్థంకాను .......మానవాత్మానికి దెబ్బకొట్టే ప్రతి అంశమూ నాకు వస్తువే. ఈ మానవత్వపు విలువల్ని ప్రదర్శించడమే బహుశా నా ఆశయం, ఈ నిజాన్ని ప్రకటించడమే బహుశా నా లక్ష్యం"[18] అంటాడు. మధుబాబు రచయితకు కావలసిన ప్లాటును గురించి చెప్తూ విచిత్ర మనస్తత్వాల్ని మనసులో సృష్టించుకుని ఆ సంఘర్షణపడుతున్నారు. మనిషిమీద మనిషి ప్రభావం స్వార్థం-త్యాగం, పాపం-పుణ్యం వీటి తేడాల విలువల్ని రచనల్లో చూపించాలి, జీవితంలో పిరికివాళ్ళన్నా, అసమర్ధులన్నా ఓ అనక్తి సానుభూతి పెరుగుతుంది. గండిపడ్డ జీవితాల విషాద చరిత్రను గురించి తన రచనల్లో దృఢమైన నమ్మకం కలుగుతుంది. మధుబాబు రచనా వ్యాసంగం ఆరంభమైనప్పటి నుంచి ప్రతి మనిషి స్వభావాల్ని పరిశీలనా దృష్టితో చూడటం ప్రారంభిస్తాడు. కుటుంబాల్లో జరిగే కలతలకు కారణాల్ని తెలియజేస్తాడు. సాంఘిక ధర్మాల్ని గురించి తను ఆలోచించి రచనలు చేయగలిగాడు. భార్యాభర్తల మధ్య విముఖత్వం, హింసాకాండ, లేచి పోవడం, ఆత్మహత్యలు, వివాహబంధం, ప్రేమ మొదలగు విషయాల్ని గురించి మధుబాబుని కలవరపరచి రచనకు తోడ్పడ్డాయి.

మధుబాబు తన రచనల్లో విశేషాల్ని కాకుండా ఇతర రచయితల రచనల్లోని వివిధ కోణాల్ని తీసుకొని చర్చించాడు. ఉదాహరణకు చలం, శరత్ రచనల్లోని విశేషాంశాల్ని పోల్చి చెప్పాడు. అవి—

"శరత్ పాత్రల్ని కరుణామయంగా చిత్రీకరించాడు.
చలం సంపుంపట్ల తనకున్న కసిని కూడా జోడించి పెట్టాడు.
శరత్ హృదయాంతర్గత వేదనని పాత్రల ద్వారా వెలిబుచ్చాడు.
చలం పాత్రలను తనే డామినేట్ చేసి విశ్వవిహారం చేశాడు.
జరిగేది రాశాడు శరత్.
ఇలా జరిగితే బాగుంటుందనుకున్నది రాశాడు చలం.
శరత్ తానే గాకుండా అతని పాత్రలు కూడా నిలిచేటట్లుగా రాశాడు.
చలం తాను మాత్రమే నిలిచే రచనలు చేశాడు.
శరత్ సాహిత్యం పాఠకుల్ని కన్విన్స్ చేసి తనవైపుకు లాగుతుంటుంది.
చలం సాహిత్యం పాఠకుల్ని భయపెడుతుంది గందరగోళపరుస్తుందని"[19]

ఇలా మధు ఇరువది రచనల్లో వుండే విషయాల్ని బయపెట్టాడు. మధు యెంత ఉత్తమ ప్రయోజనాన్ని ఆశించి రచన చేసినా, ప్రజల్ని భయపెట్టే సాహిత్యం సృష్టించడం మంచిదికాదనే నిర్ణయానికి రాగలిగాడు. అంటే శరత్ రచనల ప్రభావం మధుబాబులో కూడా చోటు చేసుకుని ఆకట్టుకున్నాయి. ఇక్కడ పరోక్షంగా రచయిత కనిపిస్తున్నారు. మధు వాస్తవికతను గురించి చెప్తూ వాస్తవికతకు చేరువగా వస్తున్నారేగాని వున్నదివున్నట్టుగా ఎవరూ రాయలేరు. అలా రాస్తే అసహజంగా వుంటుందంటున్నాడు. జీవితంలోని ప్రతిఅణువు ఓచిక్కుసమస్యగా తీసుకుని చర్చించినప్పుడే అతని మనుగడకు సార్థకత లభిస్తుందంటాడు. మధుబాబులోని ప్రతి అభిప్రాయం వేణుగోపాలరావు రచనలకు చేరువలో వున్నట్లే మనకు ద్యోతకమవుతుంది. మధుబాబు పాత్రలో రచయిత తన అభిప్రాయాల్నే ఆ పాత్ర ద్వారా చెప్పారనడంలో సందేహంలేదు.

## ప్రమీలాదేవి :

'ఊగవే ఉయ్యాల' నవల్లో ప్రమీలాదేవి రచయిత్రి, వైద్యవృత్తిని చేపడుతుంది. రయిచత్రిగా తమ తమ అభిప్రాయాల్ని తన రచనల్లో వెల్లడి చేస్తుంది. ఈమె రచనల్లో ఎక్కువగా సెంటిమెంటల్ ఇతివృత్తాలూ, ప్రేమకథలే వుంటాయి. తన రచనల్లోని ఇతివృత్తాన్ని గురించి చెప్తూ—"ప్రపంచంలో రకరకాల మనుషులుంటారు. . ..నన్ను షిప్పింగ్, ఫిషింగ్ గురించి రాయమంటే రాయగలనా? నేను మెడికల్ సబ్జెక్టు తీసుకుంటాను. అతిడ్రైగా వుండకుండా ప్రేమ, సెంటిమెంట్ ఇతివృత్తాల్లో వాటిని యిముడ్చుతాను. ప్రేమ అనేది అంట రాని వస్తువుకాదు. ప్రపంచ సాహిత్యంలో ఎక్కువ ప్రాముఖ్యం పొందింది ప్రేమ కథలే"[20] అంటుంది. చెప్పింది రచయిత్రి పాత్రలోనైనా మనం వేణుగోపాల రావుని ఆ పాత్రద్వారా చూడగలుగుతాం. ఎందుకంటే రచయిత, డాక్టరు కాబట్టి. రచయిత పాపులారిటీ గురించి చెప్తూ. ప్రమీలాదేవి—ఏ ఇతివృత్తం తీసుకున్నా సహజంగా మలచుకుంటూపోతూ వాటికి కొన్ని హంగులు చేర్చాలంటుంది. రొటీన్‌గా యాంత్రికంగా కాకుండా బయోలాజికల్‌గా ఇతివృత్తం వెనుక అంత ర్వాహినిలా ప్రవహిస్తూ వుండాలంటుంది.

సీరియల్ రచనలను గురించి చెప్తూ ప్రమీలాదేవి 'నవలను సీరియల్‌గా రాస్తున్నన్ని రోజులు కత్తిమీద సాము లాంటిదని చెప్తుంది. తను నిద్రపోతున్నా

మెలుకువతో వున్నా హాస్పిటల్‌లో పనిచేస్తున్నా, అంతర్లీనంగా అదే ధ్యానంతో వుంటా' నంటుంది. వృత్తిరీత్యా డాక్టరు అయివుండి ప్రవృత్తిరీత్యా రచయిత అయిన వ్యక్తి మానవ స్వభావాల్ని యెలా తరచిచూడగలరో డాక్టరుగా పేషంట్ మనస్తత్వాన్ని కూడా మధించగలుగుతారంటుంది. రెండిటి రీత్యా రచయిత నైతిక బాధ్యత వహించవలసి వుంటుందని చెప్తుంది. పేషంట్‌కు సంబంధించిన వారి జీవితాల్ని, రచనల్లో చూపడంవల్ల మానసికమైన ఉద్రేకం కలుగుతుందని దానివల్ల రోగి శారీరకంగా, మానసికంగా ఎదుగుతాడని ప్రమీలాదేవి తన అభిప్రాయాన్ని తెలియజేస్తుంది. రచనల ద్వారా రోగుల్ని మానసికంగా మార్పు తీసుకు రావచ్చునన్నది వేణుగోపాలరావు ప్రమీలాదేవి పాత్ర ద్వారా తెలియజేస్తున్నారు. కొందరు రచయితలు స్త్రీల పేర్లతో నవలల్ని రాస్తున్నారు. ఇందులో ప్రమీలా దేవి పాత్రద్వారా వేణుగోపాలరావుగారు తన ఆశను, అభిమతాన్ని తీర్చుకున్నట్టయింది.

**అనంతమూర్తి :**

'సూర్యుడు దిగిపోయాడు' నవలలో అనంతమూర్తి జర్నలిస్టు, రచయిత, ఎడిటర్. రచయిత నుంచి జర్నలిస్ట్ వరకు ఎదిగిన వ్యక్తి. జీవితంలో ఒడుదుడుకులకోర్చి పైకి వచ్చిన పాత్రగా కనిపిస్తుంది. ఛీఫ్ ఎడిటర్ అయిన రఘురామయ్య పత్రిక పూర్తి బాధ్యతను అనంతమూర్తికి అప్పగిస్తాడు. సాహిత్యం అతని ఊపిరి కావడంవల్ల పత్రిక విలువల్ని పెంచుతాడు. శీర్షికల విషయంలో, సీరియల్స్ ప్రచురించటంలో పత్రిక స్థాయిని పెంచుతూ నూతన ప్రయోగాలు చేస్తాడు. వైద్య వృత్తిలో డాక్టరు యెటువంటి ఒడుదుడుకుల్ని యెదుర్కొంటాడో, రచయితగా అనంతమూర్తి పాఠకుల దృష్టిలో అలాంటి ఇబ్బందుల్ని చవిచూచి ఎదుర్కొంటాడు. డాక్టరు వృత్తిలో కొన్ని అసంతృప్తులకు లొంగిపోయినప్పుడు భార్య ప్రోత్సాహం వున్నట్టే ఇందులో రచయిత పాఠకుల్లో విమర్శకు గురియైనప్పుడు అటువంటి ప్రోత్సాహం అనంతమూర్తికి లభిస్తుంది.

అనంతమూర్తి సీరియల్‌గా రచించిన నవల విపరీతమైన ప్రాచుర్యంలోకి వస్తుంది. ప్రతి ఇంటిలోను చర్చావేదిక అయి అనేక సంఘర్షణలకు దారితీస్తుంది. అందుకు ఒక పాఠకురాలి ప్రశ్నకు సమాధానం చెప్తూ అనంతమూర్తి—

"రచయితకు కావల్సింది నిజాయితీ. ఇజాల గురించి సభల్లో ఊకదంపుడు ఉపన్యాసాలు చేసి, ప్రపంచంలో మార్క్సిజాన్ని తానే కాచి వడపోసినట్టు మాట్లాడి వ్యక్తిగత జీవితంలో సిద్ధాంతానికీ ఆచరణకూ జకిల్ అండ్ హైడ్ స్థాయిలో భిన్న ధృవాలు కలిగివుండి వూహించలేనంతటి నీచస్థాయిలో వున్నాడని"[21] అంటున్నాడు. సిద్ధాంతాన్ని ఏకరువు పెట్టడంతోనే వాళ్ళ పని సరిపోతుంది కాని జీవితంలో సమన్వయించుకోలేకపోతున్నారని అనంతమూర్తి అభిమతంగా తెల్తుస్తుంది. రచయిత నైతిక విలువలు లేక ప్రవర్తిస్తున్నారని డబ్బు ఎర చూపిస్తే తలాతోక లేని రచనలు చెయ్యటానికి ముందుకు వస్తున్నారని కూడా అంటాడు, నిజాయితీ గల రచయితగా ఇక్కడ అనంతమూర్తి కనిపిస్తున్నాడు.

సీరియల్ నవల్లో కల్పన పాత్రను సృష్టించి కొన్ని సూత్రీకరణ లివ్వడం వల్ల పాఠకుల్లో చిక్కుకుంటాడు. నవీన స్త్రీ గురించి అనంతమూర్తి "ప్రతి వ్యక్తిలోను మంచీ-చెడూ వుంటాయి. సంఘపరంగా, వ్యక్తిపరంగా యీ మంచీ చెడూ యెప్పుడూ కలిసి మెలిసి విడదీయరానంత కట్టుదిట్టంగా వుంటాయి........పురుషుడిలో అనేక బలహీనాలుంటాయి. అలాగే స్త్రీలోనూ వుంటాయి. స్త్రీకి సాంఘిక జీవనంలో సమాన ప్రతిపత్తి లేదు. స్త్రీకి సమాజంలో రక్షణ లేదు. స్త్రీ మగవాడి కామానికి అన్యాయంగా బలవుతూ వుంటుంది . . . .కుటుంబాలు యెక్కువగా ఆడవాళ్ళ తగాదాల వల్లో పడిపోతూ వుంటాయి. జీవితాన్ని తేలిగ్గా తీసుకొని బరువుగా ఆలోచించటం నేటి ఆడవాళ్ళ సొత్తు. అసలు నేటి స్త్రీకి ఆలోచనలో పరిపక్వత కన్న తొందరపాటు యెక్కువగా వుంది—అనే సత్యాన్ని ఎందుకు అంగీకరించరో"[22] అని అంటాడు. అనంతమూర్తి తన రచనల్లో మానవాళి అభ్యుదయానికి సర్వతోముఖ వికాసం పెరగాలని ఆవేదనచెందుతాడు. మానవత్వపు విలువల విషయంలో నిజమైన హృదయం పేద బాలికల్లో వుంటుందని అంటాడు. పేద స్త్రీల సమస్యల్ని అర్థం చేసుకునే సహనం, ఓర్పు, డబ్బున్న ఆడవాళ్ళకు లేదంటున్నాడు. రచయిత్రులనే ఉదాహరణగా తీసుకుని చెప్తూ 'ఒకళ్ళ గొప్పతనం ఒకళ్ళు ఛస్తే ఒప్పుకోరు. స్త్రీలలో ఒకరు కాస్త పైకి వస్తే, ఒకరు కారాలు నూరేస్తారు. పురుషుడికి వయస్సు వస్తోన్నకొద్దీ విశాలదృక్పథం పెంచుకోవడానికి ప్రయత్నిస్తుంటారు. కాని స్త్రీ వయసు పైబడుతున్నకొద్దీ ఇరుకు మనస్తత్వం గల మనుషులవుతుంటారని' అనంతమూర్తి వ్యక్తం చేస్తున్నాడు. ప్రపంచంలో అబ్బుదెవ

రైనా వుంటే వాళ్ళు మేధావులే. ఎందుకంటే వాళ్ళు అత్యల్పమైన వాటి గురించి అతి యెక్కువగా ఆలోచిస్తుంటారని అనంతమూర్తి తన అభిప్రాయాన్ని వ్యక్తం చేస్తున్నాడు.

దేశం అత్యవసర పరిస్థితిలో వున్నప్పుడు జర్నలిజంలో సంపాదకీయాలు రాసినందుకు అనంతమూర్తి జైలుజీవితం గడుపుతాడు. విడుదల అయిన తరువాత జీవితం తృప్తినిచ్చేవరకు జీవించానంటాడు. నాది కానిజీవితం జీవించటం తనకు చేతకాలేదని కూడా చెప్తాడు. అనంతమూర్తి పాత్ర చిత్రణలో రచయిత తన అభిప్రాయాల్ని జోడించి పలికినట్లయింది. జీవిత సమస్యల్ని గురించి, జీవిత సత్యాల్ని గురించి యువతరం ఎమగుతనాన్ని గురించి, రచయిత సమస్యల్ని గురించి, రచన ఇతివృత్తం మలిచే విధానాన్ని గురించి యెంతో చాకచక్యంగా అనంతమూర్తి పాత్ర ద్వారా వేణుగోపాలరావు చిత్రించగలిగారు.

## 6. దుష్ట స్వాభావికాలు :

నవలాకారుడు తన నవల్లో వాస్తవ జీవితానికి అద్దం పడతాడు. వాస్తవ జీవితంలో విభిన్న మనస్తత్వాలు గల మనుషులున్నట్టే నవల్లో కూడా విభిన్న మనస్తత్వాలు గల పాత్రలను సజీవంగా చిత్రిస్తాడు. ఈ పాత్రలలో మంచి స్వభావం కలిగినవి వుంటాయి. చెడు స్వభావంతో కూడిన పాత్రలుంటాయి. నలుగురికి మంచి చేసేవి మంచిగా మసలుకునేవి మంచి స్వభావం గల పాత్రలు అనుకుంటే, ఇతరులకు చెడుపు చేయటమే గాక చెడు తలంపులు కలిగివున్న పాత్రలను చెడు స్వభావం గల పాత్రలని చెప్పుకోవచ్చు. జీవనస్రవంతిలో సవ్యంగా, నిర్మలంగా సాగుతున్నప్పుడు ఇటువంటి పాత్రలు సుడిగుండాలు సృష్టించి, అలజడి పుట్టిస్తారు. వారి సముచిత గమనానికి ఈ దుష్టస్వభావం గల పాత్రలు అడ్డు తగులుతుంటాయి. వీటి కార్యకలాపాలవల్ల వొడుదుడుకులను యెదుర్కొని సత్ స్వభావం గల పాత్రలు ప్రత్యక్షంగా ప్రమాదకారులై పార కుల ఈసడింపులకు గురియై పరోక్షంగా మంచి పాత్రలకు మేలుచేసి మెప్పు లిస్తాయి. ఇటువంటి స్వభావం గల పాత్రల్లో మచ్చుకు కొన్నిటిని మాత్రమే ఇక్కడ చర్చించడం జరుగుతుంది,

శ్రీపతి :

'పెంకుటిల్లు' నవలలో రాధ స్నేహితురాలైన ప్రమీల భర్త శ్రీపతి. రాధ పేదింటి ఆడపడుచు కావడంవల్ల ప్రమీలతో తన కుటుంబాన్ని ఆదుకోమంటుంది. రాధ ప్రమీల ఇంటికి తరచూ వస్తూవుండటంవల్ల శ్రీపతికి ఆమెపై కన్ను పడుతుంది. శ్రీపతి కుటిలబుద్ధితో తన పనిమనిషి ద్వారా ప్రమీల పిలుస్తుందని అబద్ధపు మాటలతో రాధను ఇంటికి రప్పించుకుంటాడు. శ్రీపతి ఇంటికి రాధ వచ్చింది. పరిసరంబట్టి వాడి కుటిల మనస్తత్వం అవగతమవుతుంది. శ్రీపతి తన కోర్కెను తీర్చమంటాడు. రాధ విస్తుపోతుంది తనను వదలివేయమని ప్రాధేయపడుతుంది. నిందిస్తుంది. అయినా కామంతో కళ్ళు మూసుకుపోయిన శ్రీపతి రాధ శీలాన్ని అపహరిస్తాడు. రాధ తనను తాను నిందించుకుని ఆత్మవిమర్శ చేసుకుంటుంది. పవిత్రమైన ఇంటిలో తమకు చోటు లేదనుకొని ఆత్మహత్యా ప్రయత్నం చేస్తుంది. ఆనందరావు కాపాడతాడు. శ్రీపతి తను చేసిన తప్పుకు పశ్చాత్తాపం పడతాడు. మనశ్శాంతి కోసం భార్యతో కలిసి తీర్థయాత్రలు చేస్తాడు. 'ప్రతి మనిషి తను తప్పు చేస్తున్నప్పుడు అది తప్పు అని తెలుస్తుంది. కాని మనిషి తాత్కాలికంగా, మానసికంగా బలహీనుడవుతాడు. ఆ పరిస్థితుల్లో 'ఇక్కడ శ్రీపతి కూడా అంతే. చేసిన పాడుపనికి మనశ్శాంతికోసం శ్రీపతిని తీర్థయాత్రలు తిప్పిస్తారు ఇందులో రచయిత.

వీరభద్రం :

'విషవలయం' నవల్లో వీరభద్రం ఆస్తి దాహం గల దుష్టపాత్ర. రాధమ్మ, భర్త బలరామయ్య మరణంతో వీరభద్రం తన అక్క రాధమ్మను ఆశ్రయిస్తాడు. వాళ్ళ దత్తపుత్రుడయిన సత్యమూర్తిపై లేనిపోని ఆరోపణలు చేసి ఆ ఆస్తిని విడకొట్టడానికి ప్రయత్నిస్తాడు. తల్లీకొడుకుల మధ్య చిచ్చుపెడతాడు. పర్యవసానంగా రాధమ్మ, సత్యమూర్తి కోర్టుకెళతారు. కోర్టు వ్యవహారాలవల్ల వున్న ఆస్తి కాస్త కాళీ అవుతుంది. బలరామయ్య ఆస్తిని రెండుగా విడగొట్టి తన అక్కకు తెలియనీయకుండా ఆమె ఆస్తిని తన పేర రాసుకుంటాడు. రాధమ్మ తన తమ్ముడి సంకుచిత బుద్ధిని తెలుసుకుంటుంది. కాని యేమీ చేయలేని నిస్సహాయురాలౌతుంది. రాధమ్మ మరణంతో వీరభద్రం ఆస్తిని దుబారాగా ఖర్చు చేస్తాడు. రాధమ్మ కూతురు విజయ తన తల్లికి రాస్తున్న ఉత్తరాల్ని యెవరికీ తెలియకుండా గూడుపు

రాణి చేస్తాడు. సత్యమూర్తి, వీరభద్రం యొక్క గూడుపుఠాణిని తెలుసుకుని విజయను తీసుకువస్తాడు. వీరభద్రం చిందులు త్రొక్కుతాడు. విజయను ఇంటి నుండి పంపివేయమని సత్యమూర్తితో లాలూచిపడతాడు. అందుకు నిరాకరిస్తాడు. 'నువ్వు అనవసరంగా గోతిని తవ్వుతున్నావని' సత్యమూర్తిని బెదిరిస్తాడు.

వీరభద్రం ఇంటిలో దొంగతనం చేస్తాడు. సత్యమూర్తికి పట్టుబడిన వాడై అతన్ని గాయపరచి వెళ్లిపోతాడు. వీరభద్రం పోలీసులకు పట్టుపడతాడు. రాధమ్మ ఆస్తిని విజయకు దక్కేటట్టు చేస్తాడు. సత్యమూర్తి. తన అక్క ఆస్తిని కాజేయాలన్న ఆశ పేరాశ అవుతుంది. ఆ దాహంతో అర్రులు చాచిన వీరభద్రం చివరకు కటకటాల పాలౌతాడు. పైసాకోసం గడ్డి కరిచే ప్రబుద్ధులు కూడా సమాజంలో కోకొల్లలుగా వుంటారు. ఆస్తికోసం బాంధవ్యాలను కూడా లెక్క చేయక కోర్కెల పుట్టతో జనారణ్య కుహరంలో విహరించే పాత్రకు ప్రతీకగా వీరభద్రం పాత్రను రచయిత చిత్రించారు. దగాకోరు దగుల్బాజీలకు మచ్చు తునకే ఈ వీరభద్రం.

**రాంజీ :**

'విష వలయం' నవల్లోనే మరో దుష్ట స్వభావం గల పాత్ర రాంజీ. విజయ భర్త అయిన కృష్ణమూర్తి స్నేహితుడు. కృష్ణమూర్తి టి. బి. పేషంట్ కావడం వల్ల అతనికి సాయం చేస్తుంటాడు. కృష్ణమూర్తి భార్య విజయపై రాంజీ కన్ను పడుతుంది. అనుక్షణం విజయను వేధిస్తాడు. అందుకు తిరస్కరిస్తుంది. అతని ధోరణి మారదు. రాంజీ విజయతో కలుగ జేసుకుని "ఎందుకొచ్చిన ఆత్మాభిమానాలు విజ్జీ. నెలలు తరబడి నా ఉప్పు తింటున్నారు. నాది మృగత్వమే అయితే మీకు పెట్టిన డబ్బుతో పదిమంది ఆడవాళ్లను కొనుక్కొనేవాడ్ని; నీ మొగుడికి యీ జీవితంలో యిహ ఆరోగ్యం బాగుకాదు. ఇహ బ్రతుకంతా మంచం మీద వెళ్లదియ్యాల్సిందే... ... నాకింకా పెళ్ళి కాలేదు. బాగా సంపా దిస్తున్నాను, నాతో వచ్చెయ్యి. ఈ అవిటివాడ్ని అంటిపెట్టుకుని ఏం బావుకుంటావు? నిన్ను పెళ్ళి చేసుకుంటాను. సుఖపెడతాను"[23] అని యుక్తాయుక్త జ్ఞానాన్ని మరచిపోయి మాట్లాడుతాడు. వాడికి తగ్గట్టుగానే విజయ వాడికి గట్టిగా బుద్ధి చెప్తుంది. విజయకు భయపడి వెళ్ళిపోతూ కృష్ణమూర్తితో 'అవిటి వెధవా! పనికి

రాని వేధవ్వి. నువ్వెందుకిక దానికి నీ కళ్ళముందు ఏం జరిగినా కాపాడుకోలేని శవానివి' అని తిట్టి వెళ్ళిపోతాడు. ప్రపంచంలో స్నేహమే పవిత్రమైనదని ఎంచిన రాంజీ స్నేహితుని భార్య శీలాన్ని అపహరించాలనే కోర్కె వ్యక్తీకరించడం దుర దృష్టకరం. చంద్రునిలో మచ్చలాగా స్నేహమనే చంద్రుణ్ణి కల్మషం చేసింది కామమనే కోరిక. ఇటువంటి దుష్టస్వభావంగల పాత్రలు సమాజంలో మనకు యెదురౌతున్నవే, రాంజీవంటి స్నేహితులు లోకంలో వుంటారన్న ధ్యేయంతోనే రచయిత ఆ పాత్రను సృష్టించారు. స్నేహధర్మానికి విలువ తెలియనివాళ్ళ ప్రవర్తనలు యెలా వుంటాయన్నది రాంజీ పాత్ర ద్వారా రచయిత మనకు తెలియ పరుస్తున్నారు.

శంకర్ :

రాంజీలాంటి కాముకుడై మరో పాత్ర 'పసుపు-కుంకుమ' నవల్లో శంకర్ కంపెనీ మేనేజర్ చంద్రశేఖర్ స్నేహితుడు శంకర్. చంద్రశేఖర్‌కు గుండెపోటు కారణంగా రాయవెల్లూరులో ఆపరేషన్ జరుగుతుంది. చంద్రశేఖర్ బలవంతం వల్లనే శంకర్ యింటిలో మకాం చేస్తాడు. చంద్రశేఖర్ భార్య మాలతి. డాక్టర్ల సలహామేరకు సంసారసుఖానికి దూరంగా వుంటాడు చంద్రశేఖర్. శంకర్ ఇంటిలోని ప్రతివస్తువునూ తారతమ్యం లేకుండా తనదిగా వాడుకుంటాడు. మాలతిని అడుగడుగునా కవ్విస్తూ 'నేను నీకు నచ్చలేదా' అనే మాట కూడా అతని నోట నుండి బయటపడుతుంది. మాలతి శంకర్‌ను ఎప్పటికప్పుడు ఖండి స్తూనే మాట్లాడుతుంది.

ఒకరోజు రాత్రి మాలతి గదిలో పడుకునివుంటే శంకర్ ఆమె శీలాన్ని అపహరిస్తాడు. ఆ సమయంలో మాలతి తన భర్తేనని అనుకొంటుంది, జీవితంలో అతివిలువయిన శీలాన్ని తేలిగ్గా పోగొట్టుకోగలుగుతుంది. శంకర్ మాలతిని తనతో వచ్చేయమని ప్రాధేయపడుతూ—"ఓ ప్రాణస్నేహితుడ్ని మోసం చేసిన పాపిష్టి వాడిని యెలాగూ అయ్యాను. నువ్వెలాగూ పతనమయ్యావు. నీ మెళ్లో తాళి కట్టింది శేఖర్ అయినప్పటికీ, నేనే ముందు నిన్ను అనుభవించాను. ఈ నరకానికి తిలోద కాలిచ్చి తెల్లవారకముందే యిక్కడ నుంచి వెళ్ళిపోదాం"[24] అని అంటాడు. ఆ మాటల్ని విన్న చంద్రశేఖర్ స్నేహధర్మాన్ని చెప్తూ అతన్ని యీసడించుకుని యింటినుండి వెళ్ళగొడతాడు. శంకర్‌వల్ల మాలతిని దూరం చేసుకుంటాడు

చంద్రశేఖర్, కలతలులేని సంసారంలో చిచ్చు రగిల్చి వెళ్ళిపోతాడు శంకర్. శంకర్ పెట్టిన చిచ్చు ఫలితంగా చంద్రశేఖర్ అంధుడవుతాడు. గోపయ్య మనవరాలిగా, దుర్గగా తిరిగి తన యింటిలో ప్రవేశిస్తుంది మాలతి. మాలతి తన భర్తను మోసం చేస్తున్నావని శంకర్ ఆమెను బ్లాక్‌మెయిల్ చేస్తాడు. నీ నిజస్వరూపాన్ని నీ భర్తకు చెప్పేస్తానని బెదిరిస్తాడు. చంద్రశేఖర్‌ను తుదముట్టిస్తే ఆస్తినంతా తను దక్కించుకోవచ్చునని కుటిలబుద్ధితో అతన్ని చంపబోతాడు. ఆ సమయంలో దుర్గ అయిన మాలతి శంకర్‌ను యెదుర్కొని చావబాది తన భర్తను కాపాడుకుంటుంది.

స్నేహితుని బలహీనతను ఆసరాగా తీసుకుని ఆ అవకాశాన్ని తుచ్ఛ వృత్తితో వినియోగించుకుని అంతర్ముఖ విషకుంభాలకు ప్రతీక శంకర్ పాత్ర. అవకాశం చేయి జారిపోతే, అవసరం తీరిపోతే మిత్రుణ్ని కూడా అగర్భ శత్రువునిలా చీదరించుకుని, అసహ్యించుకుని అంధకార కామాంధులకు శంకర్ పాత్ర ఒక గుర్తు.

## డాక్టర్ గోవిందరావు :

'ఆరోగ్యమే మహాభాగ్యము'నే నినాదమే జీవిత లక్ష్యంగా పెట్టుకున్న డాక్టర్లు చాలామంది వుంటారు. అయితే డాక్టర్లలలో కూడా నీచప్రవృత్తి కలిగిన వారు కూడా వుంటారని తెలపడానికి డాక్టర్ వేణుగోపాలరావు, డాక్టర్ గోవింద రావు పాత్రను సృష్టించారు.

'భారతి' నవల్లో డాక్టరు గోవిందరావు కుష్ఠువ్యాధికి సంబంధించిన ప్రముఖ వైద్యులు. భారతికి కుష్ఠువున్నదని చెప్పిన డాక్టరు. భారతి తండ్రి గౌరీపతి తన కూతురికి కుష్ఠువున్న సంగతి కప్పిపుచ్చి సారధితో పెళ్లి జరిపిస్తాడు. గంగాధరంతో భారతికి వున్న వ్యాధిని గుర్తుచేస్తాడు గోవిందరావు.

అందువల్ల గంగాధరం తన కోడల్ని మాటలతో తూలనాడి, పుట్టింటికి పంపివేస్తాడు, భారతికి డాక్టర్ సాగర్ చికిత్సచేయగా వ్యాధి నయమవుతుంది. భారతితో తన కొడుక్కి విడాకులు కూడా యిప్పిస్తాడు గంగాధరం. భారతి కుష్ఠు రోగులకు సేవచేయాలన్న నెపంతో నర్సరీ ట్రయినింగ్ పూర్తిచేస్తుంది. కలికిరి ఆసుపత్రికి నర్స్‌గా వెళుతుంది. గోవిందరావు అవినీతిని లంచగొండితనాన్ని యెత్తి చూపుతుంది. అందుకు గోవిందరావు భారతితో "చిన్నదానివి. పైకి

రావలసిన వాళ్ళివి. నీ ఆశయాలు మంచివే కాని యిలా పనికిమాలిన సేవలు చేస్తూ జీవితాన్ని వృథా చేసుకోవటం నాకు నచ్చలేదు. అందులోను యిలాంటి రోగుల మధ్యనా నీ ఆదర్శాలు? ఇది లెప్రసీ భారతీ. లెప్రసీ. ఏ జన్మంలో పాపం చేసు కున్నారో వాళ్ళిలా ఏడ్చారు. వాళ్ళని యాంత్రికంగా ట్రీట్ చెయ్యాలిగా! ఇలా మితిమీరిన దయచూపకూడదు. చూపితే మన నెత్తికెక్కుతారు."[25] అని హితబోధ చేసినట్టు మాట్లాడతాడు. బాధ్యత కలిగిన ఒక డాక్టరు నోట ఇటువంటి మాటలు వినవలసివస్తుందని భారతి ఆలోచిస్తుంది కుష్ఠురోగులంటే అసహ్యించు కునే గోవిందరావు భారతి అందచందాల్ని చూసి ఆమె గతాన్ని గుర్తుచేస్తూ 'యవ్వనం వృథాగా కరిగిపోతుంది. నీలో చెలరేగే కోరికల్ని తీర్చుకో. మొగుడు వదిలేశాడు' అని ఆమెను బలాత్కారం చేయబోగా భారతి పదునైన చాకును చూపి బెదిరిస్తుంది. గోవిందరావు మనసులో తన డయాబిటిస్ పేషంట్‌నని గుర్తు చేసుకుని వదిలేస్తాడు.

డాక్టర్ గోవిందరావులో కామం చల్లారక పోగా యుక్తాయుక్త జ్ఞానం నశించి, లక్ష్మి అనే అమ్మాయిని బలవంతం చేస్తాడు. గోవిందరావు ఆ సమ యంలో 'అందమైనది, బలమైనది, అసూయ పడేవయసు' అంతవరకే ఆలో చిస్తున్నాడు. లక్ష్మి తన శక్తినంతా కూడదీసుకుని గోవిందరావును వెనక్కు తోసేస్తుంది. క్రింద పడిన గోవిందరావుకు తుప్పు పట్టిన మేకు గుచ్చుకుంటుంది. తనకు ధనుర్వాతం వస్తుందేమోనని బెణికిపోతాడు. ధనుర్వాతానికి గురి అవుతాడు. నోరు తెరవటం మూయటం సాధ్యంకాక శరీరంలోని కండరాలు బిగుచుకుపోయి మూడు రోజుల్లో మరణిస్తాడు. ఆ ఆసుపత్రికి పట్టిన శని విరగడవుతుంది.

సంఘసేవా తత్పరులైన డాక్టర్లలో కూడా నీతి, నిజాయితీగా బ్రతకలేక పోతున్నారని డాక్టర్ గోవిందరావు పాత్ర ద్వారా మనకు తెలుస్తుంది. డాక్టర్ కొమ్మూరి వేణుగోపాలరావు ఒక డాక్టరు అయివుండి ఒక డాక్టరు పాత్రను అలా చిత్రించడంలో వారి నిజాయితీని ఇక్కడ తెలియజేస్తుంది. డాక్టర్లు మానసిక బల హీనతలకు గురియై తమ వృత్తి ధర్మాన్ని విడమరచి ప్రవర్తిస్తున్నారని రచయిత ఆవేదన చెందుతున్నారని కూడా మనకు ఇక్కడ వ్యక్తమౌతుంది. లంచం, దగా, మోసం, వ్యభిచారాలు వ్యసనాలకు లోనిసై, డాక్టర్లను అలా ప్రవర్తించవద్దని రచయిత సందేశంగా కూడా మనం భావించుకోవచ్చు. వేణుగోపాలరావు డాక్టర్

గోవిందరావుకు ధనుర్వాతాన్ని అంటగట్టి తన కసి తీర్చుకున్నట్టుగా కూడా ఇక్కడ తెలుస్తుంది.

## 7. సందేశాత్మకాలు :

నవల ప్రధానోద్దేశం సందేశాన్ని యివ్వడమే. రచయిత ఈ సందేశాన్ని ఇతివృత్తపరంగా గానీ, పాత్రల పరంగా గానీ, సన్నివేశపరంగా గానీ, వ్యక్తీకరించడం జరుగుతుంది. నవలలన్నీ సందేశాత్మకాలు కాకపోవచ్చు. నవలా రచయిత్రులు అందరూ తమ నవలల ద్వారా సమాజానికి సందేశాల్ని ఇవ్వాలన్న అభిలాష కలిగివుండకపోవచ్చు. కానీ కొంతమంది నవలా రచయిత్రులు విధిగా తమ నవలల ద్వారా ఏదో ఒక సందేశాన్ని పాఠకులకు అందిద్దామనే ఆకాంక్షలు కలిగివుంటారు. అలాంటి రచయితల కోవకు చెందినవారే కొమ్మూరి వేణుగోపాలరావు. ఆయన నవల్లో అధికభాగం సందేశాత్మకాలుగా వుంటాయి.

రచయిత పాత్రల పరంగా సందేశాన్ని అందిస్తాడు. దానికి తగ్గట్టుగానే ఆ పాత్రల గుణాలని కూడా వర్ణించడం జరుగుతుంది. సాధారణంగా నవల్లో ప్రధానపాత్రల ద్వారానే సందేశాన్ని ఇవ్వటం జరుగుతుంది. కొన్ని ఆ ప్రధాన పాత్రలు కూడా సందేశాత్మక వ్యక్తీకరణకు సాధనాలవుతాయి. రచయిత తాను చెప్పదలుచుకున్న సందేశానికి అనుగుణంగానే పాత్ర చిత్రీకరణ గావిస్తాడు. వేణుగోపాలరావుగారు తన నవల్లో కొన్ని విషయాలను, సంఘటలను తీసుకుని వాటి తప్పొప్పులను బేరీజు వేసుకుని పాత్రల ద్వారా సమాజానికి ఉపయోగపడే సందేశాన్నివ్వడం కనిపిస్తుంది.

### డాక్టర్ కిషోర్ :

'ఒకే రక్తం-ఒకే మనుషులు' నవల్లో ప్రధాన పాత్రధారి డాక్టర్ కిషోర్. వైద్యవృత్తిని స్వీకరించినవాడు. మేనరికపు పెళ్ళిళ్ళలోని అనర్థాల్ని రచయిత కిషోర్ పాత్రను ప్రవేశపెట్టి అందులోని లొసుగుల్ని తెలియజేశారు. మన సమాజంలోని సంప్రదాయాల్ని, సంఘం కట్టుబాట్లను ఎత్తి చూపడం డాక్టర్ల విధిగా భావించాలి. ఎందుకంటే మారుతున్న సమాజానికి తగ్గట్టుగానే అందరిలో మార్పు రావాలన్నది వారి ఆశయంగా తెలుస్తుంది. కిషోర్ మేనమామ కూతురు సరోజ,

సరోజ కిషోర్‌ను పెళ్ళి చేసుకోవాలని కలలు కంటుంది. ఈ లోపుగా కిషోర్ నుంచి వుత్తరం వస్తుంది. అందులో మేనరికాలవల్ల వచ్చే అనర్థాల్ని గురించి చెపుతూ "రక్తసంబంధాల పెళ్ళిళ్ళు మన దేశంలో కొన్ని ప్రాంతాల ప్రజల్లో ముఖ్యంగా తెలుగు వాళ్ళలో ప్రబలివున్నాయి. ప్రపంచంలోని చాలా దేశాలు యిప్పుడు బహిష్కరించాయి. రక్తసంబంధాలవల్ల ఆ కుటుంబంలోని బయట ప్రపంచంలోకి పోకుండా అక్కడికక్కడే కూరుకుని, ఇరుక్కునిపోతూ వుండటం వల్ల మన స్తత్వాలు వికసించకపోవటమలా వుంచి, జీవితంలో సొగసు, మానవత్వం మనిషి పరవశింపజేసే స్పందన లోపిస్తాయి. ఒక యంత్రంలోంచి ఒకే రక్తం వస్తువులు తయారవుతూవుంటాయి. మార్పు వుండదు. వైవిధ్యముండదు. అలా బయటికి వచ్చిన మనుషులు కూడా యంత్రాల్లా ప్రవర్తిస్తూవుంటారు... .... యిలా తరతరాలబట్టి బయటి ప్రపంచంలోకి పోకుండా తమలో తామే ఇరుక్కుని పోయే యీ వంశాల్లో. తరాలు గడిచిన కొద్దీ మందబుద్ధులు, అనేక జబ్బులతో కూడుకున్న వాళ్ళు ఉద్భవిస్తూ వుంటారు. బ్రెయిన్‌కు సంబంధించిన వ్యాధులూ, అంగవైకల్యంగల పిల్లలూ, తీవ్రమైన చర్మవ్యాధులూ, ఒకటికమైన పక్షవాతానికి సంబంధించిన రోగాలు వీటిపైన మేనరికాల ప్రభావం చాలా వుంది"[26] అని స్పష్టపరుస్తాడు. రచయితకు బలమైన కోరికలు వుంటాయి. వాటిలో యిలాంటి పాత్రల్ని ప్రవేశపెట్టి కిషోర్ పాత్రద్వారా రచయిత తీర్చుకున్నారు. మేనరికాల వల్ల యెన్ని అనర్థాలు వాటిల్లతాయో కిషోర్ పాత్రద్వారా మనం తెలుసుకున్నాం. మనోవైజ్ఞానికంగా ఈ పాత్రస్వరూప స్వభావాల్ని రచయిత మనకు అందించినట్లవుతుంది. కాబట్టి వైజ్ఞానిక పాత్రగా కూడా చెప్పుకోవచ్చు.

**గిరిజ**

ఇదే నవల్లో ప్రధానపాత్ర గిరిజ. డాక్టర్ కిషోర్ మేనరికాలలోని అనర్థాల్ని ఉత్తరం ద్వారా తెలియజేస్తే, గిరిజ అనుభవపూర్వకంగా నిజజీవితంలో చవి చూస్తుంది. పుండరీకాక్షయ్య పెద్దకూతురు గిరిజ. పెద్దల మూర్ఖత్వపు ఆచార సంప్రదాయాలవల్ల గిరిజకు మేనరికపు పెళ్ళి జరిపిస్తారు. డాక్టర్ కిషోర్ సరోజకు రాసిన ఉత్తరాన్ని తాను చదువుతుంది. పెద్దల్ని యెదిరించాలన్న కోరిక వున్నప్పటికీ యెదిరించలేకపోతుంది. గిరిజ మానసిక సంఘర్షణలతో నలుగుతుంది. భర్తతో కాపురం చేయకుండా దూరంగా వుంటుంది. తన మాటల్ని తల్లిదండ్రులు పెడ

చెవిని పెట్టారని ఆత్మహత్యాప్రయత్నం చేసుకోబోయే సమయంలో సరోజ భర్త శంకర్ కాపాడుతాడు. సరోజ స్నేహితురాలు కావడంవల్ల ఆమె మాటల్ని గిరిజ మన్నించి భర్తతో కాపురం చేస్తుంది. ఒక పిల్లవాడు కూడా కలుగుతాడు. గిరిజ అనుకున్న అనర్థాలకు తగ్గట్టుగానే పుట్టినటువంటి బిడ్డ వికారంగా వుంటాడు. తన కుటుంబంలోని వారందరిలో మార్పు తీసుకురావాలని ఆమె ఆవేశం కట్టలు త్రెంచు కుంది. తను కన్నకలలు ఫలించాయని కుటుంబంలోని వారందర్నీ వుద్దేశించి గిరిజ "మీ అందరికీ సహజంగా కనిపించింది ఆనాడు నాకు విపరీతమయింది నాన్నా. ఇప్పుడు నాకు సహజంగా కనిపించేది మీకు విపరీతమనిపిస్తోంది. జీవితం చిత్రం కాదు, మోసమిదే నాన్నా. జరగరాని పనే జరిగిపోయింది. జరగకూడదది యింకా జరగరానిది.... . మనమంతా కలిసి కూలిదండగ యెందుకని మన మనుషుల్తోనే ఓ యంత్రాగారం నడుపుతున్నాం. ఈ యంత్రాగారంలోంచి తెలివిహీనులు, వికృతాకారులు, రోగగ్రస్థులు పుట్టుకువచ్చినవాళ్ళు సౌరభ్యంతో మన కుటుంబాలను భర్తీచేస్తూవుంటారు. ఇంత యాతనపడటానికీ యీ నరకమంతా నేత్రపర్వంగా సందర్శించటానికి నాకు ఓపికలేదు . . . ఈ చరిత్ర ఒంటరిగానే సమసిపోవాలి"[27] అని అంటూ తనకు పుట్టినబిడ్డను డాబామీదనుంచి పారవేస్తుంది. తను ఆత్మహత్య చేసుకోబోతున్న సమయంలో కాపాడబడుతుంది. ఒ యింటి ఆడపడుచుగా పెట్టే ఆక్రందన యిది. ఇకమీదటనైనా మేనరికపు పెళ్ళిళ్ళు మానుకుంటారని కుటుంబంలోని అందర్నీ వుద్దేశించి మాట్లాడుతుంది. గిరిజ మాటల్లో రచయిత సమాజానికి విసిరిన చురకలాంటిదే. ముందు తరానికి ఒక హెచ్చరికలాంటిది. రాబోయే తరానికి స్వాగతం పలికినట్టు కూడా మనం అర్థం చేసుకోవాలి.

**మధు :**

'హౌస్ సర్జన్' నవల్లో మధు కీలకమైన పాత్ర వహిస్తాడు. మధు ఎం.బి.బి.యస్. పూర్తి అయిన తరువాత హౌస్ సర్జన్‌లో చేరుతాడు. మధుకి విజ్ఞానంమీద తృష్ణేగాని మరోదాన్ని గురించి ఆలోచించడు. అందువల్ల ఎవర్నీ ప్రేమించడు. ఇద్దరి వ్యక్తుల-చేత ప్రేమించబడతాడు.

నర్సువృత్తి చేస్తున్న నళిని మధుని ప్రేమిస్తుంది ప్రేమించిన విషయం గుర్తు చేస్తుంది. ముద్దు కూడా పెట్టుకుంటుంది. పైగా తన కోరిక తీర్చమని

కోరింది. ప్రభుత్వ ఆసుపత్రిల్లోని డాక్టర్లు, నర్సులు నైతికధర్మాన్ని పాటించడం లేదని గుర్తుకు తెచ్చుకుంటాడు. మధు నళిని ఉద్దేశించి "నువ్వంటే నాకెంతో అభిమానం గౌరవం. మనం వ్యక్తిగతంగా యెలాంటి వాళ్ళమైనాగానీ, అతిపవిత్ర మైన వృత్తిని స్వీకరించాం. నేను డాక్టర్ని, నువ్వు నర్సువి. వృత్తిరీత్యా మన యిద్దరకూ కొన్ని నైతికధర్మాలున్నాయి. వ్యక్తిగత ఆకర్షణను లోపలే అణచి వుంచి, ఆ అణచివేత కల్పించే ప్రకంపన ద్వారా జీవితమార్గానికి ఒరవడి పెట్టు కుంటే మనిషి ధన్యజీవి అవుతాడు. డాక్టర్ల గురించీ, నర్సుల గురించీ, హాస్పిటల్ గురించి మిగతా జనం చెడ్డగా చెప్పుకుంటున్నారే, దీనికి తరుణమేమిటి? మన లోపం వుండబట్టేకదా? అనేక చెడు సంఘటనలు మనలో వాళ్ళు చూడబట్టే కదా! దీనికి విముక్తిలేదా?........మంచివాళ్లు ఎక్కువమంది వుండరు. కాని వారిప్రభావం వేలమందిమీద ప్రసరిస్తుంది. నువ్వు అలాంటి మంచిదానివికా' 28 అని తన సందే శాన్నిస్తాడు. వృత్తిని స్వీకరించిన ప్రతి ఒక్కరికి ఈ సందేశం చురకలాంటిది. ముఖ్యంగా ప్రభుత్వపు ఆసుపత్రిల్లోవున్న డాక్టర్లు, నర్సులు ప్రవర్తనం గురించి రచయిత మధు పాత్రద్వారా తెలియజేస్తున్నారు. వృత్తిని నమ్మినవాళ్లు నిజాయితీగా తన వృత్తిధర్మాన్ని కాపాడుకోవాలన్నది రచయిత అభిమతం.

**సహజ :**

'డాక్టరుగారి భార్య' నవల్లో కీలకమైన పాత్ర సహజ. డాక్టర్ నరేష్ భార్య. వైద్యవృత్తిని చేస్తున్న తన భర్తకు చేదోడువాదోడుగా వుంటుంది. నరేష్ ప్రైవేట్ ప్రాక్టీస్‌లో అనేక ఇబ్బందుల్ని ఎదుర్కొంటాడు. తన వృత్తికి స్వస్తి చెప్పాలనుకుంటాడు. అందుకు సహజ తన భర్తలోని అసంతృప్తిని పోగొట్టాలనే వుద్దేశంతో సహజ ధోరణితో—'తోటి మానవుడితో లీనమైపోయే, అతన్తో కలిసి జీవించే ఏ స్నేహితుడూ లేకపోయినా రోగాస్తులే స్నేహమయులుగా కనిపించే అద్భుతమైన. అపురూపమైన వృత్తిచేస్తూ అనితరసాధ్యమైన అధికారాలు కలిగివున్న పవిత్రమైన వృత్తిలో వుండి, కావలసినంత అనుభవం సంపాదించి చివరకు ఓ పిరికి వాడిలా అప్రయోజకుడిలా పారిపోదామనుకుంటున్నావా? నిన్ను ఓ ఆదర్శవంతు డైన డాక్టరుగా పరిపూర్ణమైన డాక్టరుగా రూపొందించాలని నా గురించి నేను ఆలోచించకుండా నాలోని స్త్రీత్వాన్నీ మానవసహజమైన బలహీనతల్ని పాదద్రోలు కుని యెంత శ్రమించాను.........నిన్ను నా మనసులో వున్న రూపానికి దగ్గరగా

చిత్రించుకుంటూ ఎంత పరితపించాను. చివరకు నువ్వు నా కిచ్చేది? ఓ అసమర్థుడ్ని. పిరికివాణ్ణి, అప్రయోజకుడినా నేను చూడాల్సివచ్చింది.........నీ ఓటమి మంచి నువ్వు నేర్చుకోవాల్సింది వేదాంతం కాదు. ఆత్మబలం. బంధాలు త్రెంచుకోవటం కాదు. మేధస్సు, శక్తి పెంచుకోవటం. అవి నీకు చేతకానపుడు యూ గెటవుట్"[29] అని అంటుంది. సహజ మాటలకు నరేష్ ఖిన్నుడవుతాడు. ఆమె మాటల్ని ఆలోచించి పశ్చాత్తాపంతో తన వృత్తికి న్యాయం చేకూర్చిన వాడవుతాడు.

**లీల :**

'మేడలో నీడలు' నవల్లో ముఖ్యమైన పాత్ర లీల. ఆమె మనోరమ స్నేహితురాలు. మనోరమ రామం భార్య. తన భర్తను ప్రేమించి పెళ్ళి చేసుకుంటుంది. ఇంటి వాతావరణం ఇరుకనిపిస్తుంది. కళాపిపాసి కాబట్టి మనోరమ జీవితంలో నూతనత్వంకోసం మద్రాసు చేరుకుంటుంది. మనోరమకు అనుకోకుండా లీల తటస్థపడుతుంది. మనోరమను ఇంటికి తీసుకెళ్ళి ఆమె పరిస్థితిని అర్థం చేసుకుంది. స్వేచ్ఛా జీవితం పనికిరాదంటూ లీల మనోరమతో "ఓ స్వేచ్ఛా ప్రియా! నువ్వా ఊహావాసిగా, అతీతపు వ్యక్తిగా చేసుకుని మాటాడకు. అనుభవ శూన్యులు రాసే పుస్తకాల్లోని మాటలు, దూరంగా వుండి రాసుకునే ప్రేయసి ప్రియుల లేఖలు ఈ భావాలతో వుంటాయి. ఇది ప్రాక్టికల్ వరల్డ్. ఇందులో బంధం తప్పనిసరి. అసలిది లేనిదే మనిషి మనుగడే లేదు . . ఆ బంధం లేని స్త్రీలు పురుషులు ఒంటరితనంతో యెంత అల్లాడిపోతారో, పీడించబడతారో నీకు తెలీదు. స్వేచ్ఛ అనేదానికి తప్పు అర్థాలు కలిగించకు. ఉద్యోగిగా, వృత్తి చేసేవాడిగా, భార్యగా, భర్తగా, ఏ విధంగా నయినా సరే మనిషికి స్వేచ్ఛ పూర్తిగా లేదు. ఉండకూడదు. ఉన్నవాడిరి మానవత్వపు మనుగడలేదు. అంతం వుండదు. స్వార్థానికి, అప్పుడు ప్రతిదీ స్వేచ్ఛ. నృత్యం, సంగీతం ఏదో ఓ కళ అభిరుచి వున్నవారికి అత్యంతావశ్యకమైనవే. రాజీ పడక హద్దులు అక్కర లేదనుకుంటే మిగిలేది అశాంతే. అగ్నే. నిండుతనము లేక ఆ జీవితము చివికి చివికి ఆ నాట్యకత్తె అలసిసొలసివేసిన తప్పటడుగులు లాగోనో, ఆ గాయని గొంతుపోయి చేసిన అపశ్రుతిలాగానో వుంటుంది. స్వేచ్ఛకి ఇంత భయంకరమైన స్వరూపం యివ్వకూడదమ పిచ్చితల్లీ.... నాకు తెలిసినంతవరకు దాంపత్య

బంధాన్ని మించిన సత్యం భూమ్మీద మరొకటి లేదు. ఈ అదృష్టాన్ని నువ్వు చేజేతులా పోగొట్టుకోకు"[30] అని తన హితవచనాల్ని పలుకుతుంది. ఇక్కడ లీల పాత్రల్లో రచయిత పరోక్షంగా ప్రత్యక్షమైనట్టు తెలుసుకోవచ్చు. స్వేచ్ఛాజీవి అయిన మనోరమ మనసు మార్చడంకోసం లీల పాత్రను రచయిత ప్రవేశపెట్టినట్టు తెలుస్తుంది. అనుభవశూన్యులు రాసే పుస్తకాల్లోని మాటలు నమ్మి జీవితాల్ని చేజేతులా నాశనం చేసుకుంటారని కూడా హెచ్చరిస్తున్నారు. ఊకదంపుడు రచనలవల్ల రచయితలు సమాజాన్ని అడ్డుదారి పట్టిస్తున్నారని కూడా కొమ్మూరి గారు అభిప్రాయపడినట్టు కూడా ఇక్కడ తెలుస్తుంది. లీల హితోపదేశ మాటల వల్ల మనోరమ తన భర్తను చేరుకుని మన్నించమని ప్రాధేయపడుతుంది. రచయిత పాఠకుల్ని తప్పుదోవ పట్టనీయక వున్నట్టుండి లీల పాత్రను ప్రవేశపెట్ట గలిగారు. రంగుటద్దాలలోంచి జీవితాన్ని చూడవద్దని నేల విడిచిన సాము పనికి రాదని, పుస్తకాల్లో చదివేదంతా వాస్తవజీవితం కాదని, వాటిని నమ్మి మోస పోవద్దని, జీవితాల్ని గాలిమేడలలో కట్టుకోవడంలోనే గడిపివేయవద్దని పాఠకుల్ని వెన్ను చరిచి కళ్ళు తెరిపిస్తాడు.

చక్రవర్తి :

'తోడూ జోడూ' నవల్లో ప్రధాన పాత్రధారి చక్రవర్తి. రెండు కుటుంబాల మధ్య వారధిగా నిలబడి వారికి జీవితంలోని విశేషాల్ని తెలియపరుస్తుంటాడు. జీవితంలోని సుఖదుఃఖాల్లో అనుభవించిన పాత్రలాగా కనిపిస్తాడు. ఈ నవలల్లోని ప్రతి సంఘటనతోను, ప్రతి సన్నివేశంలోను చక్రవర్తి మాటల్లో మరకు రచయితే ముందుండి పలికించినట్లవుతుంది. రెండు కుటుంబాల్లోని కలతల్ని తీర్చుకుంటూ వారికి జీవిత నిర్వచనాల్ని చేసుకుంటూ ముందుకు వెళతాడు.

చక్రవర్తి స్నేహితుడు చిరంజీవి. చిరంజీవి దివ్యను పెళ్ళి చేసుకుంటాడు. ఒక స్నేహితుడిగా చక్రవర్తి చిరంజీవితో భార్యభర్తల్ని గురించి చెప్తూ "భార్యకు యెంతవరకు అవసరమో, అంతే చనువియ్యి. అభిమానించు. కాని అర్థం లేకుండా ఆరాధించకు. నీ సొంత విషయాలు, ఏమీ చెప్పకు. నీ తల్లిదండ్రుల్ని గురించి నీవైపు వున్న ఇతరులను గురించి తేలిగ్గా మాట్లాడకు. ఆమె సొంత విషయాల్లో

తల దూర్చకు ...... నీ వ్యక్తిత్వం మొదట్నుంచీ ఆమెకు తెలిసేలా ప్రయత్నిస్తూ వుండు"[31] అని అంటాడు. భర్త అనేవాడు సొంత విషయాల్ని చెప్పినట్టయితే అపోహలకు దారితీసి కుటుంబ పతనానికి దారితీస్తుందని చక్రవర్తి మాటల్లోని అంతరార్థం. పైగా భర్తగా తన భార్యకు కూడా స్వేచ్ఛ కలిగించాలని అంటు న్నాడు. మారుతున్న సమాజ పరిస్థితులపట్ల స్త్రీలలో కూడా మార్పు రావాలన్నది రచయిత ధ్యేయం. చిరంజీవి భార్య దివ్య. భర్తతో మనస్పర్థలు పెట్టుకుని పుట్టిం టికి వెళ్ళిపోతుంది. ఆ భార్యాభర్తల్ని కలపాలన్న నెపంతో చక్రవర్తి దివ్య దగ్గరకు వెళ్ళి తనను తాను పరిచయం చేసుకుంటాడు. ఇరువురిలో వున్నటువంటి అపోహల్ని తొలగించాలనే చక్రవర్తి దివ్యతో మాటలు కలుపుతాడు. దివ్య తను ఎంతో అవమానాన్ని భరించానంటుంది. అందుకు చక్రవర్తి దివ్యతో "అవమానాన్ని భరించ దల్చుకుంటె అంత కష్టంకాదు. అసలు జీవితంలో అవమానాలు, చావులు దుఃఖాలు సహజం . ఒక ప్రవృత్తి ఇంకో ప్రవత్తి ఎప్పుడూ దూరంగానే వుంటుంది. ఒక మనిషికి ఆకలి, ప్రేమ, దాహం యెంత సహజమో కోపం కూడా అంతే సహజం. సంవత్సరాల తరబడి విధివిరామం లేకుండా కలిసి జీవించేటప్పుడు కోపం రావడం, ఆ కోపాన్ని ప్రదర్శించడం, కూడనివా? ... ..ఒకరి మూడ్ని, ఇంకొకరు గమనించి సహకరించాలి. కానీ అన్ని విషయాల్లో తనకోసం తపించే వ్యక్తి యేదో ఒక బలహీనత క్షణంలో చేయిచేసుకున్నాడే అనుకోండి, దానికి శిక్ష మనిషిని వదులుకోవడమేనా? మనం నివశిస్తున్న సమాజంలో శీలం విలువకు సరియైన నిర్వచనాలు చెప్పుకోలేని పరిస్థితుల మధ్య నలిగిపోతున్న వ్యవస్థలో ఈ కారెక్టర్ అనే దానికి అంతటి ఉన్నత ప్రమాణాలుగా ఏ ఒక్క సంసారమూ సవ్యంగా నిలబడిదు"[32] అని అంటాడు. భార్యాభర్తల మధ్య సహకారముండి ఒకరి తప్పుల్ని మరొకరు క్షమించుకుంటూ వెళ్ళగలిగితే సంసారం బంగారుబాట కాగలదని రచయిత చక్రవర్తి మాటల్లో చెప్తున్నారు.

దివ్య స్నేహితురాలు సత్య. ఈమె సోఫిస్టికేటెడ్‌గా వుండాలన్నదే ఆమె అభిమతం. భర్త చిన్న ఉద్యోగి అయినా కోరికలు యెక్కువగా వుంటూ భర్తను మానసికంగా హింసిస్తుంది. అందుకు ఆమె భర్త మరణిస్తాడు. భర్త మరణించిన తరువాత తన విలువేమిటో తెలుసుకుని పశ్చాత్తాపం చెందుతుంది. మనసుని దూరంగా వుంచి ఆత్మహత్యా ప్రయత్నం చేయబోగా, చక్రవర్తి కాపాడుతాడు

చక్రవర్తి మనిషి నైతిక ప్రవర్తనను గురించి సత్యతో—"నైతికప్రవర్తన, ఈ పతనానికి అర్థం నిర్వచనం జనం మరచిపోయి చాలారోజులయింది సత్యాదేవిగారు. యెలాగో ఓలాగా మనిషి తాను సుఖంగా బ్రతకడం గురించి తప్పితే మిగతా విషయాల్ని గురించి ఆలోచించడం మానేశాడు. నేటి యువతీయువకుల్ని తీసుకోండి. వాళ్ళకు యిష్టం లేక పోతేనో, పెద్దవాళ్ల భయపడో కేరెక్టర్ గురించి కొన్ని పన్లుగాని చెయ్యడం మానేస్తారు, గాని తప్పు అని నమ్మికాదు. వాళ్ల యిష్టమైన వాడు యీ పరిధుల్ని అవలీలగా అతిక్రమించడానికి వెనుకాడరు. ఇలాంటి సమాజంలో బ్రతుకుతున్న మనకు రోత పుట్టే హక్కు లేదు. మనకున్న హక్కల్లా బ్రతకగలగడం, చావు ముగింపుకు పరిష్కారంకాదు"[33] అని అంటాడు. ఆత్మహత్యకు పాల్పడ్డ సత్యనుద్దేశించి చక్రవర్తి మాటల్ని మనం గమనించవచ్చు. ప్రతి ఒక్కరు తమ తమ నైతిక బాధ్యతల్ని విస్మరించ కూడదన్నది రచయిత ధ్యేయంగా కనిపిస్తుంది.

స్వేచ్ఛా ప్రియత్వాన్ని గురించి చెప్తూ, చక్రవర్తి, స్వేచ్ఛాప్రియత్వం అనేది పెద్ద బూటకం అంటున్నాడు. మన ప్రవర్తనలో గాని, పరిసరాల్లో గాని నిబంధన వుండకూడదు. కాని క్రమశిక్షణ వుండాలంటాడు. క్రమశిక్షణ వున్న చోట స్వేచ్ఛా ప్రియత్వానికి అవకాశం లేదంటున్నాడు.

చిరంజీవి, కిషోరి, హరగోపాల్, దివ్యల నుద్దేశించి చక్రవర్తి స్త్రీలోని బలహీనతల్ని చెప్తూ "ప్రశాంతత వున్నచోట అది ప్రశాంతత కాదని నిరూపించ గలిగేదే, ఆకర్షణ అనే పదాన్ని రూపంతో సంబంధం లేకుండా నిర్వచించ గలిగితే ఓదార్పుతున్నట్టు కనబడుతూ ఆ ఓదార్పులో యితరుల్ని అయోమయంలో పడచేసే క్రూరత్వంలో కలిగివుండేది ... శాశ్వతత్వాన్ని క్షణంలో ఆ శాశ్వతం చేసేది .... సంవత్సరాల తరబడి యెదుటి వారిమీద వున్న సదభిప్రాయాన్ని ఒక ఆవేశపు క్షణంలో పోగొట్టుకునేదీ, మాతృత్వం పేరుతో కరుకుదనం, ఏమీలేని అసంతృప్తి, అక్కర్లేని సమయాల్లో అంతులేని లోతు, అవసరమైన సమయాల్లో అసహనం"[34] అంటున్నాడు. కొన్ని సమయాల్లో స్త్రీ సహనాన్ని పాటించక అపోహలకు తావిచ్చి జీవితాన్ని నాశనం చేసుకుంటుందని చక్రవర్తి మాటల్లోని అంతరార్థం. మనిషికి సహనం, ఓర్పు స్త్రీ ద్వారానే లభిస్తుంది. అది పాటించ

నప్పుడు ఆ కుటుంబాలు చితికి పోవడం కూడా కద్దు. ఉదాహరణకు దివ్యలో ఓర్పు లేక పోవడం వల్లనే తన భర్తను వదలివేసి యింకొకర్ని పెళ్ళి చేసుకుంది. అలా సంఘంలో మనకున్న గౌరవం, అది స్త్రీ ద్వారానే నేల మట్టమవుతుందనడం రచయిత అభిప్రాయం కావచ్చు.

చక్రవర్తి నేటి సమాజంలోని అవలక్షణాన్ని స్పష్టంచేస్తాడు. ఒక వ్యక్తి అంటే మరొక వ్యక్తికి పడడంలేదు. భర్తకానీ, భార్య కానీ, స్నేహితుడుగానీ ఒకరంటే మరొకరికి బంధ రీత్యా వచ్చిన ప్రేమతోపాటు తెలియని ద్వేషం వుంది. అవకాశం వస్తే హింసించాలన్న వాంచవుంది. సానుభూతి కన్నా మృగ సంబంధమైన వినోదం చోటు చేసుకోవడం వల్ల మనిషి మానసికంగా ఎలా గిలగిల్లాడి పోతాడో అర్థం చేసుకునేందుకు ప్రయత్నించారని చెప్పాడు. అందువల్ల సంసారమనే బంధంలో ఒకరి నొకరు అర్థం చేసుకుని ముందుకు వెళ్ల మనడమే రచయిత అభిప్రాయం.

## సూచికలు

| నెం. | రచయిత | నవల పేరు | పుట |
|---|---|---|---|
| 1. | సుదర్శనం ఆర్. యస్. | 'సమాజము సహిత్యము' | 104 |
| 2. | వేణుగోపాలరావు కొమ్మూరి | 'ప్రేమ నక్షత్రం' | 74 |
| 3. | ,, | 'ఈ దేశంలో ఒక భాగమిది' | 216 |
| 4. | ,, | 'విషవలయం' | 168 |
| 5. | ,, | 'మేడలో నీడలు' | 174 |
| 6. | ,, | 'ఒకే పాటకు రెండు రాగాలు' | 142 |
| 7. | ,, | 'భారతి' | 116 |
| 8. | ,, | ,, | 209 |
| 9. | ,, | ,, | 210 |
| 10. | ,, | 'శారద' | 99 |
| 11. | ,, | 'వ్యక్తిత్వంలేని మనిషి' | 126 |
| 12. | ,, | 'గోరింటాకు' | 176 |

| నెం. | రచయిత | నవల పేరు | పుట |
|---|---|---|---|
| 13. | వేణుగోపాలరావు కొమ్మూరి | 'ఆత్మజ్యోతి' | 77 |
| 14. | ,, | ,, | 335 |
| 15. | ,, | 'ఈ దేశంలో ఒక భాగమిది' | 184 |
| 16. | ,, | 'జాలిలేని జాబిలి' | 27 |
| 17. | ,, | ,, | 28 |
| 18. | ,, | ,, | 72 |
| 19. | ,, | ,, | 97 |
| 20. | ,, | 'ఊగవే ఉయ్యాల' | 147 |
| 21. | ,, | 'సూర్యుడు దిగిపోయాడు' | 99 |
| 22. | ,, | ,, | 106 |
| 23. | ,, | 'విషవలయం' | 158 |
| 24. | ,, | 'పసుపు-కుంకుమ' | 99 |
| 25. | ,, | 'భారతి' | 135 |
| 26. | ,, | 'ఒకే రక్తం ఒకే మనుషులు' | 95 |
| 27. | ,, | ,, | 195 |
| 28. | ,, | 'హౌస్ సర్జన్' | 234 |
| 29. | ,, | 'డాక్టరుగారి భార్య' | 274 |
| 30. | ,, | 'మేడలో నీడలు' | 108 |
| 31. | ,, | 'తోడూ-జోడూ' | 17 |
| 32. | ,, | ,, | 316 |
| 33. | ,, | ,, | 317 |
| 31. | ,, | ,, | 318 |

——o——

# ఆధార గ్రంథాలు


1. అభ్యుదయ – ఈ దశాబ్ది నవల విశేష సంచిక 1980
2. ఆంధ్రనవలా పరిణామము – బొడ్డపాటి వెంకట కుటుంబరావు 1932
3. ఉషఃకిరణాలు – యండమూరి సత్యనారాయణరావు 1960
4. తెలుగునవల మనోవిశ్లేషణ – డా॥ విద్వేశ్వరి 1980
5. తెలుగునవల సామాజిక చైతన్యం – డా॥ పి. సంజీవమ్మ 1985
6. తెలుగునవలా వికాసము – మొదలి నాగభూషణశర్మ 1971
7. తెలుగునవలా సాహిత్య వికాసం – పుల్లాబొట్ల వెంకటేశ్వర్లు 1980
8. తెలుగునవలా సాహిత్యంలో మనోవిశ్లేషణ – కోడూరి శ్రీరామమూర్తి 1979
9. తెలుగు సాహిత్యం పై గాంధీజీ ప్రభావం – ఆచార్య మొదలి నాగభూషణ శర్మ 1970
10. తెలుగు సాహిత్యం పై ఆంగ్లభాషా ప్రభావం – ఆచార్య కొత్తపల్లి వీరభద్రరావు 1936
11. నవలా శిల్పం – వల్లంపాటి వెంకటసుబ్బయ్య 1989
12. మన నవల – చైతన్య సాహితి 1979
13. మహతి – యువభారతి 1972
14. విమర్శిని – కాకతీయ విశ్వవిద్యాలయం 1978
15. సమాజము సాహిత్యము – ఆర్. యస్. సుదర్శనం 1972
16. సాహిత్యంలో దృక్పథాలు – ఆర్. యస్. సుదర్శనం 1982
17. సాహిత్య దర్శనం – ఆచార్య కాకర్ల వెంకటరామ నరసింహం 1985
18. స్వాతంత్ర్యానంతర తెలుగునవల – డా॥ తుర్లపాటి రాజేశ్వరి 1991

# ఉపసంహారం

డాక్టర్ కొమ్మూరి వేణుగోపాలరావు గారికి 15 సంవత్సరాల వయస్సు నుండి రచనా వ్యాసంగం అలవడింది. ఇతర భాషలనుండి అనువదించబడిన రచనల్ని బాగా చదివారు. శరత్చంద్రుని రచనల్లో వున్న మాధుర్యం, స్పందన తెలుగు నవలా పాఠకులకు అందించారు. మొదటినుండి ఇప్పటివరకు కూడా తనదంటూ ఓ నూత్న పద్ధతిని సృష్టించుకుని తద్వారా సాహిత్య విలువలు గల రచనలు చేశారు. రచయితగా రాణించారు. రావుగారు రచయిత కావటం తండ్రికి సుతరామూ ఇష్టం లేదు. ప్రతిఘటించారు. కట్టుదిట్టాలు చేశారు. ఇలాంటి అడ్డులేవీ రావుగార్ని రచయిత కావడం నుంచి వెనుకకు మరలించలేక పోయాయి. పైగా రచయితగా బలపడేందుకు పట్టుదల ప్రసాదించాయి. వారి రచనల్లో కథానికలుగాని, నవలలుగాని ప్రతి రచనలోను వైవిధ్యంవుంటుంది. సులభశైలిలో, సహజ సుందరంగా చెప్పుకు పోతుంటారు. మళ్లీ మళ్లీ చదవాలనిపించే మంచి రచనలు వారి కలంనుంచి వెలువడ్డాయి. వీరు డాక్టరు కావడానికి ముందే సాహితీ పాఠకులకు రచయితగా పరిచయం కావడం గమనింపదగ్గ అంశం. అవసరమైన చోట తనే యేదో ఒక పాత్రలో లీనమౌతూ హితోపదేశం చేస్తూండటం వీరిలో కనిపించే ప్రత్యేకత.

డాక్టర్ కొమ్మూరి వేణుగోపాలరావు వైద్యులు కావడం చేత రోగులకు, వైద్యులకు సంబంధించిన అంశాలు, వైద్య విధానానికి సంబంధించిన విశేషాలు వీరి నవలల్లో చోటు చేసుకుని వుండటం గమనిస్తాం. ప్రభుత్వ ఆసుపత్రులు, ప్రైవేట్ ఆసుపత్రులకు గల వ్యత్యాసాల్ని రెండిటిలోనూ వున్న సాధక బాధకాల్ని వివరంగా రచయిత విశ్లేషించారు. మెడిసన్ చదువుకునేటప్పుడు వైద్య విద్యపట్ల వుండే తృష్ణను. రాజకీయాలకు బలైపోతున్న మంచి డాక్టర్లను, సోమరితనంతో తిరిగే డాక్టర్ల అశ్రద్ధవల్ల రోగులు యెదుర్కొనే యిబ్బందుల్ని, సంస్కారం, మంచితనం, మానవత్వంగల డాక్టర్లను, ప్రవేట్ ప్రాక్టీస్‌లో డాక్టర్లు ఎదుర్కొనే యిబ్బందుల్ని గురించి వీరి వైద్య వృత్తికి సంబంధించిన రచనల్లో వివరించారు.

వ్యాధులు వచ్చినప్పుడు మనుషులు అంధ విశ్వాసాలకు యెలా బలై పోతున్నారో తెలియజేశారు. ప్రత్యామ్నాయం లేనప్పుడు అహర్నిశలు బాధలతో

అలమటించే రోగుల్ని అన్ని బాధల్నుంచి విముక్తి చేయడానికి చంపడం కూడా తప్పులేదన్నది వారి అభిమతం. డాక్టర్ల ప్రమత్తత వల్ల యెదురయ్యే ప్రమాదాల్ని చక్కగా సూచించారు. కుష్ఠు రోగం భయపడేటంతటి భయంకరమైన వ్యాధికాదని నిరూపించగలిగారు. కుష్ఠు రోగులు సమాజంలోని యెటువంటి సమస్యలకు గురవుతారో స్పష్టం చేశారు. మేనరికపు పెళ్లిళ్లు యెందుకు సమర్థనీయం కావో శాస్త్రీయంగా తన నవలల్లో చర్చించారు.

మధ్య తరగతి కుటుంబాల్లోని జీవన విధానాన్ని వీరు తమ నవలల్లో చక్కగా చిత్రించగలిగారు. ముఖ్యంగా ఆర్థిక యిబ్బందులతో, కుటుంబ సమస్యలతో యెలా సతమతమౌతున్నారో తెలియజేశారు. పేద విద్యార్థుల సమస్యలు, పిల్లల పెంపకంలో తీసుకోవలసిన జాగ్రత్తలు, స్నేహ ధర్మానికి కూడా ప్రాముఖ్యత నిచ్చి చర్చించడం జరిగింది. కొందరు స్నేహితుల వల్ల కుటుంబాలు యెలాంటి యిబ్బందులకు గురురవుతాయో చెప్పగలిగారు. ఉన్నత కుటుంబాల్లో అర్థం లేని సమస్యలు యెలా చోటు చేసుకుంటాయో చిత్రించారు. ఉమ్మడి కుటుంబాలు విడిపోవడానికి గల కారణాల్ని సూచించారు. దగాపడ్డ తండ్రులు పడేపాట్లు చిత్రించారు. ఆస్థి తగాదాల వల్ల తలెత్తే కలతలు యెలా వుంటాయో సూచించారు. స్త్రీల ప్రవర్తనల వల్ల తలెత్తే సమస్యల్ని యధాతథంగా చెప్పగలిగారు.

మనిషి ఆత్మన్యూనతకు గురికావడానికి గల హేతువులు, అటువంటివాళ్ళు సమాజంలో యెదుర్కొనే యిబ్బందులు, సమాజం వారి పట్ల వ్యవహరించే తీరు కూడా వీరి నవలల్లో చోటు చేసుకున్నాయి. మానసిక పరిపక్వత రాక పోవడానికి గల కారణాలు మనో వైజ్ఞానిక నవలల్లో చోటు చేసుకున్నాయి. ఆత్మాధిక్యత వున్నవాళ్ళ వల్ల కుటుంబాలు యెలా వొత్తిడులకు లొంగి కనిపిస్తాయో తెలియజేశారు. లెస్బియానిజం వల్ల తలెత్తే సమస్యలను స్పష్టంచేశారు. దానివల్ల కుటుంబాలు యెలా పతనమవుతున్నాయో చెప్పారు. మనుషుల మానసిక బలహీనతలు జీవితపు వొడుదుడుకులకు యెలా కారణమౌతాయో తెలియజేశారు. తండ్రిని యెదిరించలేని కొడుకుల్ని, వాళ్ళుపడే మానసిక వేదనను రమ్యంగా చిత్రించగలిగారు. స్వేచ్ఛా ప్రవృత్తిగల పాత్రలు వేణుగోపాలరావు రచనల్లో కనిపిస్తాయి. రచయితలు, రచయిత్రులు యెదుర్కొనే యిబ్బందులు, సమాజ పరిస్థితుల దృష్ట్యా

వాళ్ళకున్న బాధ్యతలు వీరి రచనల్లో కనిపిస్తాయి. డాక్టర్ అయినవ్యక్తి రచయిత అయినట్లయితే తన రచనల ద్వారా రోగిలో మానసికంగా మార్పు తీసుకురావచ్చు నని వీరు నిరుపించారు. అటు వైద్యవృత్తి చేస్తూ, ఇటు సాహిత్యకృషి చేస్తున్న పాత్రల్ని సృష్టించి వాటిలో తనని చూసుకున్నారు. జర్నలిజంలో యెదుర్కొనే యిబ్బందుల్ని కూడా తన రచనల్లో వీరు చూపించారు.

కళాశాలల్లో జరిగే ర్యాగింగును, సెక్స్ ఎడ్యుకేషన్ చెప్పలవల్ల విద్యార్థులపై పడే ప్రభావాన్ని చర్చించారు. వీరి నవల్లో పాత్రపోషణ చక్కగా సాగింది. వైద్యవృత్తిలో ఏమాత్రం అజాగ్రత్త వహించినా ఎదుటివారికేగాక తమకు కూడా ఎన్నో ప్రమాదాలు ఎదురౌతాయని వీరి అభిప్రాయం. ఒక రోగికి జబ్బు నయం కాదని తెలిసినప్పుడు రోగి జీవితాన్ని అంతం చేయడానికి చట్టం అనుమతించదు. నయం కాని జబ్బుతో బాధపడే రోగికి 'దయామరణం' ప్రసాదించే విధానాన్ని రచయిత సమర్థించారు.

శాస్త్రీయ అధ్యయనం కారణంగా మనోవిశ్లేషణలోని మానసిక స్థితిగతుల్ని వంట బట్టించుకున్న కొమ్మూరి వేణుగోపాలరావు తన సృజన శక్తితో ఆయా పాత్రల్ని విశ్లేషించిన విధానం ప్రశంసనీయం. వీరి నవలలన్నీ ప్రయోజనాత్మకాలే. ఆయన రచనా వ్యాసంగమంతా నిర్దిష్ట ప్రయోజనం మేరకే సాగింది. ఆధునిక తెలుగు నవలా సాహిత్యంలో కొమ్మూరి వేణుగోపాలరావు తన కొక ప్రత్యేకస్థానాన్ని నిలబెట్టుకున్నారనడంలో సందేహం లేదు.

--- 0 ---